


# మోక్షమార్గ ప్రదీపిక

["లైట్ ఆన్ ది పాత్" అను ఆంగ్లగ్రంథమునకు
ఆంధ్రవ్యాఖ్య]

కడపపుర వాస్తవ్యులు,
[...]యిసాహేబు గంగనపల్లె శంకరరావుచే
విరచితము.

"వసంతా ఇన్‌స్టిట్యూట్," థియసాఫికల్ సొసైటీ,
అడయారు, మద్రాసు.




# మోక్షమార్గ ప్రదీపిక

["లైట్ ఆన్ ది పాత్" అను ఆంగ్ల గ్రంథమునకు
ఆంధ్రవ్యాఖ్య]

కడపపుర వాస్తవ్యులు
రాయి సాహేబు గంగనపల్లె శంకరరావు చే
విరచితము

"వసంతా ఇన్స్టిట్యూట్", థియసాఫికల్ సొసైటి,
అడయారు, మద్రాసు
1925

# కృతిసమర్పణము

సీ ॥ ధర్మబుద్ధివహించి • తత్త్వంబుఁ బరికించి
మతసారములను నె • మ్మదిఁ దలంచి ।
దేశసంచరణసం • స్థితిని సంపాదించి,
విశ్వకుటుంబంబు • విశ్వసించి ।
పరకీయ దుర్మత • వాదముల్ నిరసించి
యుపకారపరతచే • నొప్పుగాంచి ।
శాంతగుణంబున • జగతిఁగీర్తి నిబెంచి
వాగ్ధాటిదిక్కుల • వాసినించి ॥

గ్రంథరాజిఁ బఠించి ని • క్కము వచించి ।
సభలవాదించి యోగ్యత • సంగ్రహించి ।
నిరుపమాన యటన్నమె • న్నికనుమించి ।
వఱలునట్టి వసంతమాం • బకును భక్తి ॥

ఆ ॥ జ్ఞానదాత్రి యనుచు • మానితాచారయం ।
చాత్మ నెఱుఁగుననుచు • నాత్మ నమ్మి ।
కృతిని దీని నేను • గృతకృత్యతం గాంచ ।
నంకితం బొనర్తు • నాదర మున ॥

---

# ధ్యాన శ్లోకములు

వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే ।
యంనత్వా కృతకృత్యాస్స్యుః తం నమామి గజాననం॥

నమోఽస్తు గురవే తస్మై ఇష్టదేవ స్వరూపిణే ।
యస్య వాక్యామృతం హంతి విషం సంసార సంజ్ఞికం ॥

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥

యస్మాజ్జాతం జగత్సర్వం యస్మిన్నేవ ప్రలీయతే ।
యేనేదం ధార్యతే చైవ తస్మై జ్ఞానాత్మనే నమః ॥

జన్మాద్యస్యయతోఽన్వయాది తరత
శ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్ ।
తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే
ముహ్యంతి యత్సూరయః ।
తేజోవారిమృదాం యథా వినిమయో
యత్ర త్రిసర్గో మృషా ।
ధామ్నా స్వేన సదా నిరస్త కుహకం
సత్యం పరం ధీమహి ॥

చం ॥ అనయము చంద్రికా హిమమయ
ప్రభులట్టులు వాక్తదర్థమ ।
ర్లినయు మహానుబంధమున
నేర్పడి శాశ్వతకీర్తిచే జగ ।
జ్జనకులు నాఁగ ఖ్యాతిఁగను
సాధుమతుల్ గిరిజా గిరీశు లీ ।
జనులను భక్తవర్యులుగ
నల్పుచుఁ బ్రోతురుగాక ప్రేమచేః ॥

చం ॥ అరుదుగఁ గల్పవల్లి తను
నల్లుకొనన్ సురభూరుహం బదె ।
క్కరణిఁ జెలంగునట్టులు ని
కామ ముదంబున వక్షమందు శ్రీ ।
తరుణి వసింప లోకసము
దాయముఁ బ్రోచుపరాత్పరుండు శ్రీ ।
హరి కృప భక్తలోకముల
నారసి ప్రోచెడుఁ గాత మెప్పుడున్ ।

---

# అవతారిక

"మార్గజ్యోతి" అను రహస్య గ్రంథము పైన వ్యాఖ్య "మోక్ష మార్గప్రదీపిక" అను శీర్షికతో రమారమి తొమ్మిది సంవత్సరముల క్రిందట "దివ్యజ్ఞానదీపిక" అను మాసపత్రికయందు వ్యాసముల రూపముగా బ్రచురించబడ బ్రారంభమయ్యెను. ఉదరపోషణార్థము గావించుకొనబడిన వృత్తికి సంబంధించిన పనులచే దీరిక లేకయు, దేహారోగ్యము బాగుగ లేకయు నేడు సంవత్సరములు గడచినను వ్యాసములు సమాప్తి కాకపోయెను. ఈ గ్రంథమును బరిసమాప్తి చేసి పుస్తక రూపముగ బ్రచురించుటకు బెద్దలైనవారి యాజ్ఞయగుటచే నీశ్వరానుగ్రహము వలన నీకార్య మిప్పటికి ముగిసెను.

ఈ రహస్య గ్రంథమునకు వ్యాఖ్యానమును వ్రాయ నేను సమర్థుడగాను. ప్రథమ భాగములోని బోధల నిజమైన తాత్పర్యమే బ్రహ్మనిష్ఠులకే కాని యితరులకు వేద్యము కానేరదు. రెండవ భాగమునకు వ్యాఖ్యానము వ్రాసిన ముక్తులే విపులముగా వ్రాయరైరి. నావంటివారి కా భాగములోని వాక్యముల సామాన్యార్థమే బోధపడుట కష్టమనియు, నికను వ్యాఖ్యవ్రాయ సమర్థత లేదనియు జెప్ప నేల?

ఇట్టి సందర్భములలో నే నీ వ్యాఖ్యను వ్రాయ బూనుకొనుట సాహసమనియే చెప్పవచ్చును. అట్లు పూనుకొన గారణము లెవ్వియన :—

(1) మూల గ్రంథ బోధలను వెల్లడిచేయుట అత్యంత అవశ్యకమని తలచితిని.

(2) ఈ గ్రంథము పైన దివ్యజ్ఞానసమాజములో యోగ్యత గల వారిదినలుకే ఆంగ్లేయ భాషలో వ్యాఖ్యానము వ్రాసియున్నారు. ఆ వ్యాఖ్యాన సారాంశమును నేను గ్రహించుకొన గలిగి నంతవఱకు దేశీయభాషలలో బ్రచురించుట యుక్తమని తోచెను.

(3) దివ్యజ్ఞానసమాజమువా రెద్దియో యొక క్రొత్తమతమును బోధించుచున్నారనియు, వారి బోధలు హిందూమత గ్రంథముల ననుసరించి యుండవనియు, గావున నవి యాదరణీయములు కావనియు, నీ దేశములోని పెక్కండ్రు తలచియున్నారు. ఆ యభిప్రాయము సరికాదు. దివ్యజ్ఞానసమాజగ్రంథములు సర్వమతముల సామాన్య విశేషధర్మములను దెలుపుటవలన బ్రతిమతమువారలకు దమ మత విషయములను గ్రహించుటయే కాక ఇతర మతముల ధర్మముల దెలిసికొని ముఖ్యమైన విషయములలో సర్వమత బోధ లేక వాక్యతగ నున్నవని యెఱుగ నవకాశము గలుగును. భేదములు బాహ్యాచారములలోనే కాని మూలధర్మములలో లేవని తెలియవచ్చును. దాన బరమతసహనము, సర్వజనసోదరభావము వృద్ధియగును. ఈ "మార్గజ్యోతి" అను గ్రంథము మోక్షగ్రంథము. దానిలోని బోధలును హిందూసనాతనధర్మబోధలు నొక్కటియే యని నిరూపించిన దివ్యజ్ఞానసమాజగ్రంథముల విషయమైన దురభిప్రాయము తొలగిపోవును. అట్లు దురభిప్రాయమును దొలగించుట యత్యంతావశ్యకమని తోచెను. అందువలన హిందువుల పవిత్రగ్రంథములైన ఉపనిషత్తులు భగవద్గీత లునగు గ్రంథములలో నుండి ప్రమాణములు కను

పరుచబడియున్నవి. ఈ గ్రంథము ద్వారా ఉపనిషదాది పావన గ్రంథములలోని బోధలు ప్రచురమునకు వచ్చుటకు సయితము అవకాశము కలుగుననని తోచెను.

ఈ గ్రంథము తొలుత వ్యాసముల రూపముగా వ్రాయబడినందునను, నాకుపాండిత్యము లేనందువలనను, సంభాషణ శైలిలో వ్రాయబడియున్నది. అర్ధానుస్వారములు వ్రాయనే లేదు. మూల గ్రంథము యొక్క బోధలను జక్కగా గ్రహించని దోషములు, శైలిదోషములు, మఱియు నితర దోషములను క్షమించి వ్రాయబడినంతవఱకు విషయమును మాత్రము గ్రహింతురని చదువరులు ప్రార్థితులు.

ఈ గ్రంథము నచ్చొత్తించ నియ్యకొనిన "వసంతా ఇన్‌స్టిట్యూట్" సంఘమువారికి వందన మాచరించుచున్నాను.

ఈ గ్రంథమును బ్రచురించ బ్రోత్సాహపరచియు, నచ్చొత్తించ నంగీకరించ 'వసంతా ఇన్‌స్టిట్యూట్' వారికి సలహా చేసియు, గ్రంథములోని తప్పులను సవరించియు, శైలిని బాగుపరచియు, శోధన ప్రతులను (Proofs) బరీక్షించియు, మఱియు నెన్నివిధములనో గ్రంథమును శోధించి ప్రచురణార్హముగా జేసిన మహా రాజ రాజశ్రీ చిట్టమూరు రామయ్యా పంతులుగారి కెంతయో కృతజ్ఞుడ నైతిని. వీరు

> శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః।
> శ్రేయో హి ధీరోఽభిప్రేయసో వృణీతే ॥ (కఠ. ఉప. 2-2)

అను వాక్యమును సార్థముచేయ దలచి అభ్యుదయమును దుచ్ఛముగ భావించి యైహిక పదవిని ద్యజించి వైరాగ్యవృత్తిని బూని లోకోపకారముగ బనిచేయుచుండుట యెల్లఱకు విదితమే. విరామము లేక పని

చేయుచుండియు నీ గ్రంథమునకుగా నింత శ్రమపుచ్చుకొనినందుకు మదీయ వందనములకు విశేషముగ నర్హులైరి.

వ్యాసములుగా మాసపత్రికలో బ్రచురించునప్పుడు దోషములను సవరించినందుకు ఆ పత్రిక సంపాదకులైన మహారాజరాజశ్రీ పరమాత్మని నరసింహయ్య గారికిని, అల్లాడి మహాదేవశాస్త్రి గారికిని వందనములు. శ్రీ మహాదేవశాస్త్రులు వారు గ్రంథ ప్రచురణకాలములో నయితము సవరణ కార్యమునకు దోడ్పాటైరి. అందుకు వారికి విశేషముగ వందనములు.

కడపపుర వాస్తవ్యులును, హైస్కూలు ఆంధ్ర ప్రథమోపాధ్యాయులును, ఆయుర్వేద, జ్యోతిష ఛంద శ్శాస్త్రవేత్తలును, వేదోక్త కర్మానుష్ఠానతత్పరులును, భగవదుపాసన శీలురును నగు అభినవ ఆంధ్ర వాల్మీకి జనమంచి శేషాద్రి శర్మగారు స్తుతి కృతి సమర్పణ పద్యములను వ్రాసియిచ్చియు, వ్యాకరణ విషయములను బోధించియు నీ గ్రంథ సమాప్తికి సహకారులైరి. వారికి వందనము లాచరించుచున్నాను.

ఈ గ్రంథమును 'వసంత ముద్రాక్షరశాల' వారు ప్రచురించిరి. ఆ శాలాధ్యక్షులై శాలయొక్క కార్యములను మిక్కిలి నిపుణతతో నిర్వహించుచుండు మహారాజరాజశ్రీ అద్దంకి కృష్ణగిరి సీతారామ శాస్త్రిగారు మదీయ వందనార్హులు.

ఆ శాల ఉపాధ్యక్షులును బ్రహ్మచర్య, వృద్ధోపసేవ, మార్దవాది సుగుణాలంకృతులగు మహారాజ రాజశ్రీ చిట్టమూరు సుబ్బరాయుడు గారు శోధన ప్రతులను సవరించుటయందును మఱియు ననేక విధములను గ్రంథప్రచుర సమాప్తికై మిక్కిలి శ్రమ పుచ్చుకొనిరి. వారికి వందనములు.

నాకు నేత్రపాటవము తక్కువగ నుండుటవలన లేఖక ప్రమాద జనిత దోషములను, అచ్చు శోధనప్రతులలోని దోషములను బూర్తిగ గనిపెట్టనేరక పోయినందున గ్రంథములో నచ్చటచ్చట తప్పులున్నవి. ముఖ్యమైన వానిని మాత్రము శుద్ధపత్రికలో గనుపరచినాను. శేషించినవి గణనానర్హములుగా భావింతురని చదువరులను బ్రార్థించుచున్నాను.

క్రోధన సం ॥ చైత్రశుద్ధ ఏకాదశి, అడయార్

గంగనపల్లె శంకరరావు

---

# ఉపోద్ఘాతము

ప్రపంచములోని జనుల అజ్ఞానమును దొలగించి వారిని సంసార సముద్రమునుండి యుద్ధరించుటకై ఈశ్వరాజ్ఞా ప్రవర్తకులైన ఋషి సంఘమువారు దేశకాలానుసారముగా జ్ఞానబోధచేయు గ్రంథముల రచించి ప్రకటించుచుందురు. అట్లు ప్రచురించబడినదియే ఈ "మోక్షమార్గప్రదీపిక" లేక 'మార్గజ్యోతి' యను గ్రంథము.

ఈ గ్రంథము మనకెట్లు లబ్ధమైనదియు జ్ఞానపూతులైన యోగీ లెడ్‌బీటరుగా రిట్లు తెలిపియున్నారు. "ఇది యపూర్వప్రాచీన సంస్కృత గ్రంథము. పదితాళపత్రంబులపైన నొక్కొక్క పత్రముపై మూడుసూత్రములవంతున ముప్పదిసూత్రములు తొలుత వ్రాయబడి యుండినవి. పిదప దమశిష్యసుబోధార్థము 'వెనిషియన్' అని దివ్యజ్ఞానసమాజమువారివలన బేర్కొనబడు ముక్తులాసూత్రములకు వ్యాఖ్యానరూపమగు వాక్యములను జతపర్చి గ్రీకుభాషలో వ్రాసిరి. ఆ వాక్యములు సయితము సూత్రములుగా నెన్నబడెను. తొలుత ప్రాచీనభాషలో నుండినవి ముప్పది; వెనుక జేర్చబడినవి పండ్రెండు; మొత్తముకు నలుబదిరెండు సూత్రములును, బ్రహ్మవిద్యాధికారిలక్షణ ముల దెల్పు నయిదు పూర్వవాక్యములునుగల యీ గ్రంథమునకు గొంత టీకనువ్రాసి "హైలేరియన్" అను ముక్తులాంగ్లేయభాషలో బ్రచురించిరి."

ఇచ్చట ప్రాచీన వ్యాఖ్యానసూత్రములు ప్రత్యేకముగ వివరముగ గనుపరచబడును.

ఈ గ్రంథములోని ముముక్షువుల కత్యంతోపయుక్తమయిన మహానుభావుల బోధలు, వానిప్రకార మనుష్ఠించిననే సఫలము కాగలవు.

"ఆహారము దిక్కు జూచి యిదిబాగుగా నున్నదనుటచే నాకలి కొని యున్నవాని యాకలితీరదు ; చేయిచాచి యాయన్నమును దినవల యునుగదా. అట్లే పరమగురువుల వాక్కు వినుట మాత్రము చాలదు. వారు చెప్పెడి యొక్కొక్క మాటయు గమనించి, వారు సూచించెడి యొక్కొక్క యంశమును గ్రహించి, వారు చెప్పినటుల నడుచుకొనవలయును."

అని "పరమగురుచరణ సన్నిధి" యుపోద్ఘాతమునం దాల్కియోని యను పుణ్యపురుషుడు వ్రాసిన మాటను గమనించవలయును.

మఱియు,

న గచ్ఛతి వినా పానం వ్యాధి రౌషధశబ్దతః ।
వినా పరోక్షానుభవం బ్రహ్మ శబ్దై ర్న ముచ్యతే ॥

ఔషధము బాగుగనున్నదని చెప్పునంత మాత్రముననే వ్యాధినివారణ కానేరదు. పానముచేయబడి దేహమునందు వ్యాపించిననే గుణమియ్యగలదు. "బ్రహ్మ, బ్రహ్మ" అని కోటిసార్లు నోటిమాటలు చెప్పిన నేమి యుపయోగము? అనుష్ఠానముచేసి యనుభవమును బొందినగాని ఫలము కలుగదు.

కనుక మనము మహనీయులు నుడివిన వాక్యములను గమనించి యా ప్రకారము నడుచుకొని పరమేశ్వరుని యనుగ్రహమునకు బాత్రతబడయ గల్గుదుముగాక.

---

# విషయసూచిక

## ప్రథమభాగము

### ౧ వ అధ్యాయము—పూర్వ అధికార సంపత్తి



*B*

పుట

## ౨ వ అధ్యాయము—చిత్తశుద్ధి, కర్మయోగము

## 3 వ అధ్యాయము—భేదభావనిరసనము, ఆత్మైకత్వము

## ౫ వ అధ్యాయము—యోగమార్గాన్వేషము

## మొదటి ఖండము, అన్వేషణ విధానములు

పుట

విషయానుభవము దూష్యము కాదు. అది ఆత్మాన్వే షణమందు మొదటి మెట్టు—క్రమక్రమముగ నింద్రియ లోలత్వము నతిక్రమించి సంసారములోనుండి విషయ ముల ననుభవించుచుండియే మోక్షమును సాధించ వచ్చును. భోగించబడు శబ్దాదిసర్వ విషయము లాత్మ యేయని భావించ నభ్యాసము చేయవలెను. జితేం ద్రియులు ఇంద్రియలోలుల ద్వేషించక ఉద్ధరించ వలెను.

రెండవ మెట్టు—ధర్మజ్ఞానము, ఆత్మవిషయ జ్ఞానము.

మూడవ మెట్టు—మార్గదర్శనము. తొలుత ఆత్మజ్యోతి మందప్రకాశకముగనే కనుపడును. అహంకారము కొంచె కొంచెము నశించుచుండ జ్యోతి ఎక్కుడుగ గనుపడును. అవిద్యపూర్ణముగ నశించిననే అఖండ జ్యోతి సాక్షాత్కారమగును. కొంచెముగ నైనను జ్యోతి దర్శనమైన వాడు సంపూర్ణముగ నజ్ఞానాంధ కారములో నుండువారి నుద్ధరించిననే దర్శనప్రాప్తి ప్రయోజనము. అట్లు చేయుటయే లోకసంగ్రహ కర్మ. ప్రపంచభార వహనము. దేవాసురుల లక్షణ ములు. దైవీసంపదలు. ఆసురసంపదలు. లోకక్షే మార్థము పాటుపడుచుండు ఋషి సంఘమువారికి తోడ్పాటగుటయే గొప్ప ఆనందము.

## ౫ వ అధ్యాయము—యోగమార్గాన్వేషణము
## ఆఱవ ఖండము, మనఃప్రసాదము



సంసారసముద్ర వర్ణనము, తత్తరణోపాయములు. కామాది

పుట



## ౫ వ అధ్యాయము—యోగమార్గాన్వేషణము

## ఏడవ ఖండము, గురూపసక్తి



## ౬ వ అధ్యాయము—అనుబంధము

ఫుట

# ద్వితీయ భాగము

## అనుశాసనము

## ౧ వ అధ్యాయము

## పూర్వ అధికార సంపత్తి

ఈ విధులు శిష్యుల నెల్లఱ నుద్దేశించి వ్రాయబడియున్నవి, వానిని గమనించుడు.

1. కన్నులు చూడగలుగుటకుమున్న కన్నీరు విడుచుటను మీఱి యుండవలయును.

2. చెవి వినగలుగుటకుమున్న నిందాస్తుతులకు చలింపక యుండవలయును.

3. వాక్కు పరమగురువుల సన్నిధానమందు వచించగలుగుటకు మున్నితరులను నొప్పించుట యసాధ్యమై యుండవలయు.

4. జీవాత్మ పరమగురువుల సన్నిధానమున నిలవగల్గుటకుమున్న వాని పాదములు హృదయరక్తముతో ప్రక్షాళనము చేయబడవలయు.

ఈ వాక్యములు బ్రహ్మవిద్యాధికారమునకు వలయు యోగ్యతలను దెలియజేయుచున్నవి. యోగ్యతలేనివారికి విద్య గఱపరాదు.

ఇదంతే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।
నచాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి ॥

(భ. గీ. 18—67.)

తపస్సులేనివానికి, భక్తిరహితునికి, ఆసక్తి లేనివానికి, భగవంతుని దూషించువానికిని ఈ గీతాశాస్త్రము నుపదేశించవలదని శ్రీకృష్ణు డర్జునునకు జెప్పెను. ఎందువలనన, వా డా విద్యను గ్రహించ జాలక పోవుటవలన నది నిరర్థకమైపోవును. ఒకప్పుడు విపరీత భావనవలన గీడు సయితము కలుగును.

దేహము మలరాశియనియు, బుత్రక్షేత్రకళత్రాదులందు దోష దృష్టి కలిగినగాని నిజవైరాగ్యము లేదనియు, మోక్షప్రసక్తికి సయిత మధికారము లేదనియు, నుడువు వాక్యములను సాధారణ ప్రపంచ ధర్మము ననుష్ఠించుచు బ్రవృత్తి మార్గమున వర్తించు వానికి బోధించినట్టయిన దేహములను నుపేక్షించి తనకును, దన్నాశ్రయించి యుండు వారలకును హానికలుగ జేయును. లేక ఈ బోధలు హితములుకావని వానిని దూషణ. పరిహాసముల పాలుచేయును. ఔషధము రోగి వయస్సు ననుసరించి యుండవలెను. పెద్దవాని కియ్యదగ్గ ప్రమాణమును బాలునికిచ్చిన విరోధించును. అవివేకిచేతికి గాని, పసిబాలుని చేతికి గాని, ఖడ్గమిచ్చిన దన్ను దానే నఱకు కొనవచ్చును. దానినే వివేకికి గాని, యుక్తవయస్సువచ్చిన పురుషునికి గాని యిచ్చిన సుఖదాయకంబగు. అపరిశుద్ధ మనస్కులు మనోమాలి న్యముచే వస్తుపారిశుద్ధ్యమును గ్రహించజాలరు. ఎఱ్ఱని యద్దము ద్వారా జూచువానికి దెల్లని పదార్థ మెఱ్ఱగ గన్పడుగాని నైజశ్వేత వర్ణమును జూపనేరదు. చలించుచున్న నీరమునందు సూర్యబింబము చక్కగ బ్రతిబింబించనేరనియట్లు విషయాసక్తితో సదా చలించు చున్న మనస్సునం దాత్మవిద్య ప్రకాశించ నేరదు. అట్టి మనస్సు గలవారికి విషయేంద్రియ సంయోగ జనితసుఖలవమే యాపేక్షణీయ

ముగ దోచునుగాని కష్టసాధ్యమైన యక్షయసుఖ ప్రాప్తియం దభిరుచి యుండదు.

"పంది బురదమెచ్చు పన్నీరుమెచ్చునా". (వేమన.)

మఱియు క్రైస్తుదేవుడు సయితము ముత్యములను వరాహముల కిడ వలదని బోధించిరి.

ఇట్లనధికారులకు విపరీతభావనచేఁ జెడుగు గలుగునని తెలిసియే మహాత్ములు పరావిద్యను గుప్తముగ నుంచుకొని యోగ్యత గల వారికే యుపదేశించుచుండిరి కాని యౌర్వ్యలేమిచే గాదు.

ఎట్టివా రుపదేశార్హులైనది యుపనిషత్తులలో స్పష్టముగా దెల్పఁ బడియున్నది.

యముఁడు నచికేతసుని గఠినముగ బరీక్షించి వాని యోగ్యతను దెలిసికొనిన పిదపనే ఆత్మవిద్య నుపదేశించెనని కఠోపనిషత్తునందుఁ దెల్పబడియున్నది. నచికేతసుఁ డాత్మజ్ఞానము నుపదేశము చేయుమని కోరగా అదివలదు మఱియెట్టి వరమడిగిన నిచ్చెదనని యముడు పల్కెను.

పుత్రపౌత్రులు, మహదైశ్వర్యము, భూమండలాధిపత్యము, విత్తము, చిరజీవిత్వము, మఱియు,

> యే యే కామా దుర్లభా మర్త్యలోకే
> సర్వాన్ కామాఁశ్ఛందతః ప్రార్థయస్వ ।
> ఇమా రామా స్సరథా స్సతూర్యా
> న హీదృశా లంభనీయా మనుష్యైః ॥

(క. ఉప. I. (1). 22-25.)

మర్త్యలోకమునందు బొంద నలవిగాని కోరిక లన్నిటిని నీ యిష్ట ప్రకారము కోరుము. మనుష్యులకు బొంద నలవిగాని రథతూర్య వాద్యములతో గూడ ఈ యప్సరస్త్రీలను సయితమిచ్చెద నని యముఁడు చెప్పెను.

అందుకు నచికేతసుడు

శ్వోభావా మర్త్యస్య యదన్తకైతత్
సర్వేన్ద్రియాణాం జరయంతి తేజః
అపి సర్వం జీవితమల్పమేవ
తవైవ వాహాస్తవ నృత్యగీతే.
న విత్తేన తర్పణీయో మనుష్యః ॥

(క. ఉప. I. (1). 16-7.)

ఓ యముడా! నీవు చెప్పిన నశ్వరములగు భోగములు మనుజుని సర్వేంద్రియముల తేజస్సును జీర్ణింపజేయునవియే కాని వేఱొండు ఫలములేదు. ఆయుష్కాలము స్వల్పము. నృత్యగీతాదులు నాకు వలదు. నీకే యుండనిమ్ము. ధనమును బొంది తృప్తిజెందిన మనుజుడు లేనేలేడు.

అని యుత్తరమిచ్చి యాత్మవిద్య వినా మఱియొండే నొల్లనని పల్కెను.

అందుకు యముఁడు

స త్వం ప్రియాన్ప్రియరూపాంశ్చ కామాన్
అభిధ్యాయన్నచికేతోఽత్యస్రాక్షీః
నైతాం సృఙ్కాం విత్తమయీమవాప్తో

యస్యాం మజ్జంతిబహవో మనుష్యాః
విద్యాభీప్సినం నచికేతసం మన్యే
న త్వా కామా బహవోఽలోలుపన్తః ॥

(క. ఉప. I. (2). 3-4.)

ఓ నచికేతసుడా! పుత్రవిత్తవనితాది ప్రియరూపములైన కామము లను జక్కగ నాలోచించి వాని నతిక్రమించి యందఱు మునిగి యుండు ధనరూపమగు సంసారమును బొందకపోతివి. నీవు (అవి ద్యకు భిన్నమగు) విద్యను గోరువాడవు. బహు కోరికలు నిన్ను లోపఱచుకొన జాలక పోయెను.

అని వక్కాణించి నచికేతసుని పూర్ణవైరాగ్యమునకు మెచ్చి యాత్మవిద్యోపదేశము చేసెను.

మఱియు "పరమగురు చరణసన్నిధి" యందు

"తలుపు దట్టువారికి" బోధించవలెను

అని విధింపబడియున్నది. తలుపు దట్టువాడనగా వైరాగ్య వృత్తి నవలంబించి నివృత్తిమార్గమునందు బ్రవేశించి "నేను లోకహితార్థము జ్ఞానమును గోరెదను, తలుపు దెఱచి నన్ను లోపలికి రానిచ్చి జ్ఞానము నొసంగుడు" అని సంకల్పించి తలుపుదట్టువాడు. అంత దలుపు దెఱచి పరమగురువులు తమ సన్నిధికి వాని రానిచ్చి సహాయము చేయుదురు.

ఇందువలన మన గ్రంథములలో నెవడు వివేకాది నాలుగు సాధనములను సాధించ బ్రయత్నించునో వానికే బ్రహ్మవిద్యాధికారము అని విధించబడియున్నది.

ప్రకృతమందు "వెనిషియర్" అను జీవన్ముక్తుల యభిప్రాయము సయితమిదియే యని సూత్రముల ముందువ్రాసిన వాక్యముల వలన స్పష్టమగుచున్నది.

ఈ వాక్యములలో సాధనచతుష్టయ సంపన్నులగు శిష్యవర్గమునకే గ్రంథముద్దేశించబడినదని మూల వచనమునందు నిరూపించబడియున్నది.

## మూల వచనము

"శిష్యులకు" అని చెప్పినందున ముముక్షుత్వము విధించబడియున్నది. "ఎల్లఱకు" అను పదమువలన ప్రథమ భాగములోని సూత్రములు ముక్తగురు సాక్షాత్కారము కాని ముముక్షువులకు సయితము బోధనీయములని యర్థము. అయితే శిష్యతారతమ్యము కొలది యర్థము గ్రాహ్యమగును. ఈ గ్రంథములోని సూత్రములకనేకార్థములున్నవని టీ. సుబ్బరావు స్వామి గారు నుడివిరట.

## ప్రథమ వాక్యము

కన్నులు చూడ గల్గుటకుమున్ను కన్నీరు విడుచుటను మీఱి యుండవలయును.

ఈ వాక్యమునకు విపరీతార్థముచేసి ముముక్షు వత్యంత కఠిన హృదయుడు గావలెనని విధించునట్లు భావించవచ్చును. "కంట నీటి చుక్క రానియ్యక యెవడెంత కష్టపడినను నెంత దుఃఖము పొందినను వాని గతి విచారించ గూడదు. సహాయము చేయగూడదు. అట్లు సహాయము చేసినయెడల వాని కర్మము వాడనుభవించవలసినట్లు భగవంతుడు విధించియుండ మనము సహాయముచేసినచో భగవదాజ్ఞకు

విరుద్ధముగ నటించినట్లగును. వాని కష్టము వానిది, మనము జోక్యము పుచ్చుకొన కూడదు'' అని వాదించవచ్చును. ఇయ్యది యసురపక్ష వాదము. అసురులు పరుష గుణములు కలవారనియు, నుగ్రకర్మలు సేయువారనియు, కేవలము స్వార్థమునే చింతించు కామ భోగ పరులనియు, బరులను హింసించి ద్వేషించువారనియు, భగవద్గీత 16 వ అధ్యాయమందు నుడువబడి యున్నది. ఇట్టి గుణములు గల వారు అల్ప బుద్ధులనియు నష్టాత్ములనియు జగత్తుకు శత్రువులనియు వారు నరకప్రాప్తులగుదురనియు జిరకాల మసురయోనులందే జన్మిం చెదరనియు గీతయందు జెప్పబడియున్నది.

ముముక్షువులు నరకప్రాప్తికి బాటుపడువారు కారు. ఈశ్వర గుణములను సంపాదించి ఈశ్వరుని సన్నిధి జెంద గోరువారు. అన్ని మతములందును నీశ్వరుడు కరుణాసముద్రుడనియు, నపారభూత దయోపేతుడనియు, ప్రేమానుకంప భరితుడనియు, సంసార సము ద్రమున మునిగి శ్రమపడుచుండు జీవులను బూర్ణానురాగముతో నుద్ధరించువాడనియు నొక్కి చెప్పబడియున్నది.

> తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
>
> (భ. గీ. 12–7)

> సంసారపంకనిర్మగ్నసముద్ధరణపండితా ॥
>
> (లలితాసహస్రనామము)

అట్టి భగవంతుని జెందవలెనన్న, సత్యార్జవ అహింసా భూతదయ శమాది యాత్మగుణములే సోపానమార్గములు గాని పారుష్యద్వే షాది యనాత్మగుణము లెంతమాత్రము కావు. పరశ్రమనివారణము

భగవదాజ్ఞోల్లంఘనమని భావించుట తెలివిలేనిమాట కాని వేఱు కాదని సత్యముగా జెప్పవచ్చును. పరోపకృతి కైవల్యముకంటె నుత్కృష్టమైనదనియు,

పరోపకృతికైవల్యే తులయిత్వాజగద్గురుః ।
గుర్వీ ముపకృతిం మత్వా అవతారాన్ దశాఽగ్రహీత్ ॥

భగవంతుడు లోకహితార్థమే పనిచేయుచున్నాడనియు,

సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ॥
(భ. గీ. 5 అ.)

పరోపకారమే పుణ్యమనియు,

శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః ।
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం ॥

ఈశ్వరాజ్ఞాప్రవర్తకులగు ఋషులు పరశ్రమనివారణమే స్వభావముగా గలవారనియు,

అయం స్వభావః స్వత ఏవ యత్పరశ్రమాపనోదప్రవణం మహాత్మనాం ।

(వివేకచూడామణి)

ఇట్లని గ్రంథము లుద్ఘోషించుచున్నవి.

ఈశ్వరాజ్ఞ యట్లుండ నితరుల శ్రమ నివారించిన నతని కర్మఫలభోగమునకు భంగము గలుగజేసినట్లగునని తలంచుట సరికాదు. మనము చూచిన మనుజుడు కష్టపడుచుండుట వాని పూర్వదుష్కర్మఫలము ; ఆ సంకటమును నివర్తింపజేయు సహాయప్రాప్తికి గారణ

మగు సత్కర్మసయితేము వాడు పూర్వము చేసియుండవచ్చును. ఆ సత్కర్మయొక్క మంచి ఫలము నొసంగు పుణ్యము ఈశ్వర ప్రేరితమై మనకు గల్గినదని తలచి ఈశ్వరస్వభావమైన పరోపకారము తత్క్షణము చేయసలయునే కాని తామసించ గూడదు. ఆలస్యము చెసిన యెడల మనయందు దాగియుండిన దుర్బుద్ధి బయటికివచ్చి తొలుత బూనికొనిన పరోపకారచింతను బోగొట్టునేమో? మరియు నెన్ని విఘ్నములు వచ్చునో?

శుభకార్య ఘటనమునందు దామసము గూడదు. కనుక ప్రథమ వాక్యము కాఠిన్యమును బోధించునది యెంత మాత్రము కాదు. ఇకను వాక్యముయొక్క యథార్థతాత్పర్యము నాలోచింతము.

దాని సాధారణార్థమేమన:—తన కెంతటిదుఃఖము సంభవించినను వ్యసనము చెందగూడదు. కంట నీరు పెట్టుట వ్యసనముయొక్క బాహ్యచిహ్నము. ఇట్లు దుఃఖము ప్రాప్తియగునప్పుడు చలించక సహించుటయే తితీక్షయని పేరు.

సహనం సర్వదుఃఖానాం అప్రతీకారపూర్వకం ।
చింతావిలాపరహితం సా తితీక్షా నిగద్యతే ॥

చింతించక విలపించక దుఃఖములను గలుగజేసిన వానికి బ్రత్యపకారము జేయదలచక సర్వదుఃఖములను సహించుటయే తితీక్ష.

పూర్వ మనేక జన్మములయందు జేసిన దుష్కర్మఫలము రోగాది యాధ్యాత్మిక, వ్యాఘ్రపీడాది యాధిభౌతిక, అగ్న్యాది యాధిదైవిక దుఃఖరూపముగా మనకు బ్రాప్తమగును. మనము చేసిన కర్మఫలము మన మనుభవించక తీరదు. అది ఋణము వంటిది. నిశ్శేషముగ దీర్చ

వలయు. ఈ ఋణమను గొప్పమూటను మననెత్తిపై నుంచుకొని యుండువఱకు మహాగురువుల పవిత్రమగు నభయహస్తము మన శిరస్సుపైన నుంచబడుట కవకాశము లేదు. సాధారణమనుజునికి బూర్వజన్మకృత పాపములో గొంతభాగము ప్రారబ్ధరూపమున నీజన్మమందు ప్రాప్తించి భోగముచే క్షయించును. ముముక్షువుకు నింకయు హెచ్చుగా గష్టములు కలుగును. ముముక్షువు వైరాగ్యవృత్తి బూని లోక దుఃఖనివృత్తి సాధనమగు జ్ఞానమును సంపాదించ సర్వప్రయత్నములు చేయువాడు. దుష్కర్మ బలముగా శేషించి యుండినయెడల వాని ప్రయత్నములకు లెక్క అంతరాయములు కలిగి సఫలములు కానేరకపోవును. వానికి లక్ష్యస్థానమందు బూర్ణ గమనముండుటవలన దన కార్యమునకు విఘ్నములు కలుగజేయునట్టియు, దాననుభవించక తీరనిదియు నగు పురాకృత కర్మమును శీఘ్రముగ దెంచివేయవలెనని ధృఢముగ సంకల్పించును. ఆ సంకల్పబలముచే సాధారణ మనుష్యునికి ప్రాప్తించు ప్రారబ్ధకర్మయే కాక సంచిత కర్మలో గొంతభాగము సయితము భోగమునకు బక్వమై తటస్థించును. అతని వైరాగ్యమెంత తీవ్రముగనుండునో అంత యెక్కుడుగ సంచితకర్మ అనుభవమునకు ప్రాప్తించును. ఒక యుదాహరణముచే దీనిని సులభముగ గ్రహించవచ్చును. పదివేలరూప్యములు ఋణముండినయెడల సాధారణ మనుష్యుడు నూరు రూపాయలవంతున నూరు వాయిదాలుగా జెల్లించును. ముముక్షువు వెయ్యిరూప్యములవంతున పది వాయిదాలలోనే ఋణమును దీర్చి యా బాధను దొలగించుకొన బూనుకొనును. కనుక సన్మార్గప్రవర్తనమునందు గష్టము లెక్కుడుగ సంభవించునను లోకోక్తి సహేతుకముగ నున్నది. మనము చేసిన కర్మను మన మనుభ

వించవలసియే యుండును గనుక సంతోషముతో ననుభవించ వలె నని వివేకముతో దెలిసికొనవలయును. చింతించుట నిష్ప్రయోజన ము. ఎవరిమూలమున మనకీజన్మమందు దుఃఖము సంప్రాప్తమాయెనో వాడు మన పూర్వకర్మను మనచేత దీర్పించి మనల మోక్షమార్గమం దొక మెట్టెక్కించెనని తలంచి వానియందు గృతజ్ఞత కలిగి సన్మా నించవలెను. అట్లు భావించక మన కిడుములు ప్రాప్తింపజేసెనని వానిపై నలిగి వానికి బ్రత్యపకార మొనర్చదలచిన బురాకృతకర్మా నుభవమునందు గ్రొత్తగా రాబోవు జన్మకొక దుష్కర్మము చేర్చి నట్లగును. మనముచేసిన ఋణమును నడుగవచ్చిన వానిని దిట్టి కొట్టి హింసించినయెడల దొలుత జేసిన యప్పు దీర్చకపోవుటయే కాక క్రొత్తగాజేసిన హింసాదులకు బ్రత్యేకశిక్ష ననుభవించవలసి యుం డును గదా.

కష్టములకు వెఱచి చింతించుచు గన్నుల నీరు కార్చుకొనుచు దైన్య వృత్తి నవలంబించుట మోక్షమార్గ ధర్మము కాదు.

ఈ వాక్యమున కింతకంటె విశేషార్థము స్ఫురించుచున్నయది. జ్ఞాన వైరాగ్య నిష్ఠలయం దున్నత స్థితికి వచ్చిన వారికి భేదబుద్ధి నశిం చును. మనస్సు నిర్మలమై చలించక ప్రసాదముజెందిన వారికి ఆత్మ యొక్క యథార్థజ్ఞానము ప్రకాశించును. వారికి బూర్వజన్మ జ్ఞాన ము కలుగును. ఈశ్వర సంకల్ప మిట్టిది యని తెలియును. అట్టి వారికి దుఃఖ మూలమగు నజ్ఞానము నశించుటవలన జింతా విలాప ములు కలుగ నేరవు. తమ కష్టముల కెంతమాత్రము ఖేదము చెంద రు. పరుల సంకటములను జూచి వానిని గూర్చి మిగుల పరితాప పడుదురు. సహాయము చేయ బూనుదురు. అంతియు కాని వారి

తో గూడ దాము సయితము విలపించరు. చింతించి చేయు నదేమి లేదనియు, మనస్సు ఖేదక్షోభలచే జలించునెడ సంమోహ స్మృతి భ్రంశలచే దుఃఖితుల నాదరించు శక్తి సయితము లేక పోవుననియు, ఈశ్వరాజ్ఞ ప్రకారము దుఃఖ ప్రాప్తి కారణమగు దుష్కర్మ చేసిన కతన తత్ఫలము ననుభవించుట న్యాయమే యనియు, తెలిసికొని తాము చింతించి మనశ్శక్తిని వృథాపుచ్చక, దుఃఖించు వారల నాద రించి దుఃఖమును నివారించుటకై సర్వ ప్రయత్నములు చేయు దురు.

ఇట్లిరు తెగల వారికిని ఈ వాక్య మన్వయించుచు సద్బోధ చేయుచున్నది.

మొదటి వాక్యము ముఖ్యముగా "తితీక్ష" ను బోధించుచున్నది యని తెలియజేయ బడెను. ఆ గుణము వివేక వైరాగ్యములు లేనిచో సాధ్యము కాదు. ఈ వివేకాదులకు సాధన-చతుష్టయ మని పేరు (అనగా నాలుగు సాధనోపాయములు). ఏ కార్యము సాధించవలసి వచ్చినను నాల్గు సాధనములు కావలసియుండును. 1. కార్యవిషయము తెలిసికొనుట, 2. కార్యసాఫల్యప్రతి బంధకములను దొలగించుకొను ట, 3. సాఫల్యానుకూల సామగ్రిని సంపాదించుకొనుట 4. గమ్య స్థానమును చెందుటకై ప్రకృతమందుండుస్థానమునుండి విడిపించుకొన వలెనని ధృఢసంకల్పము చేయుట. మోక్షమార్గమం దీ నాలుగు సాధనములకు వివేక, విరాగ, షట్సంపత్తి, ముముక్షుత్వము అని పేర్లు గలవు. ఆ సాధనములు మిక్కిలి ముఖ్యమైనవి కావున వానిని బా గుగ దెలిసికొనుట యత్యంతావశ్యకము. వానిని బోధించు వేదాంత గ్రంథము లనేకములున్నవి. అంతకన్న మిక్కిలి స్పష్టముగ విపుల

ముగ దివ్యజ్ఞానసమాజమువారి వలన బ్రచురింపబడిన నీ క్రింద జేర్కొనబడిన గ్రంథములలో బోధించబడియున్నవి.

(1) పరమగురు చరణసన్నిధి, (2) అందుపై యోగి లెడ్బీటర్ గారి వ్యాఖ్యానము, (3) బ్రహ్మశ్రీ అద్దంకి సీతారామశాస్త్రిగారిచే రచించబడిన "ఆత్మవిచారము" అను గ్రంథము, (4) చిట్టమూరు రామయ్యగారిచే రచించబడిన "బ్రహ్మవిద్యాదర్పణము" లోనగు గ్రంథములు. "మోక్షమార్గ ప్రదీపిక" అను నీ గ్రంథములో గ్రంథవిస్తరభీతిచే నీ విషయమును గూర్చి వ్రాయలేదు.

ఈ ప్రథమ వాక్యముయొక్క ముఖ్యతాత్పర్య మేమన "కన్నులు చూడగల్గుటకు మున్ను" అనగా యథార్థదృష్టి కల్గుటకు మున్ను. యథార్థదృష్టి యనగా సర్వం బ్రహ్మమయమని తెలియుట. అట్టి దృష్టి సాధారణమనుజునివలె దుఃఖములకు జలించువానికి కలుగదు. యథార్థదృష్టివలన భగవంతుని విశ్వరూపమును జూడ శక్యమగును. అట్టి విశ్వరూపము సాధారణములగు కన్నులతో జూడనోపవని శ్రీ కృష్ణు డర్జునితో జెప్పెను.

> నతు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా ।
> దివ్యం దదామి తే చక్షుః పశ్యమే యోగమైశ్వరమ్ ॥
>
> (భ. గీ. 11—8)

దివ్యచక్షుస్సు నిచ్చినగాని విశ్వరూపసందర్శనము సాధ్యము కాక పోయెను. దివ్యచక్షుస్సు అనగా దుఃఖబాష్పములు విడుచునది కాదు. జ్ఞాననేత్రము. అర్జునుడు "నావారు నాబంధువులు" అను నభిమానమును వదలియుండలేదు. కావున దివ్యదృష్టికి వలయు సంపూర్ణ

యోగ్యతను బొందినవాడు కాడు. అందువలననే విశ్వరూపము వీ క్షించి "నేనోర్వజాల, భీతిజెందితిని, పూర్వపు సౌమ్యరూపము చూపు" డని ప్రార్థించెను.

భయేన చ ప్రవ్యథితం మనో మే । తదేవ మే దర్శయ దేవ
రూపం । ప్రసీద దేవేశ జగన్నివాస ॥ (భ. గీ. 11-45)

కావున సుఖదుఃఖాది ద్వంద్వములకు జలించనివాని కన్నులే చూడ గలుగును.

## రెండవ వాక్యము

**చెవి వినగలుగుటకుమున్ను నిందాస్తుతులకు చలించక యుండవలెను.**

ఇచ్చట వినదగిన దీశ్వరశబ్దము. ఈ శబ్దము ప్రణవాత్మకమై లోకమందంతయు నిండియున్నది.

ప్రణవోహ్యపరంబ్రహ్మ ప్రణవశ్చ పరఃస్మృతః ।
అపూర్వోఽనంతరో బాహ్యో నపరః ప్రణవోఽవ్యయః ॥
(మాం. ఉ.—గౌ. కా. 1-26)

సముద్రము మ్రోయుటయందును, గాలి వీచుటయందును, మేఘము గర్జించుట యందును వినబడుశబ్ద మీశ్వరశబ్దము. శుకపికశారికాది పక్షుల మధురవాక్కులందును, అస్వారస్యముగ దోచు కాకాదుల శబ్దములందును, బలుకువాడు భగవంతుడే. మఱియు నధ్యాపకుల వేదఘోషలయందును, బాలుర నిర్దోష సల్లాపములందును, నృపతుల గంభీర వాక్కులందును, ఆర్తుల దీనాలాపములందును జగదీశ్వరుడు పలుకుచుండు. పరమేశ్వరుడు లోపలను వెలుపలను నెల్లపుడును

సుఖజనకంబగు శాంతరసమును ప్రణవాత్మకమగు తన వాక్కుచే వెద జల్లుచుండును. వినబడు ప్రతి శబ్దమును భగవంతుని వాక్కుగ నమ్మి యానందించ వలయునే కాని చలించరాదు. పరులవాక్కు మన యెడల స్తుతినిందాపరముగ నుండవచ్చును. సుఖదాయకముగ నుండ వచ్చును. శోకాస్పదముగానైన నుండవచ్చును.

తుల్యనిందాస్తుతి ర్మౌని (భ. గీ. 12-19)

ప్రియప్రాప్తియందు సంతోషించ గూడదు. అప్రియము సంభవించి నపుడు భయపడ గూడదు.

స్తుతిచే హర్షంబును నిందచే శోకంబును జెందగూడదు. నిందా స్తుతులయందు సమత్వమును నిలుపుకొనవలయును. ఇందుకు గారణ ము విచారణీయము. తొలుత దూషణ వాక్కులను గురించి విచా రింతము. దూషించినవాడు కామక్రోధములకు లోబడిన వాడేకాని జ్ఞానికాదు. దేహధర్మములగు కామక్రోధాదు లనిత్యములు. అట్లుండ గామక్రోధోద్భవములగు దూషణవాక్కులను సరకు చేయగూడదు. వానివలన మనకేమియు నష్టము కలుగలేదు. ఆ మాటల వినకయుం డిన యెడల మన మావిషయములో జోక్యము పుచ్చుకొన దలచము. కనుక మాటలయందేమి ఫలము లేదు. మనము వాని నెన్నికొనుట వలన గష్టమును దెచ్చుకొన్నారమే కాని వేఱొండు లేదు. ఇట్లు దూషణవాక్కును సరకుజేయక యుండుట మాత్రమే చాలదు. ఆ వాక్కునందు దీశ్వర శబ్దమును వినవలెను. అనగా అది భగవంతుని వాక్కుగ దలచవలెను. ఇప్పుడు మనల నిందించువానిని బూర్వజన్మ ములలో మనము నిందించి ప్రపంచ సమష్టిశాంతమునకు భంగము

గలుగజేసినందున దానిని జక్క పెట్టుటకు భగవంతుడు నిందించువాని వాగ్రూపముగా మనపాపమును బోగొట్టి కలవరపెట్టబడిన సమష్టి శాంతము నుద్ధరించును. ఇట్లు నిందా రూపమైన వాక్కు ఈశ్వర శబ్దమే యని తెలిసి యానందించవలెను. ఇందొక యాక్షేపణ కలుగవచ్చును. ఉత్తమవాక్కు లీశ్వరశబ్దము లనదగునుగాని హేయమైన దూషణపు పలుకు లీశ్వరవాక్కులని యెట్లు తలచదగు? ఇందుకు సమాధానము కొన్నియుదాహరణములవలన దెలిసికొనవచ్చును.

ఒక కుటుంబములో బాలురు, వృద్ధులు, బలవంతులు, బలహీనులు, జ్ఞానులు, అజ్ఞానులు నుందురు. బలహీనులును నజ్ఞానులును గుటుంబములో జేరినవారు కారని నిరాకరించుట లేదు. వారికి నల్లయు సహాయ మొసగుట ధర్మమని యెఱిగి కుటుంబములోని బలవంతులు జ్ఞానులు వారిని గాపాడుదురు. మఱియు నొకరాజ్యమునందలి మనుజుడు మఱియొకరాష్ట్ర ప్రజల కెగ్గుజేసిన నా కార్యము మొదటి దేశపు రాజుచేసిన యపరాధముగ నెంచి పరిహారము గోరుట విదితమైయున్నది. గానమునం దపస్వరములు స్వరములతో జేరిన వాని శృంగార రసము నెక్కుడు జేయును. అజ్ఞానులాడు దూషణవాక్కులపస్వరములవంటివి. ఈశ్వర గానానందమును హెచ్చుజేయును. భగవంతు డపస్వరములను స్వరములతో గలిపి తన వాక్కునం దానందమును గల్పించును. అతి పిరికితనము, అతి సాహసము ప్రత్యేక దృష్టిచే వర్జనీయములయినను రెండు నొకచోట గూడిన యెడల అన్యోన్య సహకారులయి సామరస్యము నొందును. దూషణవాక్కులాడు వాడజ్ఞాని. క్రిందిమెట్టున నుండువాడు. మాటలే రానివాని కన్న వాడు మేలు.

పరనింద చెడ్డదని కాలక్రమమున నెఱుగును. ప్రకృతమందు వాని మాటలను లక్ష్యపెట్ట నవసరము లేదను శాంతగుణమును మనకు గలుపుటయందు వాడు మనకు సహకారి. ఇట్లు తన వృద్ధికిని మన వృద్ధికిని దోట్పాటగు మాటలు ఈశ్వరవాక్కులు కావని యెట్లు చెప్పనగు? ఈ విషయమందొక కథ చెప్పబడుచున్నది. పులుగు లన్నియుజేరి గానముజేయ దొడగెను. అందు కాకస్వర మీశ్వరస్తుతి రూపగానమున కనుపయుక్తమని యాయొక్కని మాత్రము తమ సంఘములో జేర్చుకొనక నిరాకరించెను. ఈశ్వరు డాగానమును మెచ్చక యిట్లు పక్షులను గూర్చి వచించెను. "మీరు చేసిన గాన మునందు లోపము కన్పట్టు చున్నయది. అది నాకపస్వరముగ దోచు చున్నది. కాకస్వరము చేరనందున గాన స్తుతియం దెంతయో కొఱత కల్గెను. ఎల్లవాక్కులు నా వాక్కులే. మీ రపస్వరములని యెన్నునవి సయితము నా వాక్కులే. నిష్కారణముగ వాయసమును నిరాకరించితిరి. దాని స్వరము లేమింజేసి మీరు పాడినది మదీయజగ దానంద జనకమగు వాక్కు కాకపోయెను. ఇక నీరీతి నెవరిని దిర స్కరించవలదు." అని హితోపదేశము చేసి తిరోధానమాయెను.

పరనిందను విని చలించుటవలన మనకు మేలులేక పోవుటయే కాక ఇతరులకు గీడుజేసినట్లగును. నిందించిన వాని దుష్టతలంపువలననే లోకసమష్టి శాంతమునకు భంగము కలిగెను. అందుకు మన మనస్సు చలించి క్రోధము చెందినయెడల సమష్టి శాంతమునకు నెక్కుడుగ హానికల్గును. అందువలన జనసామాన్యమునకు గోచరము కాని విధ మున నపకారము మనము జేసినట్టగును. అందువలననే అపకారమునకు ప్రత్యుపకారము జేయ రాదనియు, ద్వేషము ద్వేషముచేత వృద్ధియగునే

కాని నశించదనియు, అది ప్రేమవలన తుదముట్ట నశించుననియు నార్యోక్తికలదు. ఇట్టి విషయములలో సమష్టిదృష్టిచే జూడవలెను. ఒకడు ద్వేషించిన సమష్టిమైత్రభావమునకు లోపము కలుగును. మనము సయితము ద్వేషించినట్లయిన సమష్టికి రెండులోపములు కలుగును. అట్లు చేయక ప్రేమించినయెడల మన ప్రేమసంకల్పము వెనుకటి ద్వేషఫలమును సంహరించి సమష్టి మైత్రియందు గలిగిన లోపమును దొలగించును. భేదభావము నతిక్రమించినవానికి నింద నిందగా దోచనేరదు. ఏకీభావమువలన దనయందలి లోపముగనే గన్పడును. ప్రత్యపకారబుద్ధి కలుగదు.

న హినస్త్యాత్మనాత్మానం । (భ. గీ. 13—29)

అప్పుడు చలించుట కవకాశమే లేదు. ఇచ్చట నొక దురభిప్రాయము కలుగనచ్చును. "మనయందలి దౌష్ట్యమును గూర్చి జెప్పకొనబడు మాటలను మనము లక్ష్యపెట్ట నక్కరలేదు. ఎవరేమి చెప్పినను మనము లక్ష్యపెట్టక మన స్వేచ్ఛానుసారముగా వర్తించవచ్చును" అని తలచవచ్చును. ఇది యహంకార భావము. ఆసురస్వభావము. అట్లు [illegible]దు. గురువుల వాక్యతాత్పర్యము మన మితరుల మాటలను [illegible]ట్ట గూడదనికాదు. వానిని విని మనయందలి పరోపకా[illegible] భంగకరములగు లోపములున్నయెడల జక్కపెట్టుకోవలెను. ఆ మాటవలన మనము చలించకూడదనగా చింతాదైన్యముల నొందించిన వానియందసూయాక్రోధములను బూని ప్రత్యపకారము చేయబూనుకొనరాదని తాత్పర్యము. మనస్సున వికారము కలుగనే కూడదు.

ఇక స్తుతి విషయ మాలోచింతము. స్తుతికి జలించకుండుట కష్టము. నిందకు దీనికిని భేదము గలదు. నిందించబడినపుడు మనయం దారోపించబడిన లోపములు మనయందు లేవనియు నిష్కారణముగా దురుద్దేశముతో నారోపింప బడినవనియు నమ్ముదుము. ఉద్వేగము శమించినపిమ్మట నిందించినవాడు మంచి యుద్దేశముతో మన మేలు కొఱకే మన లోపములను మనకు గాన్పించెనని చెప్పినయెడల దానిని నమ్మి యటుపిదప మనస్సు చలించకుండునటుల జేసికొనినను జేసికొనవచ్చును. స్తుతి విషయమిట్లు కాదు. స్తుతిచేయువాడు మనయందు లేని సుగుణముల మనయం దారోపించును. వాని యుద్దేశము మంచిది యనినమ్ముదుము. వాని యుద్దేశము చెడుది యనికాని మనయందా సుగుణములు లేవని కాని చెప్పట కితరులు సందేహింతురు. చెప్పినను ఆ మాటలను విశ్వసించుటకు మన కిష్టముండదు. కపట స్తుతి వచనములకు మన ముప్పొంగి మోసపోదుము. కొన్ని సమయములలో స్తుతివచనములు భక్తిపూర్వకముగా సమర్పించబడినవిగ నుండవచ్చును. ఈ సందర్భములలో యథార్థస్థితిని దెలిసికొనుటకు "పరమగురు చరణసన్నిధి" యను గ్రంథమందు బోధించబడిన మహాగురు వాక్యమే సహకారి యగును. దేహోద్రేకమువలన ప్రేరితమయిన దానికిని ఆత్మప్రేరితమునకును భేదమును గనిపించవలెను. స్తుతివచనము విన్నంతనే సహజముగా మనోమయ విజ్ఞానమయ కోశములుప్పొంగును. అట్లుకానివ్వక గురువాక్య ప్రకారము లోతున దిగి పరిశోధించి యిట్లని వితర్కించుకొనవలెను :—" ఈ స్తుతివచనములు మంచి యుద్దేశముతోనే పల్కబడి యుండు గాక! స్తుత్యర్థమైనను గుణగ్రహణము మంచిదే. నాయందీ సుగుణసంపత్తి లేదు. అయినను

దానిని సంపాదించుటకు బాటుపడెదను. నాయందు సుగుణము లుండిన యెడల వానిని జూచి గ్రహించి మెచ్చిస్తుతించి యెందఱో మేలు పొందగలరు. సర్వసుగుణాధారుడు భగవంతుడే కదా!

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా ।
తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోఽంశసంభవం ॥

(భ. గీ. 10—41)

నాయందు సుగుణములు నిజముగా గల్గియుండినచో వానిద్వారా నాయందీశుడే ప్రకాశించుచున్నాడు. స్తుతివచనము లాయన కన్వ యమేకాని నాకుగాదు. నాయందుండినను లేకున్నను సుగుణ స్తుతిచే నీశ్వరస్తుతి జేసిన వాడాయెను. వానిని భగవంతు డను గ్రహించి రక్షించుగాత" అని చింతించి దేహము లుప్పొంగకుండునటుల జేయవలెను. నిందించబడినపుడు నిందితగుణములు దేహసంబంధము లనియు స్తుతించబడినపుడు స్తుతింపబడిన గుణము లీశ్వరునివనియు భావించి నిందాస్తుతులయందు జలనస్వభావము బోగొట్టుకొనవలెను. ఇట్లు నిందాస్తుతులయందు దుల్యత్వమును జెందువాడు గుణాతీతు డగును. మాట వినినంతనే చలించువానికి మనఃప్రసాదము కలుగదు. ప్రసన్నత లేనిచో నీశ్వరధ్యానమందు బుద్ధినిలువదు. విషయవాసనా రాహిత్యము లభించదు. సంసారదుఃఖనివృత్తి కలుగదు.

నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।
న చాభావయతః శాంతి రశాంతస్య కుతః సుఖమ్ ॥

(భ. గీ. 2—66)

కావున సమస్తకర్మలను జేయునపుడు సమస్తశబ్దములను వినునపుడును, అవియన్నియు నీశ్వర స్వరూపములే యని నమ్మి ప్రసాదము నొందవలెను.

## మూడవ వాక్యము

**వాక్కు పరమగురువుల సన్నిధానమందు వచించగల్గుటకు మున్ను ఇతరుల మనస్సును నొప్పించుట యసాధ్యమై యుండవలయు.**

ప్రథమ ద్వితీయ వాక్యములలో నుదాహరించబడిన చక్షుశ్శ్రోత్రేంద్రియములు జ్ఞానేంద్రియము లన్నిటికి నుపలక్షణముగ చెప్పబడినవి. బాహ్యవిషయ జ్ఞానమును గలుగజేయుటవలన జ్ఞానేంద్రియములని తెలియబడుచున్నవి.

> మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।
> ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత ।
> యం హినవ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ ।
> సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥

(భ. గీ. 2-14, 15)

ఒకప్పుడు సుఖమును మఱియొకప్పుడు దుఃఖమును గలుగజేయునవియును వచ్చుంబోవు స్వభావముగలవియు ననిత్యములునగు విషయసంస్పర్శలకు నెవడు చలించకయుండునో వాడు మోక్షమునకు అర్హుడగును.

ఈ యర్థము ప్రథమ ద్వితీయ వాక్యములచే స్పష్టపరచబడెను. మూడవవాక్యము కర్మేంద్రియములను గూర్చి జెప్పుచున్నది. వాక్కు

సకల కర్మేంద్రియముల కుపలక్షణముగ జేర్కొనబడినది. కర్మేంద్రియములచే మనము కర్మచేయుదుము. బాహ్యావస్తువులు, మనుష్యులు వీనివలనగలుగు సుఖదుఃఖములచే జలించకుండునటుల జ్ఞానేంద్రియ నియమనమును విధించినటుల నే మనము చేయు కర్మలవలన నితరులకు బాధకలుగకుండునటుల చేయవలయునని యిప్పుడు కర్మేంద్రియ నియమములను గూర్చి జెప్పబడుచున్నది.

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్సవిశిష్యతే ॥

(భ. గీ. 3-7)

ఈశ్వరసంకల్ప మెఱిగి లోకపురోవృద్ధికి బాటుపడవలెనని మనస్సున దృఢముగ నిశ్చయించి యింద్రియములను నియమించుకొని లోకోపకారకమగు కర్మనాచరించుట కుపయుక్తమగు నుపకరణములు కర్మేంద్రియములు. సర్వభూతములు భగవంతుని బిడ్డలే యనియు నొక్కటియగు నాత్మ పలురూపములుగ నగుపడుచున్నదియే కాని నిజముగ నొండొరులకు భేదము లేదనియు స్మరించుచుండవలెను.

ఏకోవశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి । తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం ।

(క. ఉప. II. (5). 12.)

లేనియెడల గర్మానుష్ఠానమం దధర్మాచరణము సంభవించును. భేదబుద్ధితో జేయునది పరహితార్థముగ నుండనేరదు. ప్రాయశః

నొప్పిగలుగ జేయునదిగ నుండును. ఇట్టిది ఈశ్వరార్పిత కర్మ యనబడ నేరదు. సదాలోకహితార్థము మనోవాక్కాయములచే ప్రవర్తించు మహాపురుషుల సన్నిధానమందు బరహింస నొనరించువా డెట్లు చేరనగు? అచ్చటికి బోనే యోగ్యతలేనివా డెట్లు మాట్లాడ నోర్చు? పరమగురువుల సన్నిధానమందుండి మాట్లాడుటకెంతయో అహింసాభూతదయాది ప్రేమగుణములు వృద్ధిచెందించుకొని యుండ వలయు. కర్మేంద్రియము లన్నింటిలో వాగింద్రియము మిగుల దుర్నిగ్రహము. దానివలన బెక్కువిధముల జనహింస చేయుచున్నారము. బుద్ధిపూర్వకముగా, అబుద్ధిపూర్వకముగా నితరులకు నొప్పి గలుగ జేయుచున్నాము. ఈ యింద్రియ శక్తిని వినియోగ పరచుటయం దనుష్ఠించవలసిన ముఖ్యమయిన విధు లీక్రింద వ్రాయబడుచున్నవి.

> అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
> ........వాఙ్మయం తప ఉచ్యతే। (భ. గీ. 17–15)

> సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ నబ్రూయాత్ సత్యమప్రియం। ప్రియోఽపి నానృతం బ్రూయాత్ ఏష ధర్మ స్సనాతనః ॥

ప్రాణులకు దుఃఖమును గలుగజేయనిదియు, సత్యమయినదియు, ప్రియమయినదియు, హితమయినదియు నగు వాక్కు, తపఃఫలము నిచ్చుననియు, ఏనాల్గింటిలో నెద్దికొఱతయయినను తపస్సనిపించుకొన నేరదనియు గీతాభాష్యమునందు నుడువబడియున్నది. "పరమ గురుచరణ సన్నిధి" యను గ్రంథమునందు వాఙ్నియమమును గుఱించి సందర్భానుసారముగ అచ్చటచ్చట మిక్కిలి విపులముగ బోధించ

బడియున్నది. ఆ బోధలను దెలిసికొనుటవలన విశేష మేలు కలుగును గావున వాని నీక్రింద చేర్చి సంగ్రహముగ వివరించబడును.

1. వాక్కు సత్యముగను అతిశయోక్తి లేకయు, నుండవలెను.

2. పరదూషణ మాటలు మనము వినినను నితరులకు జెప్పగూడదు.

3. మాట్లాడవలెనను కోరిక యుండగూడదు. అనగా ఆవశ్యకత యున్నయెడల మాట్లాడవలయునే కాని మాట్లాడుటయే కోరికగా నుండగూడదు.

4. మితభాషణము మంచిది.

5. మాట్లాడుటకుముందు వచించబోవుమాట సత్యమయిన దేనా, దయోపేతమయినదేనా, హితకారియయినదేనా, అని జాగ్రతగా యోచించుకొని మూడుగుణములను గల్గినదగునేని వచించవచ్చును. లేని యెడల, నామాటను వెడలనియ్యకూడదు.

6. మాటాడుటకుముందు బాగా యోచించుట కిప్పటినుండియే యభ్యసించవలెను. ఎందువలన ననగా గురుసాక్షాత్కారమైన పిమ్మట ప్రతిమాటను గనిపెట్టవలసి యుండును. ఆడరానిమాట నోటవచ్చునేమో యని కనిపెట్టవలసి యుండును.

7. సాధారణముగా జనుల సంభాషణ మనావశ్యకముగను దెలివి లేనిదిగ నుండును. అందు బరనింద చేరినయెడల దుర్మార్గమయినదని చెప్పవలెను.

8. మన యభిప్రాయమును నెవరైన గావలెనని కోరినయెడల జెప్పవచ్చునే గాని ముందు ముందుగానే మనము చెప్ప గూడదు.

9. మౌన మతి దుస్సాధ్యము.

10. ఈ మాట పరమగురువు నోటినుండి రాదగు మాటయే నా అని మనస్సులో ముందుగా నాలోచించుకొని తగునని తోచిన యెడల వచించవచ్చును. లేనియెడల వచించగూడదు.

11. ఇతరులకు నొప్పి గలుగజేయు మాట బుద్ధిపూర్వకముగా జెప్పగూడ దనునది సరియే! అంతియ కాదు. అజాగ్రతగా నైనను నొప్పిగలుగజేయు మాట బలుకగూడదు. అజాగ్రతగ నుండనే కూడదు.

ప్రమాదో మృత్యురిత్యాహుః ।

12. ఇతరులకు బాధ గలుగజేసినపుడు మన మబుద్ధిపూర్వకముగ జేసితిమని చెప్పినంతనే వారికి బాధ నివృత్తికానేరదు. పరులకు బాధ గలుగజేసిన కర్మ మన మనుభవించక తీరదు. కనుక గురుసాక్షాత్కారము గోరువాడు తనవలన నితరులకు గలుగు ఫలమును యోచించియే ప్రవర్తించును.

13. దూషణవాక్కులను సర్వ ప్రయత్నముల చేత నణగద్రొక్కవలెను. ఎవరిని గురించి మనము మాట్లాడుదుమో వాని యందు మన మారోపించిన దోషము లేకయుండవచ్చును. అట్టి యెడల మన దుస్సంకల్ప దుష్టవాక్కులచేత వానియందు నిదురించియుండు దోషము విజృంభించవచ్చును. మన మట్లు చేయకుండినయెడల వాని సత్సంకల్ప సత్ప్రవర్తనలవలన నాదోషము నశించి పోదగియుండును. మనవలన వానికి మిగుల చెడుగు కల్గినట్లాయెను. వానియందా దోషము నిక్కముగ నుండిన యెడల మనము చేసినదానివలన నది వృద్ధియగును. ఏవిధముచేతను వానికి మన మపకారము చేసినట్లగును. మనకు సయితము మేలు లేదు. దోషచింతనచే మనయందును దోషము

వృద్ధియగును. ఇట్లుభయులకు కెడుగు కలుగును. కావున పరదూషణ వాక్కట్టివ్యాజమున నైనను పనము పలుక గూడదు.

ఇతరులను నొప్పించుట యసాధ్యమై యుండవలెనని చెప్పబడి యున్నది. ఇచ్చట అసాధ్యమను పదము విశేషార్థద్యోతకము. స్వార్థత్యాగము, పరహితాచరణము అను గుణములను సదా స్మరించుచు ననుష్ఠించుచురాగ మనోమయకోశము పరిశుద్ధమగు నణువుల తో నిండియుండును. అట్టి శరీరములో దుస్సంకల్ప ముదయించ నేరదు. ఏలయన, తదుత్పత్తికారణమగు స్థూలాణువు లభావము. దుస్సంకల్ప ప్రేరితము కాని దుష్టవాక్కు లేదు. ఎంతకష్టపెట్టబడి నను హరిశ్చంద్రుడు కల్లలాడకపోయెను. ఆ మహాపురుషునికి అసత్య మాడ సాధ్యమే లేకపోయెను. మహాపరిశుద్ధుడు కనుక దుష్కృత మాచరింప నోపడాయెను. అటులనే మనకును నొప్పి గలుగజేయుట అసాధ్యము కాదగును.

ఈ గుణము బహుకాల మభ్యసించినగాని పట్టుపడదు. మన మెందఱికో జ్ఞాతాజ్ఞాత అపకారమును మన మాటలతో జేయు చున్నాము. ఒక దినము కనిపెట్టిన జాలును. మన దౌష్ట్యము మన మనస్సుకు వచ్చును. లెక్కించిచూడ నెందఱినో వాక్కుచే హింసించినారమని తెలియవచ్చును. కావున తామసించక వాఙ్నియమ ము సుద్యమించవలెను.

ఇటులనే మిగిలిన నాల్గు కర్మేంద్రియములను నియమించుకొన వలెను. వాగింద్రియమును వశపరచుకొన్నయెడల సర్వేంద్రియ నిగ్ర హము సుసాధ్యము. ఎందువలన నన, వాఙ్నియమమునందు మనో నిగ్రహము కలుగును. యుక్తాయుక్తముల నాలోచించి మాట్లాడుట

కభ్యసించుచు రాగా మనశ్శుద్ధికూడా కలుగును. కావుననే భగవద్గీత యందు మౌనమును మానసిక తపస్సుగా జెప్పియున్నారు.

మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే ॥ (భ. గీ. 17-16)

ఇంద్రియరాట్టగు మనస్సు శాంతముగ నుండునపు డింద్రియములు క్షోభను కలిగించ నేరవు.

ఇచ్చట నొక యాక్షేపణ చేయవచ్చును. వాక్పారుష్యము లేనిదే ప్రపంచమందు గార్యము నిర్వహించబడనేరదు, ముఖ్యముగ పామరుల విషయములో మంచిమాటలతో ప్రయోజనము లేదు, కాఠిన్యమే సహకారి యగు గాని మార్దవము నిష్ప్రయోజనము, అని యాక్షేపింతురు. ఇది యోచించవలసిన విషయమే. పామరసంఘాధ్యక్షత్వ భారమును వహించినవారలకు ముఖ్యముగ నీ సంశయోత్పత్తికి గారణ ముండును. అయితే ఈ విషయమందొక సంగతిని గమనించవలసి యున్నది. మనస్సు కఠినముగ నుండవలెనని యెచ్చటను జెప్పియుండ లేదు. రాజనీతులలో నయితము హృదయదయాళుత్వము నొక్కి చెప్పబడియున్నది. మనస్సౌమ్యత్వముగలవాడు బాధ గలుగజేయడు. లోపములను జక్కబెట్టి మంచి మార్గమునకు దెచ్చుటకు ప్రయత్నించునే కాని నొప్పి గలుగజేయడు. బాహ్యదృష్టికి నొకవేళ వాక్కాఠిన్యము నగుపరచినను దానిఫలన నొప్పి గలుగదు. ఎందు వలన ననగా మనస్సు మనస్సుపైన బనిచేయును. సదుద్దేశముతో జెప్పుమాట మనస్సునకు నొప్పి గలుగజేయదు. మంచి మనస్సుతో జెప్పినమాట ప్రాయశః కఠినముగ నుండదు. ఒకవేళ పారుష్య

మును నటించినను మేలు కలుగునుగాని చెడుగు కలుగదు. అయితే పరుషవాక్కు సాధారణముగ ననావశ్యకముగ నుండును. మన మాడు గడుసుమాటలు। చాలా మట్టు కనవసరముగ నుండును. అకారణముగ నొకనికి గాక వాని తల్లి మొదలగు వారికి సయితము పరిభవము గలుగజేయు పదములను బ్రయోగించుటకలదు. ఇది మిక్కిలి మూర్ఖపద్ధతి. పరమగురువుల యనుగ్రహము గోరువాడు వాగింద్రియమును లోకోపకారమునకు వినియోగించునుగాని బాధ గలుగజేయ నోపడు. ఎవ్విధముచేత నైనను తప్పుజేసిన వానిని గఠినముగ జూడ గూడదనియు తప్పును సవరించి మంచి త్రోవను దేవలెననియు బోధించబడి యున్నది. అబుద్ధిపూర్వకముగ నైనను వాక్కుచేత గీడు జేయగూడదని చెప్పబడియున్నది. ఎంత దుర్మార్గుడైనను వానిని మంచిమాటలతో జక్కపెట్టనగును. కేవల మూర్ఖుని యెడల గొంచెము పరుషముగ గన్పడు మాట బల్కినను ఉద్దేశము మాత్రము మంచిదిగ నుండవలెను. మనస్సుతో జెడుగు గోరువాడెంత తపస్సొనరించినను గురువు అనుగ్రహమును బొందనేరడు.

## నాల్గవ వాక్యము

**జీవాత్మ పరమగురువుల సన్నిధానమందు నిలువ గలుగుటకు మున్ను వాని పాదములు హృదయరక్తముతో బ్రక్షాళనము జేయబడవలెను.**

ప్రథమ ద్వితీయ వాక్యములచే జ్ఞానేంద్రియ నియమమును మూడవ వాక్యముచే గర్మేంద్రియ నిగ్రహమును విధించి యిప్పుడు నాల్గవ వాక్యమువలన బ్రాణకాంక్ష సయితము విడువవలెనని చెప్పబడుచున్నది.

సర్వేంద్రియముల కధిష్ఠాత ప్రాణము.

ప్రాణస్యేదం వశే సర్వం త్రిదివే యత్ప్రతిష్ఠితం ॥

(ప్ర. ఉ. II. 13.)

ప్రాణస్వరూపమును గుఱించి ప్రశ్నోపనిషత్తునందు విపులముగ జెప్పబడియున్నది.

ఇంద్రియములు మనస్సు తామే శ్రేష్ఠులమనియు దేహమును తామే ధరించుచున్నామనియు గర్వించెను. ఆ యభిప్రాయము సరి కాదని ప్రాణము చెప్పినను వినలేదు. అప్పుడు ప్రాణ ముత్క్రమించినట్లు నటించగా సర్వేంద్రియములు మనస్సు నిశ్చేష్టితములై తమకన్నిటికిని ప్రాణమే యాధారమని యంగీకరించి ప్రాణమును స్తుతించెనని చెప్పబడియున్నది.

తేఽశ్రద్దధానా బభూవుః సోఽభిమానాదూర్ధ్వముత్క్రామత
ఇవ తస్మిన్ ఉత్క్రామతి అథేతరే సర్వ ఏవోత్క్రామంతే
తస్మింశ్చ ప్రతిష్ఠమానే సర్వ ఏవ ప్రతిష్ఠంతే ॥

(ప్ర. ఉ. II. 4.)

## స్తోత్రము

ఏషోఽగ్నిస్తపతి ఏష సూర్య ఏష పర్జన్యో మఘవా నేష వాయుః।
ఏష పృథివీ రయిర్దేవః సదసచ్చామృతంచ యత్ ।

అరా ఇవ రథనాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్ ॥

(ప్ర. ఉ. II. 5, 6.)

ప్రాణమే అగ్నిరూపమున దహించుచున్నది. ప్రాణము, సూర్యుడు, పర్జన్యుడు, ఇంద్రుడు, వాయువు, పృథివి, చంద్రుడు, సత్తు, అసత్తు, అమృతము. చక్రపు కుండయం దాకులవలె సర్వము ప్రాణమునందు బ్రతిష్ఠించబడి యున్నది.

మఱియు

ప్రకృతిం విద్ధి మే పరాం ।
జీవభూతాం మహాబాహో ।
యయేదం ధార్యతే జగత్ ॥ (భ. గీ. 7—5)

దేనివలన జగత్తు ధరింపబడుచున్నదో అట్టి ప్రాణస్వరూపమైన దాని నా పరాప్రకృతిగా దెలిసికొనుము.

ఇందువలన బ్రాణ మన పరాప్రకృతియనియు, ఈశ్వరశక్తి యనియు దెలియవచ్చుచున్నది.

ఈశ్వరునికి, ఈశ్వరశక్తికి భేదములేదు.

యో వై ప్రాణః సా ప్రజ్ఞా యా వై ప్రజ్ఞా స ప్రాణః ॥
(కౌ. బ్రా. ఉ. II. 2.)

ఈ ప్రాణము సూత్రసంజ్ఞికము, సర్వాత్మకము.

వాయుర్వై గౌతమ తత్సూత్రం వాయునా వై గౌతమ సూత్రేణ అయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సందృబ్ధాని భవంతి ॥ (బృ. ఉ. 3-7-2)

కతమ ఏకో దేవ ఇతి, ప్రాణ ఇతి; సబ్రహ్మ త్యదిత్యాచక్షతే ।
(బృ. ఉ. 3—9—9)

సప్రాణః బ్రహ్మ సర్వ దేవాత్మకత్వాత్ ॥ (శాం. భా.)

ఇట్లు సమష్టి దృష్టిచే జూడ నీశ్వరశక్తియగు ప్రాణము ఆదిత్యాది సర్వభూత చైతన్యమున కధిష్ఠానమై యుండునట్లు వ్యష్టియందును జీవశక్తియగు ప్రాణము సర్వకరణముల కధిష్ఠానమై యొప్పుచుండు. ఈశ్వరాంశమగు జీవు డవినాశి యని తెలిసియున్నది కదా. జీవుని శక్తియగు ప్రాణమును గురించి భయముజెందుటకు గారణము లేదు, ప్రాణము పోవునని చింతించుట కవకాశము లేదు. జీవుని సంసార భ్రమణ కాలమునం దేయే జన్మములలో నెట్టి యనుభవప్రాప్తి కావలయునో, ఎంతజ్ఞానము సాధించవలయునో, తత్సాధనార్థ ముపయుక్తములగు దేహము లేర్పడియుండును. ఏ దేహముతో బని దీరునో, ఏ దేహముతో నెక్కుడుజ్ఞానము సాధించుట కలివికాదో, ఏ దేహ మిక దనశక్తులను బ్రకాశింపఁ జేయుటకు సహకారి కానేరదో, అట్టి దేహమును జీవుడు వదలి, పై మెట్టునకు అనగా నెక్కుడు జ్ఞానశక్తి ప్రకాశమునకు దగిన దేహమును మఱియొకటి నిర్మించు కొనును.

వాసాంసి జీర్ణాని యథా విహాయ । నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథాశరీరాణి విహాయజీర్ణా । న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥
(భ. గీ. 2—22)

మనుజుఁడు జీర్ణవస్త్రములను ద్యజించి నూతన వస్త్రములను ధరించునట్లు జీవుడు జీర్ణమైన శరీరములను విడిచి క్రొత్తవానిని గైకొనును.

ఏ దేహమును జీవుఁడు పరిత్యజించునో, ఆ దేహమునుండి జీవశక్తియగు ప్రాణ ముత్క్రమించినదని వ్యవహరించబడుచున్నది. ఆదేహము మృతిబొందెనని భావింతుము. అంతకన్న మేలైన శరీరము కావలసియుండి, అందునిమిత్తమై జీర్ణమైన శరీరమును జీవుడు విడిచెనని తెలిసికొంటిమేని త్యజించబడిన శరీరముకొఱకై శోకింప నోపము.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాంతరప్రాప్తిః ధీర స్తత్ర నముహ్యతి ॥ (భ. గీ. 2-13)

ఎట్లు జీవితకాలములో కౌమార యౌవన జరావస్థలలో నొకటి పోయి మఱియొకటి వచ్చి దేహాకారము మాఱినను జీవుఁడు మాఱుట లేదో అలాగుననే దేహాంతర ప్రాప్తి యయితేను జీవయాత్రలో నొక యవస్థతో సమానమే యని భావించి బుద్ధిమంతులు మరణమును గూర్చి మోహము జెందరు.

మృతినిమిత్త శోకమును గుఱించి విచారించగా, ఆత్మ యవినాశి యగుటంజేసి దానినిగూర్చి శోకింప నవసరము లేదనియు, దేహము నశించుస్వభావము గలదియే కనుక దానిని గుఱించి దుఃఖించుటవలన నుపయోగము లేదనియు భగవద్గీతయందు బోధించబడియున్నది.

ప్రాణము పోయెననెడు లోకోక్తి తాత్కాలిక దేహమున కన్వయించు కొనవలయును. అనగా, ఆ శరీరమునుండి ప్రాణముత్క్రమించునే కాని ప్రాణము నశించుటలేదు. మఱల జన్మము సంభవించినపుడు నూతన శరీరములో నా ప్రాణము ప్రవేశించి "బ్రతికియున్నాడు" అనియెడు వ్యవహారమున కాశ్రయమై యొప్పును. ఇట్లు సదా జీవుని నంటియుండు జీవశక్తియగు ప్రాణమును గూర్చి శోకించ నవసరము లేదు. భీతిజెంద నవశ్యకము లేదు. ప్రతిజన్మమునందు నూతనముగ గల్పించుకొన బడెడి శరీరము, దాని కాధారమగు ప్రాణము, తానును, సర్వం బ్రహ్మమయమని భావించిన శోకమునకు గారణమే యుండదు. శుకులు పరీక్షిత్తున కీవిషయ మిట్లు పదేశించిరి.

త్వం తు రాజన్ మరిష్యేతి పశుబుద్ధి మిమాం జహి ।

* * * *

మృత్యవో నోపసర్పంతి మృత్యూనాం మృత్యుమీశ్వరం ।
అహం బ్రహ్మ పరంధామ బ్రహ్మాహం పరమం పదం ।
ఏవం సమీక్షన్నాత్మానం ఆత్మన్యాధాయ నిష్కళే ॥
దంశంతం తక్షకం పాదే లేలిహానం విషాననైః ।
న ద్రక్ష్యసి శరీరం చ విశ్వంచ పృథగాత్మనః ॥

(శ్రీమద్భాగవతము. 12—5)

ఓ రాజా, చచ్చెదననెడి పశుబుద్ధిని నీవు విడువుము. మృత్యువునకు మృత్యువగు నీశ్వరుని మృత్యువు సమీపించ నేరదు. నేను పరబ్రహ్మనని బ్రహ్మైకత్వ భావము ననుసంధించిన దక్షకుండు నీ కాలు గఱచినను వాడును, శరీరమును, విశ్వమును, ఆత్మవ్యతిరిక్తములు కావని కనుగొందువు.

ఇట్లు సర్వము భగవంతుని వలననే గలిగినదనియు, ఆయన కర్పించుటకు సదా సిద్ధముగ నుండవలయుననియు దెలిసికొనవలెను. ఆయన కార్యముకొఱకు మన ప్రాణమైనను ద్యజించుటకు సంకోచించగూడదు. అల్ప భోగత్యాగమునకన్న బ్రాణత్యాగ మెక్కుడు. ప్రవాహమునుండి దెచ్చిన నీటితో నభిషేకము చేయుట కష్టము కాదు. చెట్టునుండి కోసిన పువ్వులతో బూజించుటయు గష్టము కాదు. లోకోపకారమగు కార్యమును ఘటించుటయందు బ్రాణత్యాగమునకైన నోర్చి కార్యమును జేయ బూనుకొనవలెను. ధర్మాచరణమందు బ్రాణత్యాగ మయ్యేనేని ఆ రక్తస్రావము భగవత్ప్రీతిగ జేయు గంగాభిషేకప్రాయము. ఆ ప్రాణవిసర్జనము లక్షబిల్వార్చన, తులసిపత్రార్చన.

అన్నిటికన్న మనుష్యులకు బ్రాణముపైన నెక్కుడు ప్రీతియని స్పష్టముగ దెలిసినవిషయము. కనుక ప్రాణము సయితము విడువ

నుద్యమించినచో భగవంతుడు ప్రీతిజెంది మన కిప్పటికన్న మేలైన సాధనములతో దన్ను సేవించుట కవకాశమిచ్చును. ప్రాణము నిజముగ నశించుట లేదు కదా. ఈశ్వరార్పణముగ విడువబడిన ప్రాణమిప్పటికన్న మేలయిన యుపాధిలో జేరుట ప్రాప్తించునే కాని నష్టములేదు. నాశము లేదు. ఫలకాంక్షరహితముగ నొనర్చు త్యాగమే ఈ వాక్యమునందు ప్రస్తావించిన త్యాగము. దంభాహంకారముతో గూడి ఫలాపేక్షతో జేయబడు త్యాగము జన్మబంధహేతువగును.

ఇప్పుడీ నాల్గవవాక్య తాత్పర్యము విశదమగును.

**జీవాత్మ పరమగురువుల సన్నిధానమందు నిలువ గలుగుటకుమున్ను వాని పాదములు హృదయరక్తముతో ప్రక్షాళనము చేయబడవలెను.**

ఇచ్చట "రక్తము" అనగా త్యాగము. హృదయము ప్రేమస్థానము, పాదములు సేవోపకరణలు.

"పాదములను హృదయరక్తముతో ప్రక్షాళణము జేయుట" యనగా మనకు దేనియందు ప్రీతి యతిశయముగ నున్నదో (అన్నిటికన్న నెక్కుడు ప్రీతికరమగు ప్రాణము సయితము) దానిని ద్యాగము జేయుటకు సిద్ధమై గురుసేవకు బాత్రత బడయవలయు.

బుద్ధిపూర్వకముగ హత్యజేసికోవలెనని యీ వాక్య తాత్పర్యము కాదు. ఈశ్వర, గురుసేవారూపకమగు పరోపకారాచరణమందు, వలయునెడ ప్రాణమును సయితము త్యజించుటకు సిద్ధముగ నుండవలెనని మహాగురువుల వాక్యముయొక్క యభిప్రాయమే కాని బుద్ధి

పూర్వకముగా హత్యజేసికోవలెనని కాదు. అట్లు చేసినయెడల మహా పాపము సంభవించును. ఆ మరణము దుర్మరణము. అది ఈశ్వర సేవకాదు. జీవహింస ఈశ్వరహింస జేసినంత పాపము. శరీరమును అనావశ్యకమై విధివిహితము కాని కష్టములపాలు చేయగూడదనియు నట్లు కష్టము పెట్టిన యెడల నాదేహామం దంతర్యామియై యుండు భగవంతుని గష్టపెట్టినట్టగుననియు భగవద్గీతయందు జెప్పబడియున్నది.

అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః ।
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః ।
కర్శయన్త శ్శరీరస్థం భూతగ్రామమచేతసః ।
మాంచైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్ ॥

(భ. గీ. 17—, 6)

ఇకను బుద్ధిపూర్వకముగ దేహమును జంపుకొను వారల పాప మెంత యని చెప్పవచ్చును.

సేవకుడు గుర్వాజ్ఞానుసారము తన కెంతకష్టము సంభవించినను గార్యము చేయుటకు బూనుకొనవలెను. సులభమైనపని, తనకు సమాధానమైనపని జేయుటయందు జాగరూకత గలిగి యుండుటయును, దనకాపద కలుగుచో వెనుదీయుటయును, సన్మార్గపక్షము కాదు. ఋషులు లోకోపకారార్థ మనేక కార్యములు నెఱవేర్చుచుందురు. వానిలో గొన్నిటిని దమ శిష్యకోటిద్వారా జేయించుదురు. కష్టము సంభవించునని వెనుదీయు శిష్యునివలన నుపయోగము లేదు.

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥

(భ. గీ. 18—8)

కష్టము దుఃఖము ప్రాప్తమవునని వెఱచి పనిని మానుకొనువాడు రాజస స్వభావము కలవాడని భగవద్గీతయందు జెప్పబడియున్నది. ఎట్టికార్యమైన దనకెంత దుఃఖమును గలుగజేయు కార్యమైనను లోకోపకారార్థము గురుభగవత్ప్రీతి కొఱకు జేయ బూనుకొనువాడే గురుకటాక్షమునకు బాత్రుడగును. అట్లు సాహసించి కార్యమును నిర్వహించువానిని మహానుభావులు మఱువరు. సత్కార్యమునకై యింత త్యాగము జేసెనే యని యాహ్లాదించి యెన్ని జన్మములకైనను వానిని గాపాడుచు వృద్ధికి దెత్తురు. ఐరోపాయుద్ధములో ననేకులు దేశక్షేమముకొఱకు బ్రాణములను సంతోషముతో విడిచిరని మనకు దెలిసి యున్నది కదా. అట్టివారిలో ననేకులు లేత వయస్సులో నుండి ఆరోగ్యబల ఐశ్వర్య దారాపుత్రాది సుఖంబుల ననుభవించు చుండి దేశముకొఱకును బ్రభుమానరక్షణార్థమును సర్వసుఖములను విడనాడి యుత్సాహముతో యుద్ధరంగమున కరిగి శౌర్యముతో బోరాడి దేహత్యాగము చేసినవారున్నారు. వారి త్యాగము నిష్ఫలము కానేరదు. శీఘ్రకాలములోనే వారుత్తమజన్మమెత్తి పూర్వమున కన్న నెక్కుడుగ బరోపకార మొనర్చుట కవకాశము కలిగి నియతకర్మను భగవత్ప్రీతిగ నొనర్చి లోకమునకు హితముజేయువారు కాబోవుదురని దివ్యజ్ఞానముగల పెద్దలు చెప్పుచున్నారు. అట్టి త్యాగబుద్ధిగలవారే నిజమైన గురుభక్తులు. సకల ప్రీతికరమైన వానిని విడుచుటయే హృదయరక్తమును విడుచుట. విడిచి సేవకు బూనుకొనుటయే గురుసన్నిధానమందు నిలువ గలుగుట. కనుక యీ నాల్గవ వాక్యము పరమ వైరాగ్యమును బోధించుచున్నదని భావించవలెను.

---

# రెండవ అధ్యాయము

## చిత్తశుద్ధి: కర్మయోగము

### ప్రాచీనసూత్రములు

### 1. ఔన్నత్య ఆశను జంపివేయుము.

టీక

ఔన్నత్యకాంక్ష యనునది దుఃఖ ప్రాప్తి హేతువులలో ప్ర ప్రథము. తన సరివారికంటె నున్నతస్థితికి బోవప్రయత్నించు మనుష్యునకు మిక్కిలి దుష్ప్రేరణ చేయునది. అది ప్రతిఫలాపేక్షలన్నింటిలో సర్వసామాన్యమైనది. దానివలన బుద్ధిమంతులును బలవంతులును ఉన్నతదశనుబొంద నవకాశముండినను దాని నుండి నిరంతరము తప్పిపోయ్యెదరు. అయిన నది మనకు జ్ఞానమొసగుట కవశ్యకమైనదియే. దానిఫలములు, అనుభవమునకురాగా నవి మన్నుబూడిదెవలె నిస్సారము లగును. మరణమును ప్రియవియోగమును వలె నిదియును, స్వార్థమునకై పాటుపడుటవలన నాశాభంగమే ఫలమని కడపట మనస్సునకు జెల్పును. అయితే ఈ ప్రథమ సూత్రము సుబోధ్యముగను, సులభముగను గన్పడినను దానిని వేగముగ దాటిపోవలదు. ఎందుకనగా, సాధారణ మనుష్యునియందుండు నీ దుర్గుణములే మన కగోచరమగు విధమున మాఱి (ఆచార్యానుగ్రహ

మును బొందిన) శిష్యుని హృదయమందు గ్రొత్తరూపములను ధరించి మఱల గన్పించును. "నే నాశాబద్ధుడనై యుండను" అని చెప్పట సులభమే కాని "పరమగురువులు నా హృదయమును బరిశోధించి చూడ నది కేవల పరిశుద్ధముగ నున్నదని కనుగొనును" అని చెప్ప గలుగుట అంతసులభము కాదు. గుప్తవిద్యాసాధకుడు తాను స్వార్థ పరత్వమును విడిచితినని భ్రమ పడువచ్చును గాని, యథార్థముగ, వాని యనుభవములు, వాని కామములు మునుపటికంటె విస్తార ములై, అల్పములగు ఇహలోక సుఖములకంటె, విస్తారములగు పర లోక జన్మాంతర సుఖములం[1] గూర్చి ప్రవహించుచుండును. అట్టి వానికంటె, తానుచేయు కార్యమందుండు శ్రద్ధయే హేతువుగ పనిచేయు పరిశుద్ధుడైన లలితకళాభ్యాసి సరియైన (మోక్ష) మార్గము నందు స్థిరముగ స్థాపింపబడినట్లు భావింపవచ్చును. చూచుటకు సులభముగ నున్నదు రెండవ మూడవ సూత్రములకు సయితి మీ ధర్మ మన్వయించును. వానిని నిదానముగ మననము చేయుము. నీ స్వంతహృదయమే నిన్ను సులభముగ మోసపుచ్చక జాగరూకుడవై యుండుము. ఎందుకనగా ఇపుడు ద్వారమునొద్ద దప్పును సవ రించుకొను అవకాశము గలదు. దానిని వెంటదీసికొని (లోపలికి)

[1] పూర్వము ఐహిక విషయములందుగాని ఒక జన్మమునకు సం బంధించిన విషయములయందుగాని కోరికె లుండియుండును. ఇప్పుడు జీవు డితరలోకములయందు సయితముండుననియు పెక్కు జన్మముల నొందుననియు దెలిసికొని ఇతరలోకములలోను ఇతర జన్మములలోను దనకు మేలు గల్గజేయువిషయములను గోరవచ్చును. అప్పుడు సయి తము స్వార్థపరత్వమున్నదనియు నది మునుపటికన్న ఎక్కువ విషయ ముల నాశ్రయించి యున్నదనియు జెప్పవలసియుండును.

పోయిన నది పెఱిగి ఫలించును. లేదా దానిని నిర్మూలము జేయుట యందు దుర్భరమగు దుఃఖము నొందవలసి యుండును.

2. ప్రాణేచ్ఛను జంపివేయుము.

3. సుఖేచ్ఛను జంపివేయుము.

వ్యాఖ్యానసూత్రము

4. ఔన్నత్యమును గోరువారు పనిచేయునట్లు పని చేయుము. ప్రాణేచ్ఛగలవారివలెనే ప్రాణులను గౌర వించుము. సుఖనిమిత్తము జీవించువారివలెనే సుఖముగ నుండుము.

హృదయమునం దనర్థమూలము నన్వేషించి దానిని వెడలగొట్టుము. అయ్యది భక్తుడగు శిష్యుని హృదయ మునందును, కాముకుని హృదయమునందును చేరి, దానిఫలము నిచ్చితీరును. దాని జంపివేయ దృఢచిత్తులే సమర్థులు. అది పెఱిగి పక్వమై నశించువరకు అదృఢ చిత్తులు నిరీక్షించి యుండవలయు. అయ్యది యుగముల కొలది జీవించి వృద్ధిబొందు వృక్షము (వంటిది). అది మనుజుడసంఖ్యాతములగు జన్మముల అనుభవములను సేకరించినపుడు పుష్పించును. (యోగ) బలసాధన మార్గమునందు బ్రవేశించ గోరువారు దీనిని హృదయ మునుండి ఛేదించవలయును. అప్పుడు హృదయము

నుండి రక్తము స్రవించును. మనుష్యుని జీవితమంతయు సంపూర్ణముగ నశించెనని తోచును. ఈ మహాకఠిన పరిశోధనమును సహించవలెను. అది యమృతత్వ మార్గమును జేర్పించునట్టి యుపాయకరములగు సోపానములలో మొదటిమెట్టునైనను రావచ్చును; తుదివఱకు రాకనే పోవచ్చును. అయితే శిష్యుడా! (ఏ విధమునజూచినను) అది సహించియే తీరవలెనని స్మరించి, ఆ పనియందు నీ యాత్మశక్తులను ధృఢముగ వినియోగించుము. నీవు తత్కాలపు వర్తమానదృష్టిని, మరియు భవిష్యత్కాల దృష్టిని వదలి నిత్యత్వదృష్టితో ప్రవర్తించుము. అచ్చట[1] నీ రాకాసి మొలక పుష్పించ నేరదు. నిత్యత్వచింత గాలిసోకినమాత్రమున నీజన్మ కళంకము[2] నశించును.

మోక్షమార్గమును బ్రవేశించగోరువాడు ప్రథమమందు శారీర మానస దోషములను విచారించి వాని నివృత్తికై పాటుపడి పిదప నాత్మగుణములను (అహింస, భూతదయ మొదలగు వానిని) సంపాదించి వాని ననుష్ఠించవలెను.

> నావిరతో దుశ్చరితా న్నాశాన్తో నాసమాహితః ।
> నాశాన్త మానసోవాఽపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥
>
> (క. ఉప. 2-24)

[1] నిత్యాశ్రయమునందు.

[2] జన్మసాఫల్య ప్రతిబంధకము.

దురాచారమునుండి విరమించని వాడును, (ఇంద్రియలోలత్వము నుండి) శాంతినొందని వాడును, సమాహిత చిత్తములేని వాడును, మనశ్శాంతి లేనివాడును, నిశ్చయజ్ఞానముతో నాత్మను బొంద నేరడు.

మఱియు గీతాశాస్త్రమునందు

ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభిర్నరః ।
ఆచరత్యాత్మనశ్శ్రేయ స్తతో యాతి పరాంగతిమ్ ॥

(భ. గీ. 16–22)

ఓ కౌంతేయా, నరకద్వారములగు నీ మూటినుండి (కామము, క్రోధము, లోభము) విడువబడిన మనుజుడు తనకు శ్రేయస్కరమగున ట్లాచరించును. అందువలనఁ బరమగతిని బొందును.

ఆత్మగుణముల ననుష్ఠించుటకు దుర్గుణములు ప్రతిబంధములు కావున వానిని మున్ను విసర్జించవలసినది యావశ్యకము. అందు వలన వర్జనీయదోషములు ప్రథమమందు జెప్పబడియున్నవి. మొదటి మూడు సూత్రములు ఔన్నత్య ఆశ, ప్రాణేచ్ఛ, సుఖేచ్ఛ వీనిని జంపివేయవలెనని చెప్పటచే కామనాశమును బోధించుచున్నవి. ధన కనక వస్తు వాహనాదులు, పుత్ర మిత్ర కళత్రాదులు, అధికారము, బలము, ఐశ్వర్యము మొదలగు కాయిక (అన్నమయ కోశసంబంధ ములగు) భోగవాంఛలు వర్జనీయములని ప్రథమ సూత్రమువలనను, నీ భోగముల ననుభవించుచు జీవించి యుండవలెనను (ప్రాణ మయకోశ సంబంధమగు) ప్రాణేచ్ఛను వదలవలెనని ద్వితీయ సూత్రమువలనను, నీ భోగప్రాప్తివలన మనస్సుకు సంతుష్టి, సంతోషము, సుఖము కలుగవలెననెడి (మనోమయకోశ సంబంధమగు)

కోరిక విడువదగినదని తృతీయ సూత్రమువలనను, దెలియదగియున్న ది. వస్తులాభాపేక్ష ప్రథమ సూత్రమువలనను, దదోభ్గకాంక్ష ద్వితీయ సూత్రమువలనను, దత్ఫలాభిసంధి తృతీయ సూత్రమువలనను నిందించబడినట్లు కన్పడుచున్నది. ఈ మూడు సూత్రములు నిర్యోగ క్షేమత్వమును బోధించుచున్నవి.

నిస్త్రైగుణ్యో భవార్జున; నిర్యోగక్షేమ ఆత్మవాన్ ।

(భ. గీ. 2—45)

ఈ మూడు ప్రాచీన సూత్రము లిట్లు విధించుచుండ, వ్యాఖ్యాన సూత్రమునందు "ఔన్నత్యమును గోరువారు పనిచేయునటులనే పనిచేయుము", "ప్రాణేచ్ఛగల వారివలెనే ప్రాణములను గౌరవముంచుము", "సుఖనిమిత్తము జీవించువారివలెనే సుఖముగ నుండుము" అని బోధించబడియున్నది. ఈ ప్రాచీన వ్యాఖ్యాన సూత్రములు స్థూలదృష్టికి భిన్నబోధకములుగ గన్పడెడిని. అయినను వీనియందలి ధర్మసూక్ష్మములను ముముక్షువు తెలిసికొని యనుష్ఠించవలెను. మఱియు గీతాశాస్త్రమందు

ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి ।  (భ. గీ. 7—11)

"ధర్మమునకు విరుద్ధము కాని కామము నేను" అను భగవద్వాచనమువలన సమస్తకోరికలు త్యజించదగినవి కావని తెలియవచ్చుచున్నది.

జిజీవిషేచ్ఛతం సమాః

"నూఱేండ్లు బ్రతుక గోరవలెను" అను ఈశావాస్యోపనిషద్వాక్యమువలన ప్రాణేచ్ఛనిందితముగ గన్పడలేదు.

యోగి యత్యంత సుఖమును బొందునను గీతావాక్యమువలన సుఖేచ్ఛ దూష్యమని కన్పడలేదు.

. . . . . . . . . . . . . . యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖమశ్నుతే ॥

(భ. గీ. 6–28)

కావున నీ మూడు సూత్రములచే నిషేధించబడిన కామదోష మెట్టిది యని విచారించదగియున్నది.

మామిచ్ఛాప్తుం ధనంజయ । (భ. గీ. 12-9)

"నన్ను బొందగోరుము" అను భగవద్వాక్యముచేతను, భగవంతుడే ప్రజాకాముడై లోకసృష్టి చేసెననెడి

సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి । (తై. ఉప.)

అను ఉపనిషద్వాక్యమువలనను, పై సూత్రములలో పక్కాణించ బడిన కామము ఆత్మ స్వేచ్ఛా సంకల్పరూప కామము గాదని స్పష్టముగ జెప్పవచ్చును. అట్టి కామము ఆత్మయొక్క ఇచ్ఛా శక్తి యని పేర్కొనదగు. నిషిద్ధకామ మెట్టిదియన గీతాశాస్త్ర ములో జెప్పబడిన ప్రకృతియొక్క రజోగుణమువలన నుద్భవించి నట్టిదియు, ప్రతిహతమైనచో క్రోధాకారముగ బరిణమించునట్టిది యు, జ్ఞానవైరియునగు కామము.

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥

(భ. గీ 3—37)

రజోగుణ మన నెట్టిది? దానివలన గామ మెట్లుద్భవిల్లు? వర్జనీయ మైనచో నెందు కా కామ ముద్భవించవలెను? అది జ్ఞానప్రతిబంధక మెట్లగు? ఈ విషయములు విచారించదగు. కామము ప్రవృత్తిమార్గమునం దుపయోగమైనదే, నివృత్తిమార్గమునందు వర్జనీయము. కావున నీ ప్రవృత్తి నివృత్తిమార్గములను గుఱించి విచారించి తెలిసికొనవలసియున్నది.

ఈశ్వరు డొక్కడుగనుండి నేను బహుత్వము జెందెదనని సంకల్పించెను. ఆ సంకల్పము ననుసరించి ప్రకృతి వ్యక్తమయ్యెను. ప్రకృతి యన [ప్ర=బహిర్గతముగా (Forth), కృ=చేయుట (Make)] ఈశ్వరశక్తులను బ్రకాశింపజేయునది. ప్రకృతి లేక సృష్టియే లేదు. ప్రకృతి నధిష్ఠానముగ జేసికొనియే చరాచరాత్మకమైన ప్రపంచము నీశ్వరుడు సృజించెను.

ఈ ప్రకృతి రెండు తెఱగులని గీతయందు జెప్పబడియున్నది. అపరా ప్రకృతి, పరా ప్రకృతి. ఇవియే రయి, ప్రాణము అని ప్రశ్నోప నిషత్తునందు జెప్పబడినవి.

> . . . . . . . ప్రజాపతిః . . . . . మిథునముత్పాదయతే।
> రయించ ప్రాణం చ। ఇత్యేతౌ మే బహుధా ప్రజాః కరిష్యత ఇతి ॥ (ప్ర. ఉప. 1–4)

భూరాదిలోకము లపరాప్రకృతి. దీనిని మాయాశక్తి యని సయితము చెప్పుదురు.

> భూమిరాపోఽనలో వాయుః ఖంమనో బుద్ధిరేవ చ।
> అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥
> అపరేయమ్ . . . . . . । (భ. గీ. 7–4)

వానికి రూపధారణ శక్తినిచ్చు ప్రాణశక్తి పరా ప్రకృతి.

. . . . . . . . . ప్రకృతిం విద్ధి మే పరాం ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥

(భ. గీ. 7–5)

మఱియొక శక్తికి కాలశక్తియని పేరు.

ఈశ్వరుడు తన సంకల్పమువలన వ్యక్తమయిన ప్రతియణువునందును దానంతర్యామియై ప్రవేశించెను.

తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్ ॥

(తై. ఉప. II. 6-2)

ఈశ్వరు డంతర్యామియై ప్రవేశించిన మహిమచేత బ్రకృతికి ఆ భగవంతుని శక్తులను ఆయన యంశలగు జీవులయొక్క శక్తులను వ్యక్తపరచ గలుగు గుణములు గల్గెను. ఈశ్వరశక్తులు ప్రకృతి గుణములీ క్రింద జూపబడును.

[ఈ విషయములు బహు గ్రంథములలో బహువిధములుగా జెప్పబడియుండును. ఇచ్చట దివ్యజ్ఞాన సమాజమువారిచే బ్రచురింపబడిన 'అధ్యాత్మ విద్యాసారము' (An Introduction to the Science of Peace), 'యోగశాస్త్ర సారము' (An Introduction to the Science of Yoga), అను గ్రంథములను ముఖ్యాధారములుగా జేసికొని వ్రాయబడినది].

| అపరిచ్ఛిన్న ఈశ్వరశక్తులు. | ఈశ్వరుడు పరిచ్ఛిన్నమును సంకల్పించుటచే నేర్పడిన లక్షణములు. | సాంఖ్యశాస్త్ర ప్రకారము పురుషుని లక్షణములు. | పరిచ్ఛిన్న కార్య మగు ప్రకృతి గుణములు. |
|---|---|---|---|
| 1. పరాశక్తి. పరాప్రకృతి. క్రియాశక్తి. | ప్రాణము. (Motion). | ప్రాణము. (Life). | రజోగుణము. |
| 2. అపరాప్రకృతి. మాయాశక్తి. ఇచ్ఛాశక్తి. | వ్యాపకత్వము. (Extension). | నిర్వికారత్వము. (Immutability). | తమోగుణము |
| 3. కాలశక్తి. జ్ఞానశక్తి. | పరిచ్ఛిన్నత్వము. (Limitation). | జ్ఞానము. (Awareness) | సత్వగుణము. |

రజోగుణము చలనశక్తిగలదియై ప్రాణలక్షణమై క్రియాశక్తిని ప్రకాశింపజేయునది యగుటవలన ప్రవృత్తిలక్షణముగలది. తమోగుణము వ్యాపకత్వ లక్షణమును ప్రకాశింపజేయుటచే నణువునకు రూపమును ధరించుశక్తిని గలుగజేయును. చలనమును నిరోధించును.

సత్త్వగుణము కాలపరిమితి జ్ఞానము గలదగుటవలన రజోగుణము వలన గలిగిన చలనమును నియత చలనముగ (Regulated or rhythmic Motion) జేయును. ఈ గుణముయొక్క లక్షణము ప్రకాశము. ఈ మూడు గుణములు ప్రతి యణువునందు నుండును.

> న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
> సత్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్ త్రిభిర్గుణైః ॥
>
> (భ. గీ. 18—40)

ఎందువల్లననగా ప్రాణలక్షణమగు రజోగుణములేనియెడల జలనమే కలుగదు. చలనమును నిరోధించు తమోగుణము లేనియెడల నణువులుకూడి యొక రూపమును ధరించనేరవు. మన కందరకు శరీరములే యుండనేరవు. సత్త్వగుణము దేశకాలముల ననుసరించి చలనమును సవరించి ఈశ్వరశక్తులను ప్రకాశింపజేయును. అయితే అణువుల సంసర్గములో నొక్కొక్కగుణము ప్రధానముగనుండి శేషించిన రెండుగుణము లణిగియుండును.

> రజస్తమశ్చాభిభూయ సత్వం భవతి భారత ।
> రజస్సత్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా ॥
>
> (భ. గీ. 14—10)

గీతాశాస్త్రము సాంఖ్య శాస్త్రము ననుసరించి ప్రకృతియే సర్వ కార్యములను నిర్వర్తించుననియు, నాశక్తి దానికి పురుషసన్నిధా నమువలన గలిగినదనియు జెప్పుచున్నది.

మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరం ॥
(భ. గీ. 9—10)

ఇట్లు భగవదనుగ్రహముచేత సకల కార్యములు ప్రకృతి చేయుచుండ ఆత్మ సాక్షియై కర్మలేపనము లేక కేవలుడైయుండు.

సాక్షీ చేతాకేవలో నిర్గుణః । (శ్వే ఉ.)
నమాం కర్మాణి లింపంతి । (భ. గీ. 4—14)

ఈశ్వరుడు లోకములను సృజించి లోకపాలకత్వమునకు విరాట్పురుషుని శరీరమునుండి దేవతలను సృజించెను.

తస్యాభితప్తస్య ముఖం నిరభిద్యత యథాండం ।
ముఖాద్వాక్ వాచోఽగ్నిః నాసికే నిరభిద్యేతాం ।
నాసికాభ్యాం ప్రాణః ప్రాణాద్వాయుః ॥ (ఐ. ఉ.)

ఇది యండాండసృష్టి. ఇకను వ్యష్టిరూపమున బ్రకృతివలన శరీరములు కావించబడెను. లోకపాలకులగు దేవతలింద్రియరూపముల శరీరములను బ్రవేశించిరి.

అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్ ।
వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశత్ ॥
ఇత్యాది (ఐ. ఉ.)

ఇట్లు వ్యష్టిశరీరములలో దేవతాయతనములైన యింద్రియములకు రజోగుణమువలన బాహ్యవిషయాభిముఖత్వము కల్పించబడెను.

పరాఞ్చిఖాని వ్యతృణత్ స్వయంభూః । (క. ఉ. 4-1)

దేహమును బట్టణమునకు బోల్చవచ్చును.

పురమేకాదశద్వార మజస్యావక్రచేతసః ॥ (క. ఉ.)

దేవతలింద్రియరూపమున పురపాలకులు. ఇకను స్వామి వినా పురము, తత్పాలకులు నిరర్థకములని తలచి ఈశ్వరుడు తానే తనయంశయగు జీవరూపమున శిరస్సును కేశాంతమందు భేదించుకొని వ్యష్టిశరీరములలో బ్రవేశించెను.

స ఏతమేవసీమానం విదార్యైతయాద్వారా ।
ప్రాపద్యత సైషావిదృతిర్నామద్వాస్తదేతన్నాన్దనమ్ ॥
(ఐ. ఉ. III. 12)

ఇట్లు అండాండంబున బ్రకృతి కార్యములు నిర్వర్తించును. దేవతలు లోకపాలకులు. ఈశ్వరుడు అనుమంత, అధ్యక్షుడు, బ్రభువు. పిండాండములో బ్రకృతి శరీరము. దేవతలు ఇంద్రియములు. ఇంద్రియము లింద్రియార్థములను గూర్చి బోవుచుండ ఈశ్వరాంశమగు జీవుడు ఇంద్రియవ్యాపారములకు సాక్షిగనుండును.

ఈశ్వరుడు సంపూర్ణజ్ఞానముగలవాడు. ఆయన యంశమగు జీవుడు కించిజ్ఞుడు. ఈశ్వరుఁడు సర్వశక్తిమంతుడు. జీవునిశక్తులు బీజరూపముగనున్నవి. బీజము వికసించి వృక్షముకావలెను. జీవు డీశ్వరుడను మంటనుండి బయిలువెడలిన విస్ఫులింగమువంటివాడు. ఆమిణుగురు మంట కావలెను. ఇట్లు బీజరూపముగనుండు జీవశక్తులు బ్రకాశించి జీవుడు భగవత్స్వరూపుడగుటకు ఈశ్వరునిచే సృజించబడిన లోకములు, అంధలి సర్వభూతములు, ...

రులు. అవి లేనిచో జీవుడు పురోవృద్ధి జెందనేరడు. అపరిచ్ఛిన్న డగు ఈశ్వరతత్త్వము నెఱుగుట దుస్సాధ్యము. పరిచ్ఛిన్నత్వమును వహించి ప్రపంచమందు విషయరూపమున భగవంతుడు కనబడుచు జీవుని శక్తులను వికసింపజేయును. గుణప్రాధాన్యభేదముచే నొక్కొక్క వస్తువునందు మఱియొక వస్తువు కంటె హెచ్చుగా నాత్మశక్తి వికసించియుండును. విషయానుభవముచే బంధమే కాని మోక్షమెట్లు గలుగు? ఇది విచారణీయము. సర్వభూతములకు సర్వలోకములకు ప్రభువు భగవంతుడు. ఆయన సర్వస్వతంత్రుడై యనుశాసించుచుండు.

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥

(భ. గీ. 18—61)

సర్వకార్యములను దేవతలసహాయముచే ప్రకృతి చేయుచుండును. వ్యష్టిశరీరమునందలి యింద్రియములు వాని వాని దేవతలచే ప్రేరితములై విషయగ్రహణాది సర్వకార్యములను జేయుచుండును.

ఏకోనవద్ద్వారవతీహ దేహే ।
సౌధే మహారాజ ఇవాక్షవర్గే ॥
సంసేవ్యమానో విషయోపభోగాన్ ।
ఉపాధి సంస్థో బుభుజేఽయమాత్మా ॥
కర్మేంద్రియాణి నిజదేవత చోదితాని ।
జ్ఞానేంద్రియాణ్యపి తథా మన ఆదికాని ।
స్వస్వప్రయోజనవిధౌ నియతాని సంతి ।
యత్నేన కింకరజనా ఇవ తం భజంతే ॥

(సర్వవేదాంతసారము—44)

జీవాత్మ కర్తకాదు.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి ॥
(భ. గీ. 13-29)

ఇట్టి స్థితిలో జీవాత్మయేమి సేయవలెను ? ఈశ్వర తత్వము నెఱిగి పూర్ణుడు కావలెను. విషయములద్వారా ఆతత్వము నెఱుగవలెను. ప్రపంచజ్ఞానము కావలెను. అందుకై ఇంద్రియములతో (మనస్సు సహా; మనస్సు 6 వ యింద్రియమనియు, 11 వ ఇంద్రియమనియు జెప్పబడుచున్నందున ప్రకృతమందు ఇంద్రియములని చెప్పినప్పుడు మనస్సు చేరియున్నదని యెఱుగవలెను) నేకీభావము జెందవలెను. తనయందలి యాత్మశక్తి వికసించుకొలది తదనురూపమైన విషయ మును గ్రహించును. బాల్యమందు బొమ్మపైన నభిలాషయుండును. దానిని గ్రహించుటకు జేయు ప్రయత్నముచేతను, గ్రహించి యా నందించుటచేతను, లోపలనుండెడి యాత్మశక్తి కొంతమట్టుకు వృద్ధి పొంది ప్రకాశించును. ఇట్లు వృద్ధిపొందిన యాత్మశక్తికి బొమ్మ పైన నికను మనస్సు పోనేరదు. అంతకన్న నెక్కుడుగ బ్రకాశించు నీశ్వరతేజస్సుగల మఱియొక పదార్థమును గ్రహించ గోరిక పుట్టును. తద్గ్రహణానుభవములో మఱికొంచె మాత్మశక్తి వికసించును. ఇట్లు విషయగ్రహణమువలన గ్రమక్రమముగ జీవుని యాత్మశక్తి ప్రకాశిం చుచు వచ్చును. ఇంద్రియములు బలవంతములగును. ఇట్లు బహు కాలము జరుగును. ఇదియే ప్రవృత్తి మార్గము. ఆమార్గమునందు జీవు డింద్రియములకు వశపడి వాని రాగద్వేషములు తనవిగ నంగీకరించు

కొని వానితో దాదాత్మ్యమును జెంది విషయగ్రహణముచే ప్రపంచాను భవమును బొందును. ఇంద్రియములు మిక్కిలి బలవంతములై దుర్జయములగును. అయితే ప్రతివిషయమునందును గొంతకాలము మాత్రమే సుఖప్రాప్తిగలిగి పిదప సుఖము లేకపోవుటయేకాక దుఃఖప్రాప్తి యగుటకూడా అనుభవముచే దెలియవచ్చును.

> యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।
> ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః ॥
>
> (భ. గీ. 5-22)

దీనికారణము విచారించబూనుకొనును. నిశ్చయజ్ఞానమును బొందుటకు గురువుచెంత జేరును.

> పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన । తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం ॥
>
> (ముండ. ఉ. ప.)

ఆ గురువుల యనుగ్రహమువలన విషయసుఖము నశ్వరమగుటకు గారణము తెలియవచ్చును. వారివలన నుపదేశించబడు జ్ఞానమెట్టిది యన.

> యద్జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాండవ ।
> యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥
>
> (భ. గీ 4-35)

ఓ శిష్యుడా! నీవు విషయముయొక్క రూపమును (Form) జూచి దానిని గ్రహించితివి. నీయందలి వృద్ధియయిన ఆత్మశక్తికి అను

గుణమైనంత ఆత్మప్రకాశము ఆ పదార్థమునందు లేనందున దాని యందు నీకసంతుష్టి గలిగెను. అనుగుణ ఆత్మప్రకాశమైన మఱి యొక పదార్థము నీకు బాగుగ దోచెను. ఇట్లు నీకు జ్ఞానము వృద్ధి యగుచురాగా భిన్నరూపములపైన మనస్సు పోసాగెను. రూపభేదము లనంతములు. వాని నాశ్రయించునంత కాలము నీకు యథార్థజ్ఞానము కలుగదు. నీవు రూపమును జూడవద్దు. ప్రతివస్తువునం దుండెడి యాత్మను జూడుము. ప్రతిపదార్థము ఆత్మశక్తి యభివ్యక్తము కొఱకే నిర్మించబడినదనియు, ప్రతిదానియందు భగవంతుడున్నాడనియు, దానియొక్క రమ్యత్వము భగవంతు డుండుటవలననే కలిగినదనియుఁ దెలిసికొనుము.

న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి ।
ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి ॥ (బృ. ఉ.)

పతియందలి ప్రియముచే బతి ప్రియుడు కాడు. ఆత్మప్రేమచేతనే పతి ప్రియుడగును.

భగవంతుడు నీలోపల, వెలుపల, అంతట వ్యాపించియు న్నాడనియు, ప్రతివస్తువు ఆయనను స్మరించుటకే నీకగుపడుచున్న దనియు, నట్టిభావనచే హేయమగు పదార్థమెద్దియుఁ లేదనియు, నీయందుండెడి భగవంతుడే సర్వభూతములయందున్నాడనియు, సర్వభూతములు నీయందును భగవంతునియందు నున్నవనియు నెఱుంగుము. నీవు దేహతాదాత్మ్యమును జెందుటచే సుఖదుఃఖ ప్రాప్తిహేవగు సంసారములో నిమగ్నుడవైతివి.

పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్ ।
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥ (భ. గీ. 13-21)

ఇకను నిత్యసుఖప్రాప్తికి దేహతాదాత్మ్యమునుమాని భగవద్భక్తి సలుపవలెను. ఆయన కృపచేత నీవు సంసార సముద్రమునుండి తరించగలవు.

అనునిట్టి గొప్పవిషయములు బోధించెదరు. ఇదియే నివృత్తి మార్గము. ప్రవృత్తిమార్గమునందు విషయగ్రహణము, విషయసుఖాను భవము ప్రధానమని తలచి ప్రపంచజ్ఞానమును బొంది యనేక కర్మ ఋణములపాలై యుండును. నివృత్తిమార్గములో రూపము (Form) మాఱునది కావున దానితో దాదాత్మ్యమును జెందగూడదనియు, (ఇదియే Repudiation of form), విషయానుభవము ఈశ్వర తత్వ జ్ఞానమును బొందుటకొఱకే యనియు, (విషయసుఖము నశ్వరము, ఆత్మసుఖము శాశ్వతమని ఆత్మతత్వజ్ఞానము తెలియవచ్చును), ఉపాధి భేదము నెన్నగూడదనియు, సర్వభూతములయందు భగవంతుడు సమముగ నున్నాడనియు,

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం ॥
(భ. గీ. 13—28)

ప్రతిభూతమునందును భగవంతుని జూడవలెననియు, దెలిసికొనును. పనిచేయునది ప్రకృతి (ఇంద్రియములు), చేయించువాడు భగవంతుడు, తాను గర్తకాదు, ఈశ్వరునియొక్క భృత్యుడు, కొరముట్టు వంటివాడనియు నమ్మి సకల కార్యము లీశ్వరారాధనగా నొనర్చును.

నైవకుర్వన్ నకారయన్ ॥ (భ. గీ. 5—13)
నైవకించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్ ॥
(భ. గీ. 5—9)

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం ॥

(భ. గీ. 9—27)

ప్రవృత్తిమార్గమున బ్రకృతి కార్యములు తన కార్యములని భావించుట వలన బద్ధుడయ్యెను.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే ।
ప్రకృతేర్గుణసంమూఢా స్సజ్జంతే గుణకర్మసు ॥

(భ. గీ. 3-27-29)

నివృత్తిమార్గమున బ్రకృతితో నేకీభావమును జెందక ప్రకృతికి ప్రభువయినట్టియు దనయుత్పత్తి స్థానమైనట్టియు భగవంతుని నాశ్రయించిననే కాని ప్రకృతిని జయించలేనని నమ్మి, ఈశ్వరభక్తి సలుపవలయును. ఇదియే మాయను దాటుమార్గము.

దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే ॥

(భ. గీ. 7—14)

ఈశ్వర ప్రసాదము లేక మాయనెన్నటికి దాట శక్యముకాదు.

ప్రస్తావపు సూత్రములలో వర్జనీయమని కనుపర్చిన కామము గీతాశాస్త్రమందు జెప్పిన రజోగుణసముద్భవమైన కామము.

ఇంద్రియములు నిజదైవత చోదితములై రజోగుణ బలముచే విషయములను గూర్చి స్వాభావికముగా బ్రవర్తించు చుండునని చెప్ప

బడెను గదా. ఇంద్రియముల ప్రకృతి తత్త్వము సూక్ష్మమునుంచి స్థూలమునకు బోవునది. కామక్రోధాదులు స్థూలయణువులను జేర్చునవి కావున వాని పురోవృద్ధికి సహకారులు.

జీవాత్మ పురోవృద్ధికి స్థూలాణువులను దేహమునుండి వెడలగొట్టి సాత్వికాణువులను జేర్చుకొనవలయును. ఇట్లు జీవుడును ఇంద్రియములును భిన్నార్థ సమవేతలగుటంజేసి నివృత్తిమార్గమం దడుగిడినవాడు నిత్యము తన దేహములోనే కురుక్షేత్ర యుద్ధము సలుపవలసి యుండును. జీవుడు తొలుత ప్రపంచజ్ఞానము కొఱ కింద్రియములకు వశపడవలసి వచ్చెను. అప్పుడవి వాని స్వాభావిక రాగద్వేషములచే విషయములను గ్రహించుచు విసర్జించుచుండగా వానినే తనవియని తానంగీకరించుచు వచ్చెను. అట్టిస్థితిలో నుండునప్పుడు జీవునికి స్వతంత్రము లేక ఇంద్రియములు రజోగుణ ప్రధానములై తమ పురోవృద్ధికి (స్థూలత్వమును జెందుటకు) అనుకూలమైన విషయములపై రాగము ను ప్రతికూలమైనవానిపై ద్వేషమును జూపుచువచ్చును.

ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ ॥
(భ. గీ. 3-34)

వానిరాగద్వేషములను జీవుడు తన రాగద్వేషములుగా భావించ గూడదు. తానూర్ధ్వాభిముఖుడు. అవి యధోమార్గాభిముఖములు. అందువలన నవి తనకు శత్రువులై యుండు.

రజోగుణమునుండి పుట్టిన కామము జ్ఞానప్రతిబంధకము. ముముక్షువునకు శత్రువు. ముముక్షువు మనస్సును భగవంతునిపైనుంచి ఈశ్వర

సంకల్పము నెఱిగి అహంకారాభిమానములను వదలి లోకోపకార మైన కర్మనుజేయ బ్రయత్నించును. కామము వానిమనస్సును విషయ ములవైపు ద్రిప్పును. దానివలన బ్రేరితుండై కర్మఫలమును గోరును. స్వలాభార్థము కర్మ జేయ నుద్యమించును. ఇట్లు చేయుకర్మము బంధకారణమగునేకాని చిత్తశుద్ధిగలుగజేసి జ్ఞానప్రదాయకము కానే రదు. అందువలన నది పాపాత్మకమైనదనియు జ్ఞానవిజ్ఞాననాశకర మైనదనియు జ్ఞానియొక్క వైరియనియు గీతాశాస్త్రమందు వర్ణించ బడియున్నది. ఈకామమునకు నెప్పుడేనియు దృప్తి కలుగనేరదు. భోగప్రాప్తియగుకొలది అది వృద్ధియగుచుండునేకాని శమించదు.

అది "మహాశనః" "అనలః" "దుష్పూరం" అనగా "మహాభక్షకుడు" "తృప్తిగలుగజేయ దుస్సాధ్యమగునట్టిది" "పర్యాప్తము లేనిది", అను గుణములు కలదని చెప్పబడియున్నది. ఇట్లసంతుష్టియు జ్ఞాన నాశనమును గలుగజేయునదియే కాక కామము దుఃఖప్రాప్తికి మూలకారణమని ప్రథమ సూత్రటీకయందు జెప్పంబడియున్నది.

ఆశా హి పరమం దుఃఖం వైరాగ్యం పరమం సుఖం ॥

(శ్రీ భాగవతము, ౧)

ఇకను టీకయందలి బోధలను విచారింతము.

"ఔన్నత్యకాంక్ష యనునది తన సరివారికంటె నున్నతస్థితికి బోవ బ్రయత్నించు మనుష్యునకు మిక్కిలి చుఱ్ఱప్రేరణ చేయునది."

ప్రతిమనుజు డొక్కొక్క విధమైన తప్పు జేయుచు దానివలన గలుగు కష్టము ననుభవించుచు ఆ తప్పు నికజేయగూడదని ఆవలి

జన్మములలో దెలిసికొనుచు వచ్చుచుండవలసిన యెడల బహుజన్మ ములనెత్తిననే కాని జ్ఞానప్రాప్తి కానేరదు. ఇట్లు మందమార్గమున నడచువా రదృఢచిత్తులనియు, వారు "కామము పెటిగి పక్వమై నశించువఱకు నిరీక్షించి" యుండదగిన వారనియు, వ్యాఖ్యాన సూత్రమందు జెప్పఁబడియున్నది. అట్లు దీర్ఘకాలము గడపక విశేష ప్రయత్నము చేసి పూర్వజన్మకృత దురితములను శీఘ్రముగ క్షీణింపజేసికొని మహానుభావులగు ఋషివర్యుల కృపాకటాక్ష మునకుఁ బాత్రతవడసి జ్ఞానమునొంది యజ్ఞానదశలో నుండెడి వార లకు సహాయ మొనరింప నిశ్చయించినవారే నివృత్తిమార్గస్థులగు ముముక్షువులు. వ్యాఖ్యానసూత్రమం దుదహరింపఁబడిన దృఢచిత్తులు వీరే. సోమరితనమున గాలముగడపువారు మోక్షమార్గమున కయో గ్యులు. ఆ మార్గము కష్టసాధ్యము. ఖడ్గము యొక్క అంచువలె వాడియైనది. దాటుటకు దుస్సాధ్యమైనది. దుస్సంపాద్యము.

> మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
> యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥
>
> (భ. గీ. 7—3)

వేలకొలది మనుష్యులలో నొకానొకఁడు సిద్ధికొఱకు ప్రయత్నము చేయును. అట్లు ప్రయత్నించువారలలో నొకానొకడే నన్ను యథార్థ ముగా దెలిసికొనునని తాత్పర్యము.

ఇకను ప్రయత్నముజేయనివాని విషయమేమి చెప్పవచ్చును! మోక్షమార్గమునందు బెక్కుకష్టములు సంభవించును. అంతరాయ ములు కలుగును. ఎందువలన ననగా కొంచెము కొంచెముగా గర్మ

ఋణములను దీర్చుచుండినకాలమందు గొంచెము కొంచెముగనే కష్ట ములు సంప్రాప్తియగుచుండును. శీఘ్రముగ గర్మవిమోచనముఁబొంది గురువుల సన్నిధానమును జేరవలెనని కోరునపుడు విశేషకష్టములు సంభ వించుట సహజము. వానికి వెఱగందక గురువులయెడ శ్రద్ధాభక్తులు కలిగి శ్రేయోమార్గాభిముఖుడైనవాఁడు తుదకు జయము నొందును. వాడు వెనుదియ్యక ప్రయత్నముజేయు కొలది వానికి గురువుల సహాయము గల్గుచుండును. వానికి ఉత్సాహము హెచ్చి మఱియు విశేషప్రయత్నము జేయును. ఇట్టివారే తమ సరివారలకన్న నున్నత స్థితికిబోవ బ్రయత్నించువారు. అట్లు ప్రయత్నించుట సరివారల కన్న గొప్పవాడనని యనిపించుకొనవలె ననెడి యుద్దేశముచేత గాదు. తాము ముందుపోయి వెనుకనుండువారలను సహాయము చేయగలిగియుండవలెననియే వారి యుద్దేశము. ఇట్లు ప్రయత్నము చేయునపుడు వారి యుపాధులు క్రమక్రమముగఁ బరిశుద్ధినొందుచు రాగా లోపలనణగియున్న కామశేషము బహువిధములుగా బైటికి వచ్చి యధోమార్గమున వారిని బడద్రోయజూచును. అందువలననే యిచ్చట కామము నివృత్తిమార్గస్థుని మిక్కిలి దుష్ప్రేరణ చేయు నదియని చెప్పఁబడియున్నది. ఆ దుష్ప్రేరణకు లోబడగూడదు. భక్తిజ్ఞానవైరాగ్యములచే దాని జయించవలెను.

"దానివలన బుద్ధిమంతులును బలవంతులును ఉన్నతదశను బొంద నవకాశము ముండినను వానినుండి నిరంతరము తప్పిపొయ్యెదరు."

బుద్ధిమంతుఁడన జ్ఞానమును సంపాదించినవాఁడు. జ్ఞానమీశ్వర లక్షణము. ఈశ్వరుని జ్ఞానశక్తి ప్రతిబింబమే మనయందు వికసించు జ్ఞానము.

"పరమగురుచరణసన్నిధి" యను గ్రంథమునందు జ్ఞానవిషయ మిట్లు బోధించబడి యున్నది.

"ఈశ్వరుఁడు జ్ఞానస్వరూపుఁడు. ప్రేమస్వరూపుఁడు. నీ కెంత జాస్తిగా జ్ఞానముకలుగునో అంతహెచ్చుగా ఆయనను నీ యందు ప్రకాశింపచేయ గలిగెదవు. కావున విద్య నభ్యసించుము. అయితే ఏ విద్య యితరుల కెక్కుడుగ సహాయముఁజేయుటకు నీకు సహకారిగ నుండునో దానిని ముందు అభ్యసించుము. ఓర్పుతో విద్యాభ్యాసము చేయుము. జనులు నీవు జ్ఞానము కలవాఁడని తలచ వలెనని కాదు. జ్ఞానోదయమువలన గలుగు సుఖమునొందవలెనని సయితము కాదు. మఱియెందుకొఱకనగా జ్ఞానవంతుఁడే తెలివి గలిగి (పరులకు) సహాయమొనర్ప నేర్చును."

ఇట్లు మనకుగల తెలివి, జ్ఞానము ఇతరుల యజ్ఞానమును దొల గించ వినియోగింప బడవలెను. జ్ఞానదానమునకన్న నెక్కుడు దానము లేదు. జ్ఞానమీశ్వర లక్షణమగుటవలన జ్ఞానదానము చేయుట యందీశ్వరసేవఁ జేసినవారల మగుదుము. ఇదియే జ్ఞానయజ్ఞము.

శ్రేయాన్ ద్రవ్యమయాత్ యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః ॥

(భ. గీ. 4—33)

జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టః స్యామితి మే మతిః । (18—70)

ద్రవ్యయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము. మఱియు "పరమ గురుచరణసన్నిధి" యందు,

"భాగ్యవంతుఁ డెవడైనను దేహమున కాహార మొసగగలడు. అయితే జ్ఞానవంతులే జ్ఞానమొసగి ఆత్మతృప్తిస్థితి జెందించ గల్గి

దురు. నీకు దెలిసినచో ఇతరులు సయితము తెలిసికొనునట్లు సహాయము జేయుట నీయొక్క నియతమైన పని" అని చెప్పబడియున్నది. మఱియు, పరమగురువులగు ఋషులు జిజ్ఞాసువులకొఱకు నిరీక్షించియుందురు. ఎవరు జ్ఞానార్థము ప్రయత్నించెదరు? ఎవరికి జ్ఞానము నిచ్చి దురితక్షయము చేతము అని కాచుకొనియుందురు. మనము సయితము మనకు గల అల్పజ్ఞానమును మనకన్న దక్కువజ్ఞానముగల వారి కిచ్చుటకు మిక్కిలి యుత్సాహముతో గాచుకొనియుండ వలయును.

ఆమాయంతు బ్రహ్మచారిణః స్వాహా
యథాపః ప్రవతాయంతి యథామాసా అహర్జరం ।
ఏవం మాం బ్రహ్మచారిణః ధాతరాయంతు సర్వతః స్వాహా ॥
(తై. ఉప. శిక్షా)

నాయొద్దకు బ్రహ్మచారులు వత్తురుగాక! ఓ ధాతా! ఎట్లు నీరు నిమ్నప్రదేశమును బొందునో, ఎట్లు మాసములు సంవత్సరములో జేరునో అట్లు బ్రహ్మచారులు నాయొద్ద కేతెంతురు గాక!

తనకుగల జ్ఞానము నితరుల కొసగి యారీతిన నీశ్వరారాధనము జేయుట కవకాశము గల్గవలెనని భగవంతుని బ్రార్థించినట్లు పై యుపనిషద్వాక్యమువలన దెలియవచ్చుచున్నది. ఆ యుపనిషత్తునందే

ఋతం చ స్వాధ్యాయ ప్రవచనేచ
సత్యం చ స్వాధ్యాయ ప్రవచనేచ
తపశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ ॥

ఇత్యాది వాక్యములచేత సర్వకర్మల ననుష్ఠించినను స్వాధ్యాయ ప్రవచనములు ముఖ్యముగ ననుష్ఠేయములనియు, (స్వాధ్యాయ మన చదివి జ్ఞానమును బొందుట, ప్రవచన మనగా ఇతరులకుఁ జెప్పుట)

> సత్యమితిసత్యవచారాధీతరః తప ఇతి తపోనిత్యః పౌరుశిష్టిః।
> స్వాధ్యాయప్రవచన ఏవేతి నాకోమౌద్గల్యః తద్ధితప స్తద్ధితపః।
> (తై. ఉ. శిక్ష)

రాధీతరాచార్యులవారు సత్యమే యనుష్ఠేయమనియు, పౌరుశిష్ట్యాచార్యులవారు తపస్సే ఆచరణీయమనియు, మౌద్గల్యాచార్యులవారు స్వాధ్యాయ ప్రవచనములే యనుష్ఠేయములనియు జెప్పిరనియు, అయినను వానిలో స్వాధ్యాయప్రవచనములే తపస్సనియు ననుష్ఠేయములనియు జెప్పబడియున్నది. ఇట్లు జ్ఞానము సంపాదించి యది స్మరణార్థమును ధర్మప్రవృద్ధ్యర్థమును దాని నితరుల కొసగి యీ రీతిన "సర్వజను లజ్ఞానమును బోగొట్టుకొని జ్ఞానమునొంది తన్ను జేరుదురుగాక" యనియెడు భగవత్సంకల్పమునకు దోడ్పాటుగా విద్యాప్రదాయకులగు ఋషుల కరుణాకటాక్షమునకు బాత్రులగు యుటయే యున్నతస్థికిబోవుట. అట్టి యవకాశముండినను కొంత ప్రేరణకు లోబడినయెడల "నేను జ్ఞానిని, నాతోసమాన మెవరున్నారు (కోఽన్యోస్తి సదృశో మయా), నేను బెక్కు బిరుదులను బొందితిని, మర్యాదలను సంపాదించితిని, యల్లయ అను వానికేమియు దెలియదు, నాసన్నిధానమందు నిల్చుటకు సయితము వానికి యోగ్యత లేదు, మల్లయ అనువాని యొద్దకు నేను బోయినపుడు నా యోగ్యతకు దగిన సన్మానమును జూపకపోయెను, వాని కుమారునికి

విద్యగలుపమని నాయొద్దకు రాకపోవునా? వచ్చినపుడు నేను నిరాకరించకపోదునా? ఆగ్రంథములోని విశేషార్థములు నాకుదక్క ఇతరులకు దెలియవు, నేను వాని రహస్యములుగ బెట్టుకొని సభలలో నితరుల కవమానము గలుగజేయుటకును, నాగొప్పతనమును బ్రకటించుకొనుటకును వినియోగపరచెదను, ఇతరులకు దెలిసిన నా ప్రఖ్యాతి కొంతతగ్గదా?" అని యిట్టి విపరీత భావనలకు లోనై అహంకారాభిమానములను ఆత్మస్తుతి పరనిందలను ఈర్ష్యాసూయలను జూపువా డసురసంపదగలవాడనియే చెప్పవలసియున్నది. ఇది యంతయు గామదోషమే. కామరహితుఁ డీశ్వర సంకల్పానుసార ప్రవర్తకుఁడై తనకుగల జ్ఞానము నితరులకొసగి ఈశ్వరపూజజేయును. అందు కవకాశముండినను కామప్రేరితుడు మార్గభ్రష్టుఁడగును. ఇకను బలవంతుని విషయ మాలోచింతము.

బలం బలవతామస్మి కామరాగవివర్జితమ్ ‖ భ. గీ. 7-11

కామరాగయుక్తముకాని బల మీశ్వరశక్తియే. ఈశ్వరతేజస్సే ఇంద్రియబలము అధికారబలము మొదలగువిధముల బ్రకాశించుచుండు. తనబలమును బలహీనులను రక్షించుటయందు వినియోగించిన నది యీశ్వరసేవయగును. దానికే భూతదయ యనిపేరు. అది సర్వోత్కృష్టమైన గుణము. అగుణమున్నచో దక్కిన గుణములన్నియు బ్రకాశించును. దాని ననుష్ఠించిన భేదబుద్ధితొలగి యథార్థజ్ఞానోత్పత్తిచే సంసారసముద్రమును దాటగలము. కామప్రేరితుఁడైన వాని బలము ప్రాయశః పరహింసయందు వినియోగించఁబడును. ధనబలముగలవాడు ధనహీనునె ట్లిడుములపాలు చేయునది విదితమైయున్నది.

అధికారబలముగల వాడు తనక్రిందివారలయెడ క్రౌర్యములో బ్రవర్తించును. ఇట్లు వినియోగించఁబడు బల మసుర సంపదలో జేరినది.

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ||
భ. గీ. 16-18

బలమును సద్వినియోగముచేసి యున్నతస్థితికిబోవ నవకాశముండినను కాముకునియం దా బల మహంకారమును బుట్టించి స్వార్థసంధా మందు వినియోగింపఁజేసి మార్గభ్రష్టునిగఁజేయును.

"అయిన నది (కామము) మనకు జ్ఞానమొసగుట కవశ్యకమైనది కాదే." కామము మనకు జ్ఞానము నెట్లియ్య గలుగును అని సంశయము గలుగవచ్చును. విచారించి చూడ బ్రపంచములో జరుగుచుండు ప్రతి విషయమునుండియు మన మెద్దియో నేర్చుకొనదగినది యుండును. ప్రతియొక వస్తువు భగవంతుని మహిమను దెల్పునదియే కదా! ఆయన మహిమకన్న జ్ఞానప్రదాయక మెందుగలదా? ఆయన విభూతు లనంతములు. విచారించి తెలిసికొను కొలదియు మఱియు నెక్కుడుగ దెలిసికొనదగినది యుండును. కనుక ప్రతివస్తువు భగవంతుని విభూతిని దెల్పునదియని యెఱిగి ప్రతివస్తువు ప్రతివిషయము నుండియు మనము నేర్చుకొనదగినది యున్నదని భావించు నేని నవి యన్నియు మనకు గురువులు కాగలవు. అవధూత యదుమహారాజుతో దన కిరువది నల్గురు గురువులని వాని పేర్లిట్లు చెప్పిరి.

పృథివీ వాయు రాకాశ ఆపోఽగ్ని శ్చంద్రమా రవిః |
కపోతోఽజగర స్సింధుః పతంగో మధుకృ ద్గజః ||

మధుహా హారిణో మీనః పింగళా కురరోఽర్భకః ।
కుమారీ శరకృత్సర్పః ఊర్ణనాభి స్సుపేశకృత్ ॥
(శ్రీభాగ. 11. 7. 32, 33)

భూమి, వాయువు, ఆకాశము, నీరు, అగ్ని, చంద్రుఁడు, సూర్యుఁడు, పావురము, కొండపాము, సముద్రము, మిడుత, తేనెటీగ, ఏనుగు, తేనెటీగలుపెట్టిన తేనె నపహరించువాడు, జింక, చేప, పింగళా యనెడి వేశ్య, కురరమనుపక్షి, పసిబాలుడు, కన్య, ధనుర్ధారి, పాము, సాలెపురుగు, సంజీవిపురుగు.

ఈగురువులలో ప్రతియొక్కదానినుండియు నొక్కొక్క విషయము తెలిసికొంటినని వారు వక్కాణించిరి. వానిలో కామమెట్లు గురువగునన పింగళా యనెడి వేశ్యవృత్తాంతమువలన నది విదితమగును. ఆమె వేశ్యావృత్తినవలంబించి దానివలన జీవించుచు మోదించుచుండెను. ప్రతిదినము పురుషునిరాకకు నిరీక్షించుచుండును. తాను శృంగారించుకొని దోవనడుచువారి కగుపడునట్లు బహిర్ద్వారమందు గాచుకొని యుండును. ఒకదినమిట్లెంతకాలము నిరీక్షించియుండినను నెవ్వడేని యు బురుషుడు రాడాయెను. ఆమె లోపలికి బోవును. ఇంతలో నెవఁడైన బయటబోవుచున్నాడేమోయని పునః బైటికివచ్చును. ఈ ప్రకారము లోపలికి వెలుపలికి దిరుగుచుండ మధ్యరాత్రి యయ్యెను. అంతవఱకు మేల్కొనియుండెను. ఉదకపానమైన జేయక నోరెండిపోయి యాదినము జీవనమునకు లేకపోయెనని దుఃఖాక్రాంతురాలై యుండెను. అప్పుడాశాభంగముచే దీవ్రవైరాగ్యము గల్గెను. జ్ఞానము తోలగెను. అప్పుడు పరితాపమునొంది తనవృత్తిని నిందించుచు భగవంతుఁడే శరణ్యుడనియు రక్షకుఁడనియు దెలిసికొనెను

ఆమె పరితాపము, వైరాగ్యము, తీర్మానము, ఈ క్రింద వ్రాయబడిన శ్లోకములవలన దెలియబడును.

అహో మే మోహవితతిం పశ్యతావిజితాత్మనః ।
యా కాంతా దసతః కామం కామయేయేనబాలిశా ।
సంతం సమీపే రమణం రతిప్రదం
విత్తప్రదం నిత్యమిమం విహాయ ।
అకామదం దుఃఖభయార్తిశోక
మోహప్రదం తుచ్ఛమహం భజేఽజ్ఞా ॥
అహో మయాత్మా పరితాపితో వృథా
సాంకేత్యవృత్యా హ్యతిగర్హ్యవార్తయా ।
స్త్రైణాన్నరాదర్థతృషోఽను శోచ్యా
త్క్రీతేన విత్తం రతిమాత్మనేచ్ఛతీ ।
త్యక్త్వా దురాశాం శరణం వ్రజామి తమధీశ్వరం ॥

(శ్రీభాగ. 11, 8, 29, 30, 31, 40)

నేనజ్ఞానురాలనై ఇంద్రియజయములేక సత్యస్వరూపుడును, సమీపమందుండు వాడును, సంతోషము గలుగజేయువాడును, ధనమియ్య గలవాడును, నిత్యుడు నగు భగవంతుని విడిచి కోరికలనీడేర్చ లేనట్టిదియు, దుఃఖము భయము సంకటము మోహము గలుగజేయ నట్టిదియు దుచ్ఛమగుదానిని గోరితిని. నిందితమైనవృత్తి నవలంబించి పురుషాపేక్ష ధనలోభముతో దేహము వృథా పరితపించెను. ఇకను దురాశను వదలి జగదీశ్వరుని శరణుచెందెదను.

ఈకథవలన టీకలో బోధించినవిధమున కామముయొక్క ఫలము "నోటికందినది మన్ను బూడిద వలె నిస్సారమగుటయే" అని మనకు వేద్యము కాగలదు.

"మరణమువలె నిదియు (కామము) స్వార్థమునకై పాటుపడుట వలన నాశాభంగమే ఫలమని కడపట మనస్సునకుదెల్పును."

మరణము వలన విరాగము గల్గునది ప్రసిద్ధముగ దెలిసినవిషయము. అది శ్మశాన వైరాగ్యమని చెప్పబడును. కామము, అనగా రాగము, దానికి వ్యతిరేకమగు విరాగమునెట్లు గలుగజేయును? ఈవిషయము శ్రీమద్భాగవతమందిట్లు చెప్పబడియున్నది.

> పరోక్షవాదో వేదోఽయం బాలానామనుశాసనం ।
> కర్మమోక్షాయ కర్మాణి విధత్తే అగదం యథా ।
> వేదోక్తమేవ కుర్వాణో నిస్సంగోఽర్పితమీశ్వరే ।
> నైష్కర్మ్యం లభతే సిద్ధిం రోచనార్థాఫలశ్రుతిః ॥
>
> (శ్రీభాగ. 11. 3 48. 50)

వేదము పరోక్షవాదము (అంతరార్థమును గూఢముగ నుంచి వేఱుమాటలతో బైటజెప్పుట). అజ్ఞులకట్లు చెప్పబడియున్నది. ఔషధమువలె కర్మ మోక్షముకొఱకు విధించబడియున్నది. వేదోక్త కర్మను నిస్సంగుఁడై ఈశ్వరార్పణబుద్ధితో జేసిన నైష్కర్మ్య సిద్ధి లభించును. కర్మయందు రుచిబుట్టించుటయే ఫలశ్రుతియొక్క ప్రయోజనము అని తాత్పర్యము.

కర్మను విడిపించుటకొఱకే కర్మ విధించబడి యున్నదని చెప్పుట విరుద్ధముగ దోచవచ్చును. దానియొక్క నిజమైన తాత్పర్యమేమన:—

కామ్యకర్మ విధించుట కర్మయం దభిరుచి కల్గునట్లు చేయుటకే. అజ్ఞుడు ఫలము నపేక్షించియే కర్మజేయును. లేనిచో తామస వృత్తి నవలంబించి యే కర్మయు జేయ నుద్యమించడు. తమోగుణ మును వదలడు. రజోగుణము వృద్ధి కావలెను. విశేషకోరికలతో గర్మల జేయుచురాగా నింద్రియములు మనస్సు బలవంతము లగును. అవి దుర్బలములుగ నుండిన ననుపయోగములు. భృత్యులు సమర్థులుగ గదా నుండవలయు? లేనియెడల యజమానుని కార్యముల జక్కగా నిర్వర్తించ నేరరు. కోరముట్టు తీక్ష్ణముగ నుండిననే కదా పని బాగుగ జేయనగు? అందువలన నజ్ఞులకు గర్మయం దభిరుచి గల్గించు టకు ఫలములు చూపబడెను. ఆ ఫల శ్రుతి కంతమాత్రమే ప్రయో జనము. వాడా ఫలమునుగోరి పనిజేయును. ఫలము కల్గును. వెం టనే దుఃఖము సయితము వచ్చును. ఇట్లు ఫలము నపేక్షించి చేయు కర్మయంతయు జివరకు దుఃఖప్రదాయకమే యని వాని మనస్సుకే వచ్చును. అప్పుడు ఫలకాంక్షవదలి నిస్సంగుఁడై ఈశ్వరార్పణ బుద్ధితో బనిచేయును. దానివలన జిత్తశుద్ధియు నీశ్వర ప్రసాద మును జ్ఞానప్రాప్తియు నజ్ఞాననివృత్తియు గల్గును. ఇట్లు ఫల కాము మును గల్పించుటచే గడపట దానిని విడిపించుటయే భగవంతుని ముఖ్యోద్దేశము. ఔషధముయొక్క ఉపమానమువలన దీనిని దెలిసి కొనదగు. బాలురౌషధమును దీసికొనక మూర్ఖము వహింతురు. ఔష ధము బుచ్చుకొననియెడల వ్యాధి శమించదు. అప్పుడు తండ్రి తన కుమా రునికి "ఈ యౌషధము సేవించినయెడల నీకు లడ్డు కలకండల నిచ్చె దను" అని చెప్పి యా యౌషధమునందు వానికి రుచిగల్పించి త్రాగు నట్లు జేయును. తండ్రియుద్దేశము కలకండనిచ్చుట కాదు. దేహ

రోగ్యమను ప్రయోజనమును మనస్సున నుంచుకొని ఔషధకర్మయం దభిరుచిని గల్పించుటకై ఖండలడ్డుకములను ఫలమును జూపించును. పెద్దవాడైన వెనుక కలకండ లడ్డుకములవలన నజీర్ణము మొదలగు నితరగుణములు గల్గి యౌషధముయొక్క నిజమైన ఫలము కల్గకపోవు నని తెలిసికొని "వైద్యోనారాయణోహరిః" అని భగవంతుని స్మరించుచు రోగనివారమునకొఱకై యౌషధమును బుచ్చుకొనును. అందువలన వాని కారోగ్యము గల్గును. అట్లే ప్రతిపదార్థము నందు భగవంతుడుండి దానికి రమ్యత్వమును గల్పించి మనలను దాని గ్రహింపజేయును. దాని గ్రహించుటయందు మనయొక్క యాత్మ శక్తులు ప్రకాశించును. ఆపదార్థముయొక్క ప్రయోజన మంతయే కావున దానియందు నిస్పృహ గల్గును. ఇట్లే ప్రతివిషయ గ్రహణ మందును గొంతమట్టుకు తమోగుణనివృత్తి, ఆత్మశక్తి ప్రకాశకత్వ మను ఫలములు గల్గినవెంటనే ఆ విషయమునందు నైస్పృహ్యము గల్గును. కడపట రమ్యత్వము పదార్థముయొక్క రూపమునందేమి యు లేదనియు, దానిలోనుండు ఈశ్వర మహిమవలననే గల్గినదని యు, రూపగ్రహణము సుఖప్రదాయకము కాదనియు, దుఃఖజనక మేయనియు, మనస్సుకు వచ్చి ప్రతిపదార్థమునం దీశ్వరుని జూచును. కనుక విషయవిముఖత్వము కొఱకే భగవంతునివలన గల్పించబడిన దనియు, బ్రతిపదార్థము భగవంతుని మహిమను దెల్పునదే యనియు నెఱుగవలెను. అయితే స్వార్థమునకై పాటుపడుటవలన నాశాభంగ మే ఫలమైనచో సుఖప్రదాయక కర్మ మెద్దియని విచారించదగు.

ఈ విషయము "పరమగురుచరణసన్నిధి" యందిట్లు చెప్పబడి యున్నది. "ఇతరులకు (అజ్ఞానులకు) తామెట్లు ప్రవర్తించవలసి

నది యిప్పటికేమో తెలియదు. అందువలన నందఱు ఒకటియే యనియు, గావున నొక్కఁడు (భగవంతుఁడు) సంకల్పించినదియే యెప్పుడేనియు నెవనికేనియు నిజమైనసుఖము నియ్యగలదనియు దెలియక బుద్ధిహీనులై ప్రవర్తించుచు, దమకు హితమని తమకు దోచు మార్గములను గల్పించుకొనుచుందురు. ఇట్టివారు నిత్యము ననుసరిం చక అనిత్యము ననుసరించువారు". అది మిక్కిలి గొప్పబోధ. మహాగురువాక్యము. సర్వభూతైకత్వము, ఈశ్వరసంకల్పాను ప్ర వర్తనము, సర్వభూత హితత్వమును బోధించుచున్నది. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడును సర్వభూత దయాళువునగు తండ్రి. ప్రపంచమునందలి సర్వభూతము లాయన బిడ్డలు. ఎవ్వని కేసమయమున నెద్ది వాని పురోవృద్ధికి హితమో ఆయనకు వేద్యము. అందరి పురోవృద్ధి యా యన సంకల్పమునందున్నది. ఆ సంకల్పమునకు దోడ్పాపై ప్ర వర్తించుటవలన సుఖముగల్గును. అందుకు భిన్నమార్గమున బ్రవర్తిం చిన దాత్కాలిక సుఖమును బరిణామమందు దుఃఖమును గల్గును.

> విషయేంద్రియసంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమమ్ ।
> పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥

(భ. గీ. 18—38)

ఈశ్వర సంకల్పమునకు దోట్పాటగుట యనగా లోకపురోవృద్ధికి గాను పాటుపడుట. అనగా పరోపకారము చేయుట. సర్వభూత హితత్వము ననుష్ఠించుట. ఎప్పుడు పరహితము నెన్నెదమో అప్పుడు వానియందలి యాత్మను (ఈశ్వరుని) జేర నపేక్షించినవార మగుదు ము. విచారించిచూడ నంతకన్న నెక్కుడు సుఖజనకమగు మార్గ మొండుకలదా? పరమేశ్వరుని జేరు చింతకన్న నెక్కుడు పవిత్ర

సంకల్ప మొండులేదు. కావున మన తండ్రియు ప్రభువునగు భగవంతుఁడు సర్వభూతములు తన్ను జెందవలెనని సంకల్పించెను. గావున నేభూతమునకైనను దాని పురోవృద్ధికి సహకారియగు కార్యముజేసిన నీశు నారాధించిన వారమగుదుము. అందువలన నాయన ప్రసాదము, దాన నక్షయ సుఖము, శాంతియు గల్గును. అట్లు ప్రవర్తించక స్వప్రయోజనార్థము పనిచేసినయెడల ననాత్మగుణముల నవలంబించిన వారమై, అజ్ఞానమును వృద్ధిచేసికొని, మార్గభ్రష్టులమై, సుఖమని భ్రమించి, దుఃఖవారిధి నిమగ్నుల మగుదుము. ఈ విషయము మన శరీరముయొక్క సామ్యమువలన సయితము తెలిసికొనవచ్చును. పాదేంద్రియమునందు బలమైన వ్రణములేచి బాధకల్గుచుండగా వైద్యుఁడు ఆహారపథ్యమును విధించును. అప్పుడు రసనేంద్రియము నేను బాగుగానున్నాను గదా యని పథ్యము దప్పిన జ్వరమువచ్చి దేహమంతయు బటుత్వముతప్పి రసనేంద్రియముకూడ జెడి భక్షించుట కిచ్ఛయే లేకపోవును. అన్ని యింద్రియము లొకటియే యనియు, దేనికి బాధకల్గినను నన్నిటికిని బాధకల్గినట్లే యనియు భావించక ఏ యింద్రియమైనను స్వార్థముకై వర్తించిన బైన జెప్పబడినరీతిన నాశాభంగమే కల్గును. అన్ని యింద్రియములకు స్వామియైన జీవాత్మ యెద్ది సరియని నియమించునో ఆరీతిన సకలేంద్రియములు వర్తించిన నన్నిటికి సుఖము గల్గును. భిన్నభావమును వహించిన నెద్దానికిని సుఖము గలుగనేరదు. గీతాశాస్త్రమందు "భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్" తన స్వప్రయోజనమునకై నెవడు వంట చేసికొని భక్షించునో వాడు తినునది పాపమే యని భగవంతుడు చెప్పియున్నాడు.

కావున టీకయందు స్వార్థమునకై పాటుపడుటవలన నాశాభంగ మే ఫలమని చెప్పబడియున్నది.

"అయితే ఈ ప్రథమసూత్రము సుబోధ్యముగను సులభముగను గన్పడినను దానిని వేగముగ దాటిపోవలదు."

ముక్తగురువులు మనలోపముల నెటిగియే యీ హెచ్చరిక నిచ్చియున్నారు. ఆశ చెడ్డదియని తెలిసినవిషయమే కదా అని కొందఱు తలచవచ్చును. కోరికలను బలవంతముగ జంపివేయ నసాధ్యము కాదు, సులభమైనదే యని మఱికొందఱభిప్రాయపడవచ్చును. ఇట్లు మోసపోవలదని టీకయందు బోధింపబడుచున్నది.

ఆశా హి పరమం దుఃఖం వైరాగ్యం పరమం సుఖం ॥

అని గ్రంథములలో జెప్పబడినదని తెలిసికొనుట కష్టముకాదు. గ్రంథమును బఠించుటవలనగాని గ్రంథములో నట్లు చెప్పబడియున్నదని వచించుటవలనగాని విరాగము గలుగనేరదు. అందువలననే "పరమగురుచరణసన్నిధి" వైరాగ్యప్రకరణమం దిట్లు గురువులు వక్కాణించియున్నారు. "వివేకమువలన బహుజనులు వాంఛించు ధనము అధికారము నంటి వస్తువులు సంపాదనార్హములు కావని యిదివఱకే నీకు దెలిసియున్నది; ఇది మిన్నక జెప్పబడిన మాత్రమున నే కాదు. యథార్థముగ నది నీ మనస్సు నంటినచో, వానిపై నీకుండు కోరికలు తుదముట్ట నశించును." కోరికలను నిర్బంధముగ నణచుట దుస్సాధ్యము. సాధ్యమైనను నందువలన బ్రయోజనము లేదు. తొలుత విషయభోగములు నిస్సారములనియు దుఃఖజనకములనియు నెఱుగవలయు.

జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనం ॥
(భ. గీ. 13—8)

అంతియకాక సుగుణాభ్యాసము వలననే దుర్గుణములు తొలగిపోఁ గలవు. ఈ విషయమందు,

"మనసః ప్రతిపక్షభావనయా రాగాదిమలానా మపనయనం శౌచం॥"

రాగాది మనోమలములను వానికి విరుద్ధమగు భావములనుగూర్చి ధ్యానించుటవలన బోగొట్టుకొనుటయే శౌచము అని శ్రీశంకరాచార్యుల వారు భగవద్గీత 13–7 శ్లోకభాష్యమందు బోధించియున్నారు. మన యందలి దుర్గుణములు సుగుణములేయని యెన్నక, దుర్గుణములని యంగీకరించుకొని, వానిదోషముల నెఱింగి, ప్రతిదుర్గుణముయొక్క ప్రతిపక్ష సుగుణమును నెఱిగి, దానిని బూనికతో బహుకాలము మనస్సులో భావించి, ప్రవర్తనములో నభ్యసించి, యా దుర్గుణమును బోగొట్టుకొని, మఱియు నితర దురాచారములను నీరీతిననే ఒకదాని వెనుక మఱియొకదానిని దొలగించుకొనుచురాగా, దుర్గుణ నివృత్తి యగునేకాని నోటిమాటలతో సులభముగా సిద్ధించు ఫలముకాదు. మనస్సు స్వచ్ఛపు అద్దమువంటిది. చింతించిన ప్రతివిషయము దానియందు బ్రతిబింబించుటయే కాక మనస్సు ఆ విషయాకారముగా బరిణమించును. విషయరాగ చింతనవలన నెన్ని జన్మములనుండియో ఎన్ని విధములుగనో విషయాకారముగ బరిణమించిన మనస్సు, భూతదయ, సర్వభూతైకత్వము మొదలగు నాత్మగుణధ్యానమువలననే కాని శుద్ధి కానేరదు. అందువలననే నిత్యకర్మయగు సంధ్యావందనము నందు

"యత్...... పాపమకార్షం మనసా వాచాహస్తా భ్యాం । పద్భ్యాముదరేణశిశ్నా..........యత్కించ దురితం మయి । ఇదమహం మామ్ అమృతయోనౌ సూర్యే జ్యోతిషి జుహోమి।"

ప్రతి యింద్రియమువలన జేయబడిన పాపమును స్మరించి అవి తొలగి పోవలెనని నిశ్చయించుకొని, అమృతత్వము సర్వభూతహితత్వము లోనగు వాని చింతవలన బాపమును దొలగించుకొనవలెనని విధించ బడియున్నది.

దివ్యజ్ఞానసమాజమువారివలన బ్రచురింపబడిన గ్రంథములలో సు గుణధ్యానమువలన దుర్గుణనివృత్తి చేసికొనవలెనని నొక్కి చెప్ప బడియున్నది. ప్రతిదినాంతమందు దానుజేసిన ప్రతి కార్యమును నిష్పక్షపాతముగ విమర్శించి, దోషములను (ముఖ్యముగా మనోదోష ములను) గమనించి, వానిని జేయనని సంకల్పించి, తద్వ్యతిరేక సుగుణ ములను ధ్యానించి, యభ్యసించి దోషగుణములను బోగొట్టుకొన వలెనని చెప్పబడియున్నది. దీనికే (Review) అతీతకాలాచరిత గుణదోష విచారము అని పేరు. ఇట్లు పట్టుదలతో నహిం సాది యాత్మగుణములను సంపాదించవలెనన పెక్కువర్షములు లేక పెక్కుజన్మములు పట్టును. ఇట్లుండ నీ సూత్రబోధ సుల భము, నేను సాధించితిని, అని మోసపోవలదని టీక హెచ్చరికే చేయుచున్నది.

"ఎందుకనగా సాధారణ మనుష్యునియందుండు నీ దుర్గుణములే మన కగోచరమగు విధమున మారి (ఆచార్యానుగ్రహమును బొందిన) శిష్యుని హృదయమందు గ్రొత్తరూపమున మఱల గన్పించును."

వ్యాఖ్యానసూత్రమందు సయితము అయ్యది (అనర్థమూలమగు కామము) భక్తియుతుడగు శిష్యుని హృదయమందును, గామకుని హృదయమందును జేరి ఫలమునిచ్చితీరును అని చెప్పబడియున్నది. ఈ విషయ మనుభవమువలననే విశదము కాగలదు. కామమను ప్రథమ దుర్గుణ మొక్కొక్క మెట్టున నొక్కొక్క విధముగ మాఱి కన్పడుచుండునను విషయము "పరమగురుచరణసన్నిధి" యందు వివరముగ చెప్పబడియున్నది. ధనము ఐశ్వర్యము మొదలగు నైహిక విషయ కామములు సాధారణమనుజునియందు బలవత్తరముగ నుండును. అంతకన్న పైమెట్టుననుండు వాడు స్వర్గప్రాప్తికి ప్రతిబంధకము కాకుండు మాత్ర మైహిక విషయములను వాంఛించును. ఇచ్చట కామము స్వర్గభోగాపేక్షగా బరిణమించెను. దాని పై మెట్టుకు బోయినవాడు స్వప్రయోజన కార్యములను వదలి పరోపకారార్థము ప్రవర్తించును. అయినను "నే నెంతసహాయము చేసినా నో చూడుడు. వాడు నేజేసినమేలును దలచుకొనడా? నాయందు కృతజ్ఞత గల్గియుండడా?" అని తన్ను దాను మెచ్చుకొనుచు సహాయము చేయబడినవాడు మెచ్చుకొని కృతజ్ఞతను కలిగియుండవలెనను కోరిక గల్గియుండును. ఇది కామముయొక్క మఱియొక రూపము. మఱియొక మెట్టున బరోపకార మొనర్చుట కణిమాది సిద్ధులు కావలెనను కోరికె గల్గును. అదియు కామదోషమే. ఎందుకన, సిద్ధులుబొందుటకు మనకు యోగ్యతగలదని గురువులకు దోచినపుడు వారే సిద్ధుల నొసగెదరు. ప్రకృతమందు మనకుండు శక్తులను బ్రయోగించుచు బరోపకార మెందుకు చేయుచుండగూడదు? మఱియు బైమెట్టులకు బోవుకొలదియు గామము సూక్ష్మతరరూపమున

నగుపడుచుండును. చివరకు మోక్షేచ్ఛ సయితము బంధకమే యని "పరమగురుచరణసన్నిధి" యందు జెప్పబడియున్నది. "నీవు స్వప్రయోజనమును సంపూర్ణముగా మఱచియుండిన యెడల నీ స్వంతమునకు బంధమోక్ష మెప్పుడు కాగలదని నీవు చింతించుచుండనేరవు.

ఉద్దేశమెంత గొప్పదియైనను స్వప్రయోజనార్థమగు కోరిక సమస్తమును బంధదోషముగలదే" అని చెప్పబడియున్నది. ఈ యర్థమునే కఠోపనిషత్తునందు

> అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయస్తే
> ఉభే నానార్థే పురుషం సినీతః ॥ (I. ii. 1)

అని బోధించబడియున్నది. ఈ యర్థమునే టీకయందలి యీక్రింది వాక్యములు బోధించుచున్నవి. "గుప్తవిద్యా సాధకుని కోరికల పరిమితి సయితము పూర్వముకన్న నెక్కుడుగ నుండును. ఇట్లు జీవిత విషయమై హెచ్చుసంగతులు మనస్సుకు వచ్చుకొలదియు బూర్వము కించిజ్జ్ఞత్వదశలో గొద్దివిషయముల నాశ్రయించిన స్వార్థపరత్వ మిప్పుడు హెచ్చువిషయముల నాశ్రయించి యుండును."

మఱియొక దుర్గుణమును విచారింతము.

ద్వేషము:—సాధారణమనుష్యుడు తన కార్యమునకు భంగము గలుగజేయువానిని ద్వేషించును. తన కార్య మధర్మమైనను దానికి బ్రతికూలము గలుగజేయువానియందు ద్వేషము వహించును. పైమెట్టుకు బోవుచురాగా తాను ధర్మము నాచరించుచు దాని కడ్డము వచ్చువానిని ద్వేషించును. మఱికొంతకాలమునకు దన కెట్టి యపకారము జేసినను ద్వేషించక ఇతరుల కపకార మొనర్చినవానియందు వైర

భావము గల్గియుండును. ఇదియే యథార్థమగు "సత్యాగ్రహము." తుదకు "అద్వేష్టాసర్వభూతానాం" "నిర్వైరస్సర్వభూతేషు" అనెడి గీతావాక్యముల ననుసరించి యెట్టివాని యందైనను ద్వేషము వహించక సర్వులయందు భగవంతుని జూచుచుండును. ద్వేషించినవాని యందుదాసీనభావముండువాడు సయితము మధ్యమ భాగవతుడనియు సర్వభూతములయందు భగవంతుని జూచు వాడే భాగవతోత్తము డనియు శ్రీమద్భాగవతమందు జెప్పబడియున్నది.

సర్వభూతేషు యః పశ్యేద్భగవద్భావమాత్మనః ।
భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః ॥
ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సు చ ।
ప్రేమమైత్రీకృపోపేక్షా యః కరోతి స మధ్యమః ॥

(శ్రీ భా. 11-2-45-46)

ఇట్టిదశ జెందువఱకు దుర్గుణ మొక్కొక్క మెట్టున నొక్కొక్క రూపము ధరించి కనబడుచుండును.

"'నే నాశాబద్ధుడనై యుండను' అని చెప్పుట సులభమే కాని పరమగురువు నా హృదయమును బరిశోధించి చూడ నది కేవలము పరిశుద్ధముగ నున్నదని కనుగొనును" అని చెప్పుట అంత సులభము కాదు."

ఈ వాక్యము మిక్కిలి రహస్యార్థమును బోధించుచున్నది. మన స్వంతవిషయములలో మనలను మన మంత కఠినముగా నిష్పక్షపాత ముగా బరీక్షించుకొనుట యరుదు. మనము లోతునదిగి విచారించిన యెడల స్వప్రయోజనార్థము చేయలేదని యెంచుకొనిన కార్యములలో స్వార్థపరత్వము సూక్ష్మముగ నిండియుండును. ఏకపుత్రునియం

దత్యంతప్రేమ ప్రతిమనుష్యునికి గల్గియుండునది ప్రసిద్ధమేకదా! అట్టి పుత్రవియోగనిమిత్త దుఃఖమునం దాలోచించి చూడ స్వార్థపరత్వమే యుండును. మృతినొందిన పుత్రుడు మఱికొంతకాలము జీవించి భక్తిజ్ఞాన వైరాగ్యములను సంపాదించుకొనక పోయెనే, కామలోకమును శీఘ్రముగా దాటి యచ్చట బాధపడకుండ స్వర్గప్రాప్తి గల్గునో లేదో, అని విలపించువా రరుదుగ నుందురు. నా కుమారుని వలన నే నెన్ని సుఖములనో బడయుచుంటిని, ఆ సుఖములు లేక పోయెననియే సాధారణముగ దుఃఖించువారి భావము. కనుక నిచ్చట స్వార్థచింతనమే ప్రబలముగ నున్నది. అందువలననే ఇతరుల దోషములను విచారించుటయందు, మామిడిపండు యొక్క పండు భాగమువలె మార్దవమును వహించవలెననియు, మనలను మనము (ముఖ్యముగా మన మనోభావములను) పరీక్షించు కొనునెడ నా పండుయొక్క ముట్టెవలె కాఠిన్యముతో (అనగా నిష్పక్షపాతముగా) విచారించుకొనవలెననియు "మౌనవాక్కు[1]" అను గ్రంథమునందు జెప్పబడియున్నది. ఇట్లు పరీక్షించి చూచినయెడల మన మెంతమట్టుకు కామబద్ధులమైనది, మనకార్య మెంతమాత్రము కామ వివర్జితమైనది మనకు దెలియవచ్చును. అయితే మనమట్లు పరీక్షించుకొనుట యరుదు. లోతునదిగి విచారించుకొనుట లేదు. నేనాశను జయించితిని యని మాత్రమనుకొను చుందుము. అయినను గురువులు మన యభిప్రాయముల నంగీకరించు వారు కారు. నివృత్తిమార్గమునందు ప్రవేశించి కొంతమట్టుకు స్వార్థపరత్వమును వదలి లోకోపకారముకొఱకు బనిచేయ నుద్దేశించు ప్రతియొక్కని

[1] Voice of Silence.

మహాగురువులు ముఖ్యముగ గనిపెట్టియుందురు. వారు సూక్ష్మ దృష్టి గలవారు కావున వాని సూక్ష్మ శరీరములను గనిపెట్టి యుందురు. సూక్ష్మశరీరములు ప్రతిసంకల్పము ప్రతి కోరిక వలన మాఱుచుండును. క్రోధము, అసూయ, మొదలగు దుర్గుణములచే స్థూలయణువులుచేరి హేయములగు వర్ణములతో నొప్పుచుండును. భక్తి, భూతదయ మొదలగు సుగుణములచే స్థూలయణువులు తొలగిపోయి వాని స్థానమునందు సూక్ష్మయణువులుచేరి శ్రేష్ఠమైన రంగులతో నొప్పుచుండును. ఇట్లు మనము క్షణక్షణము చెడ్డ మంచి సంకల్పములు చేయుచురాగా మన సూక్ష్మశరీరములు, ప్రతి క్షణము స్థూలసూక్ష్మ యణువులు చేరుటవలన మాఱుచుండును. ఈ మార్పులన్నిటిని మహాగురువులు పరీక్షించుచుందురు. "వీడు కలుష ముల నింకను బాయలేదు", "వీడిప్పుడు కొంచెముగ కామక్రోధ వర్జితు డగుచున్నాడు" అని సూక్ష్మశరీరములను జూచి కనిపెట్టు చుందురు. కేవల పరిశుద్ధముగ నున్నవని వారు కనుగొనినప్పుడే వారు మనల ననుగ్రహించెదరు. స్వార్థచింతన సంపూర్ణముగ వదలిన వాని సూక్ష్మశరీరము కేవలము పరిశుద్ధముగ నుండును. అనగా దాని యందలి వర్ణములు మాఱుచుండవు. ఎల్లపుడును నిర్మలముగ నుం డును. ఒకప్పుడు శ్రేష్ఠవర్ణము మఱియొకప్పుడు నికృష్టవర్ణము ఎంత కాలము మాఱుచుండునో అంతకాలము కామము చేరియున్నదని వారు తెలిసికొనియెదరు. ఎప్పుడు స్వచ్ఛమైన వర్ణముగల్గి కొంత కాలమైనను మాఱకయుండునో అప్పుడ నుగ్రహమునకు బాత్రు డని యెఱిగి వాని దమచెంత జేర్చుకొని కరుణింతురు. ఇట్టిదశ సామాన్యముగ లభించదు. పెక్కుజన్మములలో వైరాగ్యమును,

భూతసేవయు నభ్యసించుచురాగా లభించునేకాని సులభముగ నొంద సాధ్యముకాదు. ఇదియే టీకయందలి యీ వాక్యముయొక్క తాత్పర్యము.

## మోక్షమార్గమం దవశ్యమైన ధర్మములు

"అట్టి వాని (స్వార్థపరత్వము సూక్ష్మరూపముగ హెచ్చు విషయముల నాశ్రయించినదని యెఱుగక తాను స్వార్థపరత్వమును విడిచితినని తలచు గుప్తవిద్యా సాధకుని) కంటె తానుచేయు కార్యమందుండు శ్రద్ధయే హేతువుగ పనిచేయు పరిశుద్ధుడైన లలితకళాభ్యాసి సరియైన (మోక్ష) మార్గమునందు స్థిరముగ స్థాపింపబడినట్టు భావించవచ్చును".

(1) ఇంద్రియ నిగ్రహము (2) ఫలాభిసంధి రాహిత్యము (3) మనస్సమాధానము (4) నిస్సంశయము (5) శ్రద్ధ. ఇవి లేనిచో నెట్టి జ్ఞానము సిద్ధించనేరదు. లలితకళాభ్యాసకులును, భౌతికశాస్త్రాభ్యాసకులును ఈ ధర్మముల నెట్లనుష్ఠించునది విదితమైయున్న విషయమే. ముఖ్యముగ పాశ్చిమాత్యులు భౌతికశాస్త్రమునం దత్యంత నైపుణ్యమును జెందియున్నవారు. ధూమశకటములు, విద్యుచ్ఛక్తి యంత్రములు, గగనమార్గ సంచార విమానములు, మొదలగునవి యీ శాస్త్రజ్ఞుల పరిశ్రమవలననే నిర్మింపబడినవని మనకు దెలిసియున్నది. మఱియు వీరు ధాతువర్గము, వృక్షవర్గము, జంతువర్గము, వీనిని విశేషముగ బరీక్షించి వాని ధర్మములను దెలుపు శాస్త్రములను వ్రాసియున్నారు. మానవదేహ ధర్మములను గూర్చియు బరిశోధించి గ్రంథములను రచియించియున్నారు. ఈ శాస్త్రకారు లొక్క

క్క విషయమును జిరకాలము పరిశోధించి, యెన్నిసారులో పరీ
క్షించి, యొకసారి శోధనవలన నేర్పడిన పర్యవసానమునకు మఱి
యొకసారి మఱియొకరి శోధనవలన నేర్పడిన్న పర్యవసానమునకు భేద
ముండినయెడల నందుల కారణమును బరిశోధించి, యెఱింగి, తప్పుం
డినయెడల దాని సవరించి, మఱియొకసారి దోషము లేకుండునటుల
గనిపెట్టి, పరిశోధించి, నిరాక్షేపణగా నిర్ధారణచేయుబడిన ధర్మము
నంగీకరించి, శాస్త్రములలో బ్రకటింతురు. ఇట్లు ప్రతివిషయమును
నిర్ధారణ చేయుటయందు వారు పుచ్చుకొను శ్రమను వర్ణింప శక్యము
కాదు. వారు కష్టపడి లోకమున కెంతయో యుపకారమును చేసిరి.
యథార్థముగా వారికి మనము కృతజ్ఞులమై యుండవలయు. వారు
కష్టపడిరి. మనము ఫలము ననుభవించు చున్నారము. వారందఱు మన
పితృదేవతలలో జేరినవారే. వారొక్కొక్క విషయమును బరిశోధించు
నపుడు నిద్రాహారములుకూడ మఱచిరి. వారు మనస్సు నేకాగ్రముగ
జేసి శోధించి, ధర్మము నెఱుగవలెనని దృఢసంకల్పముతో, యంత
రాయములను లక్ష్యపెట్టక, పామరజన పరిహాసనిందలను సరకుసే
యక, తాముద్దేశించిన కార్యమును నెఱవేర్చి మహోపకారము
చేసిరి. ఇంద్రియములు మనస్సువలనగదా నిగ్రహింపబడవలెను.

యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః (క. ఉప. I. iii. 18)

మనస్సు శాస్త్రవిషయమునం దేకాగ్రత జెందియున్నపుడు ఇంద్రియ
ము లేమియు జేయనేరవు. యుద్ధము చేయునపుడు వీరౌత్సుక్యబలము
తో గాయములు తగిలినవను జ్ఞానముండదని తెలిసిలినవిషయమే కదా.
ఇంద్రియనిగ్రహము మన ఏకాగ్రతయు సిద్ధించెను. శాస్త్రధర్మ

మును నిర్ధారించవలెనను దృఢసంకల్పముదక్క వేఱొండుకోరి కయు వారికి లేదు. పరిశోధన సాఫల్యము చెందునో చెడిపోవునో అను సంశయమును వ్వారు చెంతజేరనియ్యరు. తాము బూనుకొన్న పనియందు శ్రద్ధాభక్తులుకల్గి దానిని ముగియువఱకు వెనుదీయక నెఱ వేర్తురు. ప్రాచీన శాస్త్రకారకులైన ఋషులు శాస్త్రవిషయమును గూర్చి ధ్యానించిన సంకల్పస్వరూపములు నశించిపోలేదు. అవి సూక్ష్మలోకములయందుండి తద్విషయ చింతన చేయువారి మనస్సు లో జొచ్చి వారి పరిశోధన కార్యమునకు దోట్పాటగును. "ఏమి యు దోచని విషయమున నెద్దియో యొక మార్గముతోచెను" అను నది నిక్కముగ సూక్ష్మలోకమునందు బూర్వుల సంకల్ప బలము ననే యని యెఱుగవలయు. ఇట్లు తమకార్యమునందు శ్రద్ధాభక్తులు కలిగి పనిచేయు భౌతిక శాస్త్రాభ్యాసికి ఇంద్రియనిగ్రహము, నిష్కా మత, ఏకాగ్రచిత్తము, శ్రద్ధ, నిస్సంశయము అను మోక్షధర్మ ములు పట్టుపడును. విషయచింతనలవలన జలించక యేకాగ్రతను జెందినవారి మనస్సునందు ఋషులబోధలు చక్కగ బ్రవేశించును. లోకోపకారమును జేసిన పుణ్యమును బొందుదురు. ఈశ్వర కర్మను జేసిన వారగుదురు. ఈశ్వర కృపాపాత్రులగుదురు. వారు "నేనిప్ప డింతమాత్రము వృద్ధిజెందినాను, గొప్పవాడనైతిని, నాకు గోరికలు వీడినవి, నేను ఋషుల యనుగ్రహమునకు బాత్రుడనైతినే, వారెం దుకు నన్ననుగ్రహించలేదు" అని యిట్లు స్వవిషయచింతన చేయు టయే లేదు. ప్రకటించుకొనకయే ఋషుల యనుగ్రహమునకు బా త్రత వడసిరి. గుప్తవిద్యాసాధకుడు తన పురోవృద్ధిని లెక్కపెట్టు కొనుచు, దాను బరిశుద్ధుడనైతినని మోసపోవుచుండగా స్వవిషయ

చింతనచేయకరయే భౌతికశాస్త్రాభ్యాసి పైమెట్టుకు బోవును. పశ్చిమ దేశ శాస్త్రజ్ఞులలో ననేకులకు చైతన్యమును సూక్ష్మలోకములు నున్న వని నమ్మకపోవుట, ఆత్మశక్తిని బ్రకాశించునదియే ప్రకృతి యని నమ్మకపోవుటయు, అను లోపము లున్నవికాని వారు పైన జెప్ప బడిన రీతిన మోక్షధర్మముల నేమో సాధించుచున్నారు.

టీకలోని యీ వాక్యమువలన ముఖ్యముగా దెలిసికొనవలసిన దేమన:—తన్ను దాను బాగుగా బరీక్షించుకొనవలెను. తన దోష ములను గణించి వానిని దొలగించుకొన బ్రయత్నించవలెను. మనో భావములను అనగా ఉద్దేశములను (Motives) గఠినముగా బరీ క్షించుకోనవలెను. లేశమాత్రము కామసంస్పర్శయున్నను దానిని విసర్జించ బ్రయత్నించవలెను. ఇట్లు మిక్కిలి కఠినముగా బరీక్షించు కొనక నేను నిష్కామ కర్మయోగముచేసినాను, పైమెట్టుకు బోయి నాను అని మోసపోకూడదు.

“చూచుటకు సులభముగ గన్పడు రెండవ మూడవ సూత్రములకు సయితె మీ ధర్మ మన్వయించును. వానిని నిదానముగ మననము చేయుము. నీ స్వంతహృదయమే నిన్ను సులభముగ మోసపుచ్చక జాగరూకుడవై యుండుము.”

రెండవ మూడవ సూత్రములు “ప్రాణేచ్ఛను జంపివేయుము” “సుఖేచ్ఛను జంపివేయుము” అని బోధించుచున్నవి.

పరమహంసదశ నొందువఱకు బ్రాణమునం దాశ యుండనే యుండును. ఎద్దియో యొక రూపమును ధరించి యుండవలెనను కోరిక సూక్ష్మరూపమున దాగి యుండును. సుఖేచ్ఛ సయితము శీఘ్రముగా నశించునది కాదు. స్వర్గభోగాపేక్ష సయితము వదల

వలసియుండును. ఆశాభంగమువలననో లేక యితర కారణములవలన నో అప్పటి దేహమందు గాని, యొక విధమైన భోగమునందుగాని జుగుప్సగల్గినంత మాత్రముననే ప్రాణేచ్ఛయు సుఖేచ్ఛయు దొలగిన వని మోసపోవలదని టీకతాత్పర్యము.

"ఎందుకనగా యిప్పుడు ద్వారమునొద్ద దప్పును సవరించుకొను అవకాశము గలదు. దానిని వెంటదీసికొని (లోపలికి) పోయిన నది పెరిగి ఫలించును. లేదా దాని నిర్మూలము జేయుటయందు దుర్భర మగు దుఃఖము నొందవలసియుండును."

ఇచ్చట ద్వారమన నెద్దియయినది విచారించదగు. స్వప్రయోజ నార్థమై కొలముగడపు ప్రవృత్తిమార్గమునందుండు జనులు దేవా లయములో ప్రవేశించుటకు యత్నించకయే బహిఃప్రాకార మునకు వెలుపలనుండు వారుగా భావించవచ్చును. కించిన్మాత్రము వైరాగ్యముగల్గి, నివృత్తిమార్గము నవలంబించి యింద్రియములను మన స్సును నియమించి, లోకోపకారమునకై పనిచేయ నుద్యమించువారు ప్రాకారమునకు లోపలను గర్భగుడికి [1] వెలుపల నుండువారుగా భావించవచ్చును. బాహ్యప్రాకారము మొదలు గర్భగుడివఱకు నెక్కు అంతస్తు లుండునట్లు నివృత్తిమార్గస్థులలో నన్ని యంతస్తు లుండును. గర్భగుడియం దడుగిడినవారు మోక్షమార్గమునందు ప్రవే శించినవారు. ప్రాకారమునకు వెలుపలనుండు ప్రవృత్తిమార్గస్థుల విషయ మిచ్చట ప్రస్తావించలేదు. దేవాలయములోపలికి వచ్చిన నివృత్తిమార్గస్థులలో గర్భగుడికి జాలాదూరములో నుండువారు,

[1] గర్భగుడి యనగా దేవాలయములో విగ్రహము, లింగము ఉండు లోపలిగది.

కొంచెము దూరమున నుండువారు, సమీపించినవారు, మిక్కిలి సమీపములో నుండువారు, అని యిట్లనేక యంతస్తుల వారుందురు. వీరందఱు సాధనచతుష్టయముల నభ్యసించువారే. వారందఱిని మహా గురువులు కనిపెట్టియుందురు. భక్తి జ్ఞాన వైరాగ్యములు హెచ్చు కొలది బహిఃప్రాకారమునుండి లోపలికి వచ్చుచుందురు. స్వప్రయోజనబుద్ధి క్షీణించి పరోపకారేచ్ఛ యుద్భవిల్లగా మహాగురువు వాని సూక్ష్మశరీరములను బరీక్షించి "వీడు నేజేయు లోకోపకార కార్యమునకు నాకు సహాయము గాగలడు, వీనిని బాగుగ నాదరించి జ్ఞాన వైరాగ్యములు వృద్ధియగునట్లు చేసినయెడల నాకార్య మింకను బాగుగ జరుగును" అని మహాగురువుకు దోచినపక్షమందు దూరమున నుండు ఇతర నివృత్తిమార్గస్థులకన్న వీనియం దెక్కుడుగ గమన ముంచి వానికి దెలియకయే వానికి సహాయముచేయుచు వాని సుగుణ స్థైర్యములను విశేషముగ బరీక్షించుచుందురు.

ఈ దశకే 'శోధనకాల' (Probationary period) మని పేరు. ఈ కాలములో నెక్కుకష్టములు ప్రాప్తించవచ్చును. వాని వైరాగ్యమును బరీక్షించుటకు సంపదలును, మఱియు నింద్రియ నిగ్రహమును, మనఃపారిశుద్ధ్యమును, స్వార్థత్యాగమును బరీక్షించుట కనేక ఇతర యవకాశములును కలుగును. లోకోపకారమే జీవిత ముఖ్యోద్దేశమను విషయమును మఱచినాడా లేక సదా మనమునందుంచుకొని తదనుగుణముగ సర్వకార్యములయందు బ్రవర్తించుచున్నాడా అను సంగతిని గురువు సదా పరీక్షించుచుందురు. ఈ దశయందుండు జీవుడు "శిష్యకల్పుడు" అని యెఱుంగబడును. ఇది మిక్కిలి ముఖ్యమైనదశ. దీనిలో "నత్వా కామా బహవో లోలుపంత" (క. ఉ.)

(నిన్ను బహుకామములు వశపరచుకొన నేరవాయెను) అని గురువు మెచ్చుకొని యనుగ్రహించునట్లు ప్రవర్తించినయెడల శీఘ్రముగా వారి ప్రసాదము కల్గును. గర్భగుడికి నిక కొంచెము సమీపమునకు బోగల్గును. ఈ పరీక్షలో గడతేరినవాని మహాగురువు ఇంకను నెక్కుడుగ జెంత జేర్చుకొని, శిష్యునిగ నంగీకరించి, స్వీకరింతురు. అప్పుడు శిష్యుని మనస్సునకును గురువు మనస్సునకును మిక్కిలి యానుగుణ్యముండును. శిష్యుడు సంకల్పించిన సంకల్పము గురువుయొక్క మనోమయకోశమును దాకి వారికి వేద్యమగును. శిష్యుడు సయితము గురువుయొక్క మనోభావము నెఱుగ గలుగును. అందువలన శిష్యుడు పెక్కు విషయములందు యథార్థజ్ఞానము కల్గి లోకమునకు జక్కగ బోధించు సామర్థ్యము గలవాడగును. వాని ద్వారా లోకోపకార కార్యము మునుపటికన్న నెక్కుడుగ జరుగుచున్నదని గురువు సయితము సంతసించును. ఈ దశలోనుండు శిష్యుడు 'స్వీకృత శిష్యుడు' (Accepted Disciple) అనబరగు. ఈ రెండు దశలనే శ్రీశంకరాచార్యులు 'వివేకచూడామణి' యందు సూచించిరని తోచెడిని:

"ధన్యాస్తే (1) భవదీక్షణక్షణగతేః పాత్రీకృతాః (2) స్వీకృతాః ॥"

అప్పుడు గర్భగుడికి మిక్కిలి సమీపించును. శిష్యుడు సంకల్పించిన ప్రతి సంకల్పము గురువుయొక్క మనస్సు నంటుటవలనను, శిష్యుడీదశయందు బూర్ణుడు కానందువలనను, గొంతమట్టు కపరిశుద్ధ సంకల్పములుకూడా వాని మనమునం దుదయించ, నవియు గురువు మనోమయకోశమును దాకగా వారట్టి సంకల్పములను వారి మనస్సున జొరనీయరు కావున వానిని ప్రయత్నముతో

దొలగించుకొనుచుందురు. ఇట్లు పలుమారు వారు చేయవలసివచ్చిన యెడల నా శిష్యునివలన వారి పనులకు భంగమే కాని సహాయముగ నుండదు. అట్టి కష్టమును వారికి గల్గుజేయుటవలన శిష్యుడు గొప్ప పాపమునకు బాలగును. దుష్కర్మ జేసినవా డగును.

ఈ దశ గడిచినవెంటనే గర్భగుడిలో బ్రవేశించ నర్హతకల్గును. కొన్ని సందర్భములలో నచ్చట బ్రవేశించుటకుమున్న మఱియొక దశను గడపవలసియుండును. ఆదశకు 'గురుపుత్రత్వము' అని పేరు. ఆదశలో స్వీకృత శిష్యత్వదశకన్న నెక్కుడుగ గురుశిష్యతాదాత్మ్యము బ్రకాశించును. ఈ స్వీకృత శిష్యత్వ దశ లేక పుత్రత్వ దశ వఱకు బ్రతి నివృత్తిమార్గస్థుడొక గురువుయొక్క శిష్యుడుగ నుండును. మోక్షమార్గమునందు బ్రవేశించుట కర్హుడు అనగా గర్భగుడిలోకి వీని బోనియ్యవచ్చును అని గురువుకు దోచగనే యా గురువు వానికి తారకోపదేశము జేసి దీక్షితునిగ జేయుటకు ఋషిసంఘేశ్వరుడగు భూమండలాధిపుని యనుమతి వడసి యుపదేశము చేయించును. అప్పటినుండి వాడు దీక్షితుడని (Initiate) యెరుంగబడును. అతడు ఋషిసంఘము వారి యస్వీక్షణకు లోబడి యుండును. ఆ సంఘములోనివాడే యనియును చెప్పవచ్చును. ఇట్లు శిష్యుని స్వీకరించి, కైదండయొసంగి తారకోపదేశము చేయించు ముక్తగురువు వానికి "దీక్షాగురువు" అను విశేష నామాంకితుడగు. ఈ విషయములన్నియు పరమహంస లెడ్‌బీటర్ గారివలన రచియించబడిన "అంతరంగ ప్రవర్తనము[1]" అను గ్రంథమునందు వివరముగ జెప్పబడియున్నవి. వానిని జదివి తెలిసికొనవలయు.

[1] Inner Life, Vol. I.

టీకయందు జెప్పబడిన ద్వార మన బహిఃప్రాకారమునకు లో పల, గర్భగుడికి వెలుపల నని యర్థము. అచ్చట దప్పు సవరించు కొనవచ్చును. పరీక్షదశవఱకు మనమే సవరించుకొనుచుందుము. దానివలన లోకమునకు విశేషబాధ కలుగదు. అంగీకారదశలో దప్పు చేసిన గురువుయొక్క పనికి భంగము కలుగుచుండుననియు, నయిన ను వారు దాని సవరించి సరిచేసికొనుచుందురనియు, నట్లు వారికి శ్రమగలుగజేయడమే మహాపాపమనియు నిదివఱకే వ్రాయబడెను. అట్లుండ, లోపలికి బ్రవేశించి ఋషిసంఘమువారి ప్రతినిధిగా నేర్పడి యుండువాడు తప్పుచేసిన దాన లోకమున కెంత యకపకారము కల్గు నో ఆ పాపమును బోగొట్టుకొనుటకు వాని కెంత కష్టముగల్గునో యోచించవలెను.

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః ॥

(భ. గీ. ౩)

పెద్దవాడెట్లు వర్తించునో అట్లే యితరులు వర్తింతురు. పెద్దవాడు దోషకార్యము చేసిన ననేకు లట్లు చేయుదురు. లోక సమష్టిదుష్కర్మ దాన నెక్కుడగును. అందువలన దీక్షితులలో చేరినవాని తప్పువలన హెచ్చుచెడుగు కలుగును. మఱియు సిద్ధుల సంఘములో జేరినవానికి ఆ సంఘబలాకర్షణచే నాతనిలోపల బీజరూపముగ దాగియుండిన గుణములును, దోషములును బలవత్తరముగ బయలుపడును. అందు వలన వాడుచేయు దోషము లోకమున కెక్కుడుగ జెడుగు చేయును. ఆ గొప్ప కర్మఋణమును దీర్చుకొనుటయందు మిక్కిలి దుఃఖము నొందవలసియుండును.

## నాల్గవ వ్యాఖ్యాన సూత్రము

మొదటి మూడు ప్రాచీనసూత్రములను గురించియు వానిపైన హైలేరియన్ అను ముక్తగురువులవలన వ్రాయబడిన టీకనుగురించియు విచారించబడెను. ఇప్పుడా సూత్రములకు వ్యాఖ్యాన రూపమగు నాల్గవ సూత్రమును గురించి మీమాంసచేయబడును. ప్రాచీనసూత్రముల యథార్థ తాత్పర్యము మందమతుల కగ్రాహ్యంబగుటంజేసి విపరీతార్థముచే జెడిపోవుదురని తలచి దురభిప్రాయములను దొలగించి సూత్రములయొక్క నిజమైన తాత్పర్యమును వెల్లడిచేయుటయే వ్యాఖ్యానసూత్రముల ముఖ్యోద్దేశము. అందు నాల్గవ సూత్రము రెండు భాగములు గలదిగ నున్నది. ప్రాచీనసూత్రములవలన నజ్ఞులకు గలుగు దురభిప్రాయములను దొలగించు సూత్రరూపమైనట్టిది మొదటిభాగము. వ్యాఖ్యానరూపమగునట్టిది రెండవ భాగము. అందు రెండవభాగము టీకకుజేరికగా నుండుట వలన దొలుత విచారించబడును.

వ్యాఖ్యానసూత్రము—వ్యాఖ్యానభాగము :—

"హృదయమునం దనర్థమూలము నన్వేషించి దానిని వెడల గొట్టుము."

సర్వానర్థమూలము అవిద్య, అజ్ఞానము.

> అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ॥
>
> (భ. గీ. 5–15)

జ్ఞాన మజ్ఞానముచే నావరింపబడుటవలన జీవులు మోహము జెందుచున్నారు.

సర్వభూతములయం దేకత్వదర్శనమే జ్ఞానము. అదియే శోక మోహములను నశింపజేయునది. అట్లు చూచువాడే జ్ఞాని, పండితుడు, సత్వగుణప్రధానుడు.

యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః ।
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః ॥
(ఈశ. ఉప.)

ఎప్పుడు జ్ఞానప్రాప్తియై వానికి సర్వభూతము లాత్మస్వరూపము లగునో అట్టి యేకత్వమును దర్శించువానికి శోకమెట్టిది? మోహ మెట్టిది? అని తాత్పర్యము.

సర్వభూతైకత్వదర్శన లక్షణమగు జ్ఞాన మజ్ఞానముచే నావరించ బడునప్పుడు భిన్నభావ ముద్భవిల్లు. కామక్రోధాదులు భిన్నభావము వలన గలుగును. వానివలన జీవుడు పాపకార్యములదెస ప్రేరితు డగును. కావున సర్వానర్థములకు మూలము అవిద్యయు దత్కార్య ములగు భేదబుద్ధియు కామము నని యెఱుంగవలయు. కావున హృదయము నన్వేషించి వెడలగొట్టవలసిన యనర్థమూలము భేద బుద్ధి కార్యమైన కామమని భావించవచ్చును.

"అయ్యది భక్తుడగు శిష్యుని హృదయమునందును కాముకుని హృదయమునందును జేరి దాని ఫలము నిచ్చితీరును."

సర్వకామ వర్జనముయొక్క సాక్షాత్ ఫలము మోక్షమే.

యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః ।
అథ మర్త్యోఽమృతో భవతి అత్ర బ్రహ్మ సమశ్నుతే ॥
(కఠ. ఉప.)

ఎప్పుడు హృదయము నాశ్రయించియుండు సర్వకామములు వదలి పోవునో అప్పుడు ఇచ్చటనే (అనగా జీవించియుండగనే) అమృతుడై బ్రహ్మమును బొందును.

అంతవఱకు గామమెద్దియో యొక రూపమున హృదయము నాశ్రయించియే యుండును. పై మెట్టుకు బోవుకొలదియు నీ కామము సూక్ష్మతరరూపమున నంటియుండును. ఈ విషయ మిదివఱలో విచారింపబడి యున్నది. (77, 78 వ పుటలు చూడుడు.)

ఆచార్యులచెంత జేరిన శిష్యుడైనతత్క్షణమే సర్వకామ రహితుడయ్యెనని దురభిప్రాయము నొందకూడదు.

"దానిజంపివేయ దృఢచిత్తులే సమర్థులు. అది పెఱిగి పక్వమై నశించువఱకు అదృఢచిత్తులు నిరీక్షించియుండవలయు."

దృఢచిత్తులన దీవ్రవైరాగ్యము గలవారు. పూర్వజన్మకృత కర్మ ఋణములను శీఘ్రముగ దీర్చుకొని యాచార్యానుగ్రహమునకు బాత్రత బడయవలయునని సంకల్పించి, యా సంకల్పమును సాఫల్యము జేయ దృఢప్రయత్నము చేసి, యెన్ని యంతరాయములు సంభవిల్లినను సరకుసేయక, యెన్నికష్టములు సంప్రాప్తమైనను సహించి, సంకల్పార్థమును సాధించువారు. సాధారణమార్గమున బహుకాలమునకు దీరదగు కర్మఋణములను గొద్దికాలములోనే తీర్చవలయునన్న బెక్కు ఇడుములు సంభవించును. వైరాగ్యము హెచ్చుకొలదియు నీ దుఃఖముల పరిమితియు హెచ్చును. సామాన్యమనుజు లీ కష్టముల నోర్వజాలక వెనుదీయుదురు. పరమార్థమునందు సంపూర్ణదృష్టిగలిగి సంసార సుఖ దుఃఖములు తుచ్ఛమని వాని గమనించక పూనుకొనిన కార్యమును సాఫల్యము జెందువఱకు వెనుదీయనివారే దృఢచిత్తులు, ధీరులు.

ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచుఁ ధృత్యున్నతోత్సాహులై।
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునఁ ॥
(భర్తృహరి)

గొప్పప్రయత్నము లేకయే కామజయము లభించదు. కామము ఇం ద్రియములు మనస్సు బుద్ధిని నాశ్రయించియుండును. పాండిత్యము వలననే ఇంద్రియనిగ్రహము గలుగనేరదు. శాస్త్రజ్ఞానము గలిగిన వాడైనను సామాన్యప్రయత్నముచే నింద్రియములను జయించజాలడు.

యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥
(భ. గీ. 2—60)

మనోనిగ్రహమున కభ్యాసముండవలెను. బాగుగ బ్రయత్నము చేయవలెను.

అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥
(భ. గీ. 6—35, 36)

ఇట్లు ప్రయత్నముతో నభ్యాసముచేయువానికి దన కార్యము సఫల మగునో లేదో యను సంశయ ముండదు.

నేహాభిక్రమనాశోఽస్తి (భ. గీ. 2—40)

అనెడి గీతావాక్యమును నమ్మెను. పూనుకొనిన పని వెంటనే సాఫల్య మొందని యెడల దాను జక్కగ బ్రయత్నముచేయనందున నట్లాయె నని తలచి మఱియు నెక్కుడుగ బ్రయత్నించును. సంసారవృక్షము చిన్న దెబ్బవలన నభేద్యము కావున

అసంగశస్త్రేణ ధృఢేన ఛిత్వా (భ. గీ. 15—3)

అసంగమను బలమైన శస్త్రముచేత నరికివేయవలెనను గీతావాక్యము ననుసరించి తీవ్రవైరాగ్యముతో బలమైన ప్రయత్నముచేయుదురు.

అధృఢచిత్తులనగా సామాన్యప్రయత్నము చేయువారు. తీవ్ర వైరాగ్యము గలవారు కారు. సంసారవృక్షమును ఛేదించను బూను కొనినను శీఘ్రముగ దాని దెంచివేయవలెనని దృఢమైన శస్త్రమును ధరించినవారు కారు. కష్టములు వచ్చినయెడల సంపూర్ణముగ సహించు వారు కారు. ఈ మార్గమున నన్నిదుఃఖములు ప్రాప్తించెననియు, దేహమున కాయాసము గలిగెననియు, నిక నెన్నికష్టములు వచ్చునో యని వెఱగంది పూనుకొన్నపనిని వదలుదురు.

ధృడచిత్తులకుగాని అధృడచిత్తులకుగాని వారు వారు చేసిన పూర్వ జన్మ కర్మఫలమే భోగమునకు బ్రాప్తమగును. అయితే ధృడచిత్తులు త్వరితములో నన్నియు దీరవలెనని సంకల్పించువారైనందున నొక్కొ క్క జన్మములోనే వారికి బెక్కు కష్టములు ప్రాప్తించును. అదృఢ చిత్తులకు వైరాగ్యన్యూనతవలన నొక్కొక్క కాలమందు గొంచె కొంచెముగనే కష్టములు వచ్చును. అన్నియు భోగమునకు వచ్చునవి యే. అనుభవించక తీరదు. అయితే అధృడచిత్తులకు గాలవిడంబము గలుగును. ఇట్లాలస్యమగు కొలదియు గామము పెఱుగుచునే యుం డును. రాగము విరాగముచే జయించబడును. దానికి లోబడు కొలదియు వృద్ధియగునేగాని క్షీణించదు. అగ్ని నీరుతో శమించునే కాని అజ్యముతో శమించునా? కనుక మందవిరాగులకు గామజయ ము దుర్లభతరము. అయితే ఆ కామము చివరకు పక్వమై దానంతనే నశించును. విషయభోగములు నశ్వరములనియు, దుఃఖయోనులనియు

నిదివఱలో వ్రాయబడెను. ఒకవిషయము భోగింపగానే దానియందు జుగుప్సగలుగును. ఇట్లు బహుకాలము పెక్కువిషయములను భోగించి వానివలన నిజమైన సుఖమును బొందనేరక దుఃఖమును బొంది కడపట నివి యన్నియు నిస్సారములని నిర్వేదము కలుగును.

ఇట్లు కామము పక్వమై నశించుకాలమురాగా దనంతనే నశించును. ఇట్లు అది పెఱిగి పక్వమై తనంతటనే నశించువఱకు దృఢచిత్తులు నిరీక్షించియుండరు. ఇదియే దృఢచిత్తులకు నదృఢచిత్తులకు గల తారతమ్యము. ఈ విషయము (అనగా దృఢచిత్తుల కుండవలయు లక్షణము) "పరమగురు చరణసన్నిధి" యందు సొంపుగ నిట్లు వర్ణించబడియున్నది.

"నీవు భగవంతు డనియెడి యగ్నియొక్క విస్ఫులింగము వంటివాడవు. సర్వశక్తుడైన భగవంతుడు నీయందున్నాడు. అందువలన నీవు దృఢముగ సంకల్పించినచో నీవు చెయలేని దొకటియు నుండదు. మనుష్యుడు (ఆరూఢుడు) సాధించినది మనుష్యుడు (ఆరురుక్షువు) సాధించగలడు. నేను మనుష్యుడనే; (అంతియకాదు) మనుష్యరూపముననున్న భగవంతుడను. దీనిని నేను సాధించగలను. సాధించెదను. అని నీలో నీవనుకొనవలెను."

అవిద్య నాశనమగువఱకు సంసార భ్రమణముండును. సంసారమునకు వృక్షసామ్యము శ్రుతి స్మృతి ప్రసిద్ధము.

ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థస్సనాతనః ॥

(కఠోపనిషత్తు)

ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం ॥

(భ. గీ. 15—1)

ఈ సంసారవృక్ష మవ్యయమనియు సనాతనమనియు జెప్పబడినది.
మఱియు,

> అవ్యక్తమూలప్రభవ స్తస్యైవానుగ్రహోత్థితః ।
> బుద్ధిస్కంధమయశ్చైవ ఇంద్రియాంతరకోటరః ।
> మహాభూతవిశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా ।
> ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖ ఫలోదయః ।
> ఆజీవ్యః సర్వభూతానాం బ్రహ్మవృక్షస్సనాతనః ॥

ఇచ్చట సంసారవృక్షముయొక్క పుష్పములు ధర్మాధర్మములనియు ఫలములు సుఖదుఃఖములనియు జెప్పబడియున్నది.

"అది మనుజుడసంఖ్యాతములగు జన్మముల అనుభవములను సేకరించినపుడు పుష్పించును."

భూమిలో విత్తనము వేసిన తత్క్షణము పువ్వుపూచి ఫలించ నేరదని తెలిసినవిషయమే కదా. మొలచి, చిన్నిమొలకయయి, క్రమక్రమముగా బెఱిగి పుష్పించి ఫలించును.

వృక్షమునకు ఋతువువంటిది మనుష్యుని కొక్క జన్మము. బహుకాలము ధాతువర్గ, వృక్షవర్గ, జంతువర్గ, దేహములలో నానావిధములైన యనుభవములను బొంది, ఆత్మశక్తులు కొంతవఱకు ప్రకాశము పొందియుండును. శక్తి లింకను హెచ్చుప్రకాశమునకు రావలెనన నందు కనుగుణమైన శరీరము కావలెను. అట్టి శరీరమే మానుషశరీరము. అది లభించునది దుర్లభము.

> దుర్లభం త్రయమేవైతత్ దేవానుగ్రహ హేతుకమ్ ।
> మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః ॥
> (వివేకచూడామణి)

మఱియు ముచుకుందస్తోత్రమునందు,

పూని యనేకజన్మముల నొంది తుదిన్ దనపూర్వకర్మసం
తానము పేర్మి కర్మ వసుధాస్థలిబుట్టి ప్రపూర్ణదేహుడై
మానవుడై గృహేచ్ఛఁబడు మందు డజంబు తృణాభిలాషియై
కానకపోయి నూతబడు క్రైవడి నీ పదపద్మ హీనుడై ॥

మఱియు, ఐతరేయోపనిషత్తు నందు

తాభ్యోగామానయత్ తా అబ్రువన్ నవై నోఽయమలమితి।
తాభ్యోఽశ్వమానయత్ తా అబ్రువన్ నవైనోఽయమలమితి।
తాభ్యః పురుషమానయత్ తా అబ్రువన్ సుకృతం బతేతి।
పురుషో వావ సుకృతం।

దేవతలకు గో అశ్వ శరీరములను జూపగా నవిచాలవు, లెస్సగా లేవని నిరాకరించిరి. పిమ్మట మనుష్య శరీరమును జూపగా బాగుగనున్నది, మనుష్యశరీరమే బాగు అని యంగీకరించి దేవత లింద్రియాధిష్ఠాను లై యొక్కొక్క రొక్కొక్క ఇంద్రియమును బ్రవేశించిరి.

ఇందువలన దెలియదగినది యేమనగా మనుష్యదేహము సంప్రాప్త మగుటయే నిక్కాలి దుర్లభము. సర్వాంగములు పూర్ణమై యాత్మ శక్తులను పూర్ణముగా బ్రకాశింపజేయగల్గు యోగ్యతగల శరీరము వేఱొండులేదు.

ఇట్టి దేహము లభించి, లోకానుగ్రహము కొఱకు బుషివర్యులు విశేషముగా బనిజేయుచుండు కాలమందు జన్మించి, బుషివర్యుల యనుగ్రహమును బొందిన ఉత్తమ విరాగుల సన్నిధానమందు నిలుచు నవకాశము గలిగియు, జన్మసాఫల్యము కొఱకు బ్రయత్నము చేయని

వారి జన్మము వ్యర్థము. సకాలములో వేసిన విత్తనమేకదా చక్కగ ఫలించును. ఇప్పటివంటి సమయములో కించిత్ లోకోపకార కార్యము నెఱవేర్చబూనుకొన్నను నది ఋషుల కటాక్ష వీక్షణము దగిలి ఎక్కువ ఫలవంతమగును.

మనుష్య దేహము లభ్యమైనను బహు జన్మములకుగాని ధర్మాధర్మ వివేకము గలుగనేరదు. తమోగుణ ప్రధానుడై వివేకలేశమైనను లేక కొంతకాలమును, రజోగుణప్రధానుడై కామక్రోధ పరవశుడై మఱికొంత కాలమును, గడపును. ఇట్లు గడపు జన్మము లన్నియు వృక్షము మొలచి ఆకులు కొమ్మలు వేయుచు బెఱుగు చుండు కాలమువంటివి యని తలచవచ్చును. వివేకముద్భవిల్లి ధర్మాధర్మముల నెఱింగినప్పుడు సంసారవృక్షము పుష్పించినదని జెప్ప వచ్చును. ఈ దశవచ్చుటకు బెక్కు జన్మముల నెత్తవలసి యుండు నని సూత్ర తాత్పర్యము.

"(యోగ) బలసాధనమార్గమునందు బ్రవేశించగోరువాడు దీనిని హృదయమునుండి ఛేదించవలయును."

యోగమార్గ మిచ్చట బలసాధన మార్గమని చెప్పబడియున్నది. అనాత్మగుణములను వదలి, భూతదయ, అహింస, సత్యము, ఆర్జవము, నిష్కామము మొదలగు నాత్మగుణముల నభ్యసించుచురాగా ఆత్మశక్తి ప్రకాశించును. ఆత్మబలముకన్న గొప్ప బలము లేదు. ఒక్కరుండగు వసిష్ఠమహర్షి గొప్పసైన్యముతో నెదిరించిన విశ్వామిత్రుని దన బ్రహ్మదండముతో జయించి "బ్రహ్మతేజోబలం బలం" అను వాక్యముయొక్క సత్యత్వమును గనుపరచ లేదా? ఆత్మనిష్ఠవలననే (అనగా భూతదయాది లోకోపకార కర్మవలన) నీబలము ప్రాప్తించును.

నాయమాత్మా బలహీనేన లభ్యో
న చ ప్రమాదా త్తపసో వాప్యలింగాత్ ।
ఏతైరుపాయై ర్యతతే యస్తు విద్వాన్
స్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ ॥
(ముం. ఉప. iii. 2. 4.)

ఈ యాత్మ, బలహీనునికి లభ్యముకాదు. ప్రమత్తునికిని, నియత లక్షణసహితమైన తపస్సులేనివానికిని లభ్యముకాదు. ఈ యుపాయములతో అనగా, బలము (ఆత్మనిష్ఠాజనితవీర్యము—శం. భా), అప్రమత్తత, లక్షణసహిత తపస్సు, వీనివలన బ్రహ్మపదమును బొందనగు.

ఈ బలముయొక్క లక్షణము కామరాగవివర్జిత మని గీతాశాస్త్రమునందు జెప్పబడియున్నది.

బలం బలవతాం చాహం కామరాగవివర్జితం ॥ (భ. గీ. 7-11)

కామము భేదబుద్ధిని వృద్ధిపరచును. భేదమనాత్మగుణము. నిష్కామమువలన సర్వభూతైకత్వజ్ఞానము గలుగును. ఒక్క మనుష్యుని శక్తికన్న నిద్దరిశక్తి హెచ్చు కదా! అట్లే, లోకములోని సమస్త భూతములతో నేకీభావమును జెందినవాని శక్తి యపరిమితముగ నుండు. అట్టి బలము మోక్షమార్గమందు సాధించబడును. ఆ యోగ బలమునకు నిష్కామ మత్యంతావశ్యకము. అందువలననే యోగమార్గమును బ్రవేశించ గోరువాడు దీనిని (సంసారమూలమగు కామమును) హృదయమునుండి ఛేదించవలయునని వ్యాఖ్యానసూత్రము బోధించుచున్నది. గీతాశాస్త్రమందు సయితము సంసారమను నశ్వత్థ వృక్షమును నసంగమను దృఢమైన శస్త్రముతో ఛేదించవలెనని చెప్పబడియున్నది.

"అప్పుడు హృదయమునుండి రక్తము స్రవించును. మనుష్యుని జీవితమంతయు సంపూర్ణముగ నశించెనని తోచును."

ఇచ్చట గీతాశాస్త్రములోని ఉపమానమే ప్రయోగించబడి యున్నది. దేహములో నే భాగమునైనను శస్త్రముతో ఛేదించినయెడల రక్తము స్రవించి బాధకల్గునట్లు హృదయమును బహుకాల మాశ్రయించియుండు కామమును వెడలగొట్టగా బాధ కలుగును. జీవితమంతయు నశించెనని తోచును. ఎందుకనగా, ఎద్దియో యొక ప్రయోజనము నుద్దేశించియే మనము సకలకార్యముల నెఱవేర్చుచుందుము. అదియందు ఐహికసుఖము, యశస్సు, ఐశ్వర్యము, పిదప బరలోకసుఖము, జన్మాంతరసుఖము, మఱియు గొంతకాలముకు సిద్ధులుకావలెనని, జ్ఞానియని యనిపించుకొనవలెననియు నిట్టులెన్నివిధములనో కామము మనయందు జేరియుండును. కార్యప్రవర్తనమునకిట్టి దెద్దియో యొక్క ప్రయోజనముండనే యుండును. ఇట్లుండ సర్వకామములను ఛేదించగా జీవించి యుపయోగములేదని తోచును. కార్యనిర్వర్తన కుత్సాహము లేకపోవును. అకృత్స్నవిదున కిది సహజమే. సమస్తము (Whole) దెలిసినవాడు కృత్స్నవిదుడు. కించిన్మాత్రము (part) దెలిసినవా డకృత్స్నవిదుడు. సమస్తమనగా సర్వభూతహితమగు ఈశ్వరసంకల్పము. ఆ సంకల్పము నెఱిగి తదనుగుణప్రవర్తనము గలవాడు జ్ఞాని, కృత్స్నవేత్త. అట్టి జ్ఞాని తన స్వప్రయోజనమును జూడడు. స్వప్రయోజనము లేనియెడల జీవితము వ్యర్థమని తలచడు. తనహిత మీశ్వరకార్యమునకు భంగమని తోచిన దన హితమును జూడక ఈశ్వరకార్యమును నెఱవేర్చును. అట్లు నికృష్టమును (lower) ద్రోసివైచి, ఉత్కృష్టమును (higher)

ఆశ్రయించుటయందు బాధ తోచదు. సంతస ముద్భవిల్లును. బాధ తోచునంతకాలము త్యాగము నిజమైన త్యాగముకాదు. గొప్ప విషయమున దృష్టిగల్గినచో అల్పవిషయమును సంతోషముతో విడిచి పెట్టును. రక్తము స్రవించిన నది యపరిశుద్ధమైన రక్తము, వ్రణ మునకు గారణమనిరే; అదిపోయిన వ్రణము మాని రక్తము శుద్ధి యగునని తలచి రక్తస్రావమునకు జింతించక సంతసించును. అట్లే ఈశ్వరకార్యార్థము తన ప్రయోజనమును త్యజించుటయందు జిత్త మాలిన్యముతొలగి, చిత్తశుద్ధియు ఈశ్వరప్రసాదము గల్గునని సం తోషముద్భవిల్లునేకాని దుఃఖము గలుగదు. దీనికే నిజమైన సంన్యా సమనియు యజ్ఞమనియు (Sacrifice) పేరు.

మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥

(భ. గీ. 3-30)

సర్వకర్మలను నాయందు సంన్యసించి ఆత్మయందుంచిన మనస్సుగల వాడవై ఆశలనువదలి మమకారము లేనివాడవై సంతాపము విడిచి యుద్ధముజేయుము.

ఇది మిక్కిలి యర్థవంతమగు శ్లోకము. శోక సంతాపములతో గర్మలను సంన్యసించిన నవి ఈశ్వరార్పణకర్మలు కానేరవు. ఈశ్వ రునియందు సంన్యసించుటలో సంతాప ముండనేరదు. గొప్పపదార్థ మును జూచిన జిన్నవస్తువునందు మనస్సుపోవునా? చిన్నవస్తువును విడు చుటయందు సంతోషమే కలుగును. పైదాని నాశ్రయించిన గ్రింది దానియం దభిమానము తొలగుననియు దత్త్యాగమునందు శోకరాహి త్యము గల్గుననియు నీ క్రింది యుపనిషద్వాక్యమువలన దెలియబడును.

సమానే వృక్షే పురుషో నిమగ్నో౽నీశయా శోచతిముహ్యమానః ।
జుష్టం యదా పశ్యత్యన్యమీశమస్య మహిమాన మితి వీతశోకః ॥
(ముం. ఉప.)

ఒకటే వృక్షమును (దేహమును) ఆశ్రయించియుండు జీవ పరమాత్మ లను రెండు పక్షులలో జీవుడనుపక్షి సంసారసాగర నిమగ్నుడై దీనభావముతో మోహమునుజెంది శోకించుచుండును. అయితే ఎప్పుడు పూజ్యుడును నీశ్వరుడును మహిమగలవాడునగు మఱియొక పక్షిని (పరమాత్మను) జూచి సేవించగల్గునో అప్పుడే శోకరహితు డగును.

ఈ మంత్రముపై శాంకరభాష్యములో సంసారసముద్ర నిమగ్నుని లక్షణములు వర్ణించబడినవి. "దేహమే యాత్మయని నిశ్చయించిన వాడై, నేను వీనిపుత్రుడను, వాని ప్రపౌత్రుడను, కృశించిన దేహము గలవాడను, స్థూలమైన దేహముగలవాడను, మంచిగుణములు గల వాడను, అట్టి గుణములు లేనివాడను, సుఖిని, దుఃఖిని, ఇంతకంటె వేఱులేదు అని దుఃఖించుచుండువాడై పుట్టుచు చచ్చుచు బంధువుల తో సంయోగవియోగములు గలవాడగును. అట్టివాడు దీనభావ ముతో నా కేమిసామర్థ్యములేదు, నా పుత్రుడు నష్టమాయెను, నా భార్యమృతినొందెను, ఇక నేను జీవించి యేమి యుపయోగము, అని సంతాపమునొందును. అనేక విధములుగా మోహమును జెంది అవివేకముతో జింతించుచుండును." ఇట్టివాడే వ్యాఖ్యాన సూత్ర ములో జెప్పబడినట్లు, "జీవితమంతయు నశించెనని" దుఃఖించు వాడు. అట్లు ప్రవర్తించక విగతజ్వరుడై అనగా శోకసంతాపములు చెందక ఆశను మమకారమును వదలి మనస్సు నింద్రియార్థముల

పైన బోనియ్యక ఆత్మయందుంచినవాడై ఈశ్వరానుగ్రహ ప్రాప్తి గల్గునని సంతోషముతో నాయనయందు గర్మలను సంన్యసించి సర్వ కర్మలను జేయవలెనని గీతాశ్లోక తాత్పర్యము. ఈ యర్థమునే "పరమగురుచరణసన్నిధి" యందిట్లు బోధించబడియున్నది.

"అనేకులకు విరాగము కష్టముగ దోచును. ఎందువలననగా తమ కోరికలే తామని వారు తలచుదురు. తమ స్వసంబంధములగు కోరికలు ఇచ్ఛాద్వేషములు పోయిన దామే (ఆత్మయే) నశించితిమని తలచెద రు. ఇట్లు దలచువారు గురుసందర్శన లాభమును బొందనివారే. వారి (గురువు) యొక్క పవిత్రమైన సన్నిధానమందు వారివలెనుండ వలెనను కోరికతప్ప యితర సమస్తకోరికలు నశించును." కావున వ్యా ఖ్యానసూత్రములో జెప్పబడినవాడు విరాగము నభ్యసించుచు గామ త్యాగముజేసియు నా త్యాగముయొక్క యథార్థప్రయోజనమును దెలిసికొననట్టివాడు. ఎప్పుడా త్యాగము ఈశ్వరకార్యార్థము అని తలచునో అప్పుడు కృత్స్నవేత్తయగును. శోకము నశించును. "స్వ ప్రయోజనము లేనందున జీవించి యేమి యుపయోగము" అని దీనత్వమును జెందడు.

"ఈ మహాకఠిన (శిష్యయోగ్యతా) పరిశోధనమును సహించ వలెను."

నివృత్తిమార్గమం దడుగిడినవానిని గురువు కనిపెట్టి యుండుననియు, వాని పూర్వజన్మకృత కర్మ శీఘ్రముగ తెగునట్లు ఎక్కుడుగ వానికి గష్టములు ప్రాప్తించుననియు, నీ కష్టముల నెట్లు సహించునో అని వారు పరీక్షించుచుందురనియు బూర్వగ్రంథములలో వ్రాయబడెను. నివృత్తిమార్గమునందుండువాడు తనకు సంప్రాప్తమగు సర్వదుఃఖ

ములను సంతుష్టితో ననుభవించి తీర్చివేయుటకు బూనుకొని తన దుఃఖ సహనమును గురువు పరీక్షించుచుండునని తలచి యివి తన కర్మఫలములే కావున ననుభవించితీరవలెనని తలచవలెను.

"అది యమృతత్వ మార్గమును జేర్పించునట్టి యపాయకరములగు సోపానములలో మొదటి మెట్టున నైనను రావచ్చును; తుదవరకు రాకనే పోనచ్చును."

అమృతత్వ మార్గమును జేర్పించు సోపానము లపాయకరములని చెప్పబడియున్నది. సుఖముగా నిరాయాసముగా నడచుత్రోవగాదు. ఆ శ్రేణికయొక్క ప్రతిపర్వము మన పూర్వ జన్మకృత దుష్కర్మ వాసనారూపమై యుండును. అది దుఃఖరూపమున నగుపడును. ఆ దుఃఖమును సంతాపరహితముగా సహించవలెను. ఆ యనుభవము వలన జ్ఞానము కలుగవలెను. అటుపిమ్మటనే పైపర్వము నారోహించ నగు. ఇట్లు సమస్త దురితములవలన జనించిన దుఃఖములను సహించి పాపవినిర్ముక్తుడైన గాని అన్ని పర్వముల నతిక్రమించి గమ్యస్థానమును జేరనోపడు. పురాతన కర్మను ద్రెంచివేయవలెను. క్రొత్త దుష్కర్మ జేయగూడదు. గమ్యస్థానమును లక్ష్యముగ మనసునందుంచుకొని రే యుండవలెను. ఐహికాముష్మిక సుఖభోగచింత యా లక్ష్యస్థానమును మఱుగుపరచును గావున ప్రమాదరహితుడుగ నుండవలెను. ఉన్నతస్థానమునుండి ఎట్టి తప్పుజేసినను దానివలన లోకమునకు నెక్కుడపకారము కలుగును. దానిఫల మనుభవించవలసి యుండును. అనుభవించు వఱకును పై సోపానములకు బోవ నసమర్థుడై యుండును. అందువలననే సోపానము లపాయకరములని చెప్పబడి యున్నది. ఈ మార్గమును గుఱించి

క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గంపథ స్తత్కవయో వదంతి ॥

(క. ఉ. 3—14)

ఈ మార్గము (మోక్షమార్గము) వాడిగల కత్తియొక్క అంచువలె తీక్ష్ణమైనట్టిదియు నతిక్రమించుటకు గష్టమైనట్టిదియు గఠినమైనట్టిదియు నని అనుభవజ్ఞులు చెప్పుచున్నారు.

ప్రవృత్తిమార్గమునందు విషయసుఖము లమృతప్రాయముగ భోగించబడెను. అయిన నవి నిస్సారములగుటంజేసి మోక్షమార్గమునందు భోగమునకు వచ్చినపుడు అవియే విషముగతోచును. విషభక్షణ మపాయకరము కాదా?

విషయేంద్రియ సంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతం ॥

(భ. గీ. 18—38)

ఎట్టి పదార్థమును భక్షించినను దానిసారముమాత్రము దేహములో నిమిడి పుష్టిని గల్గజేయును. శేషించిన నిస్సారభాగము దేహమునుండి వెడలి పోవలెను. లేనియెడల విషవాయు వుద్భవించి (Poisonous Gases) రోగములు పుట్టును. అప్పుడౌషధ సేవవలన నా విషమును వెడలగొట్టవలెను. పరమేశ్వరుడగు సదాశివుడు సర్వభూతముల యొక్క కర్మలను గ్రహించి వానియందలి వర్జనీయములును, నిస్సారభూతములును, లోకముల కహితము కలుగజేయు నట్టియు, విషప్రాయములు నగు దుర్వాసనలను సర్వపాపహారమగు తన కంఠమందుంచుకొని సారభూత దుఃఖానుభవజనిత జ్ఞానమను నమృతమును మనకొసంగుచున్నాడు గదా! ఇట్లే మనము మన కర్మఫలముల విష

భాగమును త్రిమింగి జ్ఞానసారమును గైకొనవలెను. ఇది నిశ్చయముగ నపాయకరమైన మార్గమని చెప్పవచ్చును. సులభమైనది కాదు. గొప్పవైరాగ్య ముండవలెను. వ్యాఖ్యానసూత్రములో నీ కష్టములు మార్గముయొక్క ప్రారంభమందుగాని అంతమందుగాని రావచ్చునని చెప్పబడినది. ఇది యధికారి భేదమునుబట్టి చెప్పబడినదని తోచు చున్నది. మందవిరాగుల కాలస్యముగా గర్మవినిర్ముక్తియగును. తీవ్ర విరాగులకు క్షిప్రమే కర్మ నశించును. వైరాగ్యమెంత హెచ్చునో అంత శీఘ్రముగ కర్మదేవతలు బూర్వ జన్మకృతకర్మ దుఃఖఫలములు భోగమునకు వచ్చునట్లు చేయుదురు. అట్లు దుఃఖములు ప్రాప్తించి నపుడు మన నడవడికను కనిపెట్టుటయే, పరమగురువులు మనలను పరీ క్షించుట యనబడును. మనకర్మఫలమును మన మెప్పుడైన ననుభవించ వలసినదే. తీవ్రవిరాగముగలవాడు పెక్కు దుఃఖముల నేకకాల మందే సహించి గురుసేవకు లోకసేవకు యోగ్యతను సంపాదించు కొనియెదనని తలచును. మందవిరాగులకు గర్మ విమోచనము ఆలస్య ముగ బ్రాప్తించును.

"అయితే శిష్యుడా! (ఏవిధమున జూచినను) అది సహించియే తీరవలెనని స్మరించి, ఆపనియందు నీ యాత్మశక్తులను దృఢముగ వినియోగించుము."

ఉత్కృష్టవస్తువును జూచిన వానికి నికృష్టవస్తువును వదలుటయం దేలాటి దుఃఖము గలుగనేరదనియు సంతోషముతో విడువనగునని యు నిదివఱకే చెప్పబడెను. ఆత్మ గొప్ప ప్రాప్యస్థానము. దానిని లక్ష్యముగా నుంచుకొనిన సంసారదుఃఖములన్నియు సుఖములుగానే తోచును. సుఖదుఃఖములు క్షేత్రధర్మములు.

ఇచ్ఛాద్వేషస్సుఖందుఃఖం సంఘాతశ్చేతనాధృతిః ।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥

(భ. గీ. 13—6)

తన దేహమునందు దనకభిమానముండు నంతవఱకు సుఖదుఃఖములు కలుగుచుండును. ఏలయన, దేహము కోరినది లభించిన సుఖము, లభించక పోయిన దుఃఖము. అనగా భేదబుద్ధియు తజ్జనిత కామము ను ఆ సుఖదుఃఖములకు గారణములు. పరాపరాత్మకమును సర్వవ్యాపినియు నగు ఆత్మాశ్రయమునందు దుఃఖోత్పత్తికి గారణమే లేదు. లోకములో రమ్యపదార్థమును వీక్షించిన నందలి రమ్యత్వము ఆత్మరమ్యత్వమని సంతోషము గలుగును గాని తనకు గావలెనను కోరిక గలుగదు.

తేన త్యక్తేన భుంజీథాః ॥ (ఈ ఉ.)

'త్యాగముచే భోగించుము' అనెడి యుపనిషద్వాక్య ప్రకారము ఏదైనను స్వప్రయోజనమును ద్యజించుటచే సర్వజనసుఖము తన సుఖముగనే తోచి యానందము గలుగు. ఆ సుఖము తనకు గావలెనను కోరికగలిగినయెడల నాశాభంగమువలన దుఃఖము గలుగును. కావున ఆత్మనిష్ఠాపరునికి దుఃఖములేదు.

యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ।
తం విద్యాద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితం ।
సనిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥

(భ. గీ. 6, 22-23)

దేనియందు (ఏ ఆత్మయందు) ప్రతిష్ఠించబడినవాడై గొప్పదుఃఖము చేతనైనను జలించబడజాలడో అట్టిదియే సకల దుఃఖనివారణ సాధన మగు యోగము. దానిని ధృఢనిశ్చయముతో, విసుగుచెందక అనుష్ఠించవలెను. స్వలాభార్థము జీవించుటమాని, కామములను వదలి, సర్వదుఃఖాపహారము, సర్వబలప్రదాయకము, విశేషసుఖమూలము నగు నాత్మయందు శరణుసొచ్చిన, నా యాత్మబలముచే గామమను శత్రువును జయింపనోపు. దాన, దుఃఖము శమించును.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదం ॥

(భ. గీ. 3—43)

వైరాగ్యమార్గము నవలంబించినవానికి గష్టములు వచ్చుననియు, వాని ననుభవించక తీరదనియు, నహింసాభూతదయాది యాత్మగుణాభ్యాసముచే నాత్మశక్తులను సంపాదించి సంసార మూలమై హృదయము నాశ్రయించియుండు కామమను శత్రువును సంతాపము జెందక సంహరించవలెనని వ్యాఖ్యానసూత్ర తాత్పర్యము.

"నీవు తత్కాలపు వర్తమానదృష్టిని, మరియు భవిష్యత్కాల దృష్టిని వదలి నిత్యత్వదృష్టితో ప్రవర్తింపుము. అచ్చట నీ రాకాసి మొలక పుష్పించ నేరదు. నిత్యత్వచింత గాలి సోకినమాత్రమున నీ జన్మ కళంకము నశించును."

ఈ వాక్యములు సర్వవేదాంత రహస్యమును బోధించుచున్నవి. ఆత్మ నిత్యుడనియు దేశకాల పరిచ్ఛిన్నుడు కాడనియు నెఱింగి నశ్వరమైన దేహతాదాత్మ్యబుద్ధిని మానవలెను. దేహ తాదాత్మ్యమును

కొందుటవలన దేహధర్మములైన రాగద్వేషములు సుఖదుఃఖములు ప్రాప్తించును.

అజ్ఞానమువలన దేహతాదాత్మ్యమును, దాన, రాగద్వేష శోక మోహములును గలుగును. ఆత్మజ్ఞానమువలన నవి నశించును.

జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।
తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరం ॥

(భ. గీ. 5-16)

యత్ జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ ॥

(భ. గీ. 4-35)

అందువలననే శోకమోహములచే నష్టమైన వివేక విజ్ఞానము గల వాడై ధర్మయుద్ధమునుండి విరమించిన యర్జునునికి తొలుత ఆత్మ స్వరూపజ్ఞానమును భగవంతు డుపదేశము చేసెను.

నత్వేవాహం జాతునాసం నత్వం నేమే జనాధిపాః ।
నచైవ నభవిష్యామః సర్వేవయమతఃపరం ॥ (భ. గీ. 2-12)

నేను నీవు ఇంతకుమున్ను లేకపోలేదు. ఈ రాజులును లేకపోలేదు. ఇకముందు మన మెవరును లేకపోవువారము కాము.

న జాయతే మ్రియతే వా విపశ్చి
న్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్ ।
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ (క. ఉ.)

ఈ ఆత్మ పుట్టువాడు కాడు, చచ్చువాడు కాడు. ఏ కారణాంత రమునుండి యుత్పత్తి యయినవాడును కాడు. వానినుండి వేఱొక

ర్థాంతరము పుట్టుటలేదు. అజుడు, నిత్యుడు, శాశ్వతుడు, దేహము చంపబడినను వాడు చంపబడడు.

మహాంతం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి ॥ (క.ఉ.)

గొప్పవాడును విభుడును అగు ఆత్మను తెలిసికొనిన శోకము పోవును.

. . . . నిర్యోగక్షేమ ఆత్మవాన్ (భవ) ॥ (భ. గీ. 2-45)

యోగక్షేమములను విడిచి యాత్మనిష్ఠగలవాడవు కమ్ము. కాలపరిచ్ఛిన్నమైన దేహ తాదాత్మ్యమును మాని నిత్యుడగు ఆత్మ నాశ్రయించినయెడల సర్వకామ వివర్జితుడై శాంతినిబొందును. నిత్యత్వబుద్ధి నాశ్రయించినచో గలుగునట్టి యుత్తమ ఫలములను జక్కగా విచారించవలెను.

(1) మరణభీతి తొలగును. ఇప్పుడు సాధారణమనుజులు మరణభీతిచే నిహపరలోకములలో గష్టములకు బాలగుచున్నారు. దారాపుత్రాదులను బంధుమిత్రులను విత్తమును విడిచిపోవలసి వచ్చెనే యని దుఃఖమును, పరలోకమందు నరకబాధలచే బరితపింపవలసి యుండునను భయమును, వారి మనస్సున మిక్కిలి యాయాసమును గలుగజేయును. అందువలన నూత్మశరీరము అపవిత్రమై పరలోకమునందు నిక్కముగా బాధజెందెదరు. మఱియు జీవించి యుండు కొద్దికాలములోనే గొప్పకార్యము చేయలేము, చేసినను దానివలన సంతోషించుట కవకాశముండునో లేదో యను సంశయముచేత సత్కార్యారంభమున కుద్యమించరు. అట్లులేక,

అంతవంత ఇమే దేహాః నిత్యస్యోక్తాః శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య . . . . . . ॥ (భ. గీ. 2-18)

జీవుడు నాశములేనివాడు, నిత్యుడు, అప్రమేయుడనియు, నశించునది దేహము మాత్రమే యనియు, ఈ శరీరముతో సంపాదించబడిన జ్ఞానముగాని చేసిన ప్రయత్నముగాని నశించక జన్మాంతమున విడిచినచోటనే మరుజన్మములో మఱియు నారంభించి జన్మసాఫల్యమునకై బ్రయత్నము చేయబడుననియు, నమ్మినయెడల మృత్యుభయము లేదు. సత్కార్యారంభమునందు జుగుప్స కలుగదు.

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికం ।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన ॥ (భ. గీ. 6-43)

(2) జీవుడు నిత్యుడు నిర్వికారుడనియు సచ్చిదానందస్వరూపుడును నిర్దోషుడును సకలకల్యాణగుణోపేతుడు నగు భగవంతుని యొక్క యంశమనియు, సుఖదుఃఖములు కామక్రోధాదులు శరీరవికారములేయనియు నిత్యములు కావనియు విశ్వసించినయెడల బరులుచేసిన యపకారమును మఱచి వారికి నుపకారము జేయవచ్చును. ఏలయన వారుచేసిన యపకారమును గణించునది తన దేహాభిమానియగు జీవకళయేయనియు నాత్మాపేక్షయా అపకారము చేయబడలేదనియు నెఱుంగనగు.

కం ఘాతయతి హంతి కం ॥ (భ. గీ. 2-21)

(3) నిత్యాశ్రయమనగా నిత్యుడగు భగవదాశ్రయము.

మనము లోకములో బంధువులను దారాపుత్రాదులను బ్రభువులను శాశ్వతఫలము నపేక్షించి యాశ్రయించినయెడల నాశాభంగమే కలుగును. వారివలన గలుగు సుఖ మక్షయ సుఖము కాదు. వారీ జన్మాంతమువఱకే బంధువులు.

నహ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్ ॥

సకల జన్మములలోను విడువక మనలోపలను వెలుపలనుండి సదా మనలను గనిపెట్టి యాదరించి యుద్ధరించు తండ్రి ప్రభువు భగవంతుడే.

'పితాఽహమస్మి జగతో మాతా ధాతా పితామహః'
'గతిర్భర్తా ప్రభు స్సాక్షీ . . . . . . . .' (భ. గీ. 9 17, 18)
'జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ'

తాత్కాలిక బంధుజనుల నాశ్రయించుటవలన ప్రయోజనము లేదు. సర్వకాల సుహృత్తగు భగవంతుని నాశ్రయించవలయు. ఆయనను దండ్రిగా నెంచి కొల్చినయెడల సర్వభూతము లాయన బిడ్డలే కావున సర్వభూత హితత్వ మలవడు. ఆయనయే ప్రభువని నమ్మినయెడల సకల జను లాయన పరిపాలనము లోనుండు ప్రజలే కావున సర్వ భూత భ్రాతృభావము వృద్ధిపొందును.

(4) మనకు బ్రియులైన బంధువులగు దారాపుత్రాదులయందుండు జీవుడు నిత్యుడే కావున వారి వియోగమునకు జింతించ నవశ్యక ముండదు. వారికి మనకు బరస్పర ప్రేమ నిజముగనుండిన భావిజన్మ ములలో వెండియు బ్రేమ వృద్ధియగును. అందువలన గూడ శోకించుట కవకాశము లేదు.

(5) ప్రతి మనుష్యుడు తన నిజమైన స్వరూపమును స్మరించుటకు గొన్ని మహావాక్యము లేర్పడియున్నవి.

I. తత్త్వమసి II. సోఽహం
III. అహం బ్రహ్మాస్మి IV. అయమాత్మా బ్రహ్మ

I. నీవు ఆ బ్రహ్మస్వరూపుడవేను, (అని గురూపదేశము).
II. నేను ఆ బ్రహ్మస్వరూపుడను, (సాధకుని అనుసంధానము).
III. నేను బ్రహ్మమును.
IV. ఈ ఆత్మ బ్రహ్మస్వరూపము.

మఱియు తైత్తిరీయోపనిషత్తునందు,

స యశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏకః ।
అహం వృక్షస్య రేరివా కీర్తిః పృష్ఠం గిరేరివ ।
ఊర్ధ్వపవిత్రో వాజినీవ స్వమృతమస్మి ।
ద్రవిణం సువర్చసం సుమేధా అమృతోక్షితః ॥ (తై. ఉ.)

నీవు బ్రహ్మస్వరూపుడవని గురువు ఉపదేశించుటయు నేను బ్రహ్మ స్వరూపుడనని శిష్యుడు తెలిసికొనుటయే యీ మహావాక్యముల తాత్పర్యము. వాని సంపూర్ణార్థమును సమాధిలోగాని అపరోక్షముగా నెఱుగజాలము. అయితే సాధారణ మనుష్యున కుపదేశించిన విపరీతభావన గలుగవచ్చును. "నేను బ్రహ్మను, నేనేమి తప్పుచేసినను బాధలేదు. నా యిష్టమువచ్చినట్లు ప్రవర్తించెదను. నే నెట్టి యపకార మొనర్చినను ఆత్మకర్తకాదు. కావున నాకాదోషము లేదు. నేను మహావాక్యముల బఠించితిని. బ్రహ్మనైతిని. శ్రేష్ఠుడ నైతిని" అని యిట్లు మహావాక్యములకు విపరీతఫలము నారోపించు వాడు వాని తాత్పర్యమును లేశమైనను దెలిసికొనినవాడుకాడు. నేను బ్రహ్మస్వరూపుడనని యనుకొనినందుకు బ్రయోజనమేమన:—

నిర్దోషం హి సమం బ్రహ్మ ॥ (భ. గీ. 5–19)
సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ ॥ (తై. ఉ.)

ఆనందో బ్రహ్మ ॥ (తై. ఉ.)

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ॥
(భ. గీ. 9–29)

సుహృదం సర్వభూతానాం ॥ (భ. గీ. 5–29)

పై వాక్యములవలన సర్వభూతహితత్వము, సమత్వము, సత్యము, జ్ఞానము, నిర్దోషము, ఆనందము, ఇట్టి స్వభావములుగల బ్రహ్మను నేను అని యనుకొనినందుకు అట్టి గుణములను అభ్యసించి మనము సంపాదించవలెను. వాక్కు, క్రియ, సంకల్పము, సర్వము నిర్దోషముగ నుండవలెను. భగవచ్చింత, నామసంకీర్తనము, భగవత్సంకల్పాను ప్రవర్తనము, భగవంతుని బిడ్డలగు భూతముల సేవ అనగా లోకోపకార కర్మ, వీనియందే పరమప్రీతి యుండవలెను. అహంబ్రహ్మాస్మి అని స్మరించినందుకు లోకసంగ్రహార్థము భగవంతునివలె గర్మ చేయవలెను.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥
(భ. గీ. 3–22)

అర్జునా, నాకు మూడు లోకములలో జేయవలసిన దేమియులేదు. పొందనిది పొందవలసిన దేమియులేదు. అయినను (లోకసంగ్రహార్థము) నేను గర్మచేయుచునే యున్నాను.

నేను నీచుడను హీనుడనని తలచగూడదు. బ్రహ్మశక్తులు నాయందు బీజరూపముగనున్నవి. ఉపాధిమాలిన్యమువలన నా శక్తులు వ్యక్తముకాకయున్నవి. ఆత్మశక్తులు చక్కగా బ్రకాశించునట్లు నా యుపాధిని నేను బరిశుద్ధము చేసికొనియెదను. నేను భగవత్స్వ

రూపుడను గావున నా దేహము దేవాలయమువలె బవిత్రముగ నుండునట్లు చేసెదను. ఒక దేవాలయమును గట్టిన నందు భగవత్కళ వసించి యాప్రదేశమును సమీపించువారి నెట్లు పవిత్రులుగ జేయునో అట్లే నేను బవిత్రుడనై సదాభగవంతునియొక్కయు భాగవతులైన మహర్షులయొక్కయు అనుగ్రహ తేజస్సు నాయందు సదా వసించునట్లు చేసికొని, నేను స్పృశించు ప్రతిపదార్థము, నేనుజూచు ప్రతి వస్తువు, నాతో సంభాషించు ప్రతిమనుజుడు, నా ద్వారా వెలువడు భగవత్ప్రసాదమును బొంది విగతకల్మషుడై భగవత్కైంకర్యము చేయుచు లోకోపకారమును జేయును గాత అని యనుకొనుచు, అట్టి స్థితిని జెందుటకై దృఢప్రయత్నము చేసెదను అని తీర్మానించిననే 'సోఽహం' మొదలగు మహావాక్యముల బఠించినందుకు సాఫల్యము గల్గును. నావలన నెద్దియుగాదు, నే నేమి చేయగలను అని యనుకొనుచుండువాడు త్రికాలాతీతుడైన ఆత్మ సాక్షాత్కరించినవాడు కానేరడు. అహంబ్రహ్మాస్మి అని సదా స్మరించువాడు ప్రతిక్షణమందుజేయు ప్రతికార్యమును బవిత్రముగ జేయును. వా డాభావముతో వ్రాసినలేఖను జూచి చదువుకొనువానికి తత్కాలమునకైనను నీచభావనలుపోయి యుత్తమ విషయములు స్మరణమునకు వచ్చును. 'అహంబ్రహ్మాస్మి' అని సదా చింతించువాడెట్టి సంఘములో జేరినను నాసంఘమున కంతయు బ్రహ్మ తేజస్సు వ్యాపింపజేసి సంఘము వారందఱకు సద్భావన లుద్భవిల్లజేయును. ఇట్లు సదా యీశ్వర తేజస్సు లోకమునకు వ్యాపింపజేయు వాడగును. ఇంతకన్న గొప్పకార్యము లేదు. ఈ యర్థమునే "పరమగురుచరణసన్నిధి" యందచ్చటచ్చట బోధించబడియున్నది.

1. భగవంతునితో నైక్యము జెందగోరుము. ఏలయన, ఆయన కృపారసము సరివారలకు ప్రవహించు కాలువగా నుండగల్గుదువు.

2. ఈశ్వరుడు ప్రేమస్వరూపుడు. కావున నాయనతో నైక్యముజెందవలెనన నీవు సయితము సంపూర్ణ స్వార్థరాహిత్యముతోను, ప్రేమతోను, నిండియుండవలెను. ఆయనకు సహకారివై ఆయనవలె (లోకసంగ్రహార్థము) బనిచేయవలెను.

3. మోక్షమార్గమం దుండువాడు (బ్రహ్మానుసంధానము చేయువాడు) భగవంతుని చేతిలోని పేనావంటివాడు. ఆ పేనాగుండా ఆయన సంకల్పము ప్రవహించగలదు. మఱియు నట్టివాడు తన హృదయమున నిండియుండు భగవద్భక్తిని (అనగా పరమప్రేమను) ప్రపంచమునకంతయు బ్రకాశింపచేయు నగ్నిజ్వాల వంటివాడు.

4. (నీవు ఆత్మానుసంధాన పరుడవు కావున) నీ సహోదరుని యందు (నిదురించుచుండు) బ్రహ్మత్వమును ప్రబుద్ధమగునట్లు చేయ నేర్చికొనుము. వానిని తనయందలి బ్రహ్మత్వమును స్మరించుకొనునట్లు చేయుము. అట్లు చేసినచో వానిని దోషమునుండి మఱలించినవాడవగుదువు.

5. (బ్రహ్మస్వరూపుడవని స్మరించు నీవు) పరమగురువు దేనిని జేయడో, వచించడో, సంకల్పించడో, దానిని జేయకుము, వచించకుము, సంకల్పించకుము (అనగా) ఈశ్వరస్వరూపుడగు పరమగురువువలె సత్యవాక్కు సత్యసంకల్పము లోకోపకారచింతయు గలవాడవు కావలెను.

6. స్వార్థరహిత పరోపకార కర్మయంతయు భగవత్కార్మమే కావున భగవదర్పణముగ నీవు కర్మజేయుము.

7. వారియొక్క సన్నిధానమందు వారివలె నుండవలెనను కోరిక తక్క ఇతరములగు కోరికలన్నియు నశించును.

గొప్పతటాకమునందలి జలము విస్తారమైన ప్రదేశమునకు బారి సస్యములను ఫలింపజేసి సమస్త భూతముల కాహారమొసగవలెనన్న నా జలమును భూములకు జేర్చు కాలువలుండినగాని ఉపయోగము లేదు గదా. కాలువచేయుపని ఏమన, తటాకోదకమును భూముల జేర్చి లోకసంరక్షణము జేయుటయే. అట్లే భగవంతుని కృపారస సముద్రమునుండి లోకుల కా రసమును బ్రవహింపజేయు కాలువగా బ్రహ్మానుసంధానము చేయు భక్తుడుండవలెను.

ఇట్లు నిత్యత్వబుద్ధి నాశ్రయించు వా డధోగతిని జెందించు కామ క్రోధాదులు, మొదలగు దేహేంద్రియ వికారములకు లోబడక, ఇత రుల యందలి కామక్రోధాదులు వారి యుపాధుల వికారములని తలచి, వానిని మనస్సుననుంచక, ప్రతీకార బుద్ధిని నిగ్రహించి, తనయొక్క నిజస్వరూపమైన బ్రహ్మత్వమును స్మరించుచు, దనయుపాధిని బరి శుద్ధి చేసికొనుచు, బ్రహ్మత్వ తేజస్సును, నిండించుకొనుచు, చెలమ లోని పరిశుద్ధగంగ ఉపయోగించక నిల్చినట్టయిన ఎట్లు అపరిశుద్ధ మగునో, ఉపయోగించుచుండగా మిగిలినది మహాపరిశుద్ధముగ ఎట్లుం డునో అట్లే తనయందు నిండించుకున్న బ్రహ్మతేజస్సును లోకమున కంతయు వెదజల్లుచు, లోకులను బునీతులుగాజేయుచు, లోకోప కార కర్మచేయుచు, ఈశ్వర సంకల్పమునకు దోట్పాటై, ఈశ్వర కర్మజేయుచుండును.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః ।
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాండవ ॥ (11-55)

ఇట్టి బుద్ధి నాశ్రయించవలెనుకాని దేహధర్మములైన జరామరణాదు లను స్మరించి భీతిచే గ్రుంగి సత్కర్మచేయక పరులదోషములనే గ్రహించుచు స్వార్థపరత్వచింత చేయువాడవు కావలదని గురువుల బోధయొక్క ముఖ్యతాత్పర్యము.

కామమను రాకాసి మొలక నిత్యత్వచింతగల ప్రదేశములో బుష్పించజాలదని చెప్పబడియున్నది. ఏ మొలకయైనను ఎరువువేసి నీరుపోసి పెంచినగదా వృద్ధిబొంది పుష్పించి ఫలించును. దానిని బోషింపక వదలిన నది తనంతటనే నశించును. మనయందలి దోషము లను గనిపెట్టి వాని కవకాశమియ్యక యుండినయెడల అవి నశించును. ఏ విషయమును ధ్యానించిన దదనుగుణమైన యణువులు మనశరీర మందు జేరును. ఆ గుణము మఱియు నెక్కుడుగ వృద్ధియగును. తద్విపరీతమైన గుణము వ్యక్తమగునట్లు చేయు నణువులు వెడలిపోవు ను. ఆ గుణము క్రమక్రమముగ జీవుని ధ్యానబలములేక కృశించి నశించును. తన్ను నితరులను జెరుచు కామమను మొలక నిత్యత్వబుద్ధి నాశ్రయించిన వాని యంతఃకరణమందు పెరుగుట కవకాశము లేమిచే క్షీణించి నశించునుగాని పుష్పించి ఫలించనేరదు. మఱియు నాదోషము నిత్యత్వగాలిసోకిన మాత్రముననే నశించునని చెప్పబడి యున్నది. ఇది నిశ్చయమని నమ్మవలెను.

హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపిస్మృతః ।
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః ॥
జ్ఞానతోఽజ్ఞానతోవాపి వాసుదేవస్య కీర్తనాత్ ।
తత్సర్వం విలయం యాతి తోయస్థలవణం యథా ॥

శమాయాలంజలంవహ్నే స్తమసోభాస్కరోదయః ।
శాంతిః కలేరఘౌఘస్య నామసంకీర్తనం హరేః ॥

సర్వదాసర్వకార్యేషు నాస్తితేషామమంగళం ।
యేషాం హృదిస్థో భగవాన్ మంగళాయతనం హరిః ॥

సకృత్స్మృతోఽపి గోవిందో నృణాం జన్మశతైః కృతం ।
పాపరాశిం దహత్యాశు తూలరాశి మివానలః ॥

దుష్టచిత్తులైనను హరిని స్మరించినయెడల వారు (హరి) పాపములను హరింతురు. అబుద్ధిపూర్వకముగా స్పృశించినను అగ్ని కాల్చును గదా!

బుద్ధిపూర్వకముగనో అబుద్ధిపూర్వకముగనో వాసుదేవుని గీర్తించినయెడల నీటిలోనుంచిన లవణమెట్లు అదృశ్యమగునో అట్లు సర్వపాపములు నశించును.

అగ్నిని శమింపజేయుటకు జలము, చీకటిని బోగొట్టుటకు సూర్యోదయము ఎట్లు సమర్థములో, కలియుగములో పాపరాశిని శమింపజేయుటకు హరిసంకీర్తనము సమర్థము.

ఎవ్వరి హృదయమునందు మంగళమున కునికిపట్టయిన హరి యుండునో వారికి సర్వకాలములయందు సర్వకార్యములు చేయుటయందు అశుభము లుండనే యుండవు.

దూదిరాశిని అగ్నిహోత్రుడు దహించునట్లు సకృత్తుగా స్మరించబడినను గోవిందుడు మనుష్యులయొక్క పాపరాశిని నూర్లకొలది జన్మములలో జేసినదైనను దహించును.

నిత్యుడును సర్వపాపరహితుడును సర్వభూతహితుడును సర్వశుభాశ్రయుండునగు భగవంతుని స్మరించుచుండువానికి పాపనాశము

కలుగునని చెప్పనేల? మనము పాపములు చేయుచునే యుందుము. అయినను వెంటనే తప్పును మనస్సుకు దెచ్చుకొని పాపచింతచేత నపరిశుద్ధమైన చిత్తము శుద్ధమగుటకును నా చింతచేత నితరులకు గలిగిన యపకారము నివృత్తియగునట్లును, భగవంతుని స్మరించవలెను.

తం త్వా భగ ప్రవిశాని స్వాహా స మా భగ ప్రవిశ స్వాహా ।
తస్మిన్ సహస్రశాఖే నిభగాహం త్వయి మృజే స్వాహా ॥
(తై. ఉప.)

ఓ భగవంతుడా! నేను నీలో ప్రవేశింతును గాక. (అనగా నీ సేవ చేసి పాపవినిర్ముక్తుడ నగుదును గాక—నన్ను ప్రేమచే గరుణింతువు గాక) ఓ భగవంతుడా! సహస్రశాఖలుగల (నదివంటి) నీయందు నేను (సర్వపాపములను) గడుగుకొందును గాక.

స్థూలశరీరమున కీషన్మాత్రము మురికి సోకినను తత్క్షణమే ప్రక్షాళనముచేసి మురికిని దొలగించుకొనునట్లు పాపసంస్పర్శమైన చిత్తమును తత్క్షణమే భగవచ్చింతయను నదీతోయముతో ప్రక్షాళనము చేసి పరిశుద్ధము చేయవలెను.

నాల్గవదియగు వ్యాఖ్యాన సూత్రములోని రెండవభాగము కొంత వరకు విమర్శింపబడెను. ఇప్పుడు మొదటిభాగమును విచారింతము. ఈ ప్రథమ భాగములోని మూడు వాక్యములను క్రమముగ మొదటి మూడుప్రాచీన సూత్రములతోజేర్చి చదువవలెను. (1) ఔన్నత్య ఆశను జంపివేయుము. (అయినను) ఔన్నత్యమును గోరువారు పనిచేయునట్లే పనిచేయుము. (2) ప్రాణేచ్ఛను జంపివేయుము. (అయినను) ప్రాణేచ్ఛగలవారివలెనే ప్రాణులను గౌరవించుము. (3)సుఖేచ్ఛను

జంపివేయుము. (అయినను) సుఖనిమిత్తము జీవించువానివలెనే సుఖముగనుండుము. ఈ వ్యాఖ్యాన సూత్రమువలన ప్రాచీన సూత్రముల లోని "చంపివేయుము" అను పదమునకు విశేషార్థమున్నదని తెలియ వచ్చుచున్నది. ఈ మూడు ప్రాచీనసూత్రములు మనోమయకోశ లక్షణములను ముఖ్యముగ చెలుపుచున్నవి. అందు మొదటిది యీ కోశముయొక్క ముఖ్యస్వభావమును (ఆశ లేక కామము) చెల్పు చున్నది. రెండవసూత్ర మాస్వభావము రజోగుణ ప్రధానమైనప్పటి స్థితిని చెల్పుచున్నది. మూడవది సత్వగుణ ప్రధానమగునప్పటి స్థితిని చెల్పుచున్నది. రెండవ సూత్రములో జెప్పబడిన ప్రాణేచ్ఛయనునది అన్నమయ ప్రాణమయ మనోమయ కోశములయొక్క (అనగా ఇంద్రియములు మనస్సుయొక్క) సంపూర్ణ ప్రవృత్తిని చెల్పుచున్నది. అది రజోగుణ లక్షణము. మూడవ సూత్రములోని సుఖేచ్ఛయను నది యీ శరీరములయొక్క సత్వగుణ లక్షణము. "సత్వం సుఖే సంజయతి" (గీత. 14—19)

ఈ మూడు సూత్రములలో "చంపివేయుము" అను పదమునకు గుణసంగమును "జంపివేయుము" అనియే యర్థము. కర్మసంగ లక్షణమగు రజోగుణమును సుఖసంగ లక్షణమగు సత్వగుణము నతి క్రమించవలెను. రెంటియందును సంగదోషమున్నది. ప్రతికార్యము నందును బంధకారియగు నసురస్వభావమును మోక్షకారియగు దైవీ స్వభావము నుండును.

దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా । (భ. గీ. 16-5)

"చంపివేయుము" అనగా బంధకారియగు నసురస్వభావమును జంపవలెనని తాత్పర్యము. అనగా ఇంద్రియములు మనస్సు విధేయ

ములుగ నుండవలెను. వాని స్వవిజృంభణము చచ్చిపోవలెను. మనకు దోషముగ గన్పడుదానియందు గుణముండును. గుణముగ గన్పడు దానియందు దోషముండును.

సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥
(భ. గీ. 18-48)

ఈ గుణదోషము లనునవి దేహధర్మదృష్టిచే గన్పడునవి. దేశ, కాల, అధికారభేదమునుబట్టి మాఱునవి. అనగా ఒక దేశములో ఒక కాలములో గుణముగ దోచెడిది మఱియొక దేశములోను మఱియొక కాలములోను దోషముగ గన్పడును. మఱియు నొక మెట్టున నుండువానికి గుణముగనుండునది పై మెట్టుననుండువానికి వర్జనీయమగు దోషముగనుండు. మూలధర్మమునకు గుణములేదు, దోషము లేదు. అది యధోలోకములలో నాయాలోక సంబంధమగు శరీరములలో ప్రతిబింబరూపమున ప్రవృత్తికి వచ్చినప్పుడు పైన చెప్పిన రీతిన దేశ, కాల, అధికారి భేదమున గుణదోషములుగ బరిణమించును. మూలధర్మమును జంపివేయమని ప్రాచీనసూత్రముల తాత్పర్యము కాదు. దానిని జంపివేయ సాధ్యముకూడ కాదు. అధోగతిని జెందించునట్టియు, సంగదోషముచే బంధస్వభావము గలదియు నగు మూలధర్మముయొక్క ప్రతిబింబ స్వరూపములగు గుణదోషములను జంపివేయవలెను. అనగా, అసురగుణములను దైవీగుణములుగా మార్చవలెను. కనుక "చంపివేయుము" అను పదము "మార్చివేయుము" అను నర్థముతో బ్రయోగించబడినది. రసవాద శాస్త్రప్రకార మొక లోహమును మఱియొక యుత్తమమైన లోహ

ముగ మార్చునట్లు మూలధర్మము నరకద్వారములైన కామక్రోధ లోభ సంస్పర్శచే దోషసంయుక్తముకాగా ఆ దోషమును దానివ్యతిరేక సద్గుణముచే దొలగించి మఱల స్వయంప్రకాశమగు మూలధర్మముగా మార్పవలెను. ఉదాహరణము :—ప్రేమ—అపారభూతదయ యనునది మూలధర్మము. అది ప్రతిబింబమై స్వలాభాపేక్ష, స్వజనపక్షపాతముగ మనోమయకోశమందు ప్రవృత్తికివచ్చును. దానిని భూతదయగా మార్చవలెను. ప్రేమించుట అను మూలధర్మమును నాశనము చేయగూడదు. కోశములోబుట్టు స్వేచ్ఛాప్రవర్తనరూపమగు సంకల్పమును బోగొట్టి యాత్మప్రేరిత సంకల్పమును సంకల్పించునట్లును, కోరికలను గోరునట్లును, చేయవలెను. దీనినధ్యాత్మరసవాదశాస్త్ర (Spiritual Alchemy) మని చెప్పవచ్చును. ఇట్లు మూలధర్మముయొక్క ప్రతిబింబములును, ప్రకృతి గుణసంస్పర్శచే స్వప్రయోజనపరత్వ లక్షణములు నగు దోషములను జంపివేయవలెను గాని లోకసంగ్రహార్థము సర్వభూతహితార్థము భగవదారాధనరూపమగు కార్యమునందు ప్రవర్తించవలెనని సంకల్పించుట వర్జనీయమైన కామము కాదు. గుణాతీతుడు కావలెననియే సూత్రములు బోధించుచున్నవి. అయితే దేహధర్మములైన ఇచ్ఛాద్వేషములను వదలవలెనని యజ్ఞులకు బోధించినయెడల విపరీతఫలము కలుగును. అటువంటి వారి కిట్టివిషయములను బోధించగూడదు. జ్ఞానవంతులకు సయితే మీ విషయములో విపరీతజ్ఞాన ముద్భవించవచ్చును. స్వలాభార్థమగు నాశను వదలుమని చెప్పిన రజోగుణమణగి తమోగుణము ప్రవృద్ధమై పనిచేయక స్తబ్ధత్వము ప్రాప్తించవచ్చును. ప్రాణేచ్ఛను వదలమని చెప్పిన నతిసాహసుడై ప్రాణమునం దభిమానము లేనివాడై ప్రా

ణముపోయిన నేమియని స్వహత్యచేసికొనవచ్చును. ఇతరుల ప్రాణములను దీసినను దీయవచ్చును. సుఖమునందు వాంఛకూడదని చెప్పిన శరీరపోషణయందు విముఖత్వమును వహించి శరీరమును గష్టపెట్టుచు గృశింపజేయువాడు కావచ్చును. ఇట్లుచేయు జ్ఞానరహిత సంన్యాసులు పెక్కండ్రు గలరు. దేహమును సుఖముగనుంచగూడదనియు, దానిని గష్టపెట్టినగాని యోగసిద్ధికాదనియు, వారు తలచి శరీరమును ఘోరమైన కష్టముల పాలుచేయుదురు. ఇవి యన్నియు దురభిప్రాయములు, గీతాశాస్త్ర విరుద్ధప్రవర్తనలు. ఆ దురభిప్రాయములను నివారించుటయే వ్యాఖ్యానసూత్రముయొక్క ముఖ్యోద్దేశ్యము.

గీతాశాస్త్రప్రకారము సర్వోత్కృష్టమైన క్షరాక్షరాతీత పురుషోత్తమస్థానప్రాప్తికి బ్రయత్నించవలెను. బ్రహ్మాదిలోకము లన్నియు బునరావర్తికలవియే. పురుషోత్తమ స్థానము శాశ్వత పునరావర్తి రహితపదము.

యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥
(భ. గీ. 15–6)

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥
ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥
(భ. గీ. 15–16,17)

భూతములు (becomings) క్షరము, ప్రత్యగాత్మ (root spirit) అక్షరము. క్షరాక్షరములకంటె విలక్షణుడు పురుషోత్తముడు.

దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యంతరో హ్యజః ।
అప్రాణో హ్యమనాః శుభ్రో హ్యక్షరాత్ పరతః పరః ॥
(ముం. ఉప.)

కార్యకారణములకంటె, అనగా అచిత్తు (matter) చిత్తులకంటె (life or spirit) పరుడు పరమాత్మయనియెడి పురుషోత్తముడు. గీతాశాస్త్రములో నీ పురుషోత్తమ ప్రాప్త్యుపాయములు చెప్పబడి యున్నవి.

అందుకు సామాన్యసాధనములైన వివేక వైరాగ్య శమ దమాదులే కాక అత్యంత భక్తియు నుండవలెను.

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥
(భ. గీ. 11-54)

భగవంతుడు సకలలోకముల యుత్పత్తి స్థితిలయములకు గర్తయనియు,

అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా ॥ (7-6)

ఆయనకన్న నెక్కుడెద్దియు లేదనియు,

మత్తః పరతరం నాన్యత్కించిదస్తి . . . . । (భ. గీ. 7-7)

పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః ॥
(కఠ. ఉప.)

సర్వభూతములయం దంతర్యామియై వ్యాపించి యున్నాడనియు,

మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా । (భ.గీ. 9-4)

ఆయనలేని పదార్థమెుండును లేదనియు,

న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరం ॥

(భ. గీ 10-39)

మనముచేయు సర్వకార్యము లా భగవంతుని యధీనములనియు, మన సంపదలు ఐశ్వర్యము లాయన విభూతులే యనియు,

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవం ॥

(భ. గీ. 10-41)

మన పాపములను దొలగించి మోక్షమిచ్చువా డాయనయే యనియు,

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥

(భ. గీ. 18-66)

మఱియు నాయన ప్రసాదమున నేగాని మనకుత్తమప్రాప్తి కలుగ నేరదనియు,

మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయం ।

(భ. గీ. 18-56)

దృఢముగ నమ్మవలెను.

ఇట్లు తలచి యూరక యుండ గూడదు. అట్లుండిన భగవంతుని యనుగ్రహము కలుగ నేరదు. మనతండ్రి గొప్పవాడని మన మనుకొన్నంత మాత్రమున నేమి యుపయోగము? తండ్రిచేయు పనికి దోడ్పాటై మనముచేసినగదా తండ్రి ప్రీతిజెందును. అట్లే ఈశ్వర ప్రసాదము కలుగవలెనన ఈశ్వరకర్మ (అనగా లోకోపకారకర్మ) చేయవలెను. అట్లుచేసిన నీశ్వరప్రసాదము నిక్కముగ గల్గి వారిని

జెందగలము. పురుషోత్తముడైన తన్ను జెందుమార్గమును గీతాశాస్త్ర మందిట్లు చెప్పినారు.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః ।
నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి పాండవ ॥

(భ. గీ. 11-55)

ఇది గీతాశాస్త్రముయొక్క సారాంశమును దెలిపెడి శ్లోకమని శ్రీ శంకరాచార్యులవారు సెలవిచ్చిరి. ఈశ్వరార్పణముగ గర్మము జేయుచు, ఈశ్వరుడే పరమగతియని తలచుచు, సర్వప్రకారముల నీశ్వరుని భజించుచు, దార పుత్ర ధన కనక వస్తు వాహనాదులయందు సంగము వదలినవాడై, ఏ భూతమునందును వైరములేనివాడు నన్ను జెందును.

ఈ యుత్తమ పురుషస్థానమును బొంద ననేక మార్గములుండ వచ్చును. అయితే ఈ యుగమున మనకేమార్గము భగవంతునిచే గీతా శాస్త్రమందు విధించబడి యున్నదో దానినే మన మనుష్ఠించవలెను. అది యెద్దియన భక్తిపూర్వక జ్ఞానసహిత సంగఫలాభిసంధిరహిత ఈశ్వరార్పిత భూతసేవా కర్మాచరణమార్గము. ఇది ముఖ్యమైన విష యము కావున గీతాశాస్త్రమందెన్నిచోట్ల జెప్పబడియున్నదో విచా రించి చూడదగు. ముఖ్యశ్లోకములు మాత్ర మీక్రింద గన్పర్చబడును.

1. కర్మణ్యేవాధికారస్తే (నీకు కర్మయందే యధికారము.) (2-47)

2. మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥ (3-30)

సర్వకర్మలను నాయందు సంన్యసించి యాత్మయందుంచిన మనస్సు గలవాడవై యాశలను మమకారమును వదలి సంతాపము లేనివాడవై యుద్ధము (కర్మము) చేయుము.

3. సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ । (8-7)

సర్వకాలములయందు నన్ను స్మరించుము. యుద్ధముగూడ జేయుము.

4. . . . . అసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్కర్మ పరమాప్నోతి పూరుషః ॥ (3-19)

సంగము లేనివాడవై యెల్లప్పుడు చేయవలసిన కర్మను బాగుగజేయుము. అట్లు కర్మచేసిన పురుషుడు పరమపదమును బొందును.

5. తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర ॥ (3-9)

యజ్ఞార్థముగా సంగము విడిచినవాడవై కర్మను బాగుగ జేయుము.

6. సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయం ॥ (18-56)

ఎల్లప్పుడన్ని కర్మలను నన్నాశ్రయించి చేసినచో నాప్రసాదమువలన నవ్యయమును శాశ్వతమునగు పదమును బొందుదువు.

7. చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః ।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥ (18-57)

సర్వకర్మలను మనస్సుతో నాయందు సంన్యసించి నన్ను బరునిగా నెన్ని బుద్ధియోగము నాశ్రయించి సతతము నాయందు జిత్తము నుంచినవాడవు కమ్ము.

ఈ బుద్ధియోగమును భగవంతుడే భక్తులకొసంగును. వారియందు ప్రీతికల్గి, వారి యజ్ఞానమును నాశనముచేసి జ్ఞానమునిచ్చి పాపములను దొలగించి తనలో జేర్చుకొనును.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥
తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥
(10-10, 11)

యే తు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్ ॥ (12-6, 7)

ఇది చాలాముఖ్యమైన శ్లోకము. ఎవరు సర్వకర్మలను నాయందు సంన్యసించి నేనే పరమగతినని నమ్మి యనన్యయోగముచేత నన్ను ధ్యానించి యుపాసింతురో అట్టి నాయందు నిల్పిన మనస్సు గలవారలను మృత్యుసంసారసాగరమునుండి శీఘ్రముగ నే నుద్ధరించెదను.

ఇట్లీశ్వరార్పణముగ గర్మజేసినయెడల వారిప్రసాదమును బొంది వారిని జెందగలము. సంసారసాగరమునుండి నేనే తరింపఁజేసెదనని భగవంతుడు చెప్పినప్పుడు ఏమార్గము మేలు అను సంశయము కలుగనేల? సంన్యాసమార్గము సయితము నిశ్శ్రేయసకరమైనను మనకు మాత్ర మంతకన్న నీ కర్మమార్గమే శ్రేష్ఠమని స్పష్టముగ జెప్పబడియున్నది.

సంన్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ ।
తయోస్తు కర్మసంన్యాసాత్ కర్మయోగో విశిష్యతే ॥ (5-2)

మఱియు నా సంన్యాసమార్గము కష్టము.

సంన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః । (5-6)

ఈశ్వరార్పణముగా జేసిన కర్మలతో నీశ్వరుడు ప్రీతిచెంది కర్మాను ష్ఠానమందు వచ్చెడి సర్వకష్టములను విఘ్నములను బోగొట్టును.

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి । (18-58)

అయితే అనేకులకు సంన్యాసమార్గమే సులభమని తోచవచ్చును. ఏమి పనిచేయక అరణ్యములో నుండవచ్చును, ఏమికష్టముండదు, అని తలచవచ్చును. వారలు వారి దేహతత్త్వమునే నెఱింగినవారు కారని గీతాశాస్త్రము చెప్పుచున్నది. ప్రకృతి గుణములచేత సదా కర్మ జరుగుచునే యుండును. మనము పనిచేయలేదని యూరక యనుకొనుటయేకాని నిజముగ నింద్రియములు మనస్సు బుద్ధి ప్రకృతిగుణ ప్రేరితములై ఎద్దియో యొకపని చేయుచునే యుండును.

న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ (3-5)

అందువలననే ప్రకృతిసంబంధమైన యీ దేహముండునంతవఱకు బని చేయనని యనుకొనుట నిష్ప్రయోజనము. పనిచేయక తీరదు. బంధించకుండునటుల మనము చేసికొనవచ్చునేకాని కర్మను సంపూర్తిగ విడుచుట సాధ్యముకాదు.

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మఫలత్యాగీ సత్యాగీత్యభిధీయతే ॥ (18-11)

పూర్వజన్మకృత పాపము లిపుడు చేయు శుభకర్మవలనగాని నివృత్తి కానేరవు. ఎట్లుచూచినను కర్మ చేయవలసినదేకాని సంన్యసించగూడదు. కర్మచేయవలసినదేను, విడిచిపెట్టగూడదు. ఇది నాయొక్క నిశ్చయమైన యభిప్రాయమని స్వామి సెలవిచ్చియున్నారు.

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమం ॥ (18-6)

తొలుత జిత్తశుద్ధి, నైష్కర్మ్యసిద్ధి కొఱకును, సిద్ధిని బొందిన పిమ్మట లోకసంగ్రహార్థమును, గర్మ చేయుచునే యుండవలెనని భగవంతుని యభిప్రాయము.

యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే । (5-11)
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ (3-20)

కర్మబంధించుననియు సంన్యాసమే శ్రేష్ఠమనియు బహుజనులు తలచెదరు. అది సరియయిన యభిప్రాయముకాదని గీతాశాస్త్రము చెప్పుచున్నది.

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః । (3-9)

యజ్ఞార్థము—అనగా భగవదర్పణము—గ కాక యితర ప్రయోజనమునకుగాను చేసినకర్మయే బంధస్వభావము కలది.

యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ (4-23)

యజ్ఞార్థముచేసిన కర్మ సంపూర్ణముగా నశించును.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం ॥ (9-27)

శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః ।
సంన్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥ (9-28)

దేనిని జేయుచున్నావో, దేని భక్షించుచున్నావో, ఏహోమము చేయుచున్నావో, ఏదానము చేయుచున్నావో, ఏతపస్సు చేయుచున్నావో, ఆపనుల నన్నిటిని నా కర్పణముగా జేయుము. అట్లు కర్మచేసిన యెడల నాకర్మయొక్క శుభాశుభఫలరూపమగు కర్మ బంధమునుండి విడువబడిన వాడవై సంన్యాస యోగయుక్తుడవై దేహపతనానంతరము నన్ను జెందగలవు.

కర్మయందభిమానము, కర్మఫలాపేక్షయే బంధకారణములు. వానిని వదలి భగవంతుడే శరణ్యుడను జ్ఞానముతో భగవంతునియందు భక్తియుంచి కర్మలను జేయుచు నా. కర్మలను వారియందు సంన్యసించిన (అనగా వారి కర్పణముచేసిన) వారి యనుగ్రహముతో గర్మబంధ రహితులమగుటయే కాక ఉత్తమోత్తమ స్థానమైనట్టి శాశ్వతస్థానమును అనగా భగవంతుని జెందగలుగుదుము. ఈ శాశ్వతపదము కర్మలనుజేయుచు భగవంతుని శరణుజొచ్చినవారికే గీతాశాస్త్రమందు జెప్పబడియున్నది. ఇట్టి కర్మలకు ఫలము పరాశాంతి (సాధారణ శాంతికాదు), శాశ్వతపదము (పునరావర్తికి లోబడిన బ్రహ్మాదిలోకములు కాదు).

కావున ఊరక యాశలను వదలి విజనప్రదేశమునందు ధ్యానము చేయుచుండవలెనని ప్రాచీనసూత్రముల తాత్పర్యము కాదనియు, గీతాశాస్త్రమందు జెప్పజడిన రీతిన పనిచేయువలసినదే యనియు వ్యాఖ్యానసూత్రము బోధించుచున్నది. ఇకను నీ సూత్రముయొక్క మూడు వాక్యములను బ్రత్యేకముగ విమర్శించ వచ్చును.

మొదటివాక్యము:—ఔన్నత్యమునుగోరువారు పనిచేయునట్లే పనిచేయుము

అశగల వారికి లేనివారికి పనిచేయుటయందు భేదముండగూడదు. వాడెంత శ్రమపుచ్చుకొని బాగుగ బనిచేయునో వీడు సయితే మంత కు దక్కువ లేకుండ శ్రమపుచ్చుకొని అంతశ్రద్ధతో, అంతబాగుగ, ఇంకా మేలుగనే పనిచేయును. వాస్తవముగ ఎక్కువ శ్రమపుచ్చు కొనును. అయితే వీరిరువురు చేయుపనిలో భేదములేదని చెప్ప గూడదు. గీతాశాస్త్రమునం దీభేదమును రెండుశ్లోకములలో బాగుగ గన్పర్చబడియున్నది.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత ।
కుర్యాద్విద్వాం స్తథాఽసక్తః చికీర్షుర్లోకసంగ్రహం ॥
న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినాం ।
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్త స్సమాచరన్ ॥

(3-25, 26)

అవిద్వాంసులు కర్మయందు సంగముకలిగి యెట్లు పనిచేయుదురో ఆట్లే విద్వాంసుడు సంగములేనివాడై లోకసంగ్రహార్థము చేయవలెను. కర్మసంగులైన యజ్ఞులకు "నిష్కామకర్మయోగము చేయవలెను. నీవు చేయుపనికి ఫలమును గోరరాదు. ఈశ్వరార్పణముగా జేయవలె ను." అని యిట్లు వారియోగ్యతకు మించిన జ్ఞానము బోధచేసి బుద్ధి చలనము చేయగూడదు. ఫలాపేక్షతో బనిచేయువానికి ఫలమపే క్షించగూడదని చెప్పితే ఫలమపేక్షించక పనిచేయ లేనివాడైనందున వాడేమియుపనిచేయక మిన్నక నిల్చిపోవును. అందువలన వానికిని

మఱియు నితరులకును గీడుకలుగును. ఇట్లు ఉభయభ్రష్టునిగా వానిని జేయగూడదు. మఱి విద్వాంసుడెట్లు వర్తించవలెనన, అవిద్వాంసుడు చేయునట్టి సమస్తకర్మలను తాను యుక్తుడై బాగుగజేయుచు అవిద్వాంసుడు సయితము తనవలె బాగుగ జేయుటయందు ఉత్సాహము గలుగునట్లు చేయవలెను.

ఇచ్చట ఆశగలవానికి ఆశలేనివానికి భేదము విద్వాంసునికి అవిద్వాంసునికి గల భేదమని తెలియవచ్చుచున్నది. "పరమగురుచరణ సన్నిధి" లో మనుష్యులు తెలిసినవారని తెలియనివారని రెండు తెఱగుల వారనియు ఈశ్వర సంకల్పము నెఱిగిన వారే తెలిసిన వారనియు జెప్పబడియున్నది. ఈ రెండు తెఱగుల వారినే గీతాశాస్త్రమందు విద్వాంసులు అవిద్వాంసులు అని విభజించియున్నారు. వారిరువురికి గల తారతమ్య మిట్లుండును.

(౧) అవిద్వాంసుడు: ఈశ్వరసంకల్పము నెఱుంగనివాడు.

అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే

అయుక్తుడు — అవిద్వాంసుడు — కామప్రేరితుడై — ఫలమునందాసక్తికలిగి, బద్ధుడగును

ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే

మందుడు—అవిద్వాంసుడు, తన యోగక్షేమముకొఱకే యత్నించుచు, ప్రియమునుకోరును.

(౨) విద్వాంసుడు:—ఈశ్వరసంకల్పము నెఱింగినవాడు.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీం ॥

యుక్తుడు—విద్వాంసుడు—కర్మఫలమును కోరకయే లోకసం గ్రహ కర్మచేయుచు, శాంతిని బొందును.

వీరిద్దఱికి భేదము యుక్తత్వ అయుక్తత్వములో నున్నదని స్పష్టమగు చున్నది. యుక్తుడన గూడుకొన్నవాడు. యుక్తత్వమన బరాపరముల (higher and lower) కూడిక. క్రిందియుపాధిని జయించి పైయుపాధిలో జేర్చిన నది యుక్తత్వమే. మనోమయకోశమును జయించి విజ్ఞానమయకోశ వశపర్చిన నది యుక్తత్వముయొక్క మొదటిమెట్టు. విజ్ఞానానందమయకోశముల నతిక్రమించునపుడు యుక్తత్వము మఱియు నెక్కుడు మెట్టుల కన్వయించును. ఇట్లు జీవాత్మ ఉపాధులను నిగ్రహించుకొను శక్తి హెచ్చగు కొలదియు, యుక్తత్వము భిన్నదశల కన్వయించుచు వచ్చును. ఈ దశల వివరము 18 వ సూత్రవ్యాఖ్యానములో విచారించబడియున్నది. అవిద్వాంసుని మనస్సు కామప్రేరితమై స్వేచ్ఛానుసారము విషయములనుగూర్చి బోవుచుండును. విద్వాంసుని మనస్సు జ్ఞానాత్మకు లోబడి వర్తించును. అనగా ప్రతిమెట్టునందును బైమెట్టునందు దృష్టినుంచియుండును. క్రమక్రమముగ నీశ్వరుని వైపు మనస్సును ద్రిప్పిన (ఆవృత్తచక్షురమృతత్వమిచ్ఛన్ – కఠ. ఉప.) విషయవిముఖతను జెంది భగవత్కైంకర్యముగ బ్రతిపనిని జేయుచుండును. ఈశ్వరసంకల్పము నెఱిగినవాడగును. ఈశ్వరసంకల్పానుప్రవర్తనము కలుగును. ఇదియే యుక్తత్వము (Harmony with the will of Iswara). యుక్తుడెట్టివాడైనది గీతాశాస్త్రమందు జెప్పబడియున్నది.

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ॥ (5–23)

యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।
నిస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥

(6-18)

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః ॥ (6-8)

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్ ।

(5-12)

శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥ (2-53)

వివేకముచే మోహమును బోగొట్టుకొని, దృష్టాదృష్టఫలములయందు వైరాగ్యము కలిగి, ఇంద్రియములను జయించి, సర్వకామములను వదలి, మనస్సు విషయములనుగూర్చి పోకుండునటుల దానిని బాగుగ నియమించి, త్రైగుణ్య విషయములను గూర్చి బోధించు వేదముల లోని బహువిరుద్ధార్థములుగల వాక్యములచే గలవరము చెంది నిశ్చయార్థము తెలిసికొనలేక సంశయమును జెందిన బుద్ధిని ఈశ్వరసంకల్పానుప్రవర్తనము వినా వేఱొండు సంకల్పమును లేనిదానిగాజేసి,

వ్యవసాయాత్మికాబుద్ధి రేకేహ కురునందన । (2-41)

నిశ్చలతనుజెంది సమాధియోగమునందు నిలిపి, ఆత్మసాక్షాత్కారము జేసికొనినవాడే యుక్తుడు, వాడే యోగి. అట్లు మనస్సును నిర్మలముగ జేసి యాత్మస్వరూపమును దెలిసికొనినవాడే ఈశ్వర సంకల్పము నెఱుగగలడు. సర్వకర్మల కీశ్వరుడు ప్రభువు కర్తయనియు,

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే । (10-8)

బనిచేయునది ప్రకృతియనియు, దా నీశ్వరునిచేతిలోని కొరముట్టు వంటివాడనియు, ఈశ్వరసంకల్ప మెటులనైనను నెఱవేరుననియు, దానికి దోట్పాటై తదనుకూలముగ వర్తించుటయే ధర్మమనియు, అహంకారముచే బ్రేరితమై దానికి భిన్నముగ వర్తించిన గీడే ఫలమనియు,.

అథచేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥

(భ. గీ. 18-58)

ఈశ్వరసంకల్ప మెద్దియన సర్వజనులు పాపరహితులై తన్ను జెందు దురుగాత యనియు, (evolution) అట్లు వారు జ్ఞానమును బొంది పాపమును బోగొట్టుకొని ఈశ్వరుని జెందుటకు సహాయముచేయుట యే ఈశ్వరసేవయనియు, తత్సంకల్పానుప్రవర్తనమనియు, దెలిసి కొని ప్రపంచవిషయము లెంతలాభకరములైనను తుచ్ఛమని తలచి (సమలోష్టాశ్మకాంచనః) ఈశ్వరుడెట్లు స్వలాభాపేక్ష లేక సాధు సంరక్షణ దుష్టనిగ్రహ ధర్మసంస్థాపనములద్వారా లోకహితార్థము పనిచేయుచున్నాడో తాను నట్లు లోకసంగ్రహార్థము పనిచేయును. సంగ్రహమనగా చేర్చిపట్టుకొనుట. ధర్మమే జనులందఱను వారివారి స్థానములయందు నిల్పగలిగినది. ఆ ఈశ్వర ధర్మము నెఱిగిన యుక్తుడు లోకసంగ్రహ కర్మచేయక మిన్నకయుండడు. "పని చేయుచుండునపుడు ఈశ్వరధ్యానము లేకపోవునే, పనిచేయకుండా ధ్యానముమాత్రము చేయుటబాగు" అని తలచడు. "సర్వేషు కా లేషు మామనుస్మర—యుధ్యచ" అను వాక్య మసంగతమని తలచ డు. "సర్వథా వర్తమానోపి సయోగీ మయి వర్తతే" అను వాక్య

మును విశ్వసించును. ఏ పనిచేయుచున్నను ఆ పని తనదికాదు (నైవ కించిత్కరోమి), ఈశ్వరునిది అని భగవంతునియందే మనస్సునుంచుట వలన గర్మచేయుచుండినను భగవంతుని భజించినవాడే యగును. పని చేయుటయందు వీనికి సయితము హేతు (motive) వున్నది. అవిద్వాంసునికి గర్మఫలము హేతువు. వీనికి లోకసంగ్రహము, ఈశ్వరప్రీతి, ఈశ్వరసేవ హేతువులు. ఇట్లీశ్వరసంకల్పము నెఱిగినవాడే కర్మాకర్మలయొక్క యథార్థస్వభావమును దెలిసినవాడు. కర్మయందు బంధగుణములేదు. అకర్మయందు మోక్షగుణము లేదు.

న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।

(భ. గీ. 3-4)

బంధము కాకుండునటుల సర్వకర్మలను జేయవచ్చును. పనిచేయునది శరీరము, పని భగవంతునిది, అని కర్తృత్వాభిమానములేక కర్మ నీశ్వరునియందు సంన్యసించిన నది యాత్మాపేక్షయా అకర్మయే. దేహము ప్రకృతిగుణములచే సర్వదా పని చేయుచుండును. కావున తాను బనిచేయలేదని యనుకొన్నను దేహతాదాత్మ్యము కర్తృత్వాభిమాన ముండునంతవఱకు నా పని తానుజేసినట్టే అనగా అకర్మ కర్మయే యగును. ఇట్లు కర్మాకర్మల నిజస్వభావమును దెలిసికొనినవాడు యుక్తుడు. వా డూరకయుండడు. బంధభీతిలేనివాడు కావున సకల పనులను జేయుచునేయుండును. (సయుక్తః కృత్స్నకర్మకృత్ 4-18). ఇట్టి యోగస్థితిలోనుండి (established always in the higher self) పనిచేయువాడే బాగుగ బనిచేయువాడు. ఎందుకనగా వానికి యోగబలమున్నది (యోగః కర్మసుకౌశలం_2-50).

అట్లు కర్మచేయుమనియే భగవదాజ్ఞ (యోగస్థః కురుకర్మాణి 2-48). భగవంతునియందు మనస్సునిల్పి యాయన కర్పణముగా జేయబడిన కర్మ శుభాశుభ ఫల జనితముకానిదియై జన్మబంధము కలిగించక ఈశ్వరప్రసాదమునకు గారణమగును. ఈశ్వరప్రసాదముచే సంసారసాగరమును దరించి శాశ్వతపదము బొందగలుగుదుము.

మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయం ॥

(భ. గీ. 18-56)

ఈశ్వరస్మరణపూర్వకముగను నాయన కర్పితముగను జేయబడు కర్మ కేవల కర్తవ్యభావముతో ఫలాభిసంగ రహితముగా జేయబడు కర్మకన్న నుత్కృష్ట ఫలప్రదాయకము. ఎందువలననగా ఈశ్వర కీర్తనచే గర్మయందలి దృష్టాదృష్టదోషములు నశించుటయే కాక లోకసమష్టి కానందము కలుగజేయును. లోకపురోవృద్ధి ప్రతిబంధకములగు అసురుల యుద్యమములు వ్యర్థమగును. తత్సహకారులగు ఋషుల ప్రయత్నములకు జయము కలుగు. భగవంతు డందఱి హృదయములందుండుటవలన నెవడు స్మరించినను నందఱియందలి భగవత్తత్త్వ మెంత సుప్తముగనున్నను నిమిషమాత్రమైనను బ్రబుద్ధమగును. దాన నందఱకు మేలుకల్గును.

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః ॥

(భ. గీ. 11-36)

నీ కీర్తనచే లోకమునకంతయు హర్షము, ఆనందము కల్గును. రాక్షసులు భీతిచే బలాయను లగుదురు, సిద్ధసంఘము నమస్కరింతురు.

అశను జంపివేయవలెనని ప్రథమ సూత్రమందు విధించబడి యుండి నను పనులుమాత్రము చేయుచునే యుండవలెనని వ్యాఖ్యానసూత్ర మిట్లు బోధించుచున్నది.

కర్మచేసిన సంసారబంధము కలుగునని వెఱగందియే పెక్కండ్రు జనులు సంన్యాసాశ్రమ మవలంబించి విజన ప్రదేశములలో యోగానుష్ఠానము సేయుదురు. ఆరూఢత్వమున నేకాకియై వివిక్తసేవియై ధ్యాననిష్ఠయందుండవలెనని విధించియుండునది నిశ్చయమే. అది కొంతమట్టుకు అవశ్యకమే.

ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥ (భ. గీ. 6-10)

వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది ॥ (భ. గీ. 13-10)

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥
. . . . . నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥

(భ. గీ. 18-52, 53)

యోగారూఢదశ స్థిరపడుట కిట్టి వివిక్తదేశసేవిత్వమును ధ్యానయోగనిష్ఠయు కొంత యవశ్యకములైనను యోగసిద్ధినొందినవాడు సయితము కర్మచేయక యుండవలెనని గీతాశాస్త్రములో విధించబడి యుండలేదు. యోగసిద్ధివలన నాత్మజ్ఞాన మలవడు.

తత్ (జ్ఞానం) స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥

(భ. గీ. 4-38)

దాన నీశ్వర సంకల్ప మెట్టిదియను విషయమునందు సంశయము తొలగును.

> తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః ।
> ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత ॥
>
> (భ. గీ. 4-42)

శోకమోహములు నశించును. తన యుత్పత్తిస్థానము స్మారకమునకు వచ్చును. ఈశ్వరప్రసాదమువలన నీశ్వరసంకల్ప మిట్టిదియనియు దానికి వ్యతిరేకముగ వర్తించిన జెడుగే ఫలమనియు దదనువర్తనమే శ్రేయస్సాధనమనియు దెలిసికొని యీశ్వరసంకల్పమునకు దోట్పాటుగ గర్మజేయగల్గును.

> నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత ।
> స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥
>
> (భ. గీ. 18-78)

ఈ శ్లోకమునవలన నర్జునున కాత్మజ్ఞానప్రాప్తికాగా భగవత్ప్రసాదము వలన మోహము నశించి సంశయము తొలగి యుద్ధకర్మ జేయుటయే యప్పటి సమయమం దీశ్వర సంకల్పమని నమ్మి యుద్ధమునకు బూనుకొనెనని తెలియవచ్చుచున్నది. యోగసంసిద్ధివలన నీశ్వర సంకల్పమెఱిగినవాడే చక్కగ గర్మజేయగలుగును. కావుననే "యోగస్థః కురుకర్మాణి" (భ. గీ. 2-48) (యోగముననుండి కర్మలను జేయుము) అని విధించబడియున్నది. యోగసిద్ధికి సాధనముగా కర్మచేయవలెను.

> ఆరురుక్షోర్ముసేర్యోగం కర్మ కారణముచ్యతే । (భ.గీ. 6-3)

యోగసిద్ధియయిన పిమ్మట లోకసంగ్రహార్థము పనిచేయవలెను. ఎట్లు చూచినను గర్మచేయుచునే యుండవలెను. కర్మయందు స్వభావతః

బంధగుణములేదు. ప్రకృతి పనిచేయుచుండును. అహంకారమువలన నాకర్మలు నావియని తలచునెడ బంధము కలుగును. ప్రకృతిచేత బనుల జేయించువాడీశ్వరుడనియు, ఆయన కర్త, కర్మ యాయనది, యని తలచి కర్మల నాయన కర్పణముచేసి కర్మ నాదికాదని యభిమాన ముంచుకొననియెడల బంధము కలుగదు. కనుక అంటించుకొనిన నంటుకొనునేకాని స్వభావతః కర్మబంధించదు. సాధారణమనుష్యు డీ విషయమం దొక ప్రశ్నచేయవచ్చును. "బంధించకుండునటులనైన నెందుకు పనిచేయవలెను, ఊరక ధ్యానము చేయుచుండిన జాలదా"? ఈ విషయమును గురించి గీతాశాస్త్రములో స్పష్టముగను యుక్తియుక్తముగను జెప్పబడియున్నది. ఈ ప్రశ్నవేయువాడు పనిచేయక యూరకయుండుట సాధ్యమని తలచి నట్లున్నది. పనిచేయుటయనగా కర్మేంద్రియములతో బనిచేయుట యని భావించినట్లు కనుపడుచున్నది. అది సరికాదు. దేహము చేతను, ఇంద్రియములచేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను గర్మచేయబడుచున్నది.

> కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియైరపి ।
> యోగినః కర్మ కుర్వంతి . . . . . . . . ॥ (భ. గీ. 5-11)

వీనిలో నెద్దియైన నొకటిపనిచేయక యొక క్షణమైన నుండునో లేదో మనమనుభవముచేత దెలిసికొనవచ్చును. ఇంద్రియములు పనిచేయకున్నను మనస్సు పనిచేయుచుండును. బయటజూచుటకు కర్మేంద్రియములచేత నెట్టిపనియు జేయక మనస్సుతో విషయగ్రహణము చేయువాడు మిథ్యాచారుడని చెప్పబడియున్నది.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే ॥
(భ. గీ. 3-6)

ఇంద్రియములకంటె మనస్సు మిక్కిలి బలవత్తరమైనది.

ఇంద్రియేభ్యః పరం మనః (క. ఉప.)

ఉపకారముకాని అపకారముకాని ఇంద్రియములకన్న నెక్కుడుగ మనస్సుతో జేయగలుగుదుము. అట్లుండ, బాహ్యప్రవృత్తిని విడుచుటమాత్రముననే కర్మచేయలేదని తలచగూడదు. యోగసిద్ధియగువఱకు గారేంద్రియ మనోబుద్ధులలో నెద్దియయిన నొకటి పని చేయుచుండును.

యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ ।
బుద్ధిశ్చ న విచేష్టతి తామాహుః పరమాం గతిం ॥
తాం యోగమితి మన్యంతే స్థిరామింద్రియధారణాం ।
అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ ॥
(క. ఉప.)

అయిదు జ్ఞానేంద్రియములును మనస్సును బుద్ధియును (ప్రవృత్తిశూన్యములై) నిశ్చలముగ నెప్పుడుండునో అట్టిస్థితి మిక్కిలి యుత్కృష్టమైనది. దానినే యోగమందురు. ఆ యోగదశయందు మనస్సాత్మయందు బ్రతిష్ఠించబడియుండును.

యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।
నిస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥
(భ. గీ. 6-18)

ఆత్మబలముచేత ననాత్మయగు ప్రకృతివృత్తులు నిరోధించబడును. ఆత్మానుసంధానములేక దేహ (ప్రకృతి) తాదాత్మ్యమును జెందుచుం డునంతవఱకు బ్రకృతి దాని యిచ్ఛచొప్పున బ్రవర్తించుచునే యుండు ను. ఒకక్షణమైన మిన్నకయుండదు. మన యథార్థ స్వరూపజ్ఞానము మనకులేక అహంకారాభిమానములచేత బ్రకృతి వృత్తులు మనవి యని తలచుకొనుచున్నంతవఱకు బ్రకృతి ప్రతిక్షణమందు జేయుచున్న కర్మయంతయు మనకర్మయే యగును. మనము ప్రతిక్షణము పని చేయుచున్నవారమే. నేను కర్మచేయలేదని యనుకొనుటవలన నే లాటి యుపయోగము లేదు.

న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥

(భ. గీ. ౩-౫)

అవశం ప్రకృతేర్వశాత్ ॥ (భ. గీ. ౯-౮)

ఇచ్చట అందఱు నవశముగా గర్మచేయుదురని చెప్పబడియున్నది. ప్రకృతికి లోబడియుండు నంతకాలము మన మవశముగనే పనిచేయు చుందుము. దేహధారణ నిమిత్తమైనను మనము పనిచేయక తీరదు.

శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥

(భ. గీ. ౩-౮)

అట్లుండ ప్రకృతి పనిచేయు స్వభావముగలదని యెఱిగి యాస్వభావ మునే మన పురోవృద్ధి కనుకూలముగ జేసికొనుటకు మనము యత్నించ వలెనేకాని పనిచేయకయుండిన మఱియు దానిని స్వేచ్ఛగా ప్ర వర్తించగలుగునట్లు చేసినవారమగుదుము. మనకేమియు మేలుకలు గదు. దానిని నిగ్రహించుటవలన నుపయోగములేదు.

దానికిని మనకును ప్రభువైన భగవంతుని నాశ్రయించిన నేకాని దానిని వశపరచుకొనజాలము.

మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥
(భ. గీ. 7-14)

ఇందువలన దెలిసికొనవలసిన దేమనగా మనము ప్రకృతిని బనిచేయ కుండునటుల తత్‌క్షణం నిగ్రహించజాలము. అది పనిచేయుచునే యుండును. అట్లుచేయుట దానికి భగవంతుని నియామకము. దేహ తాదాత్మ్యముచే నా పనియందు గర్తృత్వాభిమాన ముంచుకొనిన యెడల మనమనశులమై యాప్రకృతి ప్రవాహమునందే గొట్టుకొని పోదుము. దానికి బనిచేయుస్వభావమున్నది కావున దానిచేత బని చేయించుకొని యాపని భగవత్కార్మగా నెంచి భగవదర్పణముగ జేసినయెడల భగవత్ప్రసాదమువలన బ్రకృతిని జయించి మనము భగ వత్కైంకర్యముగ బనిచేయుమన్న జేయునటులను మిన్నక యుండు మనిన నుండునటులను మనవశముగ జేసికొనవచ్చును. అదియే మోక్ష దశ. కనుకనే దేహధారులకు గర్మవిడిచిపెట్టుట సాధ్యముకాదని గీతాశాస్త్రమందు నొక్కి చెప్పబడియున్నది.

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
(భ. గీ. 18-11)

దేహధారులనగా ప్రకృతి వృత్తులకు లోబడియుండువారు. వారు కర్మచేసి తీరవలెను. కర్మచేయుచు, ప్రకృతిని వశపర్చుకొని, కర్మ చేయవలసినప్పుడు చేయునటులను, అనవసరమైనప్పుడు చేయకుండు నటులను, జేసికొనవచ్చును. అట్టి స్థితియందు గర్మజేసినను బంధ రాహిత్యమువలన గర్మచేయనట్లే భావించనగును.

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవకించిత్కరోతి సః ॥

(భ. గీ. 4–20)

అందువలననే శ్రీమద్భాగవతమందు "కర్మమోక్షాయ కర్మాణి విధత్తే అగదం యథా" అని చెప్పబడియున్నది. కర్మమోక్షము (అనగా నైష్కర్మ్యసిద్ధి) కర్మచేయక యుండుటవలన గలుగదు.

న కర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।

(భ. గీ. 3–4)

కర్మచేయవలెననుటకు మఱియు ననేక కారణములు గీతాశాస్త్రమందు విపులముగ నుదహరించబడి యున్నవి. అందు ముఖ్యమైన విచ్చట ప్రస్తావించబడును.

(1) సర్వజనులు క్రమక్రమముగ నజ్ఞానమును దొలగించుకొని పరిపూర్ణజ్ఞానము కలవారలై తనుం జెందవలెనని ఈశ్వరసంకల్పము. జ్ఞానపరిపాకమునకు బెక్కు జన్మములెత్తవలెను. ఏ కాలమున కెంత జ్ఞానము సంపాదించబడినదో అజ్ఞానమును బ్రకాశింప జేయగలిగిన యుపాధి కావలసియుండును. పూర్వపు దేహమును వదలి క్రొత్త దేహమును ధరించవలెను. పునర్జన్మకై కాచుకొనియున్న జీవులకు స్థూలశరీరము నమర్చుట మిక్కిలి పవిత్రమయినట్టియు నవశ్యమైనట్టియు పని. ఆ స్థూలశరీరము తల్లిదండ్రులవలన నమర్చబడవలసియున్నది. వారలు తమదేహముల నాహారముచే బోషించుకొనిననే కాని సంతానోత్పత్తికి సమర్థులు కానేరరు. ఆహారమును సంపాదించుకొనుటకు బనిచేయవలసినదని తెలిసిన విషయమే. అంతియ

కాదు. ఇతర విషయములుకూడ యోచించవలసియున్నది. అవియేవి యన, వర్షాభావమైన నాహారాభావమగును. వర్షము దేవతల యనుగ్రహమువలన గలుగును. ఆ యనుగ్రహమును బడయుటకు వారిని దృప్తి చెందించవలెను. యజ్ఞయాగాది కర్మలచే వారికి బ్రీతిచేయవలెను. అయితే యిప్పటికాలములో నిజమైన ఫలము కలుగునట్లు యజ్ఞముచేయువారును జేయించువారును, దుర్లభము. ఒక విధముగా యజ్ఞమును మనమందఱము చేయగలము. అది యెద్దియన, భూతతృప్తి, పరోపకారము. మనుష్యుని శరీరమందును దేవత లధిష్ఠితులై యుండుటంజేసి యే మనుష్యునికి సహాయమొసగి తృప్తిచేసినను వానియందుండెడి దేవతలకు దృప్తికలుగును.

> అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్ ।
> వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశత్ ॥
> ఆదిత్యశ్చక్షుర్భూత్వాఽక్షిణీ ప్రావిశత్ ।
> దిశశ్శ్రోత్రం భూత్వా కర్ణౌ ప్రావిశన్ ॥
> ఓషధివనస్పతయః లోమాని భూత్వా త్వచం ప్రావిశన్ ।
> చంద్రమా మనో భూత్వా హృదయం ప్రావిశత్ ॥
> మృత్యురపానో భూత్వా నాభిం ప్రావిశత్ ।
> ఆపో రేతో భూత్వా శిశ్నం ప్రావిశన్ ॥ (ఐ. ఉప.)

దేవతల యనుగ్రహమునుబొంది సస్యముల ఫలింపజేసికొని యాహారమును సంపాదించుకొని పునర్జన్మకుగాను నిరీక్షించియుండు జీవాత్మలకు స్థూలదేహముల నమర్చుటకు గర్మచేయవలసినది యావశ్యకమని స్పష్టమగుచున్నది. దీనికి బ్రజాపతి వ్రతమని పేరు. బ్రహ్మలోకప్రాప్తి సాధనమని ప్రశ్నోపనిషత్తునందు జెప్పబడియున్నది.

తద్యేహ వై తత్ప్రజాపతివ్రతం చరంతి యే మిథున ముత్పాదయంతే । తేషామేవైష బ్రహ్మలోకో యేషాం తపో బ్రహ్మచర్యం యేషు సత్యం ప్రతిష్ఠితం ॥

(ప్ర. ఉప.)

జీర్ణములైన దేహములను వదలుచు క్రొత్తదేహముల గ్రహించుచుండుట సంసారచక్రము. ఆ చక్రమును త్రిప్పువాడు భగవంతుడు. శరీరవిసర్జనగ్రహణ (destruction of old & creation of new forms) ములకు ప్రతిమనుజుడు తోడ్పాటుకావలెను. అనగా ప్రతి మనుజుడు వాని వాని నియతకర్మచేయుచు పై జెప్పబడిన చక్రము తిరుగుటకు దోహ్పాటుకావలెను. ఇట్లు తోడ్పాటుకాని జీవితము వ్యర్థమని గీతాశాస్త్రము చెప్పుచున్నది.

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥

కనుక ఈశ్వర ప్రవర్తనకు దోడ్పాటగుటకు గర్మచేసి తీరవలెను.

(2) ఈశ్వరసంకల్ప మెట్లయిన నెఱవేరును. దానికనుగుణముగ మనము వర్తించినయెడల వారి యనుగ్రహమువలన సంసార సాగరమును దరించగలుగుదుము. వారియాజ్ఞ శాస్త్రములద్వారా మనము తెలిసికొనవలెను.

శ్రుతిస్మృతిర్మమైవాజ్ఞా

శాస్త్రములలో గీతాశాస్త్రము మిక్కిలి యుత్తమమైన రహస్యమును బోధించునది.

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।
. . . . . రహస్యం హ్యేతదుత్తమం ॥ (భ. గీ. 4-3)
ఇతి గుహ్యతమం శాస్త్రం ఇదముక్తం మయా ॥ (15-20)

ఆ శాస్త్రములో

ఏతాన్యపి తు కర్మాణి . . . . . . . ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమం ॥ (18-6)

కర్మ చేయవలసినదే యని నాయొక్క నిశ్చయమైన యభిప్రాయమని భగవంతుడు చెప్పినప్పుడు దానికి వ్యతిరేకముగ వర్తించిన యెడల మనము చెడిపోదుము.

అథ చేత్త్వమహంకారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥
(భ. గీ. 18-58)

నేను జెప్పినట్లు విననియెడల నశింతువు.

ప్రతిజన్మములో నీశ్వరసంకల్పానుప్రవర్తన కర్మచే గొంచెము పైమెట్టుకు బోవలసియుండగా అట్లు చేయనియెడల నా జన్మము వ్యర్థమే కదా!

(3) మనము పెక్కుజన్మములలో నిచ్ఛాద్వేషములకు లోబడి పాపకర్మలను జేసియున్నారము. ఆ పాపకర్మలను ద్రెంచివేయుట కిప్పుడు శుభకర్మలను జేయవలసినది యావశ్యకమే కదా. లేనియెడల బాపకర్మ యెట్లు క్షయించును? చిత్తశుద్ధి యెట్లు కలుగును? ఆత్మజ్ఞాన మెట్లలవడు?

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత ।
సర్వభూతాని సంమోహం సర్గే యాంతి పరంతప ॥

ఏషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణాం ।
తే ద్వంద్వమోహనిర్ముక్తాః భజంతే మాం దృఢవ్రతాః ॥
(భ. గీ. 7-27, 28)

(4) శాస్త్రజ్ఞాన పాండిత్యములకును యోగసిద్ధికిని జాలాదూరము. కర్మాకర్మల లక్షణములు సామాన్య పండితులకు దెలియవు. ఒక శాస్త్రమును జదివి "కర్మ వదలవలెను, దానియందు దోషమున్నది, సంన్యాసమే శ్రేష్ఠము" అని యొక పండితుడు చెప్పును. "అట్లుకాదు, యావజ్జీవం అగ్నిహోత్రాది కర్మలు చేయవలెనని శ్రుతులు ఘోషించుచున్నవి" అని మఱియొక పండితుడు వక్కాణించును. ఇట్లు శాస్త్రజ్ఞులు విరుద్ధాభిప్రాయములను వెల్లడిచేయుచుందురు.

కర్మాకర్మ వికర్మేతి వేదవాదో న లౌకికః ।
వేదస్య చేశ్వరాత్మత్వాత్తత్ర ముహ్యంతి సూరయః ।
పరోక్షవాదో వేదోఽయం బాలానా మనుశాసనం ॥
(శ్రీ భాగవతం, 11. 3-47,48)

కర్మచేయవలెనని విధించు శ్రుతియొక్క యథార్థాభిప్రాయము వారికి దెలియదు.

రోచనార్థాఫలశ్రుతిః (11. 3-50)

సంన్యసించవలెనని చెప్పెడి వాక్యార్థముకూడా వారికి దెలియదు. బాహ్యసంన్యాసమే సంన్యాసమని వారు తలచెదరు.

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే ॥ (భ. గీ. 18-3)

ఇట్లు భిన్నాభిప్రాయు లగుటకు గారణము చిత్తశుద్ధి రాహిత్యమే. వారలు (అనగా మనీషిణులు) యజ్ఞ (పైవారిసేవ), దాన (క్రిందివారి యెడ దయ), తపః (తన యింద్రియ మనో నిగ్రహములు), కర్మలచేత మనస్సును శుద్ధిచేసికొనిననేకాని యథార్థజ్ఞానమును బొందనేరరు.

యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణాం ॥ (భ. గీ. 18-5)

చిత్తశుద్ధి యింద్రియనియమ మనో నియమముల వలననే కలుగును. శాస్త్రపాండిత్యమాత్రముననే కలుగ నేరదు. ఎట్టి శాస్త్రజ్ఞానియైనను నింద్రియములు బలవత్తరములైనవి కావున వాని మనస్సును హరించును.

యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ (భ.గీ. 2-60)

కనుక మిక్కిలి దృఢప్రయత్నపూర్వక అభ్యాసముచేతనే కాని ఇంద్రియజయమును మనోజయమును కలుగనేరవు. శుభకర్మలవలన గాని చిత్తశుద్ధి గలుగదు. అందువలననే

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియైరపి ।
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే ॥
(భ. గీ. 5-11)

చిత్తశుద్ధికొఱకు యోగులు (ఈశ్వరార్పిత) కర్మచేయుదురని చెప్పబడి యున్నది. అట్టి కర్మవలన జిత్తశుద్ధి యెట్లు కలుగునని విచారించవచ్చును. మనస్సు స్వభావతః అశుద్ధమైనది కాదు. నిరంతరము పనిచేయుచుండుట దాని స్వభావమని యిదివఱకే చెప్పబడెను. కామసంయుక్తమై విషయములగూర్చి బోవుటచే నశుద్ధమగును. నిరంతరము పనిచేయుస్వభావమునె మన యుపయోగమునకు ద్రిప్పుకొనవచ్చును.

ఎట్లన, కామప్రేరితమై విషయములదెస బోనియ్యక భక్తిప్రేరితమై ఈశ్వరునిజెస ద్రిప్పిన శుద్ధమగును. అందువలననే యోగులు చిత్త శుద్ధికొఱ కీశ్వరార్పిత కర్మలను జేయుదురని చెప్పబడెను.

(8) ఈశ్వరశక్తులు మూడు. ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియా శక్తి. కోరిక కలుగుట యిచ్ఛాశక్తివలన, దాని నెఱవేర్చుటకు జేయు యోచన జ్ఞానశక్తివలన, దాని నెఱవేర్చుట క్రియాశక్తివలన. కావున ప్రతిసంకల్పమునకు గ్రియయందు పరిసమాప్తి గలుగును. ఈశ్వరుడు నేను లోకములను బ్రజలను సృజించెదనని సంకల్పించి యూరక యుండలేదు. సంకల్పించి (ఇచ్ఛా), తపస్సుచేసి (జ్ఞానం), సృజించి వానిలో బ్రవేశించెను (క్రియా).

సోఽకామాయత బహుస్యాం ప్రజాయేయేతి ।
స తపోఽతప్యత స తపస్తప్త్వా ఇదగ్ం సర్వ మసృజత ॥

మనము సయితము సంకల్పముమాత్రము జేసిన జాలదు. దానిని నెఱవేర్చినగాని సంకల్పము సాఫల్యము జెందదు. అందువలననే "పరమగురుచరణసన్నిధి" యందు "లోకమున కుపయోగమగ నుండవలెనన్న సంకల్పము క్రియారూపమున ఫలించవలెను. సోమరి తనము కూడదు. సత్కార్యము నిరంతరము చేయుచుండవలెను". అని చెప్పబడియున్నది. ఒక సత్సంకల్పము చేయగనే మనోమయ కోశములో జలనము (Vibration) పుట్టును. దాని కనుగుణమైన యణువులు ప్రవేశించి ప్రతికూలమైన యణువులను వెడలగొట్టుటకు బ్రయత్నించును. ఆ సంకల్పము క్రియారూపమున బరిణమించి పరిసమాప్తి నొందినయెడల నూతన యణువుల ప్రవేశము మునుపటి

యణుబహిర్గతము సులభముగ సంభవిల్లు. అట్లు లేనియెడల క్రియా రూప పరిసమాప్తిచే దృఢపడని శుభ సంకల్పము శీఘ్రకాలములో నశించి మునుపటి దుస్సంకల్పము మఱల ప్రవేశించుట కవకాశము గలుగును. కావున శుభసంకల్పము చేసినమాత్రము చాలదు. ఆ సంకల్పప్రకారము ప్రవర్తించి మన యుపాధులలోనుండు అశుభ అణువులు వెడలిపోయి శుభ అణువులు స్థిరముగ జేరునట్లు చేయ వలెను. క్రియ సయితము ఈశ్వరశక్తియే యని నమ్మినయెడల దానియందు దోషారోపణము చేయుట కవకాశముండదు. కామ ప్రేరితమై లోకమున కపకార మొనర్చిన నశుభమే అగును. లోకోప కారకర్మ భగవత్స్వరూపము. దానిని దూషించి త్యజించుట వలన నీశ్వరుని శక్తులలో నొకదానిని దూషించిన వారమగుదుము. ఇందువలనగూడ గర్మ చేయవలసినట్టే యేర్పడెను.

(6) యోగసంసిద్ధికానివారు వారి వారి నియత కర్మలను సంగ ఫలాభిసంధిరహితముగా ఈశ్వరార్పణబుద్ధితో జేసిన నవియే వారిని బునీతులుగ జేసి వారికి జిత్తశుద్ధి గలుగజేయును. యోగసంసిద్ధి కల్గినవారు సయితము లోకసంగ్రహార్థము పనిచేయవలెను. ఇందు కుదాహరణము భగవంతుడే. "మూడులోకములలో నాకు గావల సిన దేదియులేదు. అయినను లోకోద్ధారణమునకుగాను నేను బని చేయుచునే యున్నాను. నీవు సయితము లోకసంగ్రహార్థము పని చేయుము" అని యర్జునునకు జెప్పిరి.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ (భ. గీ. 3-22)
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్కర్తుమర్హసి ॥ (3-20)

యోగసిద్ధినొందిన విద్వాంసుడే ఈశ్వరసంకల్పము నెఱిగి ప్రవర్తించ గలుగువాడు. కావున వాడు ధర్మమును బాగుగ దెలిసికొని యను ష్ఠించి, యితరులను ధర్మమునందు బ్రవర్తింపజేసి తరింపజేయుభార మును వహించవలసినవాడు. అట్లు ధర్మమును దానసుష్ఠించి యిత రులకు బోధించి వారలచే జేయించువా డందఱకంటె భగవంతుని కత్యంత ప్రియుడనియు, నంతకన్న బ్రియుండితరు డెవ్వడు లేడని యు, జెప్పబడియున్నది.

న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥

(భ. గీ. 18-69)

ఇట్లు లోకోద్ధారణ భారమును వహించువాడే శ్రేష్ఠుడనబరగు (leader).

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః । (భ. గీ. 3-21)

ఆ శ్రేష్ఠునియందు భగవత్కళ విశేషముగ ప్రకాశించును. వాని మూల మున లోకోపకార కర్మ భగవంతుడుచేయును. అట్లు భగవత్కృపా రసము ప్రవహించుటకు గాలువగా జేసికొనిన శ్రేష్ఠుని జన్మమే సా ఫల్యము. అవకాశములుండినను వానిని గమనించక స్వార్థపరుడై కాలము గడుపువాడే యింద్రియారాముడు; వ్యర్థజీవి యని చెప్ప దగును.

అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥

(భ. గీ. 3-16)

ఇందువలన దెలిసికొనవలసిన విషయము లెవ్వియన :—

సిద్ధికానివాడు కర్మచేయక తీరదు. చేయవలసినదేను. విషయాసక్తిచే బంధము కలుగునట్లు చేయక యజ్ఞార్థముగా (అనగా ఈశ్వరార్పణముగా) జేసి చిత్తశుద్ధి కలుగజేసికొని యాత్మజ్ఞానమును బొంది పరాభక్తి ననుష్ఠించి తత్ఫలమగు యథార్థజ్ఞానముచే నీశ్వర స్వరూపమును దెలిసికొని (జన్మకర్మ చ మే దివ్యం, యావాన్ యశ్చాస్మి) ఈశ్వర సంకల్పమునకు దోట్పాటుగా గర్మచేయవలెను. అంతకన్న గొప్పభాగ్యములేదు. అంతకన్న గొప్ప ఆనందములేదు. అట్టియానందప్రాప్తికి గర్మకారణము. కావుననే కర్మచేయుచు జిత్తశుద్ధి చేసికొనుచు నీ జన్మములో భగవంతునికి మఱికొంచెము సమీపమునకు రాగలుగుదునా అనెడి కుతూహలముతో నూఱేండ్లు బ్రతుకుదునా అని కోరవలెనని ఈశావాస్యోపనిషత్తునందు జెప్పబడియున్నది.

జిజీవిషేచ్ఛతంసమాః ॥

ఇదియే శ్రేయోమార్గము. మనకు వేఱొండు మార్గము లేదనికూడ నీ యుపనిషత్తునందు విధించబడియున్నది.

ఏవంత్వయినాన్యథేతోఽస్తి ॥

గీతయందుగూడా "కర్మణ్యేవాధికారస్తే"

నాల్గవ వ్యాఖ్యాన సూత్రము:— మొదటి భాగము, రెండవవాక్యము. దీనిని రెండవ ప్రాచీనసూత్రముతో జేర్చి చదువవలయును.

ప్రాణేచ్ఛను జంపివేయుము. (అయినను) ప్రాణేచ్ఛగలవారివలెనే ప్రాణమునందు గౌరవముంచుము.

ప్రాచీనసూత్రములలో విధించబడిన వైరాగ్యము వివేకపూర్వకముగ నుండవలయునని వ్యాఖ్యానసూత్రము తెలియపర్చుచున్నది.

మొదటి సూత్రమునందాశను వదలవలెనని చెప్పబడినది. ఇచ్చట కర్మసంగ రాహిత్యము కర్మఫలాభిసంధిరాహిత్యము బోధించబడి యున్నవేకాని నియతకర్మ త్యాగము విధించబడియుండలేదని వివేకము గలవాడే తెలిసికొనును. అట్లే రెండవ సూత్రముయొక్క యథార్థ తాత్పర్యము వివేకశూన్యునికి దురవగాహము. అంతియ కాక విపరీతార్థము సయితము కలుగవచ్చును. సూత్రములో ప్రాణేచ్ఛను జంపివేయవలెనని చెప్పబడియున్నది. ప్రాణము నతితుచ్ఛముగా భావించవలెనని తలచి తన కిడుములు సంప్రాప్తమయినప్పుడో లేక క్షణకాలపు వైరాగ్య జుగుప్సలు కలిగినప్పుడో ప్రాణత్యాగము చేయ నిశ్చయించును. తన ప్రాణమును దుచ్ఛముగ జూచువాడితరుల ప్రాణమును సయితమంతే గౌరవముతో జూడగలుగు. వారలయందు ప్రీతిభావమున్న స్వహత్యచేసికొమ్మని చెప్పవచ్చును. ద్వేషభావముండిన దానే వారిని జంపివేయవచ్చును. వివేకము కలవాడట్లు ప్రవర్తించడు. ప్రాణ మీశ్వరశక్తి యనియు, నీశ్వరస్వరూపమనియు, నా ప్రాణశక్తిచేతనే భగవంతుడు జగత్తునంతయు ధరించి యున్నాడనియు, ప్రతిపదార్థము దానిలోపల నీశ్వరుని ప్రాణశక్తియుండుటచేతనే రూపమును ధరించగలిగి యున్నదనియు, నా రూపముతో జీవుని కెంతకాల ముపయోగమందునో అంతకాలము భగవంతుడు దానిద్వారా ప్రకాశించుచు జీవునియందు బీజరూపముగనుండిన శక్తులు క్రమక్రమముగ నభివ్యక్తమగునట్లు చేయుచుండుననియు, జీవుని జ్ఞానమెక్కుడు కాగా హెచ్చైన శక్తుల వ్యక్తిపఱచుట కసమర్థమైన రూపమును ఛేదించుచు నట్లు వృద్ధిబొందిన శక్తుల యభివ్యక్తి కనుకూలమగు మఱియొక రూపమును దాను ప్రవేశించి జీవునికిచ్చుననియు,

రూపముతో బనితీరిన నది తనంతటనే నశించుననియు, దానితో జీవుడు చేయవలసిన పనులు, పొందవలసిన యనుభవములు, నేర్చుకొనవలసిన విషయములు, సమాప్తియగువఱకు ప్రాణశక్తి దానియందుండు టంజేసి దానిని స్వహత్యచే ఛేదించిన నాత్మహననపాపమునకు బాలగుదుననియు, వివేకముగలవాడు తెలిసికొనును. తన యుపాధితో బనితీరినది లేనిదియే తానెఱుగలేనప్పుడు ఇతరుల యుపాధితో వారలకు బనితీరినది లేనిది తాను దెలిసికొనజాలనని నమ్మి స్వహత్య చేసికొమ్మని యితరులకు దుర్బోధచేయడు. మఱియు ప్రాణ మీశ్వర స్వరూపమని తెలిసినవాడు కావున లోకములో నేప్రాణిని హింసించడు, బాధపెట్టడు. మనుష్యకోటిలోనే కాదు, జంతుకోటిలో నే జంతువును జూచినను మనప్రాణమందు మనకెంత ప్రీతియున్నదో దాని ప్రాణమందు దానికంత ప్రీతియుండునని తలచి దాని కెంతమాత్రము బాధకలుగజేయడు. పశువు మోయలేనిభారము వేయుటవలన నడవలేక శ్రమపడుచుండగా వేగముగ బోలేదని దానిని గొట్టి బాధపెట్టువారిని జూచి వీరెంత మూఢులు జీవహింసచేయుచున్నారే, వీరికి జ్ఞానము వచ్చి ప్రాణులను బాధించు గుణము పోగొట్టుకొందురు గాక అని భగవద్ధ్యానముచేయును. వారు కొంచెము సౌలభ్యులైన యెడల నట్టి కార్యము చేయగూడదని వారికి బోధించును. మృగయావినోదమను నెపమున జంతువులను హింసించువారు మిక్కిలి పాపాత్ములనియు నాత్మహంతలనియు నమ్మును. ఆ జీవజంతువులు మనవలెనే సతీపతులు తల్లిపిల్లలు పరస్పర సంయోగముచే నానందించుచు, సుఖముగ గాలము గడుపుచు, నాయుపాధియందు దెలియదగు విషయములను గఱచుచుండునెడ వాని యుపాధులను మన వినోదముకొఱకై

ఛేదించిన నీశ్వరసంకల్ప ప్రతికూల ప్రవర్తులమై వారికృప కయోగ్యుల మగుదుమనియు వివేకముకలవాడు తెలిసికొనును.

జీవహింసజేయువారు మఱియు రెండు తెఱగులవారు కలరు. వారినిగూర్చి "పరమగురుచరణసన్నిధి" యందు మహాగురువులవలన జెప్పబడిన విషయమును గమనించవలెను.

"పశువులను (యజ్ఞములో) జంపవలెననునది మూఢాభిప్రాయము (Superstition). అంతకన్న మిక్కిలి క్రూరమైన మూఢాభిప్రాయ మెద్దియన మనుష్యునికి మాంసాహార మవశ్యమనునది. ఈ మూఢాభిప్రాయమువలన గలుగు భయంకరమగు జీవహింసను జూడుడు. నీయందీషన్మాత్రమీ మూఢత్వముండకుండునట్లు జాగ్రతగ నుండుము. ఈ నేరములను నీవు చేయగూడదు. ఎందువలన ననవి భక్తి (ప్రేమ) ప్రతిబంధకములు. చెడుగుచేయకుండుటయే చాలదు. మేలుచేయుటయందు బ్రవర్తించుచుండవలెను. భూతసేవ చేయవలెననియెడి యత్యంత కుతూహలముతో నిండియుండవలెను. నీ చుట్టుపట్టుననుండు వారందఱకు సేవ యెట్లు చేయగల్గుదునని సదా కనిపెట్టియుండవలెను. సేవచేయవలసినది (అనగా ఉపకారము లేక సహాయము) మనుష్యులకే కాదు. మృగములకు వృక్షములకు సహా".

నిర్జీవమైన పదార్థ మొక్కటియైనను లేదు.

న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరం ॥

(భ. గీ. 10-89)

వృక్షకోటియు ధాతుకోటియు బ్రాణముండునవిగనే నమ్మి మనము ప్రవర్తించవలెను. భౌతికశాస్త్రజ్ఞులలో నతిచతురుడని ప్రసిద్ధిగాంచిన

జగదీశచంద్ర బోస్ అను శాస్త్రజ్ఞుడు వృక్షధాతుకోటులయందు ప్రాణమున్నదను విషయము స్థిరపరిచియున్నారు. వృక్షములు సుఖ దుఃఖముల నెట్లగుపర్చునది వారు చూపియున్నారు. ప్రతిలతయందు ను ప్రాణమున్నది. దాని యధిదేవత దాని గాపాడుచుండును. అది పురోవృద్ధిని జెందుటకు వలయు సౌకర్యములు భగవంతునిచే నిర్మించ బడియున్నవి. ఆ ప్రాణులను మనము సహోదరభావముతో జూడ వలెను. వాని పురోవృద్ధికి బ్రతిబంధకమగు కార్యమును మనము చేయకూడదు. ఎండిపోవుచుండు చెట్టును జూచిన దానికి నీరుపోయ వలెను. అట్లు వృక్షమునకు జేసిన మేలీశ్వరసేవతో దుల్యమే. వృక్ష కోటివలన మనము పొందు మేలును మనము మఱువరాదు. మన కా హారము నిచ్చుచున్నవి. నీడ నిచ్చి శ్రమనివారణ చేయుచున్నవి.

పశ్యతైతాన్ మహాభాగాన్ పరార్థైకాంతజీవితాన్ ।
వాతవర్షాతపహిమాన్ సహంతో వారయంతి నః ॥
(శ్రీమద్భాగవతము, 10-22-33)

ఈ మహాపుణ్యాత్ములను (వృక్షములను) జూడుడు. అవి కేవలము పరహితార్థమే జీవించుచున్నవి. గాలి, వాన, ఎండ, మంచు వీని నన్నిటికి దాము సహించుచు మనకు వానివలన శ్రమ కలుగకుండు నటుల నివారించుచున్నవి.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥
(భ. గీ. 9-26)

దోషనబోవుచుండ దొరికిన వృక్షమునుండి కొంతయాకును రాల్చి విగ్రహముపైన బెట్టిన జాలునని యీ శ్లోకతాత్పర్యము కాదు.

ఈశ్వరారాధన నెట్టివిధముననైన జేయవచ్చును. పూజాద్రవ్యమంత ముఖ్యమైనది కాదు. ఆరాధనయొక్క నిజస్వభావము నెఱిగి ప్రేమచె జేయునదియే నిజమైన యుపాసన. ఆరాధన సంపూర్ణ ప్రేమతో నిండియుండవలెను. పూజాద్రవ్యమెట్టిదియైనను సరే. వృక్షములకు నీరుబోసినజాలును. వాడిపోవుచుండు మొలకకు నీరుబోసిన "తోయం భక్త్యుపహృత" మగును. దానిని భగవంతుడు త్రాగి ప్రీతిజెందును. పశువుకు దృణము ఆకు వేసి నీరుద్రాపిన సంతుష్టిజెందును., అప్పుడు పత్రంతోయం అను ద్రవ్యములతో బశువునందుండు భగవంతుని అర్చించిన వారలమగుదుము. దానిని భగవంతుడు భక్షించి (అశ్నామి) ప్రీతిజెందును. ప్రేమతో సకల భూతసేవ చేయుట వలన భగవంతుడు ప్రీతిజెందునని యీ శ్లోకతాత్పర్యము.

ఇట్లు సర్వభూతములయందు తరుగుల్మలతాదులు, పశు పక్షి కీట కాదులు, మనుష్యులలో జ్ఞానులు అజ్ఞానులు, సర్వులయందు భగవంతుడు ప్రాణరూపమున నున్నాడని తెలిసికొని తాను హింసచేసికొనక, యితరులకు హింసగలుగజేయక, ప్రవర్తించవలెను. అంతేకాదు. ప్రేమించవలెను. ఇచ్చట నొక యాక్షేపణ కలుగవచ్చును. "పరమగురుచరణసన్నిధి" లో యజ్ఞార్థముగాని ఆహారార్థముగాని ప్రాణిహింస జేయగూడదని చెప్పియున్నదే. యజ్ఞార్థము పశుహననము వేదములో ననుష్ఠేయమని విధించబడిన కర్మగ నున్నదే; వేదవిధి నెట్లుల్లంఘించనగు? యజ్ఞశిష్టామిష భక్షణము విధ్యుక్తమే కదా ? మఱియు "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అను న్యాయము ననుసరించి దేహపోషణార్థము

పశువధ నిర్దోషము కాదా? వేదశాస్త్రజ్ఞాన రాహిత్యముంజేసి యీ విషయములనుగూర్చి వ్రాయు నవివేకియగు ఏ గ్రంథకర్త సమర్థుడు కాడు. దివ్యజ్ఞానసమాజ పుస్తక భాండాగారాధ్యక్షులును నాంధ్ర గీర్వాణ హూణములను భాషాత్రయమందు గొప్ప పాండిత్యమును సంపాదించిన బ్రహ్మశ్రీ అల్లాడి మహాదేవశాస్త్రిలుగారు యజ్ఞవిషయమును బాగుగ బరిశీలించి వ్రాసిన గ్రంథములను జూడనగు. ఆదియందు బశుహననము వేదములయందు విధింపబడి యుండనే లేదనియు, యజ్ఞదీక్ష యన ఈశ్వరునియందు దన్ను నర్పించుకొనుటయే యనియు, (అనగా ఈశ్వరుడుచేయు లోకానుగ్రహకర్మకు దోడ్పాటై తనయందలి స్వప్రయోజన పరమైన స్వభావమును వదలి తన జీవితమును సర్వశక్తులను లోకసేవరూపమన ఈశ్వరసేవయందే వినియోగించెదనని సంకల్పించుట—(Cansecration of his whole life to the service of the Divine Lord), సోమయాగమన సర్వవ్యాపియు సర్వశక్తిమంతుడు నగు సోముని (విష్ణువును) సాక్షాత్కరించుటయే యనియు, లోకపురోవృద్ధినిమిత్తము దేవతలకు సహకారిగా నెట్టి లోకోపకారమగుపని జేసినను దేవతలు దానదృప్తిజెంది యజ్ఞభావితులగుదురనియు, పశుహననము వెనుక యాచరణలోకి వచ్చినదనియు, యిప్పటికైనను యజమాన ఋత్విజులు యజ్ఞశిష్టామిషభక్షణము సేయునది యజ్ఞదీక్ష విసర్జనానంతరమే యనియు, గావున బశువధ యజ్ఞదీక్షలో జేరినది కాదనియు నా పండితుల యభిప్రాయము. అనగా మనయందలి పశుత్వమును (lower nature) వధించుకొనవలెనని యర్థము చేయవలయునేకాని జీవహింస ధర్మమని వాదించగూడదు. పశుహననమెప్పుడు వేదములో జేర్చినది నిశ్చయముగా

జెప్పుటకు సాధ్యముండదు. మొట్టమొదట జీవహింసతో గూడిన యజ్ఞములు నిత్యకృత్యములుగను సర్వజనానుష్ఠేయములుగను, విధింప బడలేదని తలచవలసియున్నది. ఈ యజ్ఞము లన్నియు "కామ్య యజ్ఞములు" అనగా ఒక్కొక్క యజ్ఞము ఒకానొక ఫలమునిచ్చు నది. ఆయా ఫలములం గోరువా రాయా యజ్ఞముల జేయవచ్చునని అనుజ్ఞ. స్వర్గసుఖమును గోరువారు జ్యోతిష్టోమమును జేయుదురు గాక; శత్రునాశనము గోరువారు శ్యేనయాగము జేయుదురు గాక; పుత్రకాముడు పుత్రకామేష్టి జేయుగాక; అని యీ యజ్ఞములు కేవల అల్పకాములకే విధింపబడియున్నవి. కావున యజ్ఞశిష్ట ఆమిష భోజనము సర్వులకు, సర్వగృహస్థులకు గూడ విధించబడలేదు. ఇచ్చట విధి అనుజ్ఞా విధిగాని ఆజ్ఞావిధి కాదు అనిస్పష్టము.

మరియు నింకొకవిషయము. బ్రాహ్మణాదులు సైతము మాంస భక్షకులుగ నుండినకాలమున, అట్టి యాహారమును తగ్గించుటకును, క్రమక్రమముగ విడిపించుటకు "పరిసంఖ్యావిధి" ననుసరించి యజ్ఞ శిష్ట ఆమిషము మాత్రము భుజించదగునని విధించిరిగాని, మాంసా హార వర్జితులగు వారు సైతము, యజ్ఞమునైన చేసి ఆమిషమును గ్రహించవలెనని కాదు. ఈ యర్థము శ్రీమద్భాగవతమున స్పష్టముగ విశదీకరించి యున్నది.

> లోకేవ్యవాయామిషమద్యసేవా నిత్యాస్తు జంతోర్నహి
> తత్ర చోదనా। వ్యవస్థితి స్తాసు వివాహ యజ్ఞ సురాగ్రహై
> రాశు నివృత్తిరిష్టా ॥

ఈ యుత్తమ ధర్మము, వివాహవిషయమునను, సోమపానము విషయ మునను గూడ నన్వయించును.

స్త్రీపురుషులకు భోగేచ్ఛయుండినచో వివాహము చేసికొని క్రమమైన దాంపత్యమున బ్రవర్తించనగును. అట్లే, అమిషాహార మద్య సేవలయం దిచ్ఛగలవారు యజ్ఞసోమయాగముల మూలమున మాత్రము వానిని గ్రహించనగును అని శాస్త్రచోదన. తుదకు పూర్ణముగ నివృత్తి—విడుచుట—యే శాస్త్ర ఉద్దేశ్యము.

పురాణములయందు "ఉపరిచరవసు" ఉపాఖ్యాన మీ యర్థమును తెల్లముచేయుచున్నది.

ఇప్పుడు పశువధసహిత యజ్ఞము వేదములలో జెప్పబడియున్నదనియు నాచరణలో సయితమున్నదనియు నంగీకరింతము. బ్రాహ్మణులలో శ్రీమధ్వాచార్యస్వామివారి మతానుష్ఠాతలు పశువధచేయుట లేదనియు బశుత్వచిహ్నముగా బిష్టపశువును ఖండించెదరనియు దెలియవచ్చుచున్నది. మఱియు పశుయాగములను విధించియుండుటయు వేదములలో గర్మకాండయందే యని చెప్పుటకు సందేహములేదు కదా? వేదముయొక్క కర్మకాండలోని విధులెవ్వరివలన నాచరింపబడవలెను? వాని ఫలమేమి? వేదముయొక్క జ్ఞానకాండలో నీ విషయమును గుఱించి యేమి చెప్పబడియున్నది? అను నీ విషయములు విచారణీయములు.

ముండకోపనిషత్తునందు,

> ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా
> అష్టాదశోక్తమవరం యేషు కర్మ ।
> ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢాః
> జరామృత్యుం తే పునరేవాపి యంతి ॥

ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం
నాన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః ।
నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వా
ఇమం లోకం హీనతరం వా విశంతి ॥

పదునెనిమిది యజ్ఞరూప కొయ్యలుగల యీనావ యదృఢమైనది. (పదునెనిమిది కొయ్యలనగా పదునాలుగురు ఋత్విక్కులు, యజమానుడు, అతని పత్ని.) ఇట్టి యదృఢనావ నాశ్రయించిన యజ్ఞకర్మ యుత్కృష్టమైనది కాదు (అనగా ఉత్తమఫలము నిచ్చునది కాదు). ఇదియే మిక్కిలి శ్రేష్ఠమని యెవరు సంతోషించుచున్నారో అట్టి మూఢులు జరామరణములకు బునఃపునః లోబడువారగుదురు.

యజ్ఞములు, వాపీకూప తటాకాది నిర్మాణరూపమగు ధర్మకార్యములు మిక్కిలి శ్రేష్ఠములని తలచునట్టి యతిమూఢు లంతకన్న శ్రేష్ఠమగుదాని నెఱుంగరు. వారుచేసిన సుకృతఫలమును స్వర్గలోకమునం దనుభవించి పిమ్మట (పుణ్యము క్షీణముకాగా) ఈ లోకమునుగాని మఱియు నధోలోకమునుగాని (పూర్వజన్మ కర్మానుసారముగా) జెందెదరు.

భగవద్గీతలయందు:—

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున (2-45)

వేదములు (కర్మకాండ) త్రిగుణసంబంధమగు విషయములనుగూర్చి (అనగా ఐహికాముష్మిక సుఖభోగసాధన విషయములనుగూర్చి) జెప్పును. నీవో త్రిగుణాతీతుడు కావలెను.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్ ॥
తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।
ఏవం త్రయీ ధర్మ మనుప్రపన్నాః
గతాగతం కామకామా లభంతే ॥ (9-20-21)

వేదముయొక్క కర్మకాండలో విధించినరీతిన స్వర్గభోగకాంక్షతో యజ్ఞముచేసినవారు పుణ్యబలముచే స్వర్గసుఖము ననుభవించి యా పుణ్యము క్షీణించగనే మఱల మనుష్యలోకమును జెందుదురు. కర్మకాండమార్గ మనుష్ఠించువారల కిట్లు కామభోగమే ఫలము. అయితే యజ్ఞములను జేయగూడదని యిచ్చట వాదించ లేదు. పశుహింసచేయుట బాగులేదని మాత్రమే చెప్పబడుచున్నది. పశువధకూడ విధ్యుక్తమని చేయువారు దానికిదగిన ఫలమునే చెందుదురు. అట్టివారు మందమధ్యమాధికారులనే చెప్పవలసియుండును. దేవతల నుద్దేశించి యజ్ఞము చేసి దేవతాలోకములను జెందెదరు. (దేవాన్ దేవయజో యాంతి—భ. గీ. 7—23.)

మందమధ్యమాధికారులు ఫలకాంక్షతో యజ్ఞముచేసి తదనుగుణ ఫలమును బొందనిమ్ము. మోక్షమార్గమం దడుగిడినవాడు కాని, ముఖమాదెస ద్రిప్పినవాడు (అనగా నివృత్తిమార్గములో ప్రవేశించినవాడు) కాని స్వర్గఫలకాంక్షతో జీవహింసచేసి యజ్ఞముచేయ

గూడదు. వాడును యజ్ఞముచేయవలసినదే గాని అది కామ్యయజ్ఞము కాదు. (పశుహింసతో గూడినవన్నియు కామ్యయజ్ఞములే.) వాడు దురితక్షయము చిత్తనైర్మల్యముకొఱకు ఇతర యజ్ఞముల జేయును.

యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణాం ॥ (18-5)

ఈశ్వరార్పణబుద్ధితో జేయును. అందువలన జిత్తశుద్ధియు నీశ్వర ప్రసాదమును, ఉత్తమఫలప్రాప్తియు గల్గును. భగవద్గీత నాల్గవ యధ్యాయమందు బెక్కువిధములగు యజ్ఞములు వర్ణించబడియున్నవి.

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే । (4-32)

అవియన్నియు నింద్రియనిగ్రహము, మనశ్శాంతి, బ్రహ్మానుసంధానము, సర్వం బ్రహ్మమను జ్ఞానము, ఇట్టి ఫలముల నిచ్చునవియే కాని హింసాస్వరూపమగునట్టివి కావు. ద్రవ్యయజ్ఞముకన్న జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమనియు యజ్ఞములన్నిటిలో జపయజ్ఞము తానే యనియు (అనగా తన విభూతి నెక్కుడుగా దెలియపర్చునని) భగవద్వాక్యము.

యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి ॥ (10-25)

ఈ జపయజ్ఞ శ్రేష్ఠత్వమునకు గారణ మానందగిరి టీకయందు "జపయజ్ఞస్య యజ్ఞాంతరేభ్యో హింసారాహిత్యేన ప్రాధాన్యం" హింసారాహిత్యమువలన శ్రేష్ఠత్వము కలిగినదని చెప్పబడియున్నది.

జ్ఞానయజ్ఞ లక్షణములు నారాయణవల్లి యందును, బృహదారణ్యకోపనిషత్తునందును వర్ణింపబడియున్నవి.

తస్యైవం విదుషో యజ్ఞస్య ఆత్మా యజమానః శ్రద్ధా పత్నీ శరీరమిధ్మం ఉరో వేదిః . . . హృదయం యూపః కామ

అజ్యం మన్యుః పశుః తపోఽగ్నిః . . . వాక్ హోతా ప్రాణ ఉద్గాతా చక్షురధ్వర్యుః మనో బ్రహ్మ శ్రోత్రమగ్నీత్ . . . ఇత్యాది. (నారాయణవల్లి)

తమసవరుద్ధ్యైవామన్యత । తం సంవత్సరస్య పరస్తాదాత్మన ఆలభత । పశూన్ దేవతాభ్యః ప్రత్యౌహత్ । తస్మాత్ సర్వదైవత్యం ప్రోక్షితం ప్రాజాపత్యమాలభంతే ॥

(బృ. ఆ. 3-2-7)

ఇందుపైన శాంకరభాష్యమును ముఖ్యముగ జూడవలెను. ఈ వాక్యములవలన వధించవలసినది అహంకారము, కామము, క్రోధములే యని తెలియవచ్చును. యాజ్ఞికులు వధించెడి పశువు మనయందలి పశుబుద్ధి చిహ్నము.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ । (9-24)
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥ (8-4)

సర్వయజ్ఞముల యాహుతులను భక్షించువాడు భగవంతుడు. ఆయన యెట్టివాడు? సర్వభూతములకు ప్రియము చేయువాడు. సర్వభూతములకు దల్లియు దండ్రియును.

సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ॥
(5-29)

పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః । (9-17)

ఆయన తనబిడ్డలగు పశువులను వధించమని చెప్పునా? అట్టి యాహుతి ప్రీతితో భక్షించునా? తన బిడ్డలను జంపిన వారల కుత్తమ

ఫలమొసగునా? మోక్షమార్గస్థు డీ విషయమునందు మోసపోగూడదు. వాడు తన మేలుకుగాను దేవతోపాసన చేయగూడదు. ఏలాటికోరికలు లేక కర్మసంగమును విడిచి కర్మను దేవతలకు దేవుడైనట్టియు (దేవదేవజగత్పతే—10-15), దేవతల కాదిదేవుడునగు (అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ) భగవంతుని కర్పణము చేయును. లోకకల్యాణమే వానికి ముఖ్యోద్దేశ్యము. లోకమునకు మేలు భగవంతుడు చేయును. వర్షము కురిపించువా డాయనయే, నిలుపువాడుకూడ, ఎండగాయించు వాడుకూడ. సర్వమాయన యధీనమే.

తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ। (9-19)

దేవతలచేత జేయబడవలసిన కార్యములను వారలచేత నా భగవంతుడే చేయించును. మోక్షమార్గస్థుడు ప్రత్యేకముగా దేవతోపాసన చేయ నవసరములేదు. దేవతలు ఫలమిచ్చెదరని తలచి దేవతోపాసన చేయువారలకు సయితము ఫలమిచ్చునది యా దేవతలుకాదు. వారి ద్వారా భగవంతుడే యిచ్చుచున్నాడు.

లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ ॥

(7-22)

అయితే భగవద్గీతలయందు యజ్ఞముచేత దేవతలను భావించవలెనని చెప్పబడియున్నదే, దేవతారాధన చేయకపోయిన భగవద్వాక్యమునకు విరుద్ధప్రవర్తన యగునట్లు కాదా యని యాక్షేపించనచ్చును. ఆ ప్రకరణమందుగూడ జీవహింసచేయుమని చెప్పలేదు. ముందు దేవతలనుభావించి వెనుక దాను భక్షించవలెననియు, దేవతలవలన బొందు మేలుకు గృతజ్ఞత చూపక స్వప్రయోజనార్థము భక్షించునది యన్న

ము కాదనియు, పాపమే యనియు చెప్పబడియున్నది. ఫలముద్దేశించి దేవతోపాసన చేయువారు చేయుదురు కాక. మోక్షమార్గస్థుడు వివేకముగలవాడు కావున దేవతలు ప్రతిమనుష్యునియం దున్నారని యు, నింద్రియముల నధిష్ఠానములుగ జేసికొని యున్నారనియు, భూత తృప్తిచే భూతముల యింద్రియాధిష్ఠానులైన దేవతలు తృప్తిజెందగల రనియు, దెలిసికొని లోకోపకారకర్మ చేయును. ఐతరేయోప నిషత్తువలన దేవతలన్నముకొఱకే మనుష్యశరీరములో నింద్రియముల నధిష్ఠానముగ జేసికొని ప్రవేశించిరని తెలియవచ్చుచున్నది. ఆకలి కొనినవాని కన్నమిడిన వాని శరీరమునందుండు దేవతలు నిస్సంశయ ముగా దృప్తిజెందుదురు. మనుష్యశరీరములో దాము క్షుత్పిపాస లను దీర్చుకొనగలమని వారే యంగీకరించుకొని ప్రవేశించినపుడు ప్రత్యేకముగా జీవహింస చేయవలసిన యవశ్యకముండదు. ఇందువల ననే భూతతృప్తి, అన్నదానము మిక్కిలి శ్రేష్ఠమని ఖ్యాతిజెంది యున్నది.

ఆయతనం నః ప్రజానీహి యస్మిన్ ప్రతిష్ఠితా అన్నమదా మేతి . . . . . . తాభ్యో పురుషమానయత్ తా అబ్రువన్ సుకృతం బతేతి . . . . . . . . . యథాయతనం ప్రవిశతేతి . . . . . . అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్ . . . . ఇత్యాది

మఱియు "పరమగురుచరణసన్నిధి" యందు "నీ కీశ్వరునియం దత్యంత ప్రేమ (భక్తి) యున్నది గావున నాయనకు సహకారిగా ఆయన చేసినట్లులే నీవు చేయవలెను. ఆయన ప్రేమస్వరూపుడు

కావున నీ వాయనను జెందవలెనన సంపూర్ణ స్వార్థత్యాగము తోను ప్రేమతోను నిండియుండవలెను" భగవంతుని బిడ్డలను వధించినచో వానియందుండు భగవంతుని దిరస్కారముచేసిన వారము కామా? ఇట్లుచేసిన మన మెట్లు భక్తులమగుదుము? ఈ "పరమగురుచరణసన్నిధి" యను గ్రంథమునందు, భాగవతమునందు జెప్పబడి యుండునట్టియు, దివ్యజ్ఞానసమాజ స్థాపకులలో నొకరైనట్టియు, కృపాసముద్రుండును, మధుర భాషియు, అహింసాస్వరూపుడునగు దేవాపియను గొప్ప ఋషివాక్యములు సంయోజనము చేయబడియున్నవి కావున నందులోని బోధలు నివృత్తిమార్గస్థులవలన ననుష్ఠేయములు. ఆ ఋషియొక్క తాత్పర్యము యజ్ఞమను నెపమున మనము జీవహింస చేయరాదని. యజ్ఞనెపముననైన బశువధ చేయుట పాపకార్యమే యని నారదుడు ప్రాచీనబర్హి కుపదేశించినట్లు శ్రీమద్భాగవతమందు జెప్పబడియున్నది.

> భో భో ప్రజాపతే రాజన్ పశూన్ పశ్య త్వయాధ్వరే ।
> సంజ్ఞాపితాన్ జీవసంఘాన్ నిర్ఘృణేన సహస్రశః ॥
> ఏతే త్వాం సంప్రతీక్షంతే స్మరంతో వైశసం తవ ।
> సంపరేత మయఃకూటైః ఛిందంత్యుత్థితమన్యవః ॥

"భోరాజా, ఓ ప్రజాధిప, నీవు దయమాలి యజ్ఞములలో జంపిన వేల సంఖ్యాతములగు పశువులగుంపును జూడుము. అవి నీ వొనర్చిన యపకారమును స్మరించుచు గోపముతో నీవు మృతినొంది తాముండు లోకమునకువచ్చిన నినుపకొమ్ములవంటి తీక్ష్ణములగు కొమ్ములతో నిన్ను బొడువ గాచియున్నవి."

ఆహారార్థముకూడ జీవహింస చేయగూడదు. ఈ మాట కొందఱి కసమ్మతముగనుండినను నివృత్తిమార్గస్థుడేమో ఋషివాక్యమును విశ్వసించవలెను. పలలాశనము శరీరపోషణ కావశ్యకమేనా అను విషయమిటీవల వైద్యశాస్త్రజ్ఞులు పరిశోధించి యవశ్యము లేదనియు, దానివలన స్పష్టముగ కీడేగలుగుననియు, పెక్కండ్రు స్థాపించియున్నారు. ఒకవేళ మనసుకొంచెము సంకటము అసంతుష్టి కల్గినను గురువాక్యమునువిశ్వసించి యభ్యాసము చేయుచు రాగా హింసోపేతమైన యాహారముకన్న శాకాహారమే మేలని మన కనుభవమునకు వచ్చును. నా దేహమునకు మాంసాహారమే కావలెనని యెంతకాల మనుకొనుచుందుమో అంతకాలము మనము మోక్షమార్గములో ప్రవేశించుటకు వెనుదీయుచుందుము. అభ్యాసముచేసిన కొంతకాలమున కేమి కష్టము తోచదు. తైత్తిరీయోపనిషత్తులో "ఓషధీభ్యోఽన్నం" ఓషధులనుండి అన్నము పుట్టినదని చెప్పబడియున్నది. మోక్షమార్గస్థుని కుపనిషద్వాక్యములును ఋషివాక్యములును ప్రమాణములు. వాని ప్రకార మనుష్ఠించుటకు ప్రయత్నముచేయవలెను. ప్రవృత్తిమార్గస్థుడు కర్మకాండ విధులప్రకారము వర్తించవచ్చును. నివృత్తిమార్గస్థుని ధర్మమువేఱు. వాడెట్టి నెపముననైనను జీవహింస చేయగూడదు. ఉత్సవకాలములలో క్షుద్రదేవతలకు జీవహింసచేసి బలియిచ్చుట అజ్ఞానులగు పామరులు చేయుపనియని స్పష్టము.

పరమేశ్వర మూర్తులగు శివకేశవుల యుత్సవములలో సయితమీ కార్యము కొన్నియెడల జరుగుచుండుట యెంతయో శోచనీయము. అకటా! ఇందుకేమి కారణ ముండగలదు? విధ్యుక్తమను నెపము చెప్పుటకు యజ్ఞముకూడ కాదే! ఇట్టి దురాచారములను శీఘ్ర

ముగ దొలగించుటకు శ్రద్ధాళువులగు విజ్ఞులు పూనికతో యత్నింతురు గాక.

ప్రాచీన సూత్రమందు "ప్రాణము" అను పదమునకు "రజోగుణ ప్రవృద్ధత్వము, జీవితము మాత్రమే కాదు" అని యిది వఱలో వ్రాయబడియున్నది.

ఈ రజోగుణము ప్రవృద్ధమై యుండునప్పు డగుపడు గుణములు.—

లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా ॥ (14-12)

ఎవ డపరిమితముగ గోరికలు కోరుచు విసుకు జెందక నిరంతరము ఫల కాంక్షతో బనిచేయుచుండునో వాడు రజోగుణప్రధానుడు. మోక్ష మార్గమునసుండువా డీ రజోగుణమునే కాక సత్వగుణమును సయిత మతిక్రమించవలెను. గుణాతీతుడు కావలెను. అయిన బ్రవృత్తిమార్గ మునందు రజోగుణము మిక్కిలి యావశ్యకమనియు, దమోగుణము నతిక్రమించి రజోగుణము ప్రవృద్ధియగుట యప్పటికి మంచిదే యని యు, రజోగుణమప్పటికి బ్రాధాన్యత నొందనియెడల ఇంద్రియము లును మనస్సు పాటవమును జెంద నేరవనియు, గావున నా మెట్టున నుండువానియందు గన్పడు రజోగుణమును దూషించ గూడదనియు, దానివలన గలుగు మేలును జూచి దానియందు మోక్షమార్గస్థుడు గౌరవముంచును.

ఇట్లు ప్రాచీన సూత్రములో "ప్రాణేచ్ఛను జంపివేయుము" అను విధికి రూపము (Form) నం దభిమానము వదలవలెననియే తాత్పర్యము. అనగా మనము ధరించియుండెడి యుపాధితో బని తీరగనే దానిని విడుచుటకు సిద్ధముగ నుండవలెననియు "ఈ శరీర

మును నేనెట్లు విడువనోపుదు, ఇంకా బహుకాలముండవలెనని యిష్టమున్నది" అని తలచగూడదనియు, ప్రాణ మీశ్వరస్వరూపము కావుననే యేరూపము మన కుపయోగమో ఆ కాలమున కా రూపమును మన కీశ్వరుడొసగుననియు, దలచి కాలానుగత శరీర నాశనమునకు వగవగూడదనియు, రజోగుణము నతిక్రమించవలయుననియు దెలిసికొనవలెను. మఱియు ప్రాణ మీశ్వరస్వరూపమనియు, రజోగుణము జీవపురోవృద్ధికి గావలసినదే యని తెలిసి యే నెపమునకైనను జీవహింస చేయగూడదు. రజోగుణ ప్రేరిత కామేప్సు కర్మను నిందించగూడదు. ఇట్లు ప్రవర్తించిన, వ్యాఖ్యాన సూత్రములో బోధించినట్లు ప్రాణమునందు గౌరవముంచిన వారల మగుదుము.

4. వ్యాఖ్యానసూత్రము:— మొదటిభాగము మూడవవాక్యము.

"సుఖనిమిత్తము జీవించువానివలెనే సుఖముగనుండుము."

దీనిని మూడవ ప్రాచీనసూత్రముతో జేర్చి చదువవలెను.

"సుఖేచ్ఛను జంపివేయుము. [అయినను] సుఖనిమిత్తము జీవించు వానివలెనే సుఖముగనుండుము."

సుఖమును గోరువాడు తనయందు నిరంతరముండు సుఖాస్పద వస్తువును జూడనివాడు. సుఖప్రదాయక వస్తువు తనయందే యున్నదని తెలిసినచో బాహ్యంబునుండి సుఖము రావలెనని కోరడు. విషయసుఖవాంఛ దేహధర్మమేకాని ఆత్మగుణము కాదు.

ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం . . . . . . ।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ॥
(భ. గీ. 13-6)

దేహధర్మములు దేశము, కాలము, వయస్సు, అవస్థాభేదముల ననుస రించి మాఱుచుండును. అట్టి మార్పులు గల దేహములు కోరు సుఖ విషయములు సయితము మాఱుచుండును. యౌవనదశయందు సుఖ ప్రదాయకమగు వస్తువు వృద్ధదశయందు సుఖజనకము కాకపోవుట యే కాక దుఃఖజనకము సయితమగును. కనుక విషయ సంబంధ మగు సుఖదుఃఖములు వచ్చుంబోవులు గలవని చెప్పబడియున్నది.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత ॥

(భ. గీ. 2-14)

విషయములు శీతోష్ణ సుఖదుఃఖముల నిచ్చునవి, వచ్చుచు బోవుచు నుండునవి, అనిత్యములయినవి. కనుక వానిని సహించుము.

ఈ విషయసుఖ మక్షయ సుఖము కానందువలనను, దుఃఖజనక మగుటవలనను ఆ దుఃఖమును నివర్తింపగలుగు సుఖమునం దపేక్ష యుద్భవిల్లును. అది వచ్చినను గొద్దికాలమే యుండి పునః దేశకాలాది భేదకారణమున దుఃఖము ప్రాప్తించగా మఱియు నా దుఃఖనివారణ సుఖప్రాప్తియం దభివాంఛ గలుగును. ఇట్లు సుఖదుఃఖములకు హర్ష విషాదములు చెందుచుండునంతవఱకు నిజమైన సుఖము కలుగనేరదు. విషయముయొక్క రూప (Form) దర్శనమందు ప్రీతికల్గి వానివలన సుఖము కలుగునని భ్రాంతియుండునంతవఱకు నిజమైన సుఖలక్షణ మెఱుగజాలము. ఇంద్రియములకు విషయసంయోగము కాగానే తాత్కాలిక సుఖ మమృతతుల్యముగ గన్పడి యనిత్యమగుటంజేసి యాసుఖము అంతమగుటవలననో లేక దేహధర్మము మాఱుటవలన

పూర్వపు సుఖమే దుఃఖజనకమగుటవలననో కలుగు మనఃఖేదము విషప్రాయముగనుండును.

ప్రాచీనసూత్రములో వర్జనీయమని బోధించబడిన సుఖవాంఛ యీ విషయేంద్రియ సంయోగజనితమైనట్టి యనిత్యమగు సుఖము. క్రమక్రమముగ రూపదృష్టిని మాని యాత్మదృష్టిని నభ్యసించుచు రావలెను. రూపము సుఖము నిచ్చుకాలములో నది రూపసంబంధ మగునది కావున క్షణభంగురమని భావించి హర్షముచెందకుండుట నభ్యసించుటయందు మిక్కిలి కష్టముతోచును. ఈ యభ్యాసము విషప్రాయముగనుండును. అయిన బట్టుదలతో రూపముయొక్క నిజమైన స్వభావమును దెలిసికొని యది యాత్మశక్తులను బ్రకాశించుట కొఱకే యుద్దేశించబడినదనియు, దానియందలి రమ్యత్వ మాత్మ కారణముననే యనియు నెఱిగి యాత్మదృష్టిచే సకల విషయములను జూచుచురాగా ఆత్మ సర్వభూతములయందుండుటవలనను ఆత్మనినా సుఖప్రదాయకమగునట్టి దెద్దియు లేనందునను సకల విషయములు సుఖకరములుగనే తోచును. అన్నియు నమృత ప్రాయములే యగును.

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్వికం ప్రోక్తం ఆత్మబుద్ధిప్రసాదజమ్ ॥
(భ. గీ. 18-37)

ఈ సుఖము మనస్సు బుద్ధి ప్రసాదముచెందుటవలన గలుగు సుఖము. స్వభావతః మనస్సు పరిశుద్ధమైనదే. కామసంయుక్తమైననే మాలిన్యమును జెందును.

మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ॥

మనస్సే మనుష్యులకు బంధమోక్షములు రెంటికి కారణము.

కామముతో గూడుకొని విషయభోగ కాంక్షచే గామితభోగ ప్రాప్త్యర్థం జన్మాంతరముల నెత్తుచుండవలసియుండును.

కామాన్యః కామయతే మన్యమానః
స కామభి ర్జాయతే తత్రతత్ర ॥ (ముండకోపనిషత్తు)

ఎవడు కోరికలను గోరునో వాడా కోరికలతో (నెచ్చటెచ్చట నా కోరికలు నెఱవేరగలవో) అచ్చటచ్చట జన్మించును.

ఇదియే బంధము. ఆ మనస్సునే బాహ్యవిషయములదెస బోనియ్యక ఆత్మదెసద్రిప్పిన బంధము నివర్తించి మోక్షము కలుగును. ఇది యక్షయ సుఖము.

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖం ।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥
(భ. గీ. 5-21)

ఇట్లు తనయందే మనఃప్రసాదజనిత ఆత్మదృష్టిచే బరమసుఖమనుభవించగలవాడు బాహ్యమునుండి సుఖము రావలెనని కోరడు. వాడట్లు కోరుట కవసరము లేదు. ఏ బాహ్యవిషయమును జూచినను దానియందలి యాత్మనే చూచును కావున వానికి విషయమునందు హేయత్వము తోచదు. బాహ్యవిషయమునందలి యాత్మ తనయందలి యాత్మ యొక్కటియే యని తెలిసినవాడు కావున నిరంతరమంతస్సుఖిగనే యుండును. అయితే ప్రతివస్తువు నాత్మభావముచే జూడ గలుగనివానికి "సుఖేచ్ఛను జంపివేయుము" అని చెప్పిన

"సుఖమునుగోరిన బంధము కలుగును. కావున నెప్పుడేనియు సుఖముగ నుండగూడదు. దేహమునకు సుఖము మరిపినయెడల దానిని వశీకరించుకొన జాలము. దానిని గష్టపెట్టి కృశింప జేయవలసినదే" అను విపరీత భావ ముద్భవించవచ్చును. ఇట్టి భావనకలవాడు స్థూలశరీరము వలననే కామముద్భవించుననియు దానిని గష్టపెట్టినయెడల నది దన స్వాధీనమగుననియు, దానగామజయము గల్గుననియు దలచువాడు. ఇవి దురభిప్రాయములు. కోరికలకు ముఖ్యాధారము మనస్సంకల్పము.

సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః ॥
(భ. గీ. 6-24)

మనస్సును బరిశుద్ధముచేసికొనక మిన్నక స్థూలశరీరమును గష్టపెట్టినయెడల నెట్టియుపయోగము లేదు. అట్లుచేయువాడు మిథ్యాచారి యనబడును. ఎందుకనగా, బాహ్యదృష్టికి గర్మేంద్రియముల నియమించుకొని యుండుటయు మనస్సుతో విషయములను స్మరించుచుండుటయందు నిజమైన యాచారమును బయలుపర్చక యసత్యమైన యాచారమును జూపువాడు కావున మిథ్యాచారియనబడును. ఇట్టివాడు ; మఱియు దేహముయొక్క ప్రయోజనమునే తెలిసినవాడు కాడు. సత్కార్యాచరణమునకు, ఈశ్వరసేవకు, లోకసంగ్రహ కర్మానుష్ఠానమునకు, సకలధర్మసాధనమునకు, శరీర మవశ్యము. దానిని గష్టపెట్టినయెడల జెడిపోవును, ఉపయోగము లేనిది యగును. ఊడిగవృత్తితో జీవించువాడు చెడిపోయిన కొరముట్టుతో పనిచేయలేక బ్రతుకుతెరవునుండి ఎటుల భ్రష్టుడగునో అట్లే దుర్బలమై నిరుపయోగమైన శరీరముగల మనుష్యుడు జీవించియు నిరర్థకమగును.

"పరమగురుచరణసన్నిధి" యందు దేహమునకు దురగసామ్యము చెప్పబడియున్నది. గుఱ్ఱము మన కార్యనిర్వర్తనమునకు సహకారిగ నుండవలెనని మన యుద్దేశ్యము. అట్లుండవలెనన, దానిని జక్కగ బోషించవలెను. ఆహారోదకములను జక్కగ శ్రద్ధతో నమర్చవలెను. అపరిమితముగ బనిచేయించగూడదు. సోమరితనముగ నుంచగూడదు. మనకార్యమున కుపయోగముగనుండునట్లు చేసికొనవలెను. ఆ గుఱ్ఱము ను దాడనముచేతను బోషణయందు గుపేక్షచేతను గష్టపెట్టినయెడల దానికి బాధకలుగుటయేగాక మనకార్యమునకు భంగముకలుగును. అట్లే శరీరమును గష్టపెట్టి మనము సుఖవిముఖులైన నేమి యుపయోగము? ఈశ్వరసేవకు భంగము కలుగును. శరీరమును మన స్వాధీనములో బెట్టుకొనవలెనే కాని దుఃఖము పాలుచేయగూడదు. అది జీవరాశి. అందులోని ప్రతియణువునందును భగవంతుడున్నాడు. నిష్కారణముగ దానిని గష్టపెట్టినయెడల బరోప్వృద్ధినిజెందు సుఖమనుభవించవలసిన భగవత్కళలగు యణువుల కాసుఖమును బోగొట్టి వానిని గష్టపెట్టినవారల మగుదుము. ఆ బాధవలన వానియందలి భగవంతునియెడ మనముచేసిన పాపము మనకు వచ్చును.

> దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః ।
> కర్షయంత శ్శరీరస్థం భూతగ్రామమచేతసః ।
> మాం చైవాంతశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్ ॥
> (భ. గీ. 17-5,6)

తెలివిలేనివారై భూతసముదాయముచేరిన శరీరమును గృశింపజేయుచు నా శరీరములోనుండు నన్ను సయితము కష్టపెట్టినవారలగుదురు. అట్టి వారసురస్వభావము గలవారని నిశ్చయించవలెను.

వీరలు కామము దంభము అహంకారము వదలినవారుకారు. వానిని వదలకయే 'మేము ఘోరమైన తపస్సుచేయుచున్నాము, మాకు మోక్షముకలుగును', అని భ్రాంతిచెందినవారు. శరీరమును గష్టపెట్టిన మనఃప్రసాదము కలుగనేరదు. మనఃప్రసాదము లేక సుఖము లేదు.

అశాంతస్య కుతస్సుఖం ॥ (భ. గీ. 2-66)

మన శరీరములన్నియు (స్థూలసూక్ష్మకారణ) నిర్జీవపదార్థములు కావనియు, ప్రతిశరీరమందును నసంఖ్యాతములగు జీవభూతములు (భూతగ్రామము) అణురూపములుగ నున్నవనియు, నా ప్రతియణువును భగవదంశమే కావున పురోవృద్ధిచెంది తుది భగవంతుని జెందగలదనియు ముఖ్యముగ నెఱుగవలయును. మనము నియత మార్గమున బ్రవర్తించిన నా భూతములు పురోవృద్ధి చెందగలవనియే మన శరీరములలో వానిని భగవంతుడుంచినాడనియు, బ్రతిపదార్థము సుఖముగ నుండవలెననియు, జివరన బరమసుఖము చెందవలెననియే భగవంతుని సంకల్పమనియు నెఱుగవలెను. అట్లుండ శరీరమును గష్టపెట్టినయెడల బెక్కుజీవభూతములకు దుఃఖముకలుగజేసి వాని పురోవృద్ధికి భంగము గలుగజేసినపాపము మనకు వచ్చును. అందువలననే సకల గ్రంథములలోను భగవంతుడు ప్రసన్నచేతసుడనియు బరమసంతుష్టుడనియు బాహ్యదృష్టికి నయితము ప్రసన్నవదనుడనియు వర్ణించబడియున్నాడు. యోగిలక్షణము "సంతుష్ట స్సతతం యోగీ" అని చెప్పబడియున్నది. సతత సంతుష్టులైన పరమగురువుల యనుగ్రహము బడయవలెనన మనము నయితము నిత్యసంతుష్టులుగ నుండవలెను. మహానుభావులగు ఋషులు ప్రతిక్షణమందును సర్వభూతములకు సుఖము కలుగునట్లు సంకల్పముల బంపుచుందురు. ఆ దయారస

తటాకమునుండి లోకుల కారసము ప్రవహించి దుఃఖనివృత్తియు సుఖ ప్రాప్తియు గల్గునట్లు చేయుటకు గాలువవంటివారము మనము కావలెను. మనము సంతోషముగ నుండనియెడల మన మనోమయ కోశము క్షోభచెంది చలించుచుండును. ఋషులయొక్క యను గ్రహ రసము లోకులకు బారునట్లు చేయు కాలువ పూడిపోయినట్లగును. చలించుచుండు నీటిలో సూర్యచంద్ర బింబములు ప్రతిఫలించ లేనట్టును, పూడిపోయినకాలువన దటాకోదకము భూములకు బారలేనట్టును, మూయబడిన కిటికీలద్వారా వెల్తురు ప్రకాశించనేరనట్లును, దుఃఖముచే క్షోభించు మన స్వాత్మతేజస్సును గ్రహించ నసమర్థమగును. సుఖప్రదాయకమగు భగవత్కృపారసము ప్రవహింపజేయ నోపదు. అందువలన నీశ్వర సంకల్ప ప్రవర్తకులగు ఋషులయొక్క లోకోపకార కర్మకు సహకారులగు పుణ్యప్రాప్తిని నిరోధించుకొనిన వారలమగుదుము. అట్లుండక సంతుష్టచేతసుల మగుదుమేని మన మనస్సు ఋషుల సంకల్పమును గ్రహించును. లోకోపకార సంకల్పమును సంకల్పించును. సంతుష్టస్వభావము వృద్ధియగును. లోకుల మనస్సును బవిత్రముగ జేయును. లోకులకు సుఖము కలుగజేయును. "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అనియే సంకల్పించుచుండవలెను. అట్టి సంకల్పములన్నియు నీశ్వరసంకల్పములే. అవియే మహానుభావులగు ఋషుల సంకల్పములు. మనకు మనఃప్రసాదము కల్గినగాని యిట్టి సంకల్పముల సంకల్పించజాలము. మనము సుఖముగనుండి మనస్వామ్యత్వముతో లోకహితసంకల్పములు సంకల్పించిన యెడల భగవంతుని తేజస్సందు జేరి మనకు సత్సంకల్పములు సంకల్పించు శక్తి వృద్ధియగుటయేకాక లోకములో సత్సంకల్ప స్వభావ

ము లతిశయిల్లి లోకములో సుఖమెక్కుడగును. ఇదియే యుత్తమ మైన ఈశ్వరసేవ. దైన్యము విషాదము జెందినయెడల నట్టి మనోభావ ములే లోకములో వ్యాపించి యితరులకు సయితము దైన్యవిషాద ములు కలిగి సుఖము తగ్గిపోవును. ఆ పాపము మనకు వచ్చును. ఇచ్చట గొన్ని ప్రశ్నలు కలుగవచ్చును. దుఃఖప్రాప్తియగునప్పుడు సంతోషముగ నెట్లుండనగు? అట్లుండినయెడల సుఖము నటించు మిథ్యాచారి కాడా? మన దుఃఖమును సహించినను లోకములో నెచ్చటజూచినను దుఃఖము సంకటము చూచువాడు అనుతాపముతో ఖేదముచెందడా? అట్లు అనుతాపము లేనివాడు కఠినాత్ముడు కాడా?

దుఃఖకారణములను విచారించదగు. ధనము, ఐశ్వర్యము, దారా పుత్రాదులు, బంధుమిత్రులు లేకపోయెనని, ఉండి వియోగమైరని, దుఃఖముకలుగవచ్చును. ఈ దుఃఖము కలుగుట సహజమే. పూర్వ జన్మములలో జేసిన కర్మయే యిప్పుడు భోగముగా దుఃఖరూపమున వచ్చినదనియు, మనముచేసిన కర్మఫలము మనమనుభవించక తీరదని యు, నెద్దియో యొకజన్మలో దీరవలసినదేయనియు, నిప్పుడు తీరి పోవుటవలన మనపైనుండెడి భారము కొంతవఱకు దొలగిపోయెనని యు, నీ భారము నెత్తిపైన నుండునంతవఱకు గురువులచెంతజేరి వారి పనిచేయుట కభ్యంతరముగ నుండెననియు, నిప్పుడాభారము తొలగి నందున నిక గురువులసేవచేయుట కవకాశము కలిగెననియు దలచి దుఃఖమునకు బరితాపము నొందకపోవుటయేకాక సంతోషముతో దుఃఖమును సహించవలెనని యార్యులు బోధింతురు. ఇందులో మిథ్యాచార మేమియు లేదు. జ్ఞానముచే మనస్సును సమాధానము చేసికొని బాహ్యమందు సయితము దుఃఖమును గన్పర్చనివాడు మిథ్యా

చారి కాడు. ఇదియే సాధనచతుష్టయములో జేరిన షట్సంపత్తిలో తితీక్షయనెడి సాధనము. దీని నభ్యసించుటచే జింతావిలాపరహితమైన దుఃఖసహనమును సాధించవలెను. నైజధర్మమైన సుఖానుభవమున కంతరాయమగు దుఃఖము పోవుటచే సుఖముగనుండ గల్గునము. ఇతను లోకములో జూచు దుఃఖము సహించుటకు నయిత మిదియే యుపాయము. ఆ దుఃఖించు మనుష్యునకు గల్గిన సంకటము వాని పూర్వజన్మకృత కర్మఫలమే యనియు, వాడు దాని ననుభవించక తీరదనియు నెఱిగి, వానికి రాకూడని దుఃఖమువచ్చెనని చింతించక వాని కర్మఋణము తీరిపోవుట వాని మేలుకొఱకే యని నమ్మి, తాను జ్ఞానముకలవాడు కావున వానితోగూడ దాను నయితము దుఃఖములో మునిగి మోహము చెందినయెడల నిష్ప్రయోజనమని యెఱింగి, వానికెట్టి సహాయముచేసిన వానికి మేలుకలుగునో యాలోచించి, వానికిదగిన యుపకారము చేయవలెను. ఇందులో గాఠిన్యమెంత మాత్రములేదు. కనికరము, పరోపకారేచ్ఛ, యను గుణములు వ్యక్తపడుచున్నవి. పరోపకారము చేయగలిగెనని సంతోషమునకు గూడ నవకాశము కల్గెను. శోకమోహములను నజ్ఞానజనిత దోషములు కనుపడలేదు. ఈలాగున దుఃఖమూలమును జ్ఞానముచే విచారించి దానిని సహించి యాత్మగుణమైన సుఖమునే యాశ్రయించి యుండవలెను. నిజముగ దుఃఖమునకు గారణములేకున్నను గొందఱు దుఃఖమును వహించుచున్నారు. నేను వానికుపకారము చేసితిని, వాడు ప్రత్యుపకారము చేయకపోయెను. మఱియు నపకారము చేసెను. నా యజమానుడు నాకంటే వానియందు విశేషముగ దయచూపుచున్నాడు. నాయందు వాడసూయత చెందియున్నాడు. ఏమి

యపకారము చేయునో? నాపైన వాడసత్యమైన నిందారోపణ చేసినాడు. అని యిట్లు దుఃఖకారణములు కల్పించుకొనుచు దుఃఖించుచుందురు. వీరి మనోమయకోశములు ప్రాయశః చలించుచు క్షోభ చెందియుండును. ఉపకారము సహజముగా జేయవలెనే కాని ప్రత్యుపకారాపేక్షతో జేయగూడదు. మనవలన నుపకారము పొందినవాడు మన కపకారమొనర్చినయెడల వానికర్మ వాడనుభవించును. దానిని విచారించువారు భగవంతుడు కర్మదేవతలు నున్నారు. అది మనపని కాదు. వాడుచేసిన యపకారమునకు పునః మన ముపకారమే చేసి వాని దోషమువలన గలిగిన లోకసమష్టి దోషమును దొలగించవలెనేకాని అపకారముచేసి సమష్టిదోషమునకు వృద్ధి కలుగజేయగూడదు. ఎవరియం దెంతమాత్రము దయచూపవలసినది యజమానునికి దెలియును. వెలుపల దయ వ్యక్తపర్చక పోవుటయే కొన్ని సందర్భములలో మేలని వారికి దోచనచ్చును. శిష్యుడు పైపెట్టుకొనచ్చుకొలది వెలుపల జూపు దయ, ఆదరణ మనావశ్యకములుగ నుండును. జ్ఞానము హెచ్చగుకొలదియు గురువు నామీద దయ చూపుచున్నాడా లేదా అని శిష్యుడు తలచడు. ఈ విషయములో మనము ఖేదముచెందుట సరికాదు. మనయం దసూయ చూపువానియందు మనము పూర్వజన్మములయం దసూయ చూపియుండవచ్చును. దానిని వాడిప్పుడు తీర్చుకొనుచుండవచ్చును. మనపైన నిందారోపణ చేసినవాడు సయితము మీరేతినసే మన పురాకృత కర్మఫలమును మనచే ననుభవింపజేయుచుండును. వాడు నిందించినది మనము విని మనస్సున నంటించుకొన్నందున మనకు ఖేదము కల్గినదేకాని మనము గమనించనియెడల, మనకేమి కీడుకలలేదు. కావున వాడు నిశ్చయ

ముగా జెడుగుచేయలేదు. ఈ తీరున ప్రతివిషయమును జ్ఞానముతో విచారించిన శోకమునకు గారణముండదు. మనస్సుయొక్క నెమ్మదికి భంగముచేయునది యుండదు. సంతోషముగ సుఖముగ నుండనగు. మనస్సమాధానముండిన యెడల ఋషుల యనుగ్రహ శేటాకరసమును లోకులకు బాటించగలుగు కాలువలుగా మన ముండగలుగుదుము. అది గొప్పభాగ్యము. సుఖముగ నుండనియెడల మనద్వారా వారి యనుగ్రహము ప్రవహించ నేరదు. లోకసమష్టి నెమ్మదికి భంగము కలుగజేసిన దోషముకూడ మనల నంటియుండును. కావున ప్రాచీన సూత్రములో సుఖేచ్ఛను జంపివేయవలెనని బోధించినది విషయసుఖమును గోరగూడదనియు వ్యాఖ్యానసూత్రములో బోధించినరీతిన ఆత్మ ధర్మమైన సుఖానుభవము ననుష్ఠించుచుండవలె ననియూ దెలియవలెను.

---

## మూడవ అధ్యాయము

## భేదభావనిరసనము: ఆత్మైకత్వము

### ప్రాచీనసూత్రము

5. భేదబుద్ధినంతయు జంపివేయుము.

టీక

చెడ్డవానినుండికాని తెలివిలేనివాని నుండికాని దవ్వుననుండగల నని తలచకుము. వారు నీసఖ గురువులకన్న (కొంచెము) దక్కువగానైనను నీ స్వరూపులే. అయితే ఏ చెడ్డపదార్థము లేక చెడ్డ మనుజునికంటె నేను వేఱు అను భావమును నీలో వృద్ధి కానిచ్చెద వేని, అట్లు చేయుటవలన నా పదార్థముగాని మనుజుడుగాని, నిన్నుండి ప్రత్యేకించబడజాలరని నీ యాత్మ తెలిసికొనువఱకు వాని తో బంధము కల్గించు కర్మను గల్పించుకొనెదవు. లోకముయొక్క పాపము అవమానము నీ పాపము అవమానము అని స్మరించుము; ఎందువలన నన, నీవందులో నొక భాగము; విడిపించుకొన సాధ్యము లేనట్లు నీ కర్మ[1] పెద్దకర్మతో[2] సమ్మేళనమై యున్నది. నీవు జ్ఞానమును బొందుటకుమున్ను అపరిశుద్ధమైనట్టియు బరిశుద్ధమైనట్టియు నన్ని స్థలములలోను నడచియుండవలెను. కావున నీవు స్పృశించ

[1] నీవును లోకములో జేరినవాడవే. [2] లోకకర్మతో.

వెనుదీయునట్టి మురికి వస్త్రము నిన్న నీదిగానే యుండియుండ వచ్చును. రేపు నీదికావచ్చును. దానిజూచి వెఱగంది తొలగి పొయ్యెదవేని నీ భుజములమీద దానిబడవేసినప్పు డది నిన్ను విశేష ముగ నంటుకొనును. నేను ధర్మాత్ముడనని తన్నుదా నెంచుకొను వాడు తనకుదానే బురదపడకను గల్పించుకొనును. దేనినైన వర్జ నీయమను హేతువున వర్జింతువేకాని నీవు పరిశుభ్రముగ నుండ వలెనను నెపమున వర్జించవలదు.

ప్రాచీనసూత్రము

6. ఇంద్రియజ్ఞానేచ్ఛను జంపివేయుము.

7. నేను బెఱుగవలెనను కోరికను (అనగా అభి వృద్ధి తృష్ణను) జంపివేయుము.

వ్యాఖ్యానసూత్రము

8. అయిన నేకాకివై, ఇతర సాంగత్యమును కోరక యుండుము. ఎందువలన ననగా, ఉపాధియుక్తమగునది యెద్దియైనను, భేదజ్ఞానము గల దెద్దియయినను, నిత్యము కానిది యెద్దియైనను, నీకు సహాయముచేయ నోపదు. ఇంద్రియజ్ఞానముచే దెలిసికొనుము; పరిశీలించి చూడు ము; అట్లు చేసిననే నీ వాత్మవిద్యాశాస్త్రమును గఱి చుట కారంభించి, యా నిచ్చెనయొక్క మొదటి మెట్టు నం దడుగిడ సమర్థుడవగుదువు. తనపై వాయుస్పర్శ

గల్గునట్లు తన హృదయమును విచ్చుకొనవలెనని మిక్కిలి కుతూహలపడుచు దనకు దెలియకయే తాను బెఱుగు (వికసించు) పుష్పమువలె నీవు పెఱుగుము. (దానివలె నీవును) నిత్యవస్తువుదెన నీ యాత్మ (కవాటము) ను దెఱచి యుండ మిక్కిలి ప్రయత్నము చేయవలయును.[1] నిత్యవస్తువే[2] నీ లోపలనుండు శక్తిని రమ్యత్వమును బహిర్వ్యాపకము చేయవలయునుగాని[3] అభివృద్ధి తృష్ణ కాదు.[4] మొదటి మార్గమున[5] పారిశుద్ధ్యవిస్తారముచే నభివృద్ధి జెందెదవు. రెండవ మార్గమున[6] స్వమహిమ ప్రాప్తివిషయమైన బలవత్తరమగు కోరికవలన (అధో మార్గమందు) స్తంభించెదవు.

ద్వితీయాధ్యాయమున మొదటి మూడు ప్రాచీనసూత్రములును వానిపైని నాల్గవ వ్యాఖ్యాన సూత్రమును విచారించబడెను. ఆ ప్రాచీనసూత్రములు ముఖ్యముగ మనోమయకోశ సంబంధమైన దోషముల నెఱిగి వాని వర్జించవలెనని బోధించుచున్నవి. అందులో

[1] భగవంతుని యనుగ్రహమునకు సిద్ధముగ నుండవలెనని వలయు ప్రయత్నములను దామసించక చేయవలెను.

[2] భగవత్కార్య నిర్వర్తక చింతయే.

[3] వికసింపజేయవలెను.

[4] నేను గొప్పవాడను గావలెనను కోరిక యుండగూడదు.

[5] భగవత్కార్య నిర్వర్తక చింతగల్గినచో.

[6] అభివృద్ధితృష్ణచే.

మొదటి సూత్రమునం దాకోశ నైజధర్మమైన కామమును వదలవలె ననియు, రెండవ సూత్రమునం దాకోశము రజోగుణ ప్రవృద్ధమైనప్పు డు కన్పడు నింద్రియ మనోవిజృంభణముల నణచవలెననియు, మూ డవసూత్ర మాకోశము సత్త్వగుణప్రధానమైనపుడు జనించెడు నశ్వర సుఖేచ్ఛను మానవలెననియు బోధించబడియున్నది. ఇప్పుడు 5, 6, 7 ప్రాచీనసూత్రములు విచారించబడును. ఈ మూడు సూత్రములు ప్రాయశః విజ్ఞానమయకోశ దోషములను దెల్పుచు వానిని వర్జించ వలెనని బోధించుచున్నవి. ఆ కోశముయొక్క ముఖ్యదోషము అహంకారము. 'నేను' అనుభావము. అనగా భేదబుద్ధి, దానివలన మమకారము అనగా "నాది" అనుబుద్ధి, అనగా చేయబడు కర్మ యందును భోగించబడు విషయములందును కర్తృత్వభోక్తృత్వాభి మానముకల్గును. ఈ అహంకారాభిమానములే సంసారకారణములు.

అయం మహానహంకార వృత్తిమాన్ కర్తృలక్షణః
సర్వసంసారనిర్వోఢా విజ్ఞానమయశబ్దభాక్ ।
అహం మమే త్యేవ సదాభిమానం దేహేంద్రియాదౌ కురుతే గృహాదౌ
జీవాభిమానః పురుషోఽయమేవ కర్తాచ భోక్తాచ సుఖీచ దుఃఖీ ॥
స్వవాసనాప్రేరిత ఏవ నిత్యం కరోతి కర్మోభయలక్షణం చ
భుఙ్క్తేతదుత్పన్నఫలం విశిష్టం సుఖం చ దుఃఖం చ పరం చ తత్ర ॥
(సర్వవేదాంతసార సంగ్రహము, 351, 352, 353)

ఈ గొప్ప విజ్ఞానమయకోశాభిమానాత్మ అహంకారవృత్తిగలది, కర్తృలక్షణముగలది. సకల సంసారమును నిర్వహించునది. దేహేం ద్రియాదులయందును గృహాదులయందును 'నేను' 'నాది' అని సదా

అభిమానముకలిగి యుండును. జీవాభిమానము కలదియు నిదియే. కర్తయును, భోక్తయును, సుఖించునదియు, దుఃఖించునదియు నిదియే. ఎల్లప్పుడు స్వవాసనాప్రేరితమై శుభాశుభ కర్మలను నిర్వర్తించుచు వానివలన గలుగు నిహాముత్ర సుఖదుఃఖ ఫలముల ననుభవించుచుండును.

మఱియును,

స్వయం పరిచ్ఛేద్యముపేత్యబుద్ధేః
తాదాత్మ్యదోషేణ పరం మృషాత్మనః ।
సర్వాత్మకస్సన్నపివీక్షతే స్వయం
స్వతః పృథక్త్వేన మృదో ఘటానివ ॥

(వివేకచూడామణి, 191)

ఆత్మ తాను సర్వాత్మకుడైనను మిథ్యారూపముకల బుద్ధి తాదాత్మ్య దోషముచే బరిచ్ఛిన్నత్వమును వహించి మృత్తుకన్న ఘటము వేఱు అని చూచునట్లు 'నేను' 'నాది' అను భేదబుద్ధిని వహించును.

ప్రాచీనసూత్రములు

5. భేదబుద్ధినంతయు జంపివేయుము.

6. ఇంద్రియజ్ఞానేచ్ఛను జంపివేయుము.

7. నేను బెఱుగవలెనను కోరికను [అనగా అభివృద్ధి తృష్ణను] జంపివేయుము.

5 వ సూత్రములో విజ్ఞానమయకోశ ముఖ్యలక్షణమైన అహంకారము, పృథగ్భావము వదలవలెననియు, 6 వ సూత్రములో కోశము రజోగుణప్రధానమగునపుడు కలుగునట్టి ఇంద్రియములవలనను మనస్సు

వలనను స్వీకరించబడిన విషయానుభవములయందు కర్తృత్వభోక్తృత్వాభిమానములను వదలవలెననియు, 7 వ సూత్రములో గోళము సత్త్వగుణప్రధానమగునపుడు జనించు జ్ఞానసంగము.

సుఖసంగేనబధ్నాతి జ్ఞానసంగేన చానఘ ॥

అనగా గొప్పవాడను గావలెను, నేను గొప్పజ్ఞానిని అని యనిపించుకొనవలెను, అనెడి యభివృద్ధి తృష్ణను బోగొట్టుకొనవలెననియు బోధించుచున్నవి. ఇకను 5, 6, 7, సూత్రములు ప్రత్యేకముగా విచారించబడును.

5 వ సూత్రము :—భేదబుద్ధినంతయు జంపివేయుము.

ఈ భేదబుద్ధి మిథ్యాబుద్ధి. దేహాదులయందలి మోహమునం జనించునది.

. . . . . . విద్వాన్ ఆత్మనోలక్షణైః పరైః ॥
అహంమమేత్యసద్భావం దేహాదౌ మోహజం త్యజేత్ ॥
(శ్రీమద్భాగవతము, 7-7-20)

విద్వాంసుడు శ్రేష్ఠములైన ఆత్మలక్షణములచేత దేహాదులయందలి మోహమువలన బుట్టిన 'నేను' 'నాది' అను మిథ్యాదృష్టిని విడునవలెను.

నిజముగా ఆత్మయొక్కటియే.

ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ నాన్యత్
కిఞ్చన మిషత్ । (ఐ. ఉప)
ప్రజాకామోవై ప్రజాపతిః సతపోఽతప్యత ।
స తపస్తప్త్వా స మిథునముత్పాదయతే ॥ (ప్ర. ఉ.)

సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి . . . .
ఇదంసర్వమసృజత ।
తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్ తదనుప్రవిశ్య
సచ్చత్యచ్చాభవత్ ॥ (తై. ఉప., బ్రం. వల్లి)

ఆదియందు ఆత్మయొక్కటియే యుండెను. వేఱొకటియు లేదు. ప్రజాకాముడై ప్రజాపతి తపస్సుచేసి (ద్రవ్యము, ప్రాణము,) అను మిథునమును సృజించి ఇవి నాకు బహువిధములైన ప్రజలను గావించు నని తలచెను.

"నేను బహుత్వమును జెందెదను, నేను జనియించెదను గాక" అని ఆత్మ సంకల్పించి తపస్సుచేసి దీని (ఈ ప్రపంచము) నంతయు సృజించెను. సృజించి దానిలో ప్రవేశించెను. బ్రవేశించి రూపా రూపము లయ్యెను. (అనగా మూర్తామూర్తకమైన సర్వ ప్రపంచము తానే ఆయెను).

ఇందువలన నొక్కరుండగు పరమేశ్వరుడు తన సంకల్పముచేతనే ప్రపంచముగా బహుత్వమును జెందెనని తెలియనచ్చుచున్నది. అనగా ఒక ఈశ్వరుడే పలురూపములుగను పలునామములుగను బ్రకాశించుచున్నాడు.

ఈ విషయమై కఠోపనిషత్తునందు :—

అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ ।
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥

వాయుర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ ।
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥
ఏకో వశీ సర్వభూతాంతరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి ।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః
తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం ॥

ఎట్లు అగ్ని యొక్కటియైనను లోకములో బ్రవేశించి యనేక రూపములు గలదియయ్యెనో (అనగా ప్రతియింటిలో అగ్ని, ప్రతి హోమ గుండములో అగ్ని, ప్రతిశ్మశానములో అగ్ని ఇత్యాది), ఎట్లు వాయువు ఒక్కటియైనను లోకములో బ్రవేశించి యనేక రూపములు గలదియయ్యెనో, అట్లే ఒక్కరుడును బ్రభువునగు సర్వభూతాంతరాత్మ యొక్క రూపమునే అనగా తన సదేకరస విశుద్ధ విజ్ఞానరూపమును నామరూపాది యశుద్ధోపాధి భేదవశమున బెక్కులుగ జేయును.

మఱియు భగవద్గీతయందు,

యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ (13-30)

భూతములయొక్క పృథగ్భావము (వేఱు అను భావము) ఏకత్వమునందు బ్రతిష్ఠించబడి యున్నదనియు, దానినుండియే విస్తరించినదనియు, నెప్పుడు చూచునో అప్పుడు బ్రహ్మత్వమును బొందును. అనగా

ఒక బ్రహ్మమునుండియే నానా రూపములు గల ప్రపంచ ముత్పన్న మైనది. ఒక బ్రహ్మమే భిన్నరూపములుగ గన్పడుచున్నాడు. శ్రీమద్భాగవతమునందు,

ఖం వాయు మగ్నిం సలిలం మహీం చ
జ్యోతీంషి సత్వాని దిశో ద్రుమాద్రీన్ ।
సరిత్సముద్రాంశ్చ హరే శ్శరీరం
యత్కించ భూతం ప్రణమే దనన్యః ॥ (11-2-41)

పంచభూతములు, తన్మాత్రలు, దిక్కులు, తరువులు, గిరులు, నదులు, సముద్రములు, మఱియు నేభూతములుగలవో యవియన్నియు హరి యొక్క శరీరములే యని భావించి యనన్యభావముతో వానికన్నిటికి నమస్కారము చేయవలెను.

ఇందువలన ముఖ్యముగ నెఱుగవలసిన దేమియన, ఒక్క భగవం తుడే తన సంకల్పమహిమచే నానా రూపములను బొంది ప్రతిరూప ములో నంతరాత్మరూపై ప్రవేశించి యా రూపముద్వారా తాను వెలుగుచుండుననియు, వేలు వేలుగా గన్పడు రూపము లాయన విభూతిని గన్పరచునవియే కాని వాస్తవముగ భిన్నత్వము లేదనియు, బహుత్వము రూపములకు సంబంధించినదే కాని ఆత్మకు లేదనియు, రూపములయొక్క పృథక్త్వమునం దాత్మ ఏకత్వమును వీక్షించ వలెననియు, తెలియవలెను. ఏ రూపమును జూచినను భగవద్భావమే స్ఫురించవలెను. అట్లుకాక రూపభేదమును జూచుటవలన సర్వా నర్థములు కలుగును. ఏకత్వబుద్ధియే సర్వసుగుణముల కాధారము. భేదబుద్ధియే సర్వ దుర్గుణములకు మూలము.

భయంద్వితీయాభినివేశితస్స్యా
దీశాదపేతస్య విపర్యయో స్మృతిః । తన్మాయయా ॥

(శ్రీభాగ. 11-2-37)

ఏకత్వమును జూడక భేదదృష్టి ఎప్పుడు కలిగెనో అప్పుడీశ్వర విముఖత్వము కలిగినట్లే. ఎందువలన ననగా ఈశ్వరదృష్టిచే భేద బుద్ధి కలుగనేరదు. ఈశ్వరవిముఖత్వముచే మాయకు వశమగుదుము. అనగా దేహతాదాత్మ్యము కలుగును. భిన్నభావము వృద్ధియగును. నేనువేఱు వాడువేఱు అను భావముతో నాకుగావలె నను కామము పుట్టును. దాన క్రోధము, మోహము, స్మృతివిభ్రమము, బుద్ధి నాశము, మొదలగు నాశహేతుపరంపరకు లోనగుదుము. భయ మునకు గారణ మీ భేదబుద్ధియే. మనకన్న బెద్దలయెడ నీ భేదభావముచే భక్తిరాహిత్యము, అవిధేయత, తిరస్కా రము, ద్వేషము మొదలగు దుర్గుణములును, మన సమానులయెడ మర్యాద లోపము, పరస్పరమైత్రిరాహిత్యము, స్పర్ధా, అసూయ, ద్వేషము మొదలగు చెడ్డగుణములును, దక్కువవారియెడ నిర్దయ, క్రౌర్యము, హింస మొదలగు దుష్టగుణములును గలుగును. ఇట్లు సర్వదుర్గుణమూలమైన భేదబుద్ధిని వదలవలెనని సూత్రము బోధించు చున్నది.

"చెడ్డవానినుండిగాని తెలివిలేనివానినుండిగాని దవ్వున నుండ గలనని తలచకుము."

విజ్ఞానమయకోశము అహంకారాభిమాన దోషములు గలదియని యిదివఱకే చెప్పబడెను. ఈ దోషములవలన నేను మంచివాడను,

మంచికార్యముల జేసితిని, నేను జ్ఞానిని, గొప్పవాడను అను భావ ములతో నిండియుండును. అందువలన జెడ్డవానిని, దెలివిలేనివానిని, ద్వేషముతోను నుపేక్షభావముతోను జూచును. ఈ దోషములను వర్జించవలెనని సూత్రము బోధించుచున్నది. ఇది చాలా కష్టమైన కార్యము. తొలుత ద్వేషభావము పోవలెను. పిమ్మట నుపేక్షభావము పోవలెను. అటుపిమ్మట నేకత్వదర్శనము కావలెను.

నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతి పాండవ ॥

(భ. గీ. 11-55)

సర్వభూతములయందు నిర్వైరిగ నెవ్వడుండునో వాడు నన్ను జెందును.

మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥

(భ. గీ. 16-18)

ఒకడు మఱియొకని ద్వేషించిన వానియందును దనయందును (అంత రాత్మగా) నుండెడి నన్ను ద్వేషించుచున్నాడు.

ఈ ద్వేషభావమెట్లు పోవలెను? ద్వేషము భేదబుద్ధివలనను, భేద బుద్ధి అజ్ఞానమువలనను గలిగినవి. ఇప్పుడు విచారముతో యదార్థస్థితిని బరిశీలించి తెలిసికొనినయెడల నా దోషము తొలగును. శరీరదృష్టివలన భేదబుద్ధి కలిగెను. ఆత్మదృష్టివలన భేదబుద్ధి తొలగవలెను. సర్వ భూతములయందు భగవంతు డాత్మస్వరూపుడై యున్నాడని ముఖ్య ముగ నమ్మవలెను.

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ॥ (భ.గీ. 10-20)

సర్వభూతముల హృదయములయందుండెడు ఆత్మ నేను.

న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరం ॥

(భ. గీ. 10-39)

నేనువినా చరాచరాత్మకమగు నది యెద్దియును లేదు.

భగవంతునికి హేయపదార్థ మెద్దియు లేదు.

ఏ చైవ సాత్వికా భావా రాజసాస్తామసాశ్చ యే ।
మత్త ఏవేతి తాన్విద్ధి . . . . . . ॥ (భ. గీ. 7-12)

సాత్వికభావములే కాదు, రాజస తామస భావములుకూడా నన్నుండి యే యుద్భవించినవి.

ఇట్లు గుణప్రాధాన్యముచే భిన్నముగనుండినను ఆత్మమాత్ర మన్నిటియందును సమముగనుండును.

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం ।
. . . . . . . . . . . . . . యః పశ్యతి స పశ్యతి ॥

(భ. గీ. 13-28)

పరమేశ్వరుడు సర్వభూతములయందు సమముగ నున్నాడని ఎవడు చూచునో వాడే తెలిసినవాడు.

ఇట్లు సర్వభూతములయందు సమముగ భగవంతు డుండిన భేద మెట్లు కలిగెనని విచారించవలెను.

జీవులందఱు ఏకకాలమున జీవయాత్రకు బయలువెడలినవారు కారు. ప్రవాహరూపమున జీవు లసంఖ్యాతములుగా భగవంతు డనెడి గొప్ప మంటనుండి మిణుగురులవలె బయలువెడలి వచ్చుచుందురు. జీవలోకములోని విషయానుభవమును బొందుటకొఱకు జీవుడాయా లోకమునకు దగిన యుపాధిని గల్పించుకొనును. అదియందు అల్ప

ము, తుచ్ఛము, నీచమునగు విషయానుభవమునకు మిక్కిలి స్థూలమైన అణువులుకూడిన మలిన యుపాధిని వహించును. ఒక్కొక్క జన్మమందు గొంచెమెక్కుడు విషయానుభవముచే జ్ఞానము వృద్ధియగుచురాగా వానియుపాధియు స్థూల అణువులు పోయి సూక్ష్మ అణువులు చేరుటద్వారా పరిశుద్ధమగుచుండును. జీవయాత్రకు ముందు బయలుదేరి శీఘ్రముగ యాత్రాకార్యమును నిర్వర్తించువారి యుపాధులు వెనుక బయలుదేరినవారును మందగమనులును అగువారి యుపాధులకన్న నెక్కుడు పరిశుభ్రముగ నుండును. ఇట్లొక జీవుని యుపాధికన్న మఱియొక జీవుని యుపాధి మాలిన్యపారిశుద్ధ్యములలో భేదములు గలవియైయుండును. ఆత్మశక్తి లింకను వికసింపమిరయే కారణమగు మలినమైన యుపాధిద్వారా ఆత్మ ప్రకాశము తక్కువగ నుండును. ఆత్మశక్తి కొంచెమెక్కువగ వికసించుటద్వారా లభించు పరిశుద్ధయుపాధిద్వారా ఆత్మప్రకాశ మెక్కుడుగ నుండును. నాలుగు ప్రక్కల నద్దములుగల యొక లాందరులో దీపము పెట్టి యొక యద్దమును నల్లని మసితో నింపి, రెండవదానిపైన సగము మసిపూసి సగము తెల్లగ స్వచ్ఛముగ నుంచి, మూడవ యద్దము పీతవర్ణముగను, నాల్గవదానిని రక్తవర్ణముగ నుంచిన లోపలనుండెడి యొక్క దీపమే పూర్తిమసిపూసిన అద్దముగుండా కనుపడకనే పోవును. ఆ అద్దముగుండా చూచిన దీపమే లేదని తోచును. సగము స్వచ్ఛముగానుండు అద్దములో ఆ సగభాగము ద్వారా బాగుగ దీపము ప్రకాశించును. శేషించిన రెండద్దముల ద్వారా దీపము పీతరక్తవర్ణములుగ నగుపడును. ఇట్లొక్క దీపమే అద్దములయొక్క వర్ణమాలిన్యముల ననుసరించి భేదముగ గన్పడునట్లే

యొక్కటియగు ఆత్మ ఉపాధిభేదములచే నానా రూపములుగ గుణ జాతి భేదములుగా గన్పడును. జ్ఞాని లుపాధిభేదములను దాటించక ఆత్మ ఏకత్వమునే చూచెదరు. ఇప్పుడు పరిశుద్ధయుపాధిని బొంది మంచివాడు బుద్ధిమంతు డనిపించుకొనెడివాడు పూర్వము మలినయుపాధిలో జిక్కుబడి చెడ్డపనులుచేయుచు, జెడ్డవాడు తెలివిలేనివాడు అని యనిపించుకొన్నవాడే యనియు, ఇప్పుడు చెడ్డవాడుగ గన్పడువాడు భావికాలమున నుపాధి పారిశుద్ధ్యముచే మంచివాడు, కాగలడనియు మంచిచెడ్డలు కాలపరిచ్ఛిన్నత్వ దృష్టిచే దోచునవియే యనియు, నిత్యత్వదృష్టిచే జూచిన సాధు అసాధుత్వములు జీవునిపరిణామదశ ననుసరించి యా యా కాలమునకు సప్రయోజనములనియు, సర్వజనులు క్రమక్రమమున బరిపూర్ణులై ఈశ్వర సాన్నిధ్యమును జెందగలవారే యనియు, ఈశ్వరుని కన్నియంతస్థల లో నుండెడి భూతములు ప్రియములేయనియు, నికృష్ట ప్రకృష్టభావము లాయనయందు లేవనియు, ఈశ్వరుడు ప్రవేశించుట కర్హమైన రూపము (form) మనకు హేయ మెంతమాత్రము కానేరదనియు, జ్ఞానులు తలచెదరు.

> విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
> శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥ (భ. గీ. 5-18)
> సుహృ న్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధుషు ।
> సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే ॥ (6-9)
> మృగోష్ట్రఖరమర్కాఖు సరీసృపఖగమక్షికాః ।
> ఆత్మనః పుత్రవ త్పశ్యేత్ తైరేషామంతరం కియత్ ॥
> (శ్రీ భాగ. 7-14-10)

విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణునియందును, గోవునందును, గజమునందును, శునకమునందును, శునకమాంసమును భక్షించెడి చండాలునియందును, పండితులు సమదర్శనులుగ నుందురు. సుహృదులు, మిత్రులు, శత్రువులు, ఉదాసీనులు, మధ్యస్థులు, ద్వేష్యులు, బంధువులు, సాధువులు, పాపులు, వీరందఱియందు సమబుద్ధిగలవాడు శ్రేష్ఠుడు.

జింకలు, ఒంటెలు, గాడిదెలు, కోతులు, ఎలుకలు, సరీసృపములు, దోమలు, వీనినన్నిటిని ఆత్మసామ్యమునను, పుత్రవిధమునను జూడవలెను. (పరీక్షించిచూడ) వానికిని (అనగా మృగాదులకు) వీరికిని (అనగా పుత్రాదులకు) నేమి భేదము?

అయితే యీ విషయములో విపరీతజ్ఞానము కలుగగూడదు. భూతమునకు భూతమునకు భేదములేక పోలేదు. ఉపాధ్యపేక్షయా భేదముండునది సత్యము. జ్ఞానులకీభేదము తెలయకపోలేదు. ఏ జీవు డేమెట్టుననుండునది వారికి వేద్యమే. ప్రతిజీవుడు ఏ మెట్టుననుండునది యెఱిగినవారు కావున ఆ మెట్టున గన్పడు దోషములప్పటి దశయందు స్వాభావికములే యనియు, వానికి జ్ఞానమొసగుట కవశ్యకములే యనియు, నెఱిగి యాదోష నివారణకును ధైర్యం తెసుకు బోవుటకును వలయు సహాయము చేయుదురుకాని ఆ దోషములను జూచి వాని నిందించరు, ద్వేషించరు, హేయుడని తలచరు. దూష్యుడని తిరస్కరించరు. మనము మన బాల్యమునందనేక దుష్కార్యములు చేసియుందుము కదా. ఇప్పుడవి దోషములని యెఱిగి మనలను మనము నిందించుకొనము గదా. ఎందుకు? బాల్యాది సర్వదశల లక్షణములు మనకు విదితములై యున్నవి కావున

ఆ యా దశయందలి చేష్టలు ఆ దశకు స్వాభావికములే యని తలచు కొని దూషణ తిరస్కారభావములను వహించము. అట్లే నిత్యత్వ భావముతో అనగా ఈశ్వర దృష్టితో సకల విషయములను బరిశీలించి చూచినయెడల హేయము దూష్యమెద్దియు లేధని మనకు వేద్యముకాగలదు. పుణ్యపాపములకు మనము లోబడియుండునంత వఱకే పాపకార్యము జేయువానియందు ద్వేషభావము కలవారమై యుందుము. ఆత్మభావముచే బుణ్యపాపములను ద్వంద్వముల కతీతుల మగుదుము. విమర్శించిచూడ నీ పుణ్యపాపములు తారతమ్యమున నందఱిని నంటియే యుండును. నేను బుణ్యకార్యము చేసితిని, చేయకపోతినే, పాపకార్యములు చేయలేదు, చేసితినే, అనుభావము కలిగియుండునంతవఱకు బుణ్యపాపములకు లోబడియుందుము. పుణ్యాత్ముడు వేఱు, పాపాత్ముడు వేఱు, దూష్యుడు, అని తలచుకొనుచుందుము. ఆత్మదృష్టిగలవా డట్లు చూడడు.

ఏతం హవావ నతపతి కిమహం సాధునాకరవం ।
కిమహం పాపమకరవమితి ॥
సయ ఏవం విద్వాన్ ఏతే ఆత్మానం స్పృణుతే ।
ఉభే హ్యేవైష ఏతే ఆత్మానం స్పృణుతే ॥
(తైత్తి. బ్రం. ఆనం.)

నేను బుణ్యకార్యము చేయకపోతినే, పాపకార్యము చేసితినే, అని సంతాపము చెందడు. ఈ ఆత్మవేత్త పుణ్యపాపములు తాపహేతువులని యెఱిగి ఆత్మను బ్రేమించును. అనగా ఈ పుణ్యపాపములను నాత్మరూపముతో జూచును.

శంకరభాష్యము—ఆత్మరూపేణైవ పుణ్యపాపే స్వేన
విశేషరూపేణ శూన్యే కృత్వా ఆత్మానం స్పృణుత ఏవ ।

పుణ్యపాపములకు వాని ప్రత్యేక భావములు శూన్యముగాజేసి ఆత్మ
స్వరూపములుగా జూచును. దీని నొక యుదాహరణచే బోధ
చేసికొన బ్రయత్నించవచ్చును.

పాపమనగా జ్ఞానలేశము. ఒక శ్రేణిక యొక్క నాల్గవ మెట్టుననుం
డువానికి మూడవ మెట్టున జేయబడు కార్యము జ్ఞానశూన్యతవలన
బాపముగ దోచవచ్చును. ఇట్లు నాల్గవ మెట్టున జేయబడు కార్యము
క్రింది మెట్టుననుండి చూడ బుణ్యముగను నయిదవ మెట్టుననుండి చూడ
బాపముగను దోచును. ప్రతిమెట్టున నిట్లే యుండును. అన్ని
మెట్లు దాటి పైకిబోయినవాడు ప్రతిమెట్టునను ఆత్మ యా యా
మెట్టుకు దగిన యుపాధిద్వారా ప్రకాశించుచు నాయావిషయముల
ను భోగించుచు నాయాచేష్టలు చేయుచు గ్రీడించుచున్నదని తెలిసి
కొని ప్రతికార్యమును నాత్మక్రీడగా భావించి యానందించును.
అనగా ఉపాధిదృష్టికి బుణ్యపాపములు కనుపడును, పూజానిందలు
స్ఫురించును. ఆత్మదృష్టికి సర్వము ప్రేమార్హమని తోచును.
ఇట్లాత్మదృష్టితో జూచువాడు ద్వేషరాహిత్యుడగుటయేకాక
ఉపేక్షభావమును సయితము వహించడు. ఆత్మప్రేమార్హమైనది
కాని ఉపేక్షణీయము కాదు.

స్వత ఏవహి సర్వేషా మాత్మాప్రియతమో యతః ॥ (వి వే. చూ.)

ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సుచ ।

ప్రేమ మైత్రీ కృపోపేక్షా యః కరోతి స మధ్యమః ॥

ఈశ్వరునియందు ప్రేమ, తద్భక్తులయందు మైత్రి, అజ్ఞానులయందు కృప, ద్వేష్యులయం దుపేక్ష, ఎవడుచేయునో, వాడు మధ్యమ భాగవతుడు.

ఇకనుత్తమ భాగవతు డెట్టివాడన :—

> సర్వభూతేషు యః పశ్యే ద్భగవద్భావ మాత్మనః ।
> భూతాని భగవత్యాత్మ న్యేష భాగవతోత్తమః ॥

సర్వభూతములయందు (సాధువులయందు, అసాధువులయందు, మనుష్యులయందు మృగాదులయందు) భగవంతుని, దన్నుచూచుచు భగవంతునియందును దనయందును సర్వభూతములను నెవడు చూచునో వాడు భాగవతోత్తముడు.

కావున ఎట్టి పాపియేకాని దవ్వుననుంచ నర్హుడుకాడు. (అనగా ద్వేష్యుడుకాడు. ఉపేక్షనీయుడుకాడు). ఇట్టిభావము సంపాదించుట కేమిచేయవలెను? ఈ విషయమై శ్రీకృష్ణుడుద్ధవునకు జెప్పిన బ్రహ్మవాదసారమునం దిట్లు బోధించబడియున్నది.

> మామేవ సర్వభూతేషు బహిరంతరపావృతం ।
> ఈక్షేతాత్మని చాత్మానం యథాఖమమలాశయః ॥
> ఇతి సర్వాణి భూతాని మద్భావేన మహామతే ।
> సభాజయన్మన్యమానో జ్ఞానం కేవలమాశ్రితః ॥
> బ్రాహ్మణే పుల్కసే స్తేనే బ్రహ్మణ్యేఽర్కే స్ఫులింగకే ।
> అక్రూరే క్రూరకేచైవ సమదృక్పండితో మతః ॥
> నరేష్వభీక్ష్ణం మద్భావం పుంసోభావయతోఽచిరాత్
> స్పర్ధాసూయాతిరస్కారాః సాహంకారావియంతి హి ।
> విసృజ్యస్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాంచదైహికీమ్ ॥

ప్రణమేద్దండవద్భూమా ఆశ్వచండాలగోఖరమ్ ।
ఈశ్వరోజీవకళయా ప్రవిష్టో భగవానితి ॥
యావత్సర్వేషు భూతేషు మద్భావో నోపజాయతే ।
తావదేవ ముపాసీత వాఙ్మనఃకాయవృత్తిభిః ॥

(11-29. 12-17)

సర్వభూతములయందును దనయందును నాకాశంబువలె బహిరంతరపావృతుండైన నన్ను గనవలయు. ఇట్టి జ్ఞానదృష్టినాశ్రయించి సర్వభూతములను మద్భావనంబునం బూజించుచు, బ్రాహ్మణులందును, చండాలులందును, దొంగలయందును, బ్రహ్మణ్యులయందును, సూర్యునియందును, మిణుగురునందును, క్రూరులయందును, సౌమ్యులయందును సమదర్శనంబు గల యతడు పండితుడు. సర్వజనులయందు విశేషముగా నాభావమును భావించు పురుషునకు శీఘ్రమే స్పర్థా, అసూయ, తిరస్కారాహంకారములు విడిచిపోవును. పరిహసించు స్వజనులను, దేహాభిమానమును, లజ్జను విడిచి కుక్క, చండాలుడు, గోవు, గర్దభము, వీని నన్నిటియందు భగవంతుడు జీవకళగా బ్రవేశించియున్నాడని తలచి దండప్రణామం బొనర్చవలయు. సర్వభూతములయందును మద్భావము లెస్స గలుగునంతపఱకు మనోవాక్కాయవృత్తుల ని ట్లుపాసించవలయు.

అహంకారము భేదబుద్ధి తొలగుట కింతకన్న వేఱొండు ఉపదేశముండ నేరదు. ఇంతకన్న మేలైన ఉపాసనలేదు. శునకమును ఖరమును వీక్షించిన నరరూపమున మనయం దీశ్వరకళయుండునట్లు వానియందు సయితము భగవత్కళ ప్రకాశించుచున్నది. అనగా భగవత్కళ ఆరూపమును ధరించియున్నది. వానిని జూచి భగవంతుని

యొకవిధమైన కళను స్మరించుట కవకాశము కలిగెనని యానందించ దగు. సర్వభూతములకు సమానమైన ధర్మము భగవద్భావము. ఆ భావమును వీక్షించ నభ్యసించిన భేదబుద్ధి నశించును. భేదబుద్ధి నశించువఱకు నా యభ్యాసము చేయుచునే యుండవలెను. యోగ సిద్ధితో ఆనందమయకోశములో బనిచేయువారికి అభేద దర్శనము లభ్యమగును. మనకు సాక్షాద్దర్శనములేదు. భేదములు కనుపడుచునే యుండును. అయిన నుపాధుల నానాత్వములో నాత్మైకత్వమును భావించ నభ్యసించుచురాగా అభేద అపరోక్షానుభవముకూడా కాలపక్వమున మనకు సిద్ధించును.

ఈ యుపాసనకు ముఖ్యమైన యంతరాయ మెద్దియన మనము బహుజన్మములనుండి పెంచి వృద్ధిపొందించిన న్యూనాధిక్యభావము. అనగా నేను హెచ్చు; వాడు తక్కువ అనుభావము. ఇదియే గర్వము. ఇదియే మానము. ఇది యసురసంపదలో జేరినది.

దంభమాన మదాన్వితాః ॥

ఈ న్యూనాధిక్య భావము సాధారణముగా ధనము, బలము, ఐశ్వర్యము, కులము, విద్య, రూపము, వీని నాశ్రయించియుండును. అనగా నేను ధనవంతుడను వాడు నిరుపేద, నేను బలవంతుడను వాడు బలహీనుడు, నేను గొప్పపదవిలో నున్నాడను, మంచికులములో జన్మించినాను, విద్యావంతుడను, వాడీ విషయములందు నాకంటె మిక్కిలి తక్కువ, నేను రూపవంతుడను వాడందహీనుడు, అని యిట్లు తన గొప్పను జింతించి గర్వించుచు నితరులను దిరస్కార భావముతో జూచును.

ఇదమద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథం ।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనం ॥
అసౌ మయా హతః శత్రుః హనిష్యే చాపరానపి ।
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ ॥
ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా ।
యక్ష్యే దాస్యామి మోదిష్యే ఇత్యజ్ఞానవిమోహితాః ॥
అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ ॥
(భ. గీ. 16-13,14,15,16)

ఈ శ్లోకములలో నసుర స్వభావమగు నహంకారముయొక్క బహు భేదములు వర్ణించబడియున్నవి. పరిశీలించి చూడ వీనియన్నిటియందు సామాన్యదోష మొక్కటియే. అది యెద్దియన, భేదబుద్ధి. నేను వేఱు, నేను హెచ్చు, ఇది నాది, వానిది కాదు, వాని సంపదను జూచి నే నోర్వజాల, ఇత్యాది రూపముల భేదబుద్ధి వర్తిల్లుచుండును. దైవీసంపద్గుణము లన్నియు నేకత్వబుద్ధి నెట్లాశ్రయించి యున్నవో ఆసురసంపద్గుణము లన్నియు భేదబుద్ధి నాశ్రయించియున్నవి. పై గీతావాక్యములలో నీ భేదబుద్ధికార్యములగు దుర్గుణములన్నిటికి మూలకారణము మోహము, అజ్ఞానమని చెప్పబడియున్నది. కావున జ్ఞానముచే నీ దోషములను బోగొట్టుకొనవలెను. పరికించిచూడ నీ న్యూనాధిక్య భావమునకు గారణమే లేదు. ఐశ్వర్యము, బలము, జ్ఞానము, మొదలగు సంపదలన్నియు భగవంతునివే కాని మనవి కావు.

యత్కాయ ఏష భువనత్రయ సన్నివేశో ।
యస్యేంద్రియైః తనుభృతా ముభయేంద్రియాణి ।

జ్ఞానం స్వతశ్శ్వసనతో బలమోజ ఈహా ।
సత్త్వాదిభిః స్థితిలయోద్భవ ఆదికర్తా ॥ (శ్రీ భాగ. 1-4-4)

ఈ శ్లోకము లాయాదికర్తయగు నారాయణుని మూర్తి. సన్నివేశం బగు ఆయన ఇంద్రియములవలననే దేహుల జ్ఞానకర్మేంద్రియములు, ఆయన స్వరూప సత్తాస్ఫురణముననే దేహుల జ్ఞానము, ఆయన ప్రాణమువలననే దేహధారుల దేహశక్తి, ఇంద్రియశక్తి, క్రియాశక్తియు గలుగును. ఆయన సత్త్వాదిగుణములవలననే జగదుత్పత్తిస్థితిలయములు గలుగును.

మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ (భ. గీ. 15-15)

నావలననే స్మృతియు, జ్ఞానము, తద్రాహిత్యమును.

జీవనం సర్వభూతేషు . . . . . ॥ (భ. గీ. 7-9)
బలం బలవతామస్మి కామరాగవివర్జితం । (7-11)
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహం ॥ (7-10)
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహం ॥
(10-36)
. . . . . . . భూతానామస్మి చేతనా ॥ (10-22)
. . . . . . . జ్ఞానం జ్ఞానవతామహం ॥ (10-38)

సర్వభూతములయందలి ప్రాణము నేను; బలవంతులయొక్క కామరాగ వివర్జితమైన బలము నేను; బుద్ధిమంతుల బుద్ధి నేను; తేజోవంతుల తేజస్సు నేను; జయమును నేను; తీర్మానము నేను; సత్త్వవంతుల సత్త్వము నేను; భూతములయందలి తెలివి నేను; జ్ఞానవంతుల జ్ఞానము నేను, వెయ్యి చెప్పనేల:—

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవం ॥
(భ. గీ. 10-41)

ఈ ప్రపంచములో నెద్ది విభూతివంతముగ నుండునో, శ్రీమంతముగ నుండునో, ఊర్జితవంతముగనుండునో, అదియంతయు నా తేజస్సు యొక్క అంశమువలన నని తెలిసికొనుము.

ఇట్లుండ ఎవ్వడేనియు నేను బలవంతుడను, ధనవంతుడను, ఐశ్వర్యవంతుడను, నేను జయమునొందితిని, ఆ శత్రువును సంహరించితిని, వానియం దీ సంపదలు లేవు అని విఱ్ఱవీగనేల? దేవాసుర యుద్ధములో దేవతలకు జయము కలుగగా తాము జయించితిమని దేవతలు దురభిప్రాయ పడిరనియు, నా దురభిప్రాయమును దొలగించి జయము భగవంతునిదే యనియు, నాయన జయమువలననే దేవతలకు మహిమగలిగెననియు, భగవంతుడు యక్షరూపమునవచ్చి దేవతల కుపదేశించెనని కేనోపనిషత్తునందు జెప్పబడియున్నది.

సా బ్రహ్మేతిహోవాచ బ్రహ్మణోవా ఏతద్విజయే
మహీయధ్వమితి తతోహైవవిదాంచకార బ్రహ్మేతి ॥
(కేనో. 4-1)

ఆమె (ఉమాదేవి) ఇంద్రునకు మీ కగుపడిన యక్షము బ్రహ్మమే, బ్రహ్మవిజయమునందు మీరు మహిమను జెందితిరి, అనగా యుద్ధములో జయము కల్గినది మీవలనగాదు, బ్రహ్మము బలమున మీకు జయము కలిగెను, అందువలన మీరు మహిమను బొందితిరి అని యుపదేశించెను. ఆ యుపదేశమువలననే యక్షము బ్రహ్మమనియు జయము బ్రహ్మముదే యనియు నింద్రుడు తెలిసికొనెను.

ఈ యర్థమునే భగవద్గీతయందు భారతయుద్ధములో స్థూలప్రపంచములో యుద్ధము ప్రారంభము కాకపూర్వమే శత్రువులను దానే సంహరించితిననియు నీవు స్థూలప్రపంచములో శత్రుసంహారమునకు నిమిత్తమాత్రుడుగ నుండుమనియు భగవంతు డర్జునునకు దెలియ జెప్పెను.

మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥

ఈశ్వరబలము లేనిచో మనకెట్టి బలమును లేదు. ఆ కేనోపనిషత్తునందే బ్రహ్మస్వరూపమైన యక్షము పరీక్షించగా లోకములో సమస్తమును దహించెడు అగ్నిహోత్రుడు ఒకతృణమును దహించలేకయు, సమస్తము నెత్తి పారవైచు వాయువు ఒకతృణము నెత్తి పారవేయ లేకయు పరిభవము నొందిరని చెప్పబడియున్నది.

భారతయుద్ధమునందు భగవంతుడు అర్జునుని రథముదిగిన తక్షణము ఆ రథము కాలిపోలేదా? అర్జునుడంత సమర్థుడైనను భగవంతుని మహిమవలననే కదా శత్రువుల బాణములచే రథము దహించబడినను రథమునందుండి యుద్ధము చేయగలిగెను.

జయకాలే తు సత్త్వస్య దేవర్షీన్ రజసోఽసురాన్ ।
తమసో యక్షరక్షాంసి తత్కాలానుగుణోఽభజత్ ॥

(శ్రీభాగ. 7-1-8)

లోకములో సత్త్వగుణము ప్రవర్థిల్లవలసినప్పుడు దేవతలను ఋషులను, రజోగుణము ప్రవర్థిల్లవలసిన కాలమునం దసురులను, దమోగుణము ప్రవర్థిల్లవలసిన వేళలలో యక్షరాక్షసులను భగవంతు డను గ్రహించుచుండును.

ఇందువలన ముఖ్యముగ దెలిసికొనవలసిన దేమియన, తేజస్సు, బలము, ఐశ్వర్యము, జయము, మహిమ, ధనము, సమస్తము భగవంతునివి. దుర్బలము, దుర్జయము, దారిద్ర్యము, ఇవి సయితము భగవంతుని వలననే గలుగును. కాలానుసారము, మన కర్మానుసారము, (అనగా జీవుని పరిపాకావస్థ కనుగుణమగు ఉపాధుల పారిశుద్ధ్యము ననుసరించి) వానిలో నొక్కొక్కయంశ యొక్కొక్కరియందు ప్రవర్తించుచుండును. లోకోపకారార్థము ఆ భగవత్తేజాంశమును మనము ప్రయోగము చేయవలెనని భగవత్సంకల్పము. ఆ సంకల్పము నెఱిగి తదనుగుణప్రవర్తకులే జ్ఞానులు, భక్తులు, నైష్కర్మ్యసిద్ధులు. అది తెలియక ధనాది సంపదలు తమవియని మోహముచెంది స్వార్థపరత్వమున ప్రవర్తించువారు మూఢులు, ఆసురసంపదగలవారు.

ఇప్పు డుపలక్షణార్థము భేదభావమును వృద్ధిబొందించెడి యొక్క విషయమును విచారింతము.

ధనము :—సర్వధనము భగవంతునిదనియు, మనము ధర్మకర్తలము (Trustees) మాత్రమే యనియు, దానిని సత్కార్యమునందు మాత్రమే వినియోగించవలయుననియు, దుర్వినియోగముచేయ మన కెంత మాత్ర మధికారము లేదనియు, నెఱుగవలయు. ధనము మనది కాదనియు సద్వినియోగమునందే వినియోగించ దగినదనియు దెలిసిన నధర్మ మార్గమున ధనమార్జించ నవకాశముండదు.

ధనం చ ధర్మైకఫలం యతోఽస్య
జ్ఞానం సవిజ్ఞాన మనుప్రశాంతిః ।

గృహేషు యుంజంతి కళేబరస్య
మృత్యుం నపశ్యంతి దురంత వీర్యం॥

(శ్రీభాగ. 11-5-12)

ధనమునకు ధర్మమే ఫలము. దానివలన బరోక్షజ్ఞానము. దాన నప రోక్షజ్ఞానము. దాన మోక్షము. . . . . . . .

ఇచ్చట ధనముయొక్క ముఖ్యప్రయోజనము తెల్పబడియున్నది. తన ప్రయోజనమునకు ధన మెంతమాత్ర ముపయోగించుకొన వచ్చునన :—

యావద్భ్రియేత జఠరం తావత్స్వత్వం హి దేహినాం।
అధికం యోఽధిమన్యేత సస్తేనో దండ మర్హతి॥
సిద్ధైః యజ్ఞావశిష్టార్థైః కల్పయేత్ వృత్తిమాత్మనః।
శేషే స్వత్వం త్యజన్ ప్రాజ్ఞః పదవీం మహతామియాత్॥
దేవాన్ ఋషీన్ నృభూతాని పితౄన్ ఆత్మాన మన్వహం।
స్వవృత్త్యాగతవిత్తేన యజేత పురుషం పృథక్॥

(శ్రీ భాగ. 7-14-9-15-16)

ఉదరపూరణంబునకు వలసినంతయే ప్రాణులకు సొమ్మగును. అధిక మపేక్షించువాడు చోరునట్లు దండనార్హుడగు. దైవలబ్ధమైన ధన మునం బంచయజ్ఞముల నిర్వర్తించి తచ్ఛేషమున స్వత్వబుద్ధి నిరసించి వృత్తిగావించు ప్రాజ్ఞుడు పెద్దల పదవి నొందును. ఇట్లు కల్పించు కొన్న స్వవృత్తివలన నార్జించిన విత్తముతో ననుదినంబును దేవ, ఋషి, నర, భూత, పితృగణంబులయందును, దనయందును నం తర్యామి రూపమునసుండు పరమపురుషుని నారాధించవలయును.

ఈ యర్థము నే భగవద్గీతయందు :—

> తై ర్దత్తా నప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః ॥
> యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।
> భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥
>
> (భ. గీ. 3—12, 13)

దేవతలవలన ననుగ్రహించబడిన యాహారాదులను వారలకు (అనగా దేవతాధిష్ఠానములైన పరుల యుపయోగముకొఱకు) బెట్టక ఎవడు (స్వప్రయోజనార్థము) భోగించునో వాఁడు చోరుడే, అనగా స్వంత సొత్తుకాని దానిని స్వప్రయోజనమున కుపయోగించినందువలన దస్కరదోషము నొందును. యజ్ఞముచేయగా మిగిలిన యన్నమును భక్షించిన సర్వపాపములు పోవును. స్వప్రయోజనార్థ మెవరు వంటవండుకొని తినుచున్నారో వారు తినునది అన్నముకాదు, పాపమే.

దీనివలన, పంచమహా యజ్ఞములను నిర్వర్తించి శేషించినదే మనకు భోగార్హమని తెలియనగును. పంచమహాయజ్ఞములను గొప్ప విషయమును గుఱించి ఇచ్చట విపులముగా వ్రాయ నవకాశము లేదు. ముఖ్యతాత్పర్య మేమన :—

ప్రపంచమంతయు నొక్క కుటుంబము. ఆ ప్రపంచములో మన కన్న పెద్దవారలగు ఋషులు, దేవతలు, పితృలు; మనకన్న పెద్ద వారు, చిన్నవారు, సమానులుగనుండు మనుష్యులు; మనక్రింది యం తస్థునునుండు పశుపక్ష్యాది భూతములు కలరు. ప్రతిమనుజుడు ప్రతిదిన ము "ప్రపంచమంతయు నొక్క కుటుంబము, నేనందులో నొకడను.

కుటుంబములోనుండు ప్రతియొక్క మానవవ్యక్తియు వాని వాని పని చేయుచు సమష్టి కుటుంబమున కుపయోగముగ నుండునట్లు మనమంద అము వారి వారికి దగినపని చేయుచున్నారము. అందఱు అందఱకు గావలసినవారేను. ఋషులవలన మనకు జ్ఞానము కలుగుచున్నది. దేవ తలవలన వృష్ట్యాదులును, దాన నాహారాదులును, కలుగుచున్నవి. పితృ వులు మనకు స్థూలశరీరము నమర్చినదేకాక అనేక గొప్ప కార్యములు చేసి మనకు జూపించి మన జ్ఞాపకార్థము శాస్త్రముల రచియించిరి. మనుష్యకోటిలో నితరుల సహాయములేనిదే జీవించను సాధ్యమే లేదు. ఇకను బశువులన్ననో, వానివలన ననేక విధములైన సహాయముల బొందుచున్నాము. గోవు క్షీరము నిచ్చుచున్నది. ఆమె కుమారు లగు వృషభములు భూముల దున్నుచున్నవి. శకటముల లాగుచున్నవి. ఇట్లే యితర జంతువులు. అయిదు విధములైన జీవులకు మనమెం తయో ఋణస్థులమైతిమి. వాస్తవముగా నీయయిదు రూపములుగా భగవంతుడు మనకు సహాయము చేయుచున్నాడు. ఏ రూపమున నెట్టి సహాయము భగవంతుడు చేసినాడో ఆ యా విధముగా ఆ యా భగవద్రూపమును మన మారాధించవలెను. అందఱుండుటవలననే నే నుండుటయు గల్గినది. నే నొకడుమాత్ర ముండలేను, ఉండుట వలన నుపయోగమును లేదు. కుటుంబమునకు జేరినవాడు కుటుంబ విషయమును ముఖ్యముగ గమనించవలెను గాని తనస్వంత విషయ మును జూడదుకదా. అట్లే నేనును ముందు స్వేతరరూప భగవ దారాధన, పిమ్మట స్వాత్మాధిష్ఠ భగవదారాధన; అనగా ముందు పరోపకారార్థము ద్రవ్యము వినియోగించవలెను, పిమ్మట నా స్వంత విషయము చూచుకోవచ్చును. అప్పుడైనను నా స్వంతమున

కని తలచగూడదు. ఈ వస్తువు నాది, నా స్వంతప్రయోజనమున కుపయోగించుకొనుచున్నానని తలచగూడదు. (స్వత్వం త్యజేత్) సొమ్ము భగవంతునిది. ఆయనసొమ్మును పంచ మహాయజ్ఞ నిర్వర్తన వలన ఆయన కర్పించినాను. నా ప్రాణధారణ నిమిత్తము కావలసిన దానినే నుపయోగించు కొనెదను. అదియు స్వోదరపోషణమని భావించను. నా యుదరపోషణద్వారా నాయం దంతర్యామియై యుండు భగవంతుని నుపాసించెదను." అని యిట్లు భావించుచురాగా ప్రపంచమంతయు భగవద్రూపమను భావము వృద్ధిపొందును. భేద బుద్ధి క్రమక్రమముగ క్షీణించును. అయితే నా ధనము నాదికాదని యెట్లు భావించనగు ? అను సంశయము కలుగవచ్చును. ఈ భావము కలుగుట కష్టమే. అయితే మనము ప్రత్యక్షముగ జూచుచుండు విషయములను గమనించిన మనకాభావము సాధ్యమని తోచును. రాజభాండాగారములను (treasuries) మనము చూచియున్నాము కదా. ఆ భాండాగారాధ్యక్షుడు (Treasury officer) బొక్కసమునందుండు ధనములో నొకకాసైన వాని స్వప్రయోజనమున కుపయోగించుకొన నధికారము లేదనియు, ధనము ప్రభువుదనియు, ప్రభు కార్యములకు మాత్రమే వినియోగించవలెననియు, దలచి కార్యముల జరుపుచుండునది మనము చూచుచున్నాము. దానిని జూచి మనము నేర్చుకొనవచ్చును. మన బొక్కసము మనప్రభువుది (భగవంతునిది), ఆయన పనులకు (అనగా లోకోపకారమునకు) వినియోగ పరచగా మిగిలినది మనయుందంతర్యామిగానుండు భగవదారాధనకు అనగా ఆరాధనరూపమైన మన స్వంతకార్యములకు వినియోగించ వచ్చును. అతిక్రమించి వినియోగింప మనకధికారము లేదు.

ఇకను ధనహీనుడు నాకన్న నికృష్టుడు, నేను హెచ్చు అనుభావ మెట్లు పోవలెను? దీనికి మొదట కర్మవిషయ జ్ఞానము (Law of Karma) కొంతైనను సంపాదించవలెను. లోకములో ప్రతిమనుజుడు పూర్వజన్మములయందు శుభాశుభ కర్మల జేసియుండును. మిశ్ర కర్మఫలమే మానుషజన్మ. "పుణ్యేన పుణ్యం లోకం నయతి పాపేన పాప ముభాభ్యామేవ మనుష్యలోకం". పూర్వజన్మములలో సత్సంకల్పములఁ చేసిన నిప్పుడుత్తమమైన సూక్ష్మశరీరములు (Astral and mental bodies) లభించును. దుస్సంకల్పములచే నపరిశుద్ధమగు సూక్ష్మశరీరములు కలఁగును. మనము పోయినజన్మాంతమువఱకు ఎట్లు వర్తించితిమో, తదనుగుణముగా ఈ సూక్ష్మ శరీరములు ఈ జన్మమున ప్రాప్తమగును. స్థూలశరీరమును (Physical body), స్థూల లోకసంబంధమగు సుఖదుఃఖములును అట్లుకాదు. వానివిషయము ప్రారబ్ధకర్మానుసారము జరగవలసియుండును. పూర్వజన్మములలో మనము చేసిన స్థూలసంబంధమైన మంచిచెడ్డకార్యముల (పరోపకారము, పరహింస) ఫలములన్నియు నొక్కజన్మములో దీరునవికావు. కర్మాధికార ఋషులు, దేవతలు ఒకజన్మలో నేయే శుభ అశుభకర్మఫలములు భోగ్యములు కాదగునో వానిని వారిజ్ఞానమహిమచే నిర్ణయించి అశుభాశుభకర్మ ఫలములను దీర్చుకొనుట కుపయుక్తమైన స్థూలశరీరము, ధనజాతి ఐశ్వర్యాది సంపత్తియు, సమకూర్తురు. మన మీజన్మలో ధనవంతులుగ నుండిన నేమి తెలిసికొనవలెను? "పూర్వజన్మలలో నేనుచేసిన శుభాశుభ కర్మలలో నీ ధనికత్వప్రాప్తి కారణమగు శుభభాగ మీ జన్మలో భోగముగ వచ్చినది. మఱియొకడు బీదవాడుగ నుండిన వాని శుభాశుభ కర్మలపైకి దారిద్ర్యకారణ

మగు అశుభకర్మ యీజన్మలో భోగమునకు వచ్చినది. ఇకముందు నాదరిద్రాంశ పైకిరావచ్చును. వాని ధనికాంశ యుపభోగమునకు రావచ్చును. పూర్వజన్మముల యునికియే నేను మఱచి యీ జన్మస్థితులను మాత్రము చూచి నేను ధనికుడను, వాడు దరిద్రుడు, అని గర్వపడితిని. నేను హెచ్చు, వాడు తక్కువ, అను భేదబుద్ధికి లోబడితిని. ఈ గర్వముతో మఱికొంచె మశుభకర్మకే బలము కలుగజేసితి" అని చింతించవలెను. దీనిని మఱియొక విధమున నాలోచించి చూడవలెను. గొప్పతటాకములకు మూడు నాలుగు తూములుండును. నీరుపారుదల అధ్యక్షుడు (Irrigation manager) చెరువు క్రింద భూములు వానియందలి సస్యములస్థితి నాలోచించి ఏతూము నేదినమున మూసి యేతూమును దెఱచి నీరుపారనిచ్చుట యుక్తమో తీర్మానించును. ఒకదినము మూయబడినతూము మఱియొకదినము తెఱవబడును. ఒకదినము తెఱవబడిన తూము మఱియొకప్పుడు మూయబడును. ఏదెస సస్యములకు నీరుకావలసియున్నదో దానినంతయు విచారించి నీరుపాఱుదలకు వలయు ఏర్పాట్లు చేయును. అట్లే భగవంతుడు సకల జనుల కర్మఫలముల నెఱిగి ఒకజన్మయం దెవనికి ద్రవ్యసంపత్తి కలుగవలెనో ఎవడు ధనహీనుడుగ నుండవలెనో తీర్మానించును. ఎట్లన్నితూముల నేకకాలమున దెఱచిన తటాకోదకము వ్యర్థమై పైరులకు జెడుగుకలుగునో అట్లే ఏకాలమునం దెవనికి ధనముండదగునో ఎవనికి దగదో అవియన్నియు వారి జ్ఞానమహిమచే వారు నిర్ణయించెదరు. భగవంతుడు లోకసమష్టిని విచారించువాడు. ఈ దినము తెఱవబడిన తూము మూయబడిన తూమును జూచి నీలో నీరులేదు నీవు తక్కువ నేను హెచ్చు అని చెప్పగలుగునా? అట్లే

ధనవంతుడు ధనహీనుని నీచముగ జూడరాదు. సమష్టి జనక్షేమార్థము వారివారి కర్మానుసారము కొందరిద్వారా ధనవారి ప్రవహింప జేయుదురు. కొందరిగుండా ప్రవహించకుండునట్లు చేయుదురు. ఎవరిద్వారా ప్రవహించుచున్నదో వారు లోకమను సస్యమునకు బార నియ్యవలెనుగాని వ్యష్టిదృష్టితో జూచిన యథార్థము నెఱుగజాలరు.

ఈ రీతిననే శేషించిన భేదబుద్ధి జనిత దోషములగు బలము ఐశ్వర్యము మొదలగు వానిని భావించవలెను. గొప్ప అధికారములో నుండువాడు తనయందు తాత్కాలికమున నధికముగ బ్రకాశించు ఈశ్వర తేజస్సును దక్కువగ బ్రకాశించువానిని బైమెట్టుకు దీసి కొనిపోవ వినియోగించవలెనుగాని క్రూరభావము నిర్దయ వహించ గూడదు. "ప్రతిసంపద, ప్రతిసౌకర్యము, ప్రతిసుఖ హేతువగు విషయము నాదికాదు. భగవంతునిది. నాద్వారా ఆయనపని జరుగుటకై నాకీయుపపత్తి నమర్చినాడు. ఆయనకార్యమునకు వినియోగ పరచుటకై ఈ బలమునకు, ధనమునకు, విద్యకు, సంపదలకు, నేను ధర్మాధికారిని (trustee). ఈశ్వరసేవచేయుట కెంతకావలెనో అంత మాత్రము నాకై యుపయోగించుకోవచ్చును. అంతకధికముగ నుపయోగించిన నేను దొంగతనముచేసినవానితో సమానము. దండనార్హుడను. నాకు గల ద్రవ్యాది యుపపత్తిలేనివాడు నాకన్న దక్కువ కాడు. వానికాయుపపత్తి లేనందువలనగదా నా ద్రవ్యమును వానికొసగి సద్వినియోగము చేయుట కవకాశము నాకుగలిగెను. ధనహీనుని రూపమున భగవంతుడు ధనికుని దానము నాకర్షించి దానము చేయించుచున్నాడు" అని యిట్లు చింతించిన భేదబుద్ధి క్రమముగా క్షీణించును. మఱియొక్క విధమునగూడ నీ యభేదము నభ్యసించ

వచ్చును. ఒక తల్లిదండ్రులబిడ్డలు "వాడు చిన్న, నేను పెద్ద" అని తలంచెదరుకాని "వాడు తక్కువ, నేను హెచ్చు" అని తలచరు. "మేమందఱ మొక్క తల్లితండ్రుల బిడ్డలము. అందఱ మొక కుటుంబము వారలము. మేమందఱ మొకటియే" అని తలచెదరు. అట్లే ప్రపంచమంతయు నొక కుటుంబము. పార్వతీపరమేశ్వరులు లక్ష్మీనారాయణులు తల్లి దండ్రులు. సర్వభూతములు వారిబిడ్డలు. ముందు బుట్టినవారు వెనుకబుట్టినవారని వయోభేదమున్నదే కాని అందఱ యందొక రక్తమే ప్రవహించుచున్నది. సురరాజ్యాధిపతియగు దేవేంద్రుడు, మఱియు నితరదేవతలు, భృగ్వాది మహర్షులు, కుమారాది నారాయణాంశ సంభూతులు, నారదాది దేవఋషులు, వసిష్ఠాది బ్రహ్మఋషులు, మన్వాదులు, పరాశర మైత్రేయ మరు దేవాపి మొదలగు జ్ఞానప్రదాయక గురువులు, మఱియు మానవులు, మృగములు, పక్షులు, కీటకాదులు, తరు గుల్మ లతాదులు, అందఱు ఒక తల్లి బిడ్డలే. "ఆబ్రహ్మకీటజననీ" (లలితాసహస్రనామము). "పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః—భ.గీ." బాహ్యదృష్టికి బ్రత్యేకముగ గనబడు ప్రతికుటుంబాధిపతి రూపమున నారాయణమూర్తి కుటుంబమును బాలించుచుండును. ప్రతిబిడ్డకు దల్లిరూపమున స్తన్యమునిచ్చి పోషించునది శ్రీమహాలక్ష్మియే. ప్రతిగ్రామ పాఠశాలయందు విద్యార్థులకు విద్య గఱపు ఉపాధ్యాయుని రూపమున విలసిల్లువాడు పరమేశ్వరుడే.

క్షేమ ఇతి వాచి యోగక్షేమ ఇతి ప్రాణాపానయోః ।
కర్మేతి హస్తయోః గతిరితి పాదయోః ।
విముక్తిరితి పాయౌ తృప్తిరితి వృష్టౌ బలమితి విద్యుతి ।

యశ ఇతి పశుషు జ్యోతిరితి నక్షత్రేషు ।
ప్రజాతిరమృతమానంద ఇత్యుపస్థే సర్వమిత్యాకాశే ।
తత్ప్రతిష్ఠే త్యుపాసీత ॥ (తై. ఉప. భృ. వల్లీ.)

ఎవడు పనిచేయుచున్నను ఆ కర్మరూపమున వాని హస్తములలో భగవంతుడు ప్రతిష్ఠించబడి యున్నాడనియు, నట్లే సర్వము ఈశ్వరక్రీడ, ఈశ్వరచేష్ట, ఈశ్వరవ్యక్తి అని భావించుచురాగా భేదబుద్ధి క్షీణించును. మనము బహుజన్మములనుండి భేదదర్శనమే చేయుచువచ్చినారము. ఉపేక్షభావమును వహించుటకు మనము కారణములగోరము. "నేను వాని నెందుకు ప్రేమించవలెను" అని ప్రేమించుటకు గారణ మడిగెదము. కారణము కనపడనిచో ప్రేమించము. ఈ భావము కలుగుటకు గారణమేమి? "నేను వేఱు, వాడు వేఱు, నేనెందుకు ప్రేమించవలెను, నాకేమైన మేలుచేసియుండిన గదా నేను ప్రేమించవలెను, పరునితో నాకేమి సంబంధము" ఇట్టి భావమే మూలకారణము. ఈ భావము మాఱవలెను. అందఱొక కుటుంబమువారు కావున ఒండొరులు ప్రేమించుకొనుట స్వాభావికము సహజము అనియు, ద్వేషించుట కేలాటి కారణములు లేవనియు, ఉపేక్షభావము చెందుట ఏకత్వదర్శన రాహిత్యమువలననే యనియు నెఱిగి సహజముగ నుండదగినట్టియు, నేకత్వదర్శన చిహ్నమైనట్టియు, ప్రేమభావమును ధృఢముగ నభ్యసించవలెను.

న యస్య జన్మకర్మభ్యాం న వర్ణాశ్రమజాతిభిః ।
సజ్జతేఽస్మిన్ అహంభావో దేహే వై స హరిప్రియః ॥
(శ్రీమద్భాగవతము)

ఎవడు నేను మంచికులమున బుట్టినాడను, గొప్ప కార్యములు చేయు చున్నాను, ఉత్తమవర్ణము, ఉత్తమ ఆశ్రమము, ఉత్తమజాతికి జేరిన వాడను, అని దేహసంబంధ విషయములలో నహంకారభావము చెందడో వాడు హరిప్రియుడు.

మఱియు బ్రహ్మాదుని గుణముల వర్ణించు నెడ

ఆత్మవత్సర్వభూతానాం ఏకఃప్రియసుహృత్తమః ।
విద్యార్థజనరూపాద్యైః మాన స్తంభవివర్జితః ॥

తనయందువలే సర్వభూతములయందుం దొకటే భావముకలవాడు, అది యెద్దియన, ప్రియము సౌహృదము. విద్య, ధనము, కులము, రూపము మొదలగు విషయములలో నేను హెచ్చు అను మానము లేనివాడు.

ఇట్లు భేదబుద్ధికి సహకారియగు న్యూనాధిక్యబుద్ధి విసర్జించి విసర్జించి సర్వభూతైకత్వభావము నభ్యసించుచు భేదభావమును నశింపజేసికొనవలెనని సూత్రతాత్పర్యము.

"వారు (చెడ్డవారు తెలివిలేనివారు) నీసఖ గురువులకంటె కొంచెము తక్కువగానైనను నీ స్వరూపులే."

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురురేవ మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః ॥

గురువు భగవత్స్వరూపుడు. ఈశ్వరుడే గురురూపమున వచ్చి మన యజ్ఞానమును దొలగించును. అందువలన గురువు పూజ్యుడని మనకు దెలిసిన విషయమే. అంతియేకాదు. గురువు మన ఆత్మస్వరూపమే.

అభజేత్తంభక్త్యైకయేశం గురుదేవతాత్మా ।
గురురేవ దేవతా ఈశ్వరః ఆత్మా చేత్యర్థః ॥ (శ్రీ. భాగ.)

సర్వజనులకు స్వాత్మ ప్రియతమమనునది తెలిసిన విషయమే. గురువు సయితమట్లు ఆత్మస్వరూపుడు కావున ప్రియతముడు. ఈ విషయము మనకనుభవమునైన గాని విశదముకాదు. మనము భక్తిజ్ఞాన వైరాగ్యములు వృద్ధిపొందించుకొని అహంకార మమకార స్వార్థ పరత్వ బుద్ధులు మాని లోకసంగ్రహార్థము పనిచేయ నిశ్చయించుచు రాగా మహానుభావులగు గురువులు మనకు దెలియకయే వీక్షించు చుండి మనకు యోగ్యతకలిగిన తత్క్షణం మనలను వారిచెంత జేర్చుకొనియెదరనియు, మనయోగ్యత హెచ్చుగుకొలదియు వారితో నేకీభావము వృద్ధియగుననియు, జివరన మనమనస్సు వారిమనస్సు పూర్ణముగ నేకీభావము జెందుననియు, నిదివఱకే వివరముగా వ్రాయబడెను. ముఖ్యముగ దెలిసికొనవలసిన విషయమెద్దియన గురుశిష్యులకు గల పరస్పర మైత్రిభావము, అనురాగము వర్ణింపశక్యముగాదని పరమగురువుదర్శన లాభము నొందిన పెద్దలు చెప్పుచున్నారు.

ఇకను సఖులు అనగా నిజమైన స్నేహితుల యెడ సయితము మనకభేదముండును. అయితే గురువులయందలి యనురాగముకన్న గొంచెము తక్కువగ నుండును. పాపులయెడల గూడ నభేద దర్శనము కలుగవలెనని సూత్రము బోధించుచున్నది. సర్వభూతములయందాత్మ దర్శనము చేయువారికి అందఱు సుహృదులే, ప్రియులే. ఆదశ చెందనివారు అనగా అభ్యాసులు క్రమక్రమముగా ప్రేమమైత్రిభావములను వృద్ధిపరచుకొనుచు రావలెను. కావున నీ సూత్రములో సఖగురువులకన్న బాపులు కొంచెము తక్కువగానైనను నీ స్వరూపులు అని చెప్పబడియున్నది. పారమార్థికమున భేదములేదు. అభ్యాసముచేయుటలో గురువులయందును సఖులయందును నుండునంత ప్రేమ పాప

కార్యములు చేయువారియం దుంచుట కష్టముగ దోచును గావున అభ్యాస సౌకర్యార్థము కొంచెము తక్కువ అని ప్రారంభించి క్రమక్రమముగా సంపూర్ణ ప్రేమభావమును సంపాదించవలెనని తాత్పర్యము. మన బహుజన్మార్జిత దుర్వాసనలును మనలోపములును మహాగురువులకు వేద్యము కావున వారు మన కసాధ్యమైన బోధలను జేయరు. ప్రారంభము లోనే సర్వభూతముల నేకవిధమున జూడుమని బోధించినయెడల నిరుపయోగంబగును. సాధారణముగా మన యనుభవములో సమానముగ నందటిని మనము ప్రేమించజాలము. ద్వేషభావమును బోగొట్టుకొనుటయే యొక గొప్పసముద్రమును దాటినట్లు. ఉపేక్షభావమును బోగొట్టుకొనుట రెండవసముద్రము దాటినట్లు. అటుపైన ప్రేమ వృద్ధిచేసికొనుచు రావలెనుగాని తత్క్షణమే సాక్షాత్ కుమారుఁడు, స్నేహితుడు, గురువు, వీరియందెంత ప్రేమయో అంతప్రేమ పాపము చేయువారియందు జూపవలెనన గొంచెము కష్టముగనుండును. ద్వేష, ఉపేక్ష భావములు సంపూర్ణముగా వర్జనీయములు. ప్రేమ క్రమక్రమమున వృద్ధిపొందుచు దుదకు సర్వభూతైకత్వము సర్వభూత సమత్వమునందు బరిసమాప్తి జెందవలెనని సూత్రతాత్పర్యము.

“ఏ చెడ్డపదార్థము లేక చెడ్డమనుజునికంటె నీవు వేఱు అనుభావమును నీలో వృద్ధి కానిచ్చెదవేని, అట్లు చేయుటవలన నా పదార్థముగాని మనుజుడుగాని, నిన్నుండి ప్రత్యేకించబడజాలరని నీ యాత్మ తెలిసికొనువఱకు వానితో బంధము కల్గించు కర్మను గల్పించుకొనెదవు.”

ఈ వాక్యతాత్పర్యమును గ్రహించుట కష్టము. దుస్సాంగత్యము వర్జనీయము కదా! అట్లుండ దుష్టమనుష్యుని హింసించకయు ద్వే

క్షించకయు ఉండుట సరియేగాని, వానికి మనకు సంబంధము లేదు, వాడుచేయు కార్యములు చెడ్డవి, కాన వానిని మనచెంత జేర్చుకొనగూడదు, అని తలచి దవ్వుననుండుట మంచిదే కదా! వాడు నేను వేఱు అని తలచినమాత్రముననే బంధించు కర్మ ఎట్లు పుట్టును? వాని కెట్టి యుపద్రవము చేయకయే నేనెట్లు బంధించు కర్మ చేసినవాడ నగుదును? అను సంశయములు కలుగవచ్చును. దివ్యజ్ఞాన సమాజమువారు జనుల యజ్ఞాన నివృత్తికొఱకై యిక్కాలపు జనుల కుపయుక్తమగునట్లు రచియించి ప్రచురించిన మత విషయిక గ్రంథములలో మనోధర్మములు కర్మగతి రహస్యములు సవిస్తరముగ వ్రాసి లోకమునకు మహోపకారము జేసియున్నారు. ఆ సమాజ అధ్యక్షురాలును, బుద్ధికౌశల్య వాక్ప్రౌఢిమ, మేధామనీషా ఊహాపోహాల యందసమానురాలును, భక్తి జ్ఞాన విజ్ఞానవైరాగ్యయుతలోకసంగ్రహ కర్మాచరణైక తత్పరురాలును, పరమగురువులైన ఋషుల కరుణాకటాక్షమునకు బాత్రతవహించి బాహ్యలోకమునందు వారికి బ్రతినిధియో యన్నట్లు వారి లోకోద్ధరణకార్య మసమానచాతుర్యముతో నిర్వర్తించుచు, బరమపదమునకు సామీప్యమునందుండు శ్రీమతి అనీబెసంటమ్మగారిచే రచియింపబడిన కర్మ విషయిక గ్రంథములవలనను, అందు ముఖ్యముగా "కర్మవిచారము" (A Study in Karma) అను గ్రంథరత్నము వలనను ఈ టీకలోని వాక్యము నీషన్మాత్రము బోధచేసికొనవచ్చును.

ఈ వాక్యమును గుఱించి విచారించవలసిన విషయములు.

(౧) దుష్టజనుడు మన సాంగత్యమునకు వచ్చుటకు గారణమేమి?

(౨) సాంగత్యము కలిగిన, మన ముపేక్షభావముతో మిన్నక యుండుట చాలదా?

(౩) తూష్ణీభావమువలన బంధరూపమైన కర్మ ఎట్లు కలుగును?

(౪) తూష్ణీభావము దూష్యమైనచో నెట్లు ప్రవర్తించవలెను?

(౧) మనము మూడు విధముల గర్మల చేయుచుందుము. మన సంకల్పములవలన మన స్వభావమేర్పడును. సత్సంకల్పములు చేసిన మంచిస్వభావము అనగా మంచిగుణము కలవారమై జన్మింతుము. మంచిచెడ్డ కోరికలవలనను, మంచిచెడ్డ మనోభావముల వలనను కామక్రోధాది దుర్గుణములును, దయ, మైత్రి, అనుకంప లోనగు సుగుణములును, వానిని వెలిబుచ్చుట కనకాశములును గలుగును. అనగా పూర్వజన్మములలో పరోపకారము చేయవలెనని కోరుచుండిన, ఈ జన్మలో నట్టి కోరిక బలపడి తత్సాఫల్యమున కనుకూలమైన అవకాశములు (opportunities) కలుగును. కామక్రోధాదులకు లోబడి యితరుల కెగ్గుచేసియుండిన నట్టి గుణము లీజన్మలో ధృఢపడి మన మంచికోరికలు సఫలత్వము చెందుట కవకాశములు కలుగక మఱియు కోపమెక్కుడై కామశరీరము క్షోభించుచుండును. మన సంకల్పములవలనను కోరికలవలనను క్రియల వలనను ఇతరుల కెట్టి ఫలము పూర్వజన్మలయందు గలుగజేసితిమో తదనుగుణముగా ఈ జన్మలో మనకు స్థూలప్రపంచ సౌకర్యము లేర్పడును. అనగా దేశము, వర్ణము, ఆభిజాత్యము, ధనధాన్య పుత్రకళత్రాదిసంపత్తి, బంధువర్గము, మిత్రులు, శత్రువులు, ఇవియన్నియు పూర్వజన్మలయందు మన మితరులకు గలుగజేసిన సుఖదుఃఖముల ననుసరించి యుండును. ఇట్లు పూర్వకర్మానుసారము ఒక దుష్ట

జనుడు మన యింటిలోనే మన కుమారుడుగనో అన్నతమ్ముడుగనో లేక బంధువర్గములో జేరియో పుట్టవచ్చును. లేక వ్యవహార దశలోనో ఏ యితర విధముననో మనకు వానికి సాంగత్యము కలుగ వచ్చును.

(౨) కర్మానుబంధమువలన సాంగత్యము కలిగినప్పుడు ఉపేక్ష భావము చాలునా? పాపకర్మవలన దుస్సాంగత్యము ప్రాప్తించగా శుభకర్మ చేయకయే పాపకర్మ ఎట్లు నశించును?

ఏషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణాం ।

అనగా పుణ్యకర్మలవలన పాపకర్మను దొలగించుకొనవలెను.

శ్రీనృసింహస్వామి ప్రహ్లాదునికి జేసిన యుపదేశములో ఇట్లు సెలవిచ్చిరి:—

భోగేన పుణ్యం కుశలేన పాపం . . . . . హిత్వా ।

భోగించి పుణ్యమును శుభకర్మచేత పాపమును బోగొట్టుకొమ్ము.

ఆ దుస్సాంగత్యప్రాప్తి మన కెందువలన గలిగినదని విచారించి తెలిసికొనవలెను. భగవంతుని సంకల్పమగు కర్మ నియమప్రకారము మనము నేర్చుకొనవలసిన విషయము లనేకములుండియే అట్టి దుస్సాంగత్యము ప్రాప్తించినది. ఆ విషయము లెవ్వియన:—

1. నేనిట్లు దుష్టునిగ నుండగూడదని తీర్మానించుకొనుట. భగవద్గీత 16 వ అధ్యాయములో దైవీసంపదను వర్ణించి యూఱకుండక విస్తారముగా నసురసంపదనుగూర్చి ఎందుకు జెప్పవలెను? "దైవ్యా ఆదానాయ ప్రదర్శనం క్రియతే ఇతరయోః పరివర్జనాయ" అని శ్రీ శంకరాచార్యులవారు వ్రాసియున్నారు. అనగా దైవీసంపదను

వర్ణించిన నా గుణములు గ్రహించుటకును, రాక్షస అసురసంపదలను గూర్చి జెప్పిన నట్టి గుణములను విసర్జించుటకును బ్రయత్నించవలెనని.

2. దుష్టునిచేష్టలకు కోపించక శాంతిక్షమాది గుణముల నార్జించుట. మన కుమారుడు దుష్టుడైన మనకు మన కులమున కెంత కష్టములు ప్రాప్తించునో తెలిసియున్నది కదా. ఆ యిడుములు ప్రాప్తించుట మన పూర్వజన్మకృత అశుభకర్మ ఫలమే. ఆ కర్మ ననుభవించుచు ఈ క్షాంతిగుణము నభ్యసించి బలపరచవలెనని భగవదుద్దేశము.

3. ప్రాప్తించిన సంకటములకై అప్రతీకారబుద్ధి వహించుట.

4. పురాకృత అశుభకర్మను శుభకర్మచే ద్రెంచివేయుట. భగవంతుడు మనలను శుభకర్మ చేయుమనికాని, అశుభకర్మ చేయుమని కాని, నిర్బంధ పెట్టుట లేదు. శుభాశుభకర్మల కవకాశములు మన పూర్వకర్మననుసరించి మన కమర్చును. ఇప్పుడు చెడ్డఫలము భోగమునకు వచ్చునపుడు శుభకర్మాచరణ కవకాశము కల్గినదని మనము తెలిసికొనవలెను. ఈ కర్మ విచారము నందంతట సమష్టిభావమును గమనించవలెను. ఉదాహరణము—రాముడు అనువాడు కృష్ణుడు అనువాని కపకారము పూర్వజన్మములో జేసెను. దాన, లోకసమష్టి ఈశ్వర శాంతరసములో నొక విషబిందువును జల్లినట్లయ్యెను. ఈ జన్మములో కృష్ణుడు అనువాడు రాముడు అనువానికి బ్రత్యపకారము చేసిన వారిరువురి యొండొరుల ఋణము తీరిపోయెనని యనుకొనినను; లోకసమష్టికి రెండు విషబిందువులు చేరినట్లయ్యెను. మొదటి విషబిందువును వేసిన రాముడు అనువాడిప్పుడు మిన్నకకష్ట మనుభవించిన జాలము. శుభకర్మచేసి విషబిందువును దీసివేయవలెను. కృష్ణుడు

అనువాడు ప్రతీకారబుద్ధితో జేసినయపకారమున కుత్తరవాది. వాడు సయితము ముందు శుభకర్మాచరణచే లోకసమష్టికి జేసిన శాంతి భంగమును దొలగించవలెను. ఊరకుండుటవలన గ్రొత్తకర్మ చేయ బడలేదే కాని సమష్టికి గలుగ జేసిన హాని నివర్తించలేదు. అందు వలన బంధముండునని చెప్పనేల?

(౩) మనకు గేవల ఉపేక్షభావ ముండగూడదు. ఆ గుణ ముతో గొంతమాత్రమైనను దూషణ పరిహాసములో లేక ద్వేషభా వమో సమ్మిళితమై యుండును. మద్యపానము జేయువాని జూచిన మనకు సామాన్యముగ బ్రేమభావము కలుగదు. వానియందు అసహ్యము కొంచెమైనను మనస్సునం దుదయించును. అప్పుడు మన స్సుతో వానికి బాధకలుగ జేసినవారమగుదుము. నిస్సందేహముగా రాబోవుజన్మల కది బంధకారణమే. వానియెడ జాలియేచూపవలెను.

(౪) మన కపకారముచేసినను జేయకపోయినను, మనలను గష్టములపాలుచేసినను జేయకపోయినను, మనకు దుష్టజనసంపర్క ము కలిగిన, భగవంతు డా రూపమున "ఇట్టి గుణములు నీకువలదు, తద్వ్యతిరేక గుణములను సంపాదించుము" అని యుపదేశించుట కగుపడినాడని తలచవలెను. మఱియు మనకు శాంతి క్షాంతి గుణ ముల గలుపుట కీదుష్టసాంగత్య ముపయోగకారియే యనియు, సర్వ భూతహితత్వము, సర్వభూతములయం దాత్మ సందర్శనము, లోనగు గుణము లలవడుట కవకాశము కలిగెననియు, ఆ మనుష్యుని దౌష్ట్య మును జూచినపుడు కనికరముతో వానికిపలదయు సహాయము జేయు సందర్భము కలిగినందుకు సంతసించవలయుననియు, వానికి సహాయముచేసిన వాని రూపమున భగవంతుని సేవజేసినట్టేయనియు

భావించి, ద్వేషోపేక్షభావముల వదలుటయేకాక, ప్రేమతో వాని నాదరించినచో నుభయులకు గల పరస్పర ఋణవిమోచన మగుటయే కాక లోకసమష్టికి గలుగజేసిన యపకారము తీరిపోవును. లోకములో సర్వభూతములు భగవంతుని శరీరమేయని యిదివఱలో జెప్పబడెను. మన శరీరములో నొక యవయవమునకు రోగముకలిగిన నా యవయవమును దెంచి పారవైతుమా? అట్లు పారవైచిన దేహమున కంతయు గొఱంతకాదా? అపాయము కలుగదా? అట్లే ఏ యొక్క భూతమును మనము ప్రత్యేకించజాలము. ప్రతిభూతము భగవంతునియొక్క యెద్దియో యొక యవయవము. మన దేహములో బ్రతియవయవము అన్నిటితో మైత్రిభావముతో నుండి దాని దాని పని నెఱవేర్చుచుండిన, జీవునికార్యము చక్కగా జరుగును. ఏ యొక్కటి చెడినను దేహమునకంతయు బాధ. జీవునికార్యమున కభ్యంతరము. ఒక యవయవ మింకొకదానిని ద్వేషించుటకుగాని దూషించుటకుగాని తిరస్కరించుటకుగాని కారణము లేదు. అట్లే సృష్టిలోని ప్రతిపదార్థము ప్రతిభూతమువలన నెద్దియో యొక విధమున నీశ్వరకార్యము జరుగుచుండును. వ్యష్టి దృష్టితో దేశకాలపరిచ్ఛిన్నత్వబుద్ధితో జూచిన నొకటి మంచిది మఱియొకటి చెడ్డదియని తోచునేకాని సమష్టి దృష్టితో అనగా ఈశ్వర భావముతో జూచిన బ్రతి భూతమును దాని దాని అంతస్తుకు యుక్తమైన కార్యము చేయుచున్నదనియు, నట్లదిచేయుట సహజమే యనియు, యుక్తమేయనియు బైమెట్టున నున్న భూతము క్రింది మెట్టుననుండు దానిని బై మెట్టుకు దీసికొనిపోవుటయే ధర్మమనియు దలచి యందులకు వలయు ప్రయత్నము చేయవలెనేకాని, నీవు తగ్గుమెట్టులో

నున్నావు, నీవు హేయము అని భావించిన నీశ్వరధర్మము నుల్లంఘించిన వారలమగుదుము. తెలిసికొనుటకు జన్మమెత్తవలసియుండును. మనపాదములకు ధూళిసోకిన యెడల మన ముదకముతో ప్రక్షాళనము చేసికొనక మిన్నకయుండము కదా. సమష్టిదృష్టితో జూడ బాపాత్ముడెట్టివాడన భగవంతుని శరీరములో మురికియంటిన యొక యవయవము. మన కాళ్లమురికిని గడుగుకొనుటకు హస్తములుండునట్లు భగవంతుని శరీరములో మలినమునంటిన భాగమైన పాపాత్ముని పాపమను నపరిశుద్ధమును దొలగించ ప్రేమయను నుదకము నసమర్పుటకు హస్తములవంటివారము మనము అని తలచుకొనవలెను. చేతు లాపని చేయనియెడల వాని వలన నేమి యుపయోగము? అట్లే మనము పాపాత్ముల పాపమును దొలగించుట కుద్యమించని యెడల మనజన్మము వ్యర్థమేకదా? కావున నీజన్మలో నేర్చుకొనని విషయముల నేర్చుకొనుటకు బునర్జన్మ ఎత్తవలసి వచ్చును. ఇదియే జన్మబంధకర్మ అని టీకలో వ్రాయబడియుండు కర్మ. ఇదియును గాక మన మీశ్వర భక్తులమని యనుకొనుచున్నాము కదా? ఈశ్వరపూజ దంత్రవిధానముగా జేయుచున్నాముకదా? ప్రతిదినము భగవంతునికి 'పాద్యం' సమర్పయామి 'అర్ఘ్యం' సమర్పయామి 'ఆచమనీయం' సమర్పయామి 'స్నపయామి' అని యిట్లు మాటలు పలుకుచు నీరు విగ్రహములపైన బోయుచున్నాము. నిజముగా భగవంతుని దేహములో మురికియున్నది, దానిని గడుగవలెను, అని మనము నమ్మజాలము కదా. నిత్య శుద్ధుని కశుద్ధమెక్కడిది? ఆయన యంతర్యామియై బాహ్యమున ప్రపంచములో వ్యక్తమైయుండు ఉపాధులకు మలినముండును. పాపాత్ము డట్టిమాలిన్యమైన యుపాధిగలవాడు. ఆ పాపమును

మనము తొలగించుటయే మనము భగవంతుని పాద్యాదివిధులచే నభి షేకముచేయుట. శ్రీమన్నారాయణమూర్తి సదా తన పాదములనుండి ముల్లోకపావనమగు గంగను ప్రవహింప జేయుచున్నాడు. ఆ పాద స్మరణ చేసినవారికి వారి పాదపద్మములనుండి బయలువెడలెడు పరి శుద్ధ జ్ఞాన గంగ చల్లబడును. వారి పాపములు పోవును. శ్రీమహేశ్వ రుడు సదా తన జటాజూటమునందు దనను స్మరించెడు వారి పాప ములను దొలగించుటకు బరిశుద్ధజ్ఞానగంగను సిద్ధముగ నుంచుకొని యున్నాడు. అట్లే మనమును పరిశుద్ధ సంకల్పములు ప్రేమసంకల్ప ములు అను గంగను సదా సిద్ధముగ నుంచుకొని ఏక్షణమందు పాపా త్ముల దర్శింతుమో ఆక్షణమే వారిపైన ప్రేమగంగను ప్రవహింపజేసి వారిని బునీతులుగజేసి ఆవిధమున భగవంతునికి గంగాభిషేకముచేసిన పుణ్యమునుబొంది మనము పునీతులుకావలెను. ఇట్టి యవకాశము పాపులసంస్పర్శవలన గలిగెనని యెంచి వారి పాపనివృత్తికి వలయు ప్రయత్నము చేయవలెననియు, జేయనియెడల మన ధర్మమును మన ముపేక్షించినవారల మగుదుమనియు, మఱియు నుపేక్షించినపనిని నెఱవేర్చుటకు బునర్జన్మ మెత్తవలసియుండుననియు టీకాతాత్పర్యము.

"లోకముయొక్క పాపము అవమానము నీ పాపము అవ మానము అని స్మరించుము; ఎందువలన నన, నీ వందులో నొక భాగము."

సమష్టిదృష్టికి సర్వభూతములు సర్వలోకములు భగవంతుని యవ యవములే కావున ఏభూతము పాపముచేసినను నేభూత మవమాన కరమైన కార్యముచేసినను ఆ పాపము నా యవమానము నందఱు చేసినట్టే. అందఱి నంటియుండును. మనదేహమున నెద్దియో యొక

భాగమునకు వ్యాధిసంభవించిన దేహమునకంతయు బాధకల్గునట్లు ప్రపంచములో నెవ్వడు చెడ్డపనిచేసినను ఆ పాప మందఱిని బాధించును.

"విడిపించుకొన సాధ్యములేనట్లు నీ కర్మ పెద్దకర్మతో సమ్మేళనమై యున్నది."

కర్మయన బనిచేయుట. అనగా ప్రకృతితో బురుషుడు పనిచేయుట. ఆదియందు పరమపురుషుడు మూలప్రకృతితో దాని రజస్సత్వతమోగుణములద్వారా బ్రహ్మ విష్ణు రుద్రరూపముల బనిచేయ నారంభించినప్పుడు కర్మ ప్రారంభమయ్యెను. మనదేహములో క్షణక్షణము ప్రాత యణువులు వెడలిపోవుచున్నవి. క్రొత్త యణువులు వచ్చుచున్నవి. ఇట్లు జరుగుచుండుటవలననే మనము రూపమును ధరించ గలిగియున్నాము. రూపములకు వలయు సామగ్రులను బ్రహ్మ యమర్చుచున్నాడు. వానిని రూపముగజేర్చి రూపధారణశక్తి కలుగునట్లు విష్ణువు చేయుచున్నాడు. జీర్ణమై నిరుపయోగమైన రూపమును ఖండించి క్రొత్తదియును వృద్ధియైన జ్ఞానప్రకాశమున కనుకూలమైనదియు, నగు నుపాధికివలయు నణువులు క్రొత్తగా జేరుట కవకాశము రుద్రునివలన గలుగుచున్నది. త్రిమూర్తులరూపమున బరమపురుషుడు చేయుచుండు కర్మవలన మనము దేహమును ధరించి కర్మజేయుచున్నాము. ఆ కర్మ ప్రళయకాలమందు నిలిచిపోగా మన కర్మయు దత్కాలమునకు నిలిచిపోవును. ఇట్లు సమష్టికర్మకును వ్యష్టికర్మకును నుండు సంబంధమును మనము తెలిసికొనవలెను. సమష్టికిని దానిలో జేరియుండు ప్రతిభాగమునకును సంబంధమున్నది. ఏభాగము చలించినను నంతయు

చలించినట్టే. ఈ విషయము భౌతికశాస్త్రజ్ఞులు[1] సయితమంగీ కరించి యున్నారు. సమష్టివ్యష్టులు పరస్పర బాధ్యబాధకసంబంధము కలవని మనము తెలిసికొనకపోయినందున "నేను వేఱు, వాడు వేఱు, వానికి నాకు సంబంధము లేదు, వాడు చెడ్డవాడైతే నాకేమి, వాడెట్లుపోతే నాకేమి" అని మనము తలచుచున్నాము. అట్లు తలచుట యజ్ఞానమువలననే. దీనిని మనము కొన్ని యుదాహరణములవలన దెలిసికొనవచ్చును. మన మొక గొప్పపట్టణములో నివసించుచు బ్రతిదినము ఉదకమును గొట్టము (pipe) ద్వారా పుచ్చుకొనుచు పానప్రక్షాళనాది కర్మల నొనర్చుచుందుము. ఆ గొట్టమునకు నీరెట్లు వచ్చినది మనము గమనించి తెలిసికొనలేదు. ప్రతిదినము నీటియాధారమైన సరస్సునవద్ద ననేకులు జనులు జలోద్ధరణ యంత్రమును ద్రిప్పుచు పనిచేయుచుండుటవలన మనకందఱకు జల మమర్చబడినదని మనకు దెలియదు. ఒకానొకదినము యంత్రము చెడిపోవుటవలననో కూలీలు పనికి రానందువలననో మఱియు నేకారణమువలననో యంత్రము పని చేయక పోయినట్టయిన బట్టణమునకు నీరురాదు. అప్పుడు ప్రతి యింట నుండువారు (తమ పానప్రక్షాళనాది) కర్మ పట్టణ సామాన్యమునకుగాను పనిచేయువారి (జలోద్ధరణ) కర్మననుసరించి యున్నదని తెలిసికొనియెదరు. ఒక గొలుసులో నేయొక్క భాగము తెగినను గొలుసు తెగినట్లే. ఒక పట్టణములో నొకయిల్లు పడిపోయినను పట్టణమున కంతయు, నలంకారన్యూనత ప్రాప్తించినట్టే. అట్లే ఎవడు మంచికార్యము చేసినను లోకమందఱికి శుభము కలుగును.

[1] No movement of a part can take place without affecting the whole.

ఒక మనుజుడు పరమపదవిని బొందినయెడల లోకమునకంతయు నత్యంతశుభము సమకూరునని పెద్దలు చెప్పుచున్నారు. ఒకడు దుష్ట కార్యముజేసిన లోకమునకంతయు నశుభమును గలుగజేసినట్టే. నీరునిండిన పాత్రలో నొక బిందువు విషమువేసిన పాత్రలోని జల మంతయు విషప్రాయమగును. ఈ రీతిని గారణకార్యములకు సం బంధముండునట్లు సమష్టి వ్యష్టులకు సంబంధమున్నదనియు బ్రపంచ ములో నెవ్వడేనియు "నేను వేఱు, నా మంచిచెడ్డలు నా పుణ్య పాపములు నావి, వాని పుణ్యపాపములు వానివి" అని తలచగూడ దనియు భిన్నభావ మసత్యమనియు నెఱుగవలెను.

"నీవు జ్ఞానమును బొందుటకు మున్ను అపరిశుద్ధమైనట్టియు బరి శుద్ధమైనట్టియు నన్నిస్థలములలోను నడచియుండవలెను".

ఇచ్చట జ్ఞానమనగా పరిపూర్ణజ్ఞానము. సాక్షాన్మోక్షహేతువగు జ్ఞానము. ఈ జ్ఞాన మెన్నిజన్మము లెత్తినవెనుకనో కలుగబోవును. జ్ఞానోత్పత్తికిమున్ను పాపకార్యములు చేయుచునే యుందుము. ఆది యందు జ్ఞానము విశేషము కొలంతగనుండునపుడు పెక్కు పాప కార్యములుచేయుచు జ్ఞానము కొంచెము కొంచె మెక్కుడగు కొలది బుణ్యకర్మాచరణము వృద్ధియగుచునచ్చును. పాపకార్యాచరణము తక్కువగుచుండును. ముక్తిసాన్నిధ్యకాలమందు వెనుకటి జన్మ ముల నన్నిటిని బరీక్షించిచూడ మన మెన్నిజన్మములలో నెట్టి యశుభ కార్యముల జేసినది విదితమగును. మనము చేసియుండు మంచికార్య ములే టీకలో జెప్పబడియుండు పరిశుద్ధస్థలములు. చెడ్డకార్యములే యపరిశుద్ధస్థలములు. పాపకార్యముచేసి తత్ఫలదుఃఖ మనుభవించియే అట్టి పాపకార్యము చేయగూడదని నిశ్చయించుకొనగలము. కావున

జ్ఞానోత్పత్తికి బూర్వము సకలవిధములైన యశుభములు మనకు గలిగి యుండునని టీకతాత్పర్యము.

"కావున నీవు స్పృశించ వెనుదీయునట్టి మురికివస్త్రము నిన్న నీదిగానే యుండియుండవచ్చును. రేపు నీది కావచ్చును".

ఇప్పటిదశలో మురికివస్త్రమును జూచి మన మసహ్యపడుదుము. అయితే మురికివస్త్రము మనకు బాగుగ దోచినకాల ముండినది. అన గా అజ్ఞానదశలో జెడ్డకార్యములు చేసినవారమే. అప్పటి కవి మనకు చెడ్డపనులుగ దోచలేదు. ఇప్పుడా చెడ్డకార్యముల దుఃఖ ఫలము ననుభవించి జ్ఞానమువచ్చి ఆట్టికార్యములు చేయగూడదని తెలిసి కొన్నారము. మనము పూర్వ మజ్ఞానదశలోనుండి దుష్కార్యములు చేయుచుండినట్లు ఇప్పు డట్టి దశలోనుండి అట్టి కార్యములు చేయు చుండువా రనేకులున్నారు. వారలను జూచిన మన పూర్వపు అజ్ఞాన దశను స్మరించుకొని వారియెడల విసుకుచెందక ద్వేషించక మనవలె నే వీరును నజ్ఞానదశలో నున్నారు. కాలక్రమమున జ్ఞానము కలుగగా నిట్లు ప్రవర్తించరు. ఆ జ్ఞానము వారికి శీఘ్రముగ గలుగునట్లు నేను గొంచెము సహాయము చేయవలెను అని పశ్చా త్తాపముతో వారికివలయు సహాయ మొనర్చవలయునుగాని వారి యందు మురికి అనగా అజ్ఞానమున్నదని తొలగిపోగూడదు. మన ము జ్ఞానపూర్ణుల మగువఱకు మన వస్త్రమునందును మురికి యుండనే యుండును. అయితే కొంచెము తక్కువగ నుండ వచ్చును. ఒకరి దోషముల నొకరుచూచునపుడు వానియెడ ద్వేష భావమును జెందక ఆ దోషములు జీవయాత్రలో నా యా మెట్టునకు దగినట్లుండుననియు, స్వాభావికములేయనియు దెలిసికొని పరస్ప

రానుకంపమున కాధారముగ జేసికొనవలనేకాని ద్వేషకారణములుగ జేసికొనగూడదు.

"దానిజూచి వెఱగంది తొలగిపోయ్యెదవేని నీ భుజములమీద దాని బడవేసినప్పు డది నిన్ను విశేషముగ నంటుకొనును."

పరమగురువులు మనలను వారిచెంతజేర్చి జ్ఞానోపదేశము చేసి, దీక్షితునిగ జేయుటకు మున్ను మనలను బలువిధముల బరీక్షింతురు. ముఖ్యముగ మన నిర్వైరత్వమును బరీక్షింతురు. మనకు బూర్వ మెవరియందు ద్వేషభావ మెక్కుడుగ నుండినదో వారిని బరమప్రేమతో నాలింగనము చేసికొన గలిగినంతవఱకు మనము గురుకటాక్షమునకు బాత్రత బడయనేరము. నిజముగ మనము ద్వేషించిన మనుష్యుని దెచ్చి మన భుజములపైన వైతురు కాబోలు. అప్పుడు మన మనోభావమును వారు కనిపెట్టుదురు. వాని చెడ్డ మన స్మరణకే రాకూడదు. పరమేశ్వరుడే వాని రూపమున మనవద్దకు వచ్చినాడనియు, వానియం దత్యంత ప్రేమచూపుటయే భగవంతునియందు భక్తిసలుపుటయనియు, మన మనస్సుకు తత్క్షణం స్ఫురించవలెను. ఈ భావము బహుకాలము ద్వేషవివర్జితులమై మైత్రిభావమును వృద్ధిపరచుకొనుచుండిన గాని మనకు గలుగనేరదు. కనుక నిప్పటినుండియే మురికివస్త్రమును జూచి వెఱగంది తొలగిపోకుండున ట్లభ్యసించవలెను. అనగా దుర్మార్గుని ద్వేషించకుండున ట్లభ్యసించవలెను. మనము జ్ఞానము వహించి యిట్లభ్యాసము చేయనియెడల నయత్నముగ ద్వేషియే మన పుత్రుడుగ జన్మించి వానిని ప్రేమించువిధమును మనకు గఱపును. ఇదియే టీకలోజెప్పిన మురికివస్త్రము మనల విశేష మంటియుండుట. మన చెడ్డికూడదని తొలగిపోతిమో దానినే మన భుజము

పైన వేసినట్టగును. సర్వభూతహితత్వము సంపాదించవలెనేకాని యపరిశుద్ధుని సాంగత్యము కలిగినప్పు డెంతమాత్రము చింతించ గూడదు. దీనిని మఱియొకవిధమున విచారించవచ్చును. అపరి శుద్ధమును జూచి వెఱగందుటకు గారణమేమి? మనయందలి పారి శుద్ధ్య అభావమే.

స్వచ్ఛః ప్రకృతిత స్స్నిగ్ధో మాధుర్య స్తీర్థభూర్నృణాం।
మునిః పునాత్యఘాత్ మిత్ర మీక్షోపస్పర్శన కీర్తనైః ॥

(శ్రీ. భాగ. 11-7-44)

నిర్మలుడుగను, జనులయందు స్వాభావిక మగు ననురాగము గలవాడు గను, మధురవాక్కు గలవాడుగను, జనులను బవిత్రముచేయు తీర్థము వంటి వాడుగను, ఉండి దర్శన స్పర్శన కీర్తనలచేత దవమిత్రుని బావన ము చేయవలెనని ముని జలమును జూచి నేర్చుకొనవలెనని యవధూత యదుమహారాజునకు జెప్పెను. మనము పరిశుద్ధులుగనుండి యితరుల బరిశుద్ధులుగ చేయుటయే కర్తవ్యము. అగ్ని పరిశుద్ధమైనదానిని నపరిశుద్ధమైనదానిని దహించలేదా! మనయందు పవిత్రాగ్ని యున్నది. పరుల కుపకారముచేయుచు బరుల యపరిశుద్ధమును మన పవిత్రతచే గాల్చుచురాగా మనయందలి పరిశుద్ధాగ్ని మిక్కిలి ప్రజ్వ లించును.

తేజస్వీ తపసా దీప్తో దుర్ధర్షో దరభాజనః।
సర్వభక్షోఽపి యుక్తాత్మా నాదత్తే మలమగ్నివత్ ॥

(భాగ. 11-7-45)

జ్ఞానవర్చస్సుగలవాడును, దపస్సువలన దేజః ప్రకాశము గలవాడును, క్షోభజెందనివాడును, నపరిగ్రహుండును, యుక్తాత్ముఁడగు ముని యగ్నివలె సర్వభక్షితుడయ్యు దద్దోషములవలన నంటబడడు.

జ్ఞానమువలనను దపస్సువలనను మిక్కిలి పరిశుద్ధాత్ముల కెట్టి యపరిశుద్ధస్థలమునకు బోయినను బాధలేదు. వారి పరిశుద్ధాగ్ని సర్వమలములను హరించును. అంత పారిశుద్ధ్యములేనివారు సయితము అపరిశుద్ధ ప్రదేశములకును నపరిశుద్ధులవద్దకును బోయి సహాయము చేయవలసి వచ్చును. అట్టి సమయములందు లోకోపకారమునకై అచ్చటికి బోవుటచే భగవదనుగ్రహమను రక్షను వహించినవారల మగుదుము. దానికి జేరికగా భగవన్నామస్మరణ, ప్రణవోచ్చారణ, వీనివలన నా రక్షను మఱియు బలపర్చుకొనవచ్చును. మహామారి (plague) మొదలగు జాడ్యములు ప్రాయశః మిక్కిలి యపరిశుద్ధ ప్రదేశములలో నెక్కుడుగ సంభవించును. సహాయముచేయుట కచ్చటికి బోవుటయే ధర్మము. అప్పు డారోగికి జేయుసహాయ మీశ్వరసేవయని నిశ్చయించి ఈశ్వరస్మరణ యను రక్షతో బోయినయెడల నీశ్వరానుగ్రహము వలన నపరిశుద్ధ సంస్పర్శ జనిత దోషము మనల నంటదు.

"నేను ధర్మాత్ముఁడనని తన్నుదా నెంచుకొనువాడు తనకుదానే బురదపడకను గల్పించుకొనును."

బురద పడక అనగా మాయ–అజ్ఞానము. లోకముయొక్క పుణ్యపాపములన్నియు దన్నంటుచుండగా నేను ధర్మాత్ముఁడనని యూరకుండుట అజ్ఞాన చిహ్నమే కదా. నేను ధర్మాత్ముఁడనని తలచువానియందు దోషములున్నవి. (1) ధర్మాధర్మముల నతిక్రమించనివాడే నేను ధర్మాత్ముఁడ ననుకొనును. (2) నేను ధర్మాత్ముఁడనని

తలచుటలో నహంకారభావము వృద్ధియగును. (3) అంతరంగమం దెవడు ధర్మాత్ముఁడు కాడని తోచునో వానియందు ద్వేషము గాని లేక ఉపేక్షరూపమైన భేదబుద్ధి గాని కలుగును. (4) అందువలన వానికి సహాయముచేయుట కవకాశముండినను దూష్ణీభావము కలుగును. ఈ దోషము లధోగతిని జెందించునవియే. అధోగతిమార్గమున నడు గిడి నేను ధర్మాత్ముఁడ ననుకొనువాడు మాయ యను బురదలో దిగినవాడనుట కేమియు సందేహము లేదు.

"దేనినైన వర్జనీయమను హేతువున వర్జింతువే కాని నీవు పరి శుభ్రముగ నుండవలెనను నెపమున వర్జించవలదు."

వర్జనీయమైనది దోషము. దోషము వర్జనీయమైనదే. అయితే దోషి ద్వేష్యుడు కాడు. క్రిస్తుదేవుడట్లే బోధించియున్నాడు. "పాపము ను నికారింతువు గాని పాపిని నిరాకరించకము"[1] "నేను పాపము చేసినయెడల నన్నుజూచి యితరులు చెడుదురు. సమష్టివ్యష్టులకు గల పరస్పర సంబంధమువలన లోకమునకంతయు నేను జెడుగు కలుగ జేసిన వాడనగుదును. అట్లు చేయుట సరికాదు. అట్లుచేయ నా కధి కారము లేదు." అని తలచి దోషకార్యములనుజేయుట మానుకొన వలెనేకాని ఆ దోషవర్జనము గర్వమునకు గారణము కాగూడదు. "నేను నిర్దోషినై జ్ఞానము సంపాదించి దోషులయొక్క యజ్ఞాన మును దొలగించి వారిని గురువుల సన్నిధానమునకు దీసికొనిపోయె దను" అని యుద్దేశించవచ్చును. "నేను శీఘ్రముగా జ్ఞానమును బొందెదను. ఇతరులతో నాకేమి సంబంధము? నాగొప్ప నాది. నా మంచిఫలమును నే ననుభవించెదను" అను భిన్నభావము యో

[1] Hate Sin but not the Sinner.

గ్యమైనది కాదు. పరమగురువు లట్టి యుద్దేశముకలవారి నంగీకరించరు. ఎంత గొప్పవాడైనను ఆ యుద్దేశములో స్వార్థపరత్వ మున్నది. గురువుల యభిప్రాయమున నది గొఱంతయే. ఆ లోపము తొలగుటకు జ్ఞానోపదేశమున కనర్హులమనియే వారు భావింతురు.

భేదబుద్ధిని నశింపజేయుమని బోధించు 5 వ ప్రాచీనసూత్రము విచారించబడెను. 5, 6, 7 ప్రాచీన సూత్రములు విజ్ఞానమయకోశ దోషములను దెలుపుచున్నవని నిరూపించబడెను. 1, 2, 3 ప్రాచీన సూత్రములలోని బోధలను జక్కగా గ్రహింప నేరమిచే గలుగు దురభిప్రాయములను దొలగించ నాల్గవవ్యాఖ్యాన సూత్రము గ్రంథములో జేర్చబడినదని నాల్గవ సూత్రవిమర్శలో దెలియజేయబడెను. 5, 6, 7 ప్రాచీన సూత్రములవలన గలుగు దురభిప్రాయములను 8 వ వ్యాఖ్యాన సూత్రము తొలగించుచున్నది. ఈ 8 వ సూత్రములోని యొక్కొక్క భాగమును నందుకు సంబంధించిన 5, 6, 7 ప్రాచీన సూత్రములతో జేర్చి చదువుకొనవలెను. ఇప్పుడు విచారించబడిన 5 వ సూత్రముకు సంబంధించిన 8 వ సూత్రములోని వ్యాఖ్యానభాగము విచారించబడును.

## ఎనిమిదవ వ్యాఖ్యానసూత్రము

"భేదబుద్ధినంతయు జంపివేయుము. అయిన నేకాకివై, సాంగత్యము కోరకయుండుము. ఎందువలన ననగా, ఉపాధియుక్తమగు నది యెద్దియైనను, భేదజ్ఞానముగల దెద్దియైనను, నిత్యముకానిది యెద్దియైనను, నీకు సహాయముచేయ నోపదు."

"భేదబుద్ధిని జంపివేయుము" అని చెప్పుటవలన "నే నెందుకు పనిచేయవలెను. నేనేల శ్రేయోమార్గమునందు రాగల పెక్కు సంకటములపాలు కావలెను? ఎవరు పనిచేసినను నేను జేసినట్లేను. ఎందుకనగా వారికి నాకు భేదములేదు." అని కొందఱు దురభి ప్రాయపడవచ్చును. "సర్వం బ్రహ్మమయము. నే నద్వైతానంద రసము ననుభవించుచుండు వాడను. నేను ధర్మాతీతుడను" అని చెప్పుకొనుచు మనఃపారిశుద్ధ్యములేక పరద్రవ్యాపహారణము, పర స్త్రీసంస్పర్శదోషములకు లోనగు శుష్కవేదాంతులను గూర్చి విని యున్నాము. బ్రహ్మలక్షణములలో జ్ఞానమనునది యొక్కటి.

సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ।

సర్వము భగవన్మయమని యనుభవముచే తెలిసికొనువాడే జ్ఞాని.

"జ్ఞానవాన్ మాం ప్రపద్యతే వాసుదేవస్సర్వ మితి"

ఇట్టి పరమయోగిదశ, జ్ఞానము, సులభముగా లభించదు. బహు జన్మ లెత్తినగాని లభించదు.

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వ మితి . . . . . . . . . . . . . . ॥

అట్టివాడు మహాత్ముడు, దుర్లభుడు.

"సమహాత్మాసుదుర్లభః." భ. గీ. 7-19.

ఆ దశను జెందుటకు బహుప్రయత్నములు చేయవలెను. అపజయ మునకు వెఱగందక వెనుదీయక ప్రయత్నమునుండి విరమించక సాధించవలెను.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥

(భ. గీ. 7-3)

బహుమంది జనులలో మోక్షసిద్ధికి ప్రయత్నించువా డొకానొకడే. ప్రయత్నించువారలలో (వెనుదీయక సిద్ధిచెందువఱకు బట్టుదలతో సాధించి) భగవత్తత్త్వము నెఱుగువా డరుదు.

ఈ ప్రయత్నము ప్రతిమనుజుడు తనకు దాను జేయవలసినదేకాని అభేదముయొక్క యాథాత్మ్యమును దెలియక మఱియొకడు చేసిన జాలునని యుండుటవలన నుపయోగము లేదు. ఈ విషయమందు వివేకచూడామణియం దిట్లు బోధించబడియున్నది:—

ఋణమోచనకర్తారః పితుస్సంతిసుతాదయః ।
బంధమోచనకర్తాతు స్వస్మాదన్యోనకశ్చన ॥
మస్తకన్యస్తభారాదేః దుఃఖ మన్యై ర్నివార్యతే ।
క్షుధాదికృతదుఃఖం తు వినా స్వేన న కేనచిత్ ॥
పథ్యమౌషధసేవాచ క్రియతే యేన రోగిణా ।
ఆరోగ్యసిద్ధిర్దృష్టాఽస్య నాన్యానుష్ఠితకర్మణా ॥
వస్తుస్వరూపం స్ఫుటబోధచక్షుషా స్వేనైనవేద్యం నను పండితేన ।
చంద్రస్వరూపం నిజచక్షుషైవ జ్ఞాతవ్యమన్యై రవగమ్యతే కిమ్ ॥
అవిద్యా కామకర్మాది పాశబంధం విమోచితుం ।
కశ్శక్నుయాద్వి నాత్మానం కల్పకోటిశతైరపి ॥ (63-67)

తండ్రియొక్క ఋణవిమోచన కర్తలు సుతాదులు. బంధమోక్షకర్త తనకన్న నన్యు డెవడును లేడు. తలపైనున్న భారము మొదలగు

వానివలన గలుగు కష్ట మితరులచే నివారింపబడ గలదు. ఆకలి మొదలైన వానివలనగలుగు కష్టమన్నచో తానువినా మఱియొకని వల నను నివారింపబడ నేరదు. (అనగా తాను భక్షించిన నాకలి తీరునే కాని మఱియొకడు భక్షించిన దీరదు.) రోగి యౌషధసేవ పథ్యము నాచరించి ఏ యారోగ్యఫలమును బొందుచున్నాడో ఆ ఫల మిత రులాచరించిన బొందనేరడు. (ఇతరులు మందుదీసికొనిన రోగి వ్యాధి నివారణకానేరదు. రోగి స్వంత మౌషధము పుచ్చుకొనవలెను.) వస్తు (ఆత్మవస్తువు) స్వరూపము (ప్రయత్నముచే సంపాదించిన) జ్ఞానచక్షుస్సుచే దనకే వేద్యము కాగలదు కాని పండితుడు చెప్పుట వలన వేద్యము కానేరదు. చంద్రస్వరూప మెట్టిదియైనది తన స్వంతకంటితో దాను చూచి తెలిసికొనవలెనేకాని యితరులు చెప్పు టవలన తెలియబడునా? అవిద్యాకామకర్మాది పాశబంధమునుండి విడిపించుకొనుట తనవలనవినా నూరుకోట్ల కల్పములకైన నితరులవలన శక్య మగునా?.

కావున నాత్మజ్ఞానము, సర్వభూతైకత్వ అభేదభావము, తాను స్వయంప్రయత్నముచేసి సంపాదించవలెను గాని లోకములో భేద ము లేదు, ఎవరైన బ్రయత్నముచేసిన నా ఫలము నాకు గలుగును, అంతియ చాలు అని తలచి మిన్నక యుండిన నెంతకాలమునకైనను జ్ఞానము లభించదు.

నాయమాత్మా బలహీనేన లభ్యో
న చ ప్రమాదాత్తపసో వా ప్యలింగాత్ ।
ఏతైరుపాయైర్యతతే యస్తు విద్వాం
తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ ॥ (ముం. ఉ.)

ఈ యాత్మ బలహీనునికి లభ్యముకాదు. ప్రమత్తునికిని, నియత లక్షణ సహితమైన తపస్సు లేనివానికిని లభ్యము కాదు. ఈ యు పాయములతో (అనగా ఆత్మనిష్ఠాజనిత వీర్యము, అప్రమత్తత, లక్షణసహిత తపస్సు) నే విద్వాంసుడు ప్రయత్నము చేయునో వానికి బ్రహ్మపదము లభ్యమగును. వేదములు, శాస్త్రములు, గురువు వీర లుపాయములను బోధించువారే. ఆ బోధను జక్కగా గ్రహించి ధ్యానయోగ సమాధియందు దాని యథార్థతత్త్వమును స్వా త్మానుభవమునకు దెచ్చికోవలెను. అందువలననే బాహ్యబోధవలన లభ్యమైన విద్యయంతయు (వేదములుసహా) నపరావిద్యయని గణించ బడుచున్నది.

> తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదస్సామ వేదోఽథర్వ వేదః । శిక్షాకల్పో వ్యాకరణం నిరుక్తంఛందో జ్యోతిషమితి ॥

ఇక బరావిద్య యెట్టిది యన:—

> అథ పరా యయా తదక్షరమధిగమ్యతే । (ముం ఉప.)

ఆ అక్షరమును (బ్రహ్మను) నే విద్యతో (ఏ అపరోక్షానుభవము వలన) దెలిసికొనదగునో ఆ విద్యయే పరావిద్య.

ఇతరులు—అనగా తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, పరమ గురువులు, వీరలు మార్గమును జూపుదురు. ఉపాయముం బోధిం తురు. జ్ఞానమునుబొంది యాత్మసాక్షాత్కారము మనసు స్వయముగ జేసికొనవలెను. మోక్షమార్గోపదేశమునందు బరమగురువు లనుష్ఠించు పద్ధతులకును లౌకికపాఠశాల బోధలకును మిక్కిలి భేదముకలదు. పరమగురువు లే విషయమందైనను బాహుళ్యముగా విశదముగా

జెప్పరు. ఒకమాట, లేక ఒక వాక్యము, ఒకసలహామాత్రము చెప్పెదరు. దానిని మనస్వాంతబుద్ధిని బ్రయోగించి మనము గ్రహించి నరీతిన మనము ప్రవర్తించి దానివలన నేర్చుకొనవలసిన విషయములను నేర్చుకొనవలెను. అట్లు లేక ప్రతివిషయమును వారు చెప్పచూవచ్చి యాప్రకారమే మనము వర్తించుచుండినయెడల మనకు బుద్ధిసూక్ష్మ మెట్లుకలుగును? జ్ఞానమెట్లు సిద్ధించును? ఈశ్వరసాన్నిధ్యమును జెందవలెనన నీశ్వరలక్షణమైన జ్ఞానస్వరూపులము కావలెనుగదా! కావున "అభేదము, అభేదము" అని మోసపోగూడదు. ఉపాధి సహితులముగ నుండునంతవఱకు నుపాధికృతభేద ముండనేయుండును. ఆత్మాభేదదర్శనమునకు, అనగా సర్వమీశ్వరమయము అనుభావమల వడుటకు ఉపాధియుక్తుడైన ప్రతియొకడు ప్రత్యేకముగా బ్రయత్నము చేయనలెను. ఒకకుటుంబములోని ప్రతియొకడు కుటుంబార్థము పని చేయునది విదితమైన విషయమే. అందఱొకకుటుంబమువారే. అంద ఱు కుటుంబార్థము కృషిచేయువారే. అయినను బ్రతియొకడు వాని వాని శక్తిసందర్భానుసారము పనిజేసి కుటుంబకార్యమును నెఱవేర్చు ను. మేమందఱ మొకటే, అభేదము అనితలచుకొని అందఱూరక యుండిన నేమి ఫలము కలుగునో చెప్పనేల? అట్లే ఈశ్వరకుటుంబ ములో బ్రతియొకడు తన బుద్ధిని వికసింపజేసికొని సంసారముదెసనుండి ఈశ్వరుని దెస ద్రిప్పి ఈశ్వరప్రీతిగా ఈశ్వరార్పితముగా లోకసంగ్ర హార్థము పనిచేయనలెను గాని ఇతరులను సదా నమ్మియుండి స్వశక్తు లను బ్రకాశింప జేసికొననివాడు ఈశ్వరకార్యమును నిర్వర్తింపజాలడు. యుక్తాయుక్తములను, కార్యాకార్యములను దెలిసికొన మనస్వాంత బుద్ధిని బ్రయోగించవలెను. నివృత్తిమార్గమునం దడుగిడి పరమగురు

వులచెంత జేరువాడు గురువుల లోకోపకారకార్యమును కౌశల్యము తోజేసి గురువులకు సహాయముచేయవలెనేకాని ప్రతివిషయములోను, "దీని నెట్లు చేయవలెను, అట్లుచేసిన నేమి, ఇట్లేల చేయకూడదు" అని గురువులను బలుమఱు పృచ్ఛించుచుండువాడు వారిపని కంతరాయము కలుగజేయునేకాని సహకారిగ నుండడు. వారు చెప్పి ప్రతిపనిని మనచేత జేయించుచువచ్చిన యెడల మనబుద్ధి కౌశలము వృద్ధికానేరదు. అపుడు ఈశ్వరకర్మను స్వతంత్రముగ మనము చేయనేరము. తత్వ జ్ఞానము మనకలవడదు. ఆరంభదశయందు జనసామాన్య ధర్మమాచరించువారల మైనప్పుడు ఇతరులవలన దెలిసికొనినదానినే నమ్మి ప్రవర్తించుచుందుము. ఆ ప్రవర్తనమువలన నశుభఫలము కల్గిన "వాడు చెప్పినప్రకారము వర్తించితిని. నాతప్పుకాదు. పదిమంది చేసిన ప్రకారము నేనుగూడ జేసితిని" అని యీవిధమున నితరుల నిందింపదలతుము. పరమగురువులచెంత జేరినవా డిట్లితరులనే నమ్మి తన బుద్ధికుశలత ప్రకాశించుట కవకాశములేకుండునట్లు చేయగూడదు. ఈశ్వరప్రతినిధిగా గురువులప్రతినిధిగా గొప్పకార్యముల జేయవలసియుండును. అప్పుడు స్వంతబుద్ధిని ప్రయోగించి తన కార్యమువలన లోకమున కశుభము కలుగకుండునట్లును మేలు కలుగునట్లును చేయవలెను. ఈ విషయమునందు "పరమగురుచరణసన్నిధి" అను గ్రంథమునం దిట్లు చెప్పబడియున్నది. "ఇతరు లనేకు లొక విషయమునం దొక యభిప్రాయము పడినారనే కారణముననే నీవు సయితము నా యభిప్రాయమే కల్గువాడవు కాగూడదు. ఆ యభిప్రాయమును శతాబ్దములనుండి జనులు నమ్మియుండినను పవిత్రమైన గ్రంథములయందు వ్రాయబడియుండినను నా కారణములచేతనే నీవు

నమ్మకూడదు. నీవు స్వయముగా నా యభిప్రాయము సరియయిన దా లేదా అని విమర్శించుకొనవలెను. . . . . . . . . . . . . మోక్ష మార్గమును బ్రవేశించగోరువాడు ప్రతివిషయమును స్వంత బుద్ధితో విచారించి తీర్మానించుకొనవలెను. మూఢశ్రద్ధ ప్రపంచములోని దోషములలో గొప్పది. ఆ శృంఖలమునుండి విడిపించుకొనవలెను."

కావున "భేదబుద్ధిని జంపివేయుము" అని బోధించెడి ౯వ ప్రాచీన సూత్రముయొక్క యథార్థ తాత్పర్యమేమన పారమార్థిక మున నభేదము సత్యమే ; అయిన వ్యావహారికమున నుపాధియుక్తుల ముగ నుండునంతవఱకు భేదమున్నది. ప్రతియొకడు ప్రత్యేకముగా బనిచేయుచు నుపాధులను బరిశుద్ధము చేసికొనుచు వానిదోషములు తొలగగా ఆత్మాభేదానందము ననుభవించును. ఏకాంతుడవై సాంగత్యరహితుడవై (కేవల మితరులనే నమ్మియుండక) యుండ వలెనని వ్యాఖ్యానసూత్రము బోధించుచున్నది. అందుకు గారణము సూత్రమునందే చెప్పబడియున్నది. "ఉపాధియుక్తమైనది యెద్ది యైనను, భేదజ్ఞానముకల దెద్దియయినను నిత్యబాహ్యమైన దెద్దియయి నను నీకు సహాయముజేయనోపదు." నిత్యమైనవస్తువు బ్రహ్మవస్తువే. నిత్యుడు భగవంతుడే. శరణ్యు డాయన యొక్కడే. ఆత్మస్వరూప మున మనయం దాయన ప్రకాశించుచున్నాడు. ఆత్మయే యాథార్థ్య మని సంపూర్ణముగా విశ్వసించవలెను. పరులసహాయము కొంతవఱకే ప్రయోజనకారిగ నుండును. చివరన నితరులెవరు సహాయముచేయ నోపరు. ఆత్మావలోకనము స్వయముగ చేసికొనవలయును. పరమ గురువులు, మహావాక్యోపదేశముచే "తత్వమసి" నీవు బ్రహ్మవు అని మన స్వరూపమిట్టిది యని చెప్పగలరే కాని బ్రహ్మసాక్షా

త్కారము చేసికొని బ్రహ్మానందము మనమే యనుభవించవలెను. అవాక్యార్థ అపరోక్షానుభవ జ్ఞానము ఉపాధియాశ్రయమును నమ్మి యుండునంతవఱకు గలుగ నేరదు. పరమహంసదశను గడచుటకు మున్ను సర్వబాహ్యాశ్రయమును (దీనినే సూత్రములో నిత్యబాహ్యా మగునది అని చెప్పబడియున్నది) వదలవలెనని యనుభవజ్ఞులైన పెద్దలు చెప్పుచున్నారు. ఆ దశను గడచుకాలమందు బెక్కుసంకటములు ప్రాప్తించును. సత్కారమునుబొందినవా రపకారమును జేతురు. కృతజ్ఞతను జూపవలసినవారు కృతఘ్నులగుదురు. ఎవరి సహాయముండు నని సంపూర్ణనమ్మకముండినదో వారు తొలగిపొయ్యెదరు. బాహ్యా శ్రయము నిరర్థకమని తోచి అంతరాత్మాశ్రయమునందు సంపూర్ణశ్రద్ధ కలుగునంతవఱకు ఉండినచోటు పోయి క్రొత్తచోటుదొరకనికాల మప్పుడు నిరాశ్రయుడెట్లు దుఃఖముపాలగునో అట్టిదశయందుండును. అప్పుడు భగవంతుడు పరమగురువులు సయితము నాయందు కృపార హితులై నన్ను విడనాడిరా! అకటా! అని విలపించును. అప్పుడు విలాపమును మాని అపకారమొనర్చినవారి యెడల వైరభావముచెందక వారుసయితము మన యాత్మయందుండువారే అని శాంతచిత్తుడై కొంచెము విచారించిన భగవంతుడు గురువు ఎచ్చటను పోలేదు. వారు వేఱు నేను వేఱు అని భ్రమచెందినంతవఱకు దుఃఖము కల్గెను. వారు నాయందేయున్నారు. నా ఆత్మస్వరూపులే, ఆత్మయే శరణ్యము. ఆత్మేతరము, ఆత్మబాహ్యము, అనాత్మ అసత్యము. బాహ్యమునందు న్నదని మనముతలచిన యెట్టి పదార్థముకాని ఎట్టి మనుష్యుడు కాని మనకు జివరన సహాయముచేయనోపరు అని ధృడముగ నమ్మిన నాత్మావలోకనము సిద్ధించును. అట్టివారినిగూర్చి భగవద్గీతయందు

నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్త కామాః । ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః గచ్ఛంత్య మూఢాః పదమవ్యయం తత్ ॥ (15-5)

వారు సర్వభావ్యాసంగమును వదలి అధ్యాత్మనిత్యులైనవారు. "పరమగురుచరణసన్నిధి" లో "నిన్ను నీవు నమ్మవలెను" అని చెప్పబడియున్నది. అనగా ఆత్మయందు సంపూర్ణశ్రద్ధయుండవలెను.

కావున అభేదానందానుభవము లక్ష్యస్థానముగనుంచుకొని ఆ యనుభవసిద్ధి కల్గుటకు జేయవలసిన ప్రయత్నములు తాను స్వంతము చేయుచుండవలెననియు, నితరులనే నమ్మియుండగూడదనియు, "భేద బుద్ధిని నశింపజేయుము" అని బోధించెడి ప్రాచీనసూత్రమువలన ననాత్మాశ్రయము, రూపభ్రమ, రూపసంగము (attachment to form) నిరసించబడి పారమార్థికాభేదము బోధించబడినదే కాని మోక్షసాధనమునకు స్వంత ప్రయత్నము చేయవలసిన యవశ్యకము లేదని బోధించబడలేదనియు ఎనిమిదవ వ్యాఖ్యానసూత్రము బోధించుచున్నది. భేదబుద్ధి మిథ్యాజ్ఞానమువలన గల్గుచున్నది. భేద బుద్ధి యుండునంతవఱకు మనము స్వప్నావస్థలో నుండువారమే. వస్తువునందు భేదదృష్టి ఒకస్వప్నము. భిన్నాధికారులవలన నిర్వ ర్తించబడు కర్మలు వేఱు అని తలచుట మఱియొకస్వప్నము. కర్మ వలన సాధించబడుఫలము నాకు గావలెనను కోరిక కల్గుట మూడవ స్వప్నము. ఈ మూడు స్వప్నములు భేదజ్ఞానజనితములే. వాని నభేదజ్ఞానముచేత బోగొట్టుకొనవలెను. ఈ మూడు భేదజ్ఞానజనిత స్వప్నములను అనగా దుర్లభిప్రాయములను భావాద్వైత క్రియా

ద్వైత ద్రవ్యాద్వైతములను మూడద్వైతభావములవలన బోగొట్టు కొనవలెనని శ్రీభాగవతమందు జెప్పబడియున్నది.

భావాద్వైతం క్రియాద్వైతం ద్రవ్యాద్వైతం తథాత్మనః ।
వర్తయన్ స్వానుభూత్యేహ త్రీన్ స్వప్నాన్ ధునుతే మునిః॥
కార్యకారణవస్త్వైక్య దర్శనం పటతంతువత్ ।
అవస్తుత్వాద్వికల్పస్య భావాద్వైతం తదుచ్యతే ॥
యద్బ్రహ్మణి పరేసాక్షాత్ సర్వకర్మసమర్పణం ।
మనోవాక్తనుభిః పార్థ క్రియాద్వైతం తదుచ్యతే ॥
ఆత్మజాయాసుతాదీనా మన్యేషామపిదేహినాం ।
యత్స్వార్థకామయోరైక్యం ద్రవ్యాద్వైతం తదుచ్యతే॥

(7. 63–66)

పటతంతువులకుంబోలె గార్యకారణములకు అనగా బ్రహ్మకు జగత్తుకు భేదములేదని చూచుట, అనగా ప్రపంచమంతయు బ్రహ్మయభివ్యక్తమేయని భావించుట భావాద్వైతము. మనస్సుచేతను వాక్కు-చేతను కాయముచేతను సర్వభూతములవలన జేయబడు కర్మ ఈశ్వర కర్మయేయనియు, ఈశ్వరశక్తులవలననే కర్మచేయబడుచున్నదనియు నెవరి నుద్దేశించి ఏ ఫలమును గోరి ఏకర్మచేసినను దత్సర్వ మీశ్వరుని జెందునదేయనియు, నాయనకర్పితమే యనియు, భావించుటవలన భిన్నాధికారుల భిన్నకర్మలయం దభేదమును జూచుటచే క్రియా ద్వైతమగును. తాను, భార్య, సుతాదులు, మఱియు నితరులు వీరందఱికి నుపాధులు వేఱైనను అన్నియుపాధులు పంచభూతాత్మకములే యని యుపాధియందభేదమును, అందఱు వేఱు వేఱు కోరి

కలు ఉద్దేశములు కలవారైనను అందటి అర్థకామముల భోక్త పరమా త్మయే యగుటవలన సర్థకామాపేక్షయా సయితము భేదము లేదనియు చూచుట ద్రవ్యాద్వైతము. ఈ మూడువిధములైన అభేదదర్శనము వలన భేదబుద్ధి జనిత మిథ్యాజ్ఞానము తొలగగా, యథార్థజ్ఞానము చేత ఈశ్వరసంకల్ప మెఱిగి తదనుగుణముగా సర్వభూతహితమును గోరుచు ఈశ్వరసంకల్పాను ప్రవర్తకులగు ఋషులకు దోడ్పాటుగా లోకసంగ్రహ కర్మాచరణము చేయనగు. ఇదియే అభేదదర్శనము యొక్క వాస్తవఫలము. ఇట్లు వర్తించుటకు యోగ్యతను స్వప్రయత్నము చేత సంపాదించవలెననియు బరాధీనులుగ నుండగూడదనియు యథార్థ అభేదమును వ్యాఖ్యానసూత్రము బోధించుచున్నది.

ఆఱవ ప్రాచీనసూత్రముతో నెనిమిదవ వ్యాఖ్యానసూత్రము రెండవభాగమును జేర్చి చదువవలెను.

6. ఇంద్రియ జ్ఞానేచ్ఛను జంపివేయుము 8. (అయిన) నింద్రియ జ్ఞానముచే తెలిసికొనుము, పరిశీలించి చూడుము, అట్లుచేసిననే నీ వాత్మవిద్యాశాస్త్రమును గఱచుట కారంభించి, యా నిచ్చెన యొక్క మొదటి మెట్టునం దడుగిడ సమర్థుడవగుదువు.

ఇచ్చట ఇంద్రియములన వాగాది త్వగాది యింద్రియములే కాదు. అవి బాహ్యేంద్రియములు. మనోబుద్ధిచిత్త అహంకారములను వృత్తి భేదములుగల మనస్సు అంతరింద్రియము. మనస్సు వేదాంతగ్రంథ ములలో నింద్రియముగా గణించబడుచున్నది.

మనష్షష్ఠానీంద్రియాణి; ఇంద్రియాణి దశైకంచ ।

(భ. గీ. 15-7 13-6)

అంతర్బాహ్యేంద్రియములను నింద్రియములు, మనస్సు, బుద్ధి ఈ మూడును గామాశ్రయిములే.

ఇంద్రియాణి మనోబుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే ।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినం ॥

(భ. గీ. 3-40)

ఇంద్రియ మన అధిష్ఠానములందు గామము విషయచింతన, విషయ భోగకాంక్ష, విషయభోగ జనిత హర్షాద్యనుభవము మొదలగు లక్షణములు గలదిగ నుండును. బుద్ధ్యధిష్ఠానమునం దహంకారాభిమానరూపముల గామము ప్రవర్తించును. బాహ్యవిషయభోగకాంక్ష నిరసనము మొదటి మూడుసూత్రములలో జేయబడెను. 5-6-7 ప్రాచీనసూత్రములు విజ్ఞానమయకోశదోషములను దెల్పునవికావున అహంకారాభిమానదోషములు వర్జనీయములని బోధించుచున్నవి. ఎండాఱవసూత్రము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, వీనితో బొందబడు సమస్తజ్ఞానమునందభిమాన ముండగూడదని తెల్పుచున్నది. అనగా ప్రపంచములో దెలిసికొనదగినది యంతయు నీమూటితో దెలిసికొనదగియున్నందున దానియందభిమానమును విసర్జించవలెనని బోధించుటవలన నపరావిద్యయందును దానివలన బొందదగు సమస్త జ్ఞానమునందును నభిమానము వదలవలెనని తెలిసికొనవలెను. ఆఱవ సూత్రములో జెప్పంబడిన ఇంద్రియజ్ఞానేచ్ఛ (Sensation) అననేమి? దానియందభిమాన మెందు కుండగూడదు? అనువిషయములు విచారణీయములు. ఇంద్రియములు కరణములు, కొలిముట్లు. లోకములో నన్నివిధములైనపనులు చేయువారు వారివారి కార్యములకువలయు

కొలిముట్లను సంపాదించుకొని వానితో దమపనుల నిర్వర్తించు కొనునట్లు ఆత్మ తనకార్యార్థము ఇంద్రియములు, మనస్సు, అను సాధనములనమర్చుకొనుచున్నది. జీవాత్మ ఈశ్వరాంశయే, ఈశ్వర స్వరూపుడే, ఇద్దఱు నజులే. అయిన, జ్ఞానములో నిరువురకు భేదము కలదు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు; జీవుడు అజ్ఞుడు; ఈశ్వరుడు సర్వలోకముల ప్రకృతిని వశపరచుకొన్నవాడు. జీవుడు తనలోక ములో (Monadic Plane) నీశ్వరతుల్యుడే కాని క్రిందిలోకముల ప్రకృతిని జయించినవాడుకాడు; ఆ క్రిందిలోకముల ప్రకృతికి వశుడైయున్నవాడు.

జ్ఞాఽజ్ఞౌ ద్వా వజావీశా నీశౌ। (శ్వేతా. ఉప. ౧.౯.)

జ్ఞానవంతుడు ఈశ్వరుడు, అజ్ఞుడు జీవుడు. ఉభయులు అజులు. ఏలు వాడు ఈశ్వరుడు, ఏలలేనివాడు జీవుడు.

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్ ॥
(భ. గీ. 9-8)

నేను ప్రకృతిని వశపరచుకొని (గ్రహించి) మాటిమాటికి ప్రకృతికి లోబడి ప్రకృతి వశులైన ఈ భూత సముదాయమును సృజించు చున్నాను.

పై మంత్రమువలనను శ్లోకమువలనను ఈశ్వరునికిని జీవునకును గల భేదము విశదమగుచున్నది. అన్ని లోకములలోని ప్రకృతిని జయించి ఈశ్వరత్వము నెఱిగి ఈశ్వరునివలె బరిపూర్ణుడగుటయే జీవయాత్ర యొక్క యుద్దేశము. "నేను బ్రతిలోకముయొక్క ప్రకృతి

తత్వము నెఱిగి దానిని వశపరచుకొని ఈశ్వరుని జెందెదను” అని సంకల్పించుటయే జీవుడు క్రిందిలోకములలో జన్మించుటకు గారణము. ప్రకృతి (మాయ) ఈశ్వరసంబంధము కావున ఈశ్వరచింతన, ఈశ్వరభక్తి, ఈశ్వరతత్వావబోధ, వీనివలననే జీవుడు ప్రకృతిని జయించగలుగు.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥

(భ. గీ. 7-14)

లోకమంతయు బ్రకృతిమయము. ప్రతిలోకములో బ్రతిభూతము యొక్క రూపధారణకు బ్రకృతియే యుపాదానకారణము. ప్రకృతి నాశ్రయించియే ఈశ్వరుడు సర్వభూతరూపముగ బ్రకాశించుచున్నాడు. ప్రకృతి వివిక్త ఆత్మస్వరూపమును గొప్ప యోగసిద్ధి వలనగాని తెలిసికొనజాలము. సూర్యబింబమును మన కన్నులతో జూడనేరక నీటిలోగాని పొగగమ్మిన లేక రంగు గల గాజుముక్కలోగాని చూచి యా సూర్యబింబ స్వరూప మిట్టిదియని తెలిసికొనుచున్నాము. అట్లే ఆత్మస్వరూపమును సామాన్యముగా దెలిసికొనజాలము. ప్రకృతిసంబంధమైన యుపాధిని ధరించి లోకములో బ్రతిపదార్థమందు భగవంతుడు ప్రకాశించుచున్నాడు. ఆ యుపాధి (అనగా రూపము) నీరు, గాజుముక్క వంటిది. సూర్యబింబస్వరూపమును నీరు లేక గాజుముక్కద్వారా చూచునపుడు అయథార్థముగా నయితము తెలిసికొనుటయు గలదు. నీరు చలించుచుండ బ్రతిబింబము చలించినట్లు కనుపడును. గాజు ఏ వర్ణముగలదియో బింబ మా

వర్ణము గలదిగ గన్పడును. చలించునది జలమనియు, వర్ణ మద్దమునని యు, మనకు గన్పడిన చలనము వర్ణము సూర్యబింబమునకు లేవనియు ను మనము తెలిసికొనిననే బింబముయొక్క యథార్థజ్ఞానము కలుగును. అనగా ఉపాధులైన నీరు, గాజు యొక్క చలనాది ధర్మములను బింబ మునం దారోపించుటయే అయథార్థజ్ఞానము. అట్లు చేయక చలనాది ధర్మము లుపాధిగతములేయని యెఱుగుట యథార్థజ్ఞానము. అట్లే ప్రకృతితో గూడియుండు భగవంతునినే ప్రకృతి విలక్షణునిగా మనము తెలిసికొనవలెను. అట్లు తెలిసికొనుటకు ప్రకృతిధర్మము లిట్టివి, ఆత్మధర్మము లిట్టివి, అని తెలిసికొనవలెను. అదియే యథార్థ మైన జ్ఞానము.

> క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ ।
> క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ మంతరం జ్ఞానచక్షుషా ।
> భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాంతి తేపరం ॥
>
> (భ. గీ. 13-2, 34)

ఈ ప్రకృతి జ్ఞానముకల్గుటకును ఆ జ్ఞానము ద్వారా ప్రకృతి విలక్ష ణుడు ఆత్మయని తెలిసికొనుటకును ప్రకృతి సంబంధమైన కరణ ములు కావలెను. వాయువునందు సంచరించుటకు విమానములును, జలములోయాత్రకు నావలును, భూమియందు భూమశకటాదులును నిర్మించుకొన్నట్లు ప్రకృతిధర్మముల నెఱుగ ప్రకృతిసంబంధ కర ణము లావశ్యకములు. ఈశ్వరుడు సంకల్పించిన మాత్రమున సంకల్పించినదంతయు నెరవేరునట్లు జీవుడీశ్వరాంశయే కావున "నేను లోకములలో జన్మించి ప్రకృతిని జయించెదను" అని సం

కల్పించిన కారణముననే తత్సాధనానుకూలములైన యుపకరణములు కాలక్రమమున నుత్పన్నమగును. ప్రాణము, ఇంద్రియములు, మనస్సు అనునవియే యా యుపకరణములు.

> ఆత్మన ఏష ప్రాణో జాయతే యథైషా పురుషే ఛాయా
> ఏతస్మి న్నేతదాతతం । మనోకృతేనా యాత్యస్మిన్ శరీరే ॥
> (ప్ర. ఉప.)

ఆత్మవలన ప్రాణము పుట్టుచున్నది. పురుషునియందు ఛాయ ఎట్లో అట్లు దానియందు (ఆత్మయందు) అది (ప్రాణము) వ్యాపించియున్నది. మనోకృతమువలన ఈ శరీరమునందు ప్రాణము ప్రవేశించుచున్నది.

ఈ ప్రాణమాత్మసంబంధము, ఆత్మస్వరూపము. దీనికే ప్రజ్ఞ యని పేరు.

> యో వై ప్రాణః సా ప్రజ్ఞా యావా ప్రజ్ఞా స ప్రాణః ।
> (కౌ. బ్రా. ఉప.)

ఇంద్రియములు, మనస్సు ప్రకృతిసంబంధములు. ఆదియందహంకారతత్త్వమునుండి సాత్వికాంశతో మనస్సును రాజసాంశతో నింద్రియములును సృజించబడెను. ఈ సృష్టి ప్రాకృతసర్గములో జేరినది. ప్రకృతియందుండెడి యీ యింద్రియములను మనస్సును జీవాత్మలోకములో దనకార్యముకొఱకై యాకర్షించుచున్నాడు.

> మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ (భ. గీ. 15-7)

> యో వేద ఇదం జిఘ్రాణీతి స ఆత్మా గంధాయ ఘ్రాణం ।
> అథ యో వేదేదమభివ్యాహరాణీతి స ఆత్మా అభివ్యాహారా

య వాక్ అథయో వేదేదం శృణ్వానీతి స ఆత్మా శ్రవణా
య శ్రోత్రం అథ యో వేదేదం మన్వానీతి స ఆత్మా
మనోఽస్య దైవం చక్షుః ॥ (ఛాం. ఉ. 8-12)

నేను ఆఘ్రాణించెదనని తెలిసికొనెడు (అనగా సంకల్పించెడు) ఆత్మ ఆఘ్రాణించుటకు ఘ్రాణేంద్రియమును నిర్మించుకొనెను. నేను వచించెదనని సంకల్పించి వచించుటకు వాగింద్రియమును, నేను వినెదనని సంకల్పించి వినుటకై శ్రవణేంద్రియమును, నేను మననముచేసెదనని సంకల్పించి మననము కొఱకు దివ్యచక్షుస్సు అయిన మనస్సును నిర్మించుకొనెను.

ప్రాణమునకే ప్రజ్ఞయని పేరని చెప్పబడెను. ప్రతియింద్రియమును మనస్సును వాని వాని కార్యముల నియోగించునది ప్రాణము ప్రజ్ఞరూపే.

ప్రజ్ఞయా వాచం సమారుహ్య వాచా సర్వాణి నామాన్యాప్నోతి ప్రజ్ఞయా ప్రాణ మారుహ్య ప్రాణేన సర్వాన్ గంధానాప్నోతి ప్రజ్ఞయా చక్షుస్సమారుహ్య చక్షుషా సర్వాణి రూపాణ్యాప్నోతి ప్రజ్ఞయా శ్రోత్రం సమారుహ్య శ్రోత్రేణ సర్వాణి శబ్దానాప్నోతి ప్రజ్ఞయైవ ధియం సమారుహ్య ప్రజ్ఞయైవ ధియో విజ్ఞాతవ్యం కామానాప్నోతి ఇత్యాది ॥
(కౌ. బ్రా. ఉ. 18-6)

ఆత్మ, ప్రాణము, లేక ప్రజ్ఞారూపమున వాగాది ప్రతియింద్రియమునందును మనస్సునందును ప్రవేశించి యాయా యింద్రియము మనస్సు ద్వారా ఆయా విషయజ్ఞానమును బొందును.

ఇందువలన, ఇంద్రియములు మనస్సు జీవుడాయాలోకములో నాయారూపముననుండు ప్రకృతిని తెలిసికొని దానికన్న విలక్షుణుడాత్మ యను జ్ఞానమును సంపాదించుకొనుటకై నిర్మించుకొన్నవే యనియు, జీవునిసంకల్పము ననుసరించియే శరీరములో నుత్పత్తి యైనవనియు, అవి జీవుని కొలిముట్లు, ఉపకరణములు, సాధనములే యనియు, ముఖ్యముగ నెఱుంగవలయును.

ఈ విషయము ఐతరేయోపనిషత్తునందు:—

> స ఈక్షత కథం న్విదం మదృతే స్యాదితి ॥ (2-3-11)

ఆత్మ తలచుకొనెను. "నేను వినా (మన ఇంద్రియాణి సహిత కార్య కారణ సంఘాతము) ఎట్లుండగలదు?

ఇందుకు శ్రీశంకరాచార్యులవారి భాష్యము:—

> మయా పరేణ స్వామినా అధిష్ఠాత్రా కృతాకృతఫల సాక్షి భూతేన భోక్త్రా) భవితవ్యం పురస్యేవ రాజ్ఞా.

నేను (అనగా ఆత్మ) బురము యొక్క రాజువలె ఈ సంఘాతమునకు ప్రభువుగను, నధిష్ఠాతగను, గృతాకృత ఫలసాక్షిభూతుడుగను, భోక్తగను, నుండవలెను.

మఱియు కఠోపనిషత్తునందు:—

> ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు । బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ । ఇంద్రియాణి హయానాహుః విషయాం స్తేషు గోచరాన్ । ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుః మనీషిణః ॥ (3-3-4)

ఆత్మ రథికుడు, శరీరము రథము, బుద్ధి సారథి, మనస్సు కళ్లెపుపగ్గము, ఇంద్రియములు గుఱ్ఱములు, విషయములు వాని సంచారప్రదేశములు, ఇట్లు దేహము, ఇంద్రియములు, మనస్సుతోగూడి ఆత్మ భోగించుచుండునని తెలిసినవారు చెప్పుచున్నారు.

జీవుఁడారంభదశయందీవిషయము మఱచును.

సజాతో భూతాన్యభివ్యైఖ్యత్ ॥ (ఐ. ఉప.)

వాడు (జీవుఁడు) పుట్టి భూతములను మాత్రమే తెలిసికొని వానిని గుఱించియే మాట్లాడుచుండెను. అనగా భూతతాదాత్మ్యమును జెంది నేను మనుష్యుడను, సుఖిని, దుఃఖిని, ఇత్యాది దేహధర్మముల నాత్మయందారోపించుచుండును. తాను బురస్వామిననియు, నింద్రియములు, మనస్సు, వాని యధిష్ఠానదేవతలు, తన భోగమునకేర్పడిన పురము, పురపాలకులు అనియు మఱచును. పురపాలకులు చేయు కార్యములన్నియు దనవిగా భావించును. తాను యజమానుడని మఱచి గుఱ్ఱములు వాని యిచ్ఛానుసారము ప్రవర్తించుచుండ నా ప్రవర్తనలు తనవే యనియు దలచును. ఇట్లనాత్మధర్మముల నాత్మయందారోపించువారు ఆత్మహంతలని యుపనిషత్తులలో జెప్పబడియున్నది.

కిమిహాన్యం వావదిషదితి స ఏతమేవ పురుషం బ్రహ్మతతమ మపశ్యదిదమదర్శమితి ॥ (ఐ. ఉప.)

ఆనందగిరి

కిమేషాం స్వతఃసత్తాఽస్తి నేతి విచార్య కిమన్యం ఆత్మవ్యతిరిక్తం వక్తుం శక్నోమీతి ఏవం పదార్థశోధనవతో వాక్యార్థజ్ఞానమాహ స (ఏతమేవ) ఇతి ॥

## శ్రీ శంకరభాష్యం

స కదాచిత్ పరమకారుణికేన ఆచార్యేణ ఆత్మజ్ఞాన ప్రబోధకృచ్ఛబ్దికాయాం వేదాంత మహావాక్య భేర్యాం తత్కర్ణమూలే తాడ్యమానాయాం ఏవమేవ సృష్ట్యాది కర్తృత్వేన ప్రకృతం పురుషం ఆత్మానం బ్రహ్మ వ్యాప్తతమం పరిపూర్ణం ఆకాశవత్ ప్రత్యబుధ్యత ॥

ఇట్లు ఆదియందు (అజ్ఞానదశయందు) భూతజ్ఞానమే (రూపజ్ఞానము) కలిగియుండి పిదప బదార్థశోధనచేసి, పదార్థమునందు స్వతః సత్తా కలదా లేదా అని విచారించి, ఆ శోధనవలన నాత్మవినా సత్తా లేదు, ఆత్మయే యారూపమున నగుపడుచున్నది, అని తెలిసికొనును. అట్టి జ్ఞానము కలుగుటకు గురూపదేశము కావలెను. పరమకారుణికుడైన ఆచార్యుఁడు మహావాక్యములద్వారా ఆత్మజ్ఞానము నుపదేశించును. అప్పుడు ఇదంతయు, అనగా సకలపదార్థములయందును, జీవుడనగు నాయందును బ్రహ్మమే నిండి వ్యాపించియున్నది, ఏపదార్థమును జూచినను దాని రూపమునే పాటించక దానికి రూపధారణ శక్తినిచ్చి దానిద్వారా ప్రకాశించుచుండువా డాత్మయే యనియు జెలిసికొనును.

ఇందువలన జీవుఁడు ముఖ్యముగా దెలిసికొనవలసిన దేమియన:— నే నీశ్వరాంశను, అయిన నీశ్వరశక్తులు నాయందు బీజరూపమున నున్నవి. వానిని బ్రకాశింపజేసికొన నేను సర్వలోకప్రకృతి తత్వమును నెఱింగి తద్విలక్షణుఁడు బ్రహ్మమని యెఱుంగవలెను. ప్రకృతితత్వమును సంసార సుఖదుఃఖానుభవమువలన నే ఎఱుంగ

నగును. కావున నా సంసారయాత్రను గావలయు సామగ్రులైన, ఈశ్వరునివలన నాదియందు ప్రాకృతసర్గములో సృజింపబడిన ప్రకృతిసంబంధమైన దేహేంద్రియ మనస్సులను నే నాకర్షించుకొంటిని. అవి ప్రకృతిసంబంధములు కావున రాగద్వేషగుణములు గలవియైయున్నవి. నేను ప్రకృతివిలక్షణుడైన ఆత్మస్వరూపుడను. ప్రకృతి తాదాత్మ్యముచేత సంసారమండల వర్తనయే ఫలము కావున ప్రకృతి తాదాత్మ్యము నొందగూడదు. దేహేంద్రియ మనస్సులు అనగా ఉపాధులచే విషయభోగానుభవమునందు సుఖప్రాప్తి కల్గునది నిజమే. అయిన నది విషయేంద్రియ సంయోగజనిత నశ్వర సుఖలవమేగాని అక్షయసుఖము కాదు. దుఃఖప్రాప్తికలుగుట యనుభవసిద్ధమైయున్నది. నేను సర్వవికారశూన్యుడైన ఆత్మస్వరూపుడను. ఒక యజమానుడు తన కార్యార్థ మొక సేవకుని నియమించుకొనిన నా సేవకునిచే దనకార్యమును నెఱవేర్చుకొనునుగాని సేవకుని యొక్క స్వంతకార్యములు తనవియని తలచడుకదా. ఆ సేవకుడు వాని స్వేచ్ఛానుసారము యజమానుని కార్యమునకు సంబంధములేని తాడనపీడనహత్య మొదలగు దుష్కార్యములుచేసిన నా కార్యములన్నియు యజమానుడు తనవే యని యెంచుకొనడుకదా? అట్లే ఇంద్రియములు, మనస్సుయొక్క రాగద్వేషాదిగుణములు, తజ్జనిత సుఖదుఃఖములు, నావికావని తలచవలెను. నేను యదార్థశోధనచే ప్రతిపదార్థమునం దీశ్వరుడుండుటంబట్టియే ఆ పదార్థమునకు రూపధారణశక్తి కలిగినది. నేనేపదార్థమును జూచినను నా పదార్థరూపమున భగవంతుడగుపడుచున్నాడనియు, ననేకరూపముల భగవంతుడు విలసిల్లుచున్నాడనియు, నే నెఱుగుటకొఱకే వివిధభూతములు నా

కగుపడుచున్నవనియు, సర్వభూతములు భగవంతుని విభూతులేయని యు, వానియం దంతర్యామిరూపమున నుండుభగవంతుని స్మరించుట కవకాశములేయనియు, ఇదియే రూపముయొక్క ప్రయోజన (అనఁ గా ఈశ్వరస్మరణకాధారము) మనియు నే నెఱుగవలయును. ఉపాధి (అనఁగా ప్రకృతి) జ్ఞానము తదంతర్గతాత్మావలోకనమునకు సాధన ముగ నుండవలయుననికదా నేను ప్రకృతిస్థ ఉపాధులను నిర్మించు కొంటిని. ఆ కార్యమున కీశ్వరశక్తి, ఈశ్వరసేవ, నేనీశ్వరాంశనను స్మరణము ఆవశ్యములు. ఉపాధి కార్యములయందు కర్తృత్వ భోక్తృత్వాభిమానము కాని వాని తాదాత్మ్యముకాని ఆ కార్య మునకు ప్రతిబంధకములే. పరికించిచూడ నెట్టి ప్రియత్వము పదా ర్థమునందు లేదు. పదార్థమునందుండు భగవంతునివలన దానికి రమ్యత్వము కల్గినది. పదార్థమునందే సుఖప్రదాయకత్వముండు నెడ నొకప్పుడు దుఃఖప్రదాయకత్వ ముండగూడదు. భర్తకాని భార్య కాని బిడ్డలుకాని విత్తముకాని, దేవతలుకాని మఱియు నెట్టి ప్రియ విషయమేకాని నాలోనుండెడి యాత్మ వాని ఆయాయం దుం డెడి యాత్మతో జేరి యానందించునుగాని కేవలరూపస్మరణచే నిత్యా నందము కలుగనేరదు.

నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి ఆత్మన స్తు కామాయ పతిః ప్రియో భవతి। నవా అరే జాయాయై కా మాయ జాయా ప్రియా భవతి ఆత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి। నవా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవతి ఆత్మన స్తు కామాయ విత్తం ప్రియం భవతి . . . . . నవా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి ॥ (బృహ. ఉప II. ౪. ౫.)

కావున సర్వేంద్రియములను వాని వాని ద్వారా ఈశ్వరజ్ఞానము బొందుటకును, మనస్సును దానిద్వారా ఈశ్వరతత్త్వావబోధ కల్గుటకును, వినియోగించవలెను. సర్వవేదములు సర్వశాస్త్రములు చదివినను, బుద్ధికౌశల్య పాండిత్యమును బొందినను ఆదియంతయు నాత్మజ్ఞానమునకు సాధనముగ నుండవలయుననియు, నా ఇంద్రియములు మనస్సువలన బొందబడిన జ్ఞానము నాదియని యభిమానించుటచే సంసారమందు భ్రమించక సర్వ మాత్మార్థమే యని తెలిసికొనవలెనని ప్రాచీనసూత్రము బోధించుచున్నది.

అయితే ఈ బోధవలన దురభిప్రాయము కలుగనచ్చును. వేదములు శాస్త్రము లెందుకు చదువవలెను? ఆత్మజ్ఞానమే ప్రధానమైన యెడల దొలుతనే దాని నెందు కారంభించగూడదు? ఇంద్రియములు మనస్సువలన బొందు జ్ఞానమంతయు నిష్ఫలమని తెలిసియు ఎందుకాయాసపడియయినను నాజ్ఞానమును సంపాదించవలెను? అని యభిప్రాయపడవచ్చును. ఈ యభిప్రాయము సరియయినది కాదని వ్యాఖ్యానసూత్రము బోధించుచున్నది. సంపూర్ణమైన యజ్ఞానదశలో నుండి ప్రకృతి వశుడైకదా జీవుడు సంసారములో దిరుగుచుండును. ప్రతిలోకముయొక్క ప్రతితరగతి ప్రకృతియొక్క అనుభవమును బొంది దానిని వశపరచుకొని ఈశ్వరుని జెందవలెనని జీవుడు జీవయాత్ర ప్రారంభించును. తొలుతొలుత అత్యంతస్థూలమైన దేహములధరించి, వానివలన బొందదగిన అల్పమైన జ్ఞానమును బొంది, ఆ తరగతి ప్రకృతితత్త్వము నెఱిగి, దానినవశపర్చుకొని, పిదప నెక్కుడైన జ్ఞానమున కనుగుణమైనట్టియు, బూర్వముకన్న గొంచెము సూక్ష్మమైన యణువులుగల దేహమునుధరించి, దాని తత్త్వము నెఱిగి, దానిని వశ

పరచుకొని, మఱియు గొంచెము జాస్తిజ్ఞానము కలవాడగును. ఇట్లు క్రమక్రమముగా స్థూల ఉపాధులను త్యజించుచు, సూక్ష్మఉపాధు లను ధరించుచు, జ్ఞానమును వృద్ధిచేసికొనుచువచ్చును. ఈ దశలో జ్ఞానమును స్వీకరించుటకును దృఢపర్చుకొనుటకును అహంకార మను ఆధారమును (చారువ-scaffolding) నిర్మించుకొనును. చారువ లేకయే ఇల్లుకట్టుట కెట్లు సాధ్యముకాదో అట్లే అహంకారాభి మానముల నాశ్రయించనిచో జీవునికి ప్రపంచజ్ఞానము కలుగనేరదు. ఇంద్రియములు మనస్సువలన బొందబడనలయు విషయజ్ఞానము కలుగు నంతవఱకు నహంకారాభిమానము లవశ్యములు. ఇల్లు పూర్తి యయిన పిమ్మట జారువను దీసివేయునది చూచుచున్నాము కదా. దాని నుంచినయెడల గృహము వాసయోగ్యముగనుండదు. చూచుట కే వికారముగనుండును. ఇల్లు కట్టువఱకే దానితో నవసరము. పిదప దానిని దీసివేయుట యవసరము. అట్లే ఇంద్రియములు మనస్సు వలన బొందవలయు సమస్తజ్ఞానము సంపాదించువఱకు నహంకారాభి మానము లవశ్యములే. మనము నివసించుటకు గదా గృహమును నిర్మించుకొనెదము. అట్లే ఆత్మజ్ఞానవాసమునకే అహంకార మను చారువ (scaffolding) ఆధారముతో సర్వదేహములను నిం టిని గట్టితిమి. ఇకను నా యహంకారమను చారువతో బని లేదు. సర్వోపాధు లాత్మార్థమే అనగా ఈశ్వరకార్యమునకే, అనగా లోకసంగ్రహము, లోకసేవ, పరోపకారము, సర్వభూత హితత్వము, సర్వభూతాత్మ దర్శనముకొఱకే సాధనములని యెఱిగి పనిచేయ నారంభించిన పిమ్మట నహంకారము వర్జనీయము. ఇల్లు సిద్ధముకానిదే సామగ్రులులేనిదే కాపురముచేరుట కెట్లు సాధ్యము

కాదో అట్లే ఆత్మజ్ఞానమునకు దృఢపరచబడి బలపరచబడి అటు పిమ్మట బరిశుద్ధము చేయబడిన ఉపాధులను గ్రహము కావలెను. అట్టి యుపాధులు అహంకారాశ్రయమువలన ఇంద్రియములు మనస్సు విషయానుభవము పొందిననే కల్గును. కావున అహంకార మమకారసహిత ఇంద్రియజ్ఞానేచ్ఛ యనునది ఆత్మజ్ఞానసాధనమే కాని హేయముకాదు. మోక్షమార్గమం దడుగిడుట కది సహకారి. బుద్ధి కుశలత కలవాడే ఆత్మవిద్యాధికారి యని శ్రీశంకరాచార్యులవారి యభిప్రాయము.

> మేధావీ పురుషో విద్వాన్ ఊహాపోహావిచక్షణః ।
> అధికార్యాత్మ విద్యాయాం ॥

మఱియు ఈశావాస్యోపనిషత్తునందు విద్య, అవిద్య, అను రెండును భిన్నవిధముల మోక్షసాధనములే యని చెప్పబడియున్నది.

> అన్యదేవాహు ర్విద్యయా అన్యదాహు రవిద్యయా ।
> విద్యాం చావిద్యాంచ య స్త ద్వేదో భయంసహ ।
> అవిద్యయా మృత్యుం[1] తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే ॥

సంసారమను మృత్యువులోఁ సునము దిగియున్నాము. అవిద్య, అనగా తత్కృత ఉపాధులతో సుఖదుఃఖముల ననుభవించి, అపరావిద్య నభ్యసించి, బుద్ధికౌశలమును బొంది, వానివలన శాశ్వతఫలము లేదని తెలిసికొని, నిర్వేదమును బొంది అప్రవృత్తచక్షుడగును. అనగా తన

[1] అశనాయా హి మృత్యుః (బృ. ఉప.) మృత్యుః=అధర్మము (తై. ఉప. ఆనందగిరి)

దృష్టిని సంసారముదెసనుండి ఆత్మదెస త్రిప్పును. అదియే మృత్యుతరణము. పిదప మోక్షమార్గమునందు విద్యాసహాయముచే నమృతత్వమును జెందును. ఇట్లు విద్యావిద్యలు రెండును మోక్షమార్గమునందలి సోపానములే. అవిద్యయే చాలునని అనగా సంసారసుఖమే చాలునని తలచగూడదు. అవిద్య హేయము, విద్యయే తొలుతనుండి అభ్యసనీయమని సయితము తలచగూడదు. అట్లభ్యసించుటకు సాధ్యము కూడా లేదు. అవిద్యను మొదటి మెట్టుగను విద్యను రెండవ మెట్టుగను నెన్నవలయును. మొదటి మెట్టెక్కనిదే రెండవమెట్టు నారోహించజాలము కదా. మొదటి మెట్టు వైరాగ్యమునకు సాధనము. రెండవమెట్టు జ్ఞానమునకు సాధనము. రెండును మోక్షప్రాప్తికి సహకారులే.[1] అందువలననే ఇంద్రియజ్ఞానముచే దెలిసికొనుము. పరిశీలించి చూడుము. అట్లుచేసిన (అనగా అందువలన సాధించబడిన వైరాగ్యముతో) నాత్మవిద్యను గఱచుట కారంభించి యానిచ్చెనయొక్క మొదటిమెట్టునం దడుగిడుటకు (పై ఉదాహరణములోని రెండవ మెట్టు) సమర్థుడవగుదువని వ్యాఖ్యానసూత్రము బోధించుచున్నది.

ఏడవ ప్రాచీనసూత్రము :—"నేను బెఱుగవలెనను కోరికను (అనగా అభివృద్ధితృష్ణను) జంపివేయుము."

ఈ సూత్రము విజ్ఞానమయకోశముయొక్క సాత్త్వికదోషమును బోగొట్టుకొనవలెనని బోధించుచున్నది. తమోరజోగుణములవలెనే సత్త్వగుణము సయితము బంధించు స్వభావముకలదియే. సుఖసంగము వలనను జ్ఞానసంగమువలనను సత్త్వగుణము బంధించును.

[1] ఇవియే ముం. ఉప. లో నుదహరించబడిన అపరా, పరా విద్యలు—ద్వేవిద్యే వేదితవ్యే . . . . . పరాచైవాపరాచ.

సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చ । (భ. గీ. 14-6)

ఇచ్చట ఇంద్రియసుఖమునుగూర్చి జెప్పలేదు. అట్టిసుఖము మూడవప్రాచీనమాత్రముచే నిరసించబడెను. విజ్ఞానమయకోశదోషము లెవ్వియన అహంకారాభిమానములు. నాకు జ్ఞానముకావలెను. నేను జ్ఞానజనితసుఖము నొందితిని. నాకు మోక్షముకావలెను, అను నివి యన్నియు మంచివియైనను బంధించునవియే. ఇంద్రియసుఖముల గోరక మనస్సు నధోముఖముగ బోనివ్వక జ్ఞానము, జ్ఞానలాభసుఖము, ఈశ్వరప్రీతి, మోక్షము, వీనినిగోరుట మిక్కిని గొప్పదియే. దీనిని సామాన్యముగా మిక్కిలి యుత్కృష్టస్థితియని భావించవచ్చును. అయిన 'నేను,' 'నాకు,' అను భావముండునంతవఱకు నుత్తమజ్ఞాని, ఉత్తమభక్తుని ధర్మము కానేరదు. సత్వగుణము చాలా మంచిదే. అపేక్షణీయమే. అయితే సంగదోషముచే బంధస్వభావము గలదియగుటవలన దానిని దాటి గుణాతీతస్థితికి బ్రయత్నించవలెను. ఈ సత్వగుణమునకును నిర్గుణత్వము (గుణాతీతత్వము) నకును గలభేదము మిక్కిలి సూక్ష్మము. దురవగాహము. తామసరాజసగుణపూరితులై సంసారములో బరిభ్రమించు జనులు సాత్వికవృత్తి కలవారలైతే యెంతయో గొప్ప స్థితికివచ్చినట్లె. అయిన మోక్షము సర్వగుణాతీతత్వము వలననే సిద్ధించును. కావున సత్వగుణమునకును గుణాతీతత్వమునకును గల భేదమును దెలిసికొననలయును. ఈ భేదములు ఉపనిషత్తులు, గీతాభాగవతాది గ్రంథములవలన దెలియనగు. రెండు విషయములలోని భేదములుమాత్ర మిచ్చట విచారించబడును.

## జ్ఞానము

యస్తుసర్వాణిభూతాని ఆత్మన్యేవానుపశ్యతి ।
సర్వభూతేషు చాత్మానం తతోన విజుగుప్సతే ॥ (ఈ. ఉ.)

ఎవడు సర్వభూతముల నాత్మయందును, సర్వభూతములయం దా త్మను జూచుచున్నాడో వాడు జుగుప్సచెందడు.

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్వికం ॥ (భ. గీ. 18-20)

ఏజ్ఞానముచేత సర్వభూతములయందు ఏకము, అవ్యయమగు భావ మును, భిన్నభిన్నములుగ గన్పడువానియం దభిన్నత్వమును జూచు నో ఆ జ్ఞానము సాత్వికజ్ఞానము.

అన్నిభూతము లాత్మస్వరూపములే యని భావించి తదనుగుణ ముగ బ్రవర్తించినను "నేను," "ఇతరభూతములు" అను పృథ గ్భావమున్నది.

ఇకను నిర్గుణజ్ఞాన మెట్టిదియన:—

యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మై వాభూద్విజానతః ।
తత్ర కో మోహః కశ్శోకః ఏకత్వ మనుపశ్యతః ॥ (ఈ. ఉ.)

ఎప్పు డాత్మజ్ఞానమువలన సర్వభూతము లాత్మయే యగునో అప్పుడు ఏకత్వమును జూచువానికి శోక మెక్కడ? మోహ మెక్కడ?

ఇచ్చట భిన్నభావము నశించినది. "నేను," ఇతరులు ఒక ఆత్మ స్వరూపులమే అను మనోభావము మాత్రమే కాదు. "ఇతరులు"

అను జ్ఞానమే లేదు. చూచునది ఏకత్వమే. సర్వత్ర కనుపడునది ఆత్మయే.

వాసుదేవ స్సర్వమితి ।

## భక్తి-సాత్త్వికభక్తి

కర్మనిర్హారముద్దిశ్య పరస్మిన్వా తదర్పణం ।
యజేత్ యష్టవ్య మితివా పృథగ్భావస్ససాత్త్వికః ॥
(శ్రీ భాగ. 3-29)

కర్మ నివృత్తికొఱకును, (ఈశ్వరప్రీతికొఱకై) ఈశ్వరార్పణముగను, (నేను) పూజించవలసినదే అని పృథగ్భావముతో జేయుభక్తి సాత్త్వికభక్తియనబడును.

ఇకను నిర్గుణభక్తి ఎట్టిదియనః—

మద్గుణశ్రుతిమాత్రేణ మయి సర్వగుణాశ్రయే ।
మనోగతిరవిచ్ఛిన్నా యథా గంగాంభసోంబుధౌ ॥
లక్షణం భక్తియోగస్య నిర్గుణస్యహ్యుదాహృతం ।
అహైతుక్యవహితాయా భక్తిః పురుషోత్తమే ॥ (భా. 3-29)

సర్వగుణాశ్రయుడను బురుషోత్తముడను నగు నాగుణములను వినిన మాత్రముననే గంగానదితోయము సముద్రము నెట్లు చేరుచున్నదో (తన్మయమగుచున్నదో) అట్లు ఏభక్తిచే నవిచ్ఛిన్నముగ మనస్సు నా యందు జేరునో అట్టి ఫలాభిసంధిరహితమైనట్టియు భేదదర్శన రహితమైనట్టియు భక్తి నిర్గుణభక్తి యనబరగు.

సాత్త్వికభక్తి యెంతగొప్పయుద్దేశము గలదియైనను, ఉపాత్తదురిత క్షయార్థము, ఈశ్వరప్రీతిసిద్ధ్యర్థము, సంగఫలాభిసంధిరహితము, అయినను దానియందు భిన్నభావమున్నది. నేను భక్తిసలుపుచున్నా ననుభావమున్నది. తామసరాజసములకన్న సాత్త్వికము శ్రేష్ఠమనుభావ మున్నది. పుణ్యాపాపభేదములు పోలేదు. సత్త్వగుణప్రధానుడు,

కి మహం సాధు నాకరవం కి మహం పాప మకరవ మితి ॥

(తై. ఉప.)

ఏమి, నేను పుణ్యముచేయక పోతినే, పాపముచేసితినే, అను విలాప మునకు లోబడువాడగును.

నా కిప్పుడు తామసస్వభావ ముత్పన్నమైనది. దానివలన మూఢత్వ
మును జెందితిని. ఇప్పుడు నేను రాజసప్రవృత్తి గలవాడ
నైతిని. అది దుఃఖాత్మకమైనది. దానివలన జలించబడి
స్వరూపభ్రంశుడనైతిని. సత్త్వగుణము సుఖము, జ్ఞానము,
వీని సంగముచే నన్ను బంధించును.

(భ. 14-22 శాం. భా. సారాంశము.)

అని యిట్లు పుణ్యపాపభేదముల విడువనివాడై సుఖదుఃఖములకు లోబడియుండును.

గుణాతీతుఁడగు జ్ఞాని, నిర్గుణభక్తుడు, ఇట్లు భేదదర్శనము చేయడు.

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ భ.గీ. 14-22.

సత్త్వగుణలక్షణమైన ప్రకాశముకాని, రజోగుణలక్షణమైన ప్రవృత్తి కాని, తమోగుణమైన మోహముకాని, తటస్థించినప్పుడు ద్వేషిం

చడు. లేనప్పుడు కావలెనని కోరడు. మఱి ఏమని తలచు
కొనునన,

"ఈ గుణభేదములు, పుణ్యాపాపములు, ఉపాధిసంబంధములు, ప్రకృతికార్యములు. ప్రకృతియందు మూడుగుణములును సదా యుండునవియే. ఒకప్పు డొకటి, మఱియొకప్పుడు మఱియొకటి సందర్భానుసారముగా విశేషముగ వ్యక్తమగును. నే నాత్మస్వరూపుడను, ప్రకృతిగుణకార్యములు నన్ను బంధించ నేరవు.

గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా నసజ్జతే ।

రజస్తమోగుణములు ప్రవర్ధమానములుగ నుండునపుడు పాపమని తలచను. సత్వము పుణ్యమని గణించను." అని యిట్లు తలచును.

వానికి ఆత్మయందే అనగా భగవంతునియందే దృష్టి. సర్వము భగవన్మయముగ జూచును. గంగాప్రవాహము అప్రయత్నముగ సముద్రము నెట్లు చేరునో అట్లు వానిచిత్తము భగవంతునియందు అప్రయత్నముగ లయమగును. నిరంతరము తైలధారవలె నవిచ్ఛిన్నముగ వానిచిత్త మీశ్వరుని ధ్యానించుచుండును. వా డే కార్యము చేసినను జిత్తమీశ్వరునియందుంచి ఈశ్వరసంకల్పాను ప్రవర్తనముగ, ఈశ్వరార్పణముగ జేయును. "నే నెంతమాత్రము భక్తిసల్పితిని. ఎంతమాత్రము జ్ఞానమునొందితిని. ఎన్ని మెట్లు దాటివచ్చితిని. ఇక నెన్ని మెట్లున్నవి. ఈశ్వరసేవ బాగుగ జేయుచున్నానా లేదా. నా పరోపకారమువలన నెందరు మేలుపొందిరి. నే నిప్పుడుండు స్థితికన్న నెక్కుడుస్థితిని జెందవలెను. జ్ఞానములో వైరాగ్యములో అణిమాదిసిద్ధులలో గొప్పవాడనై గొప్పకార్యములుచేసి ఈశ్వర

ప్రీతిచెందెదను.” అని యిట్లు తనయభివృద్ధినిగూర్చి దలచుకొనుచు కాలహారణముచేయడు. ఇవి యన్నియు మంచియుద్దేశములే. అంత మాత్రము స్వార్థరాహిత్యజ్ఞాన లాభేచ్ఛ యుండుట మిక్కిలి మంచిదే. అయిన, “నే నెంతమాత్రము వచ్చినాను. నే నెక్కుడు జ్ఞానము నొందెదను” అనుటయందు “నేను” అను భావముండుటవలన గుణాతీతజ్ఞానము నిర్గుణభక్తికి గొఱంతకల్గినది. “నాకు” అని యుద్దేశించి యొద్దియు ననపేక్షణీయము. అణిమాది సిద్ధులు కలిగి సూక్ష్మలోకములలో బరోపకారముచేయ శక్తుడను గావలెననికోరుట మంచిదియే. అయితే అందుకొఱకైనను “నాకు” గావలెనని కోరుట ఉత్తమజ్ఞాని భక్తులధర్మము కాదు.

అంతరాయాన్ వదంత్యేతాన్ యుంజతో యోగముత్త
మం। మయా సంపద్యమానస్య కాలక్షపణ హేతవః॥

(శ్రీ భాగ. 11 16-33)

ఉత్తమయోగముద్వారా నన్ను బొంద నుద్యమించువానికి సిద్ధులు కాలహరణ కారణములైన యంతరాయములు.

నాకు మోక్షము కావలెనని కోరుట సయితము బంధకారణమే.

అన్య చ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయస్తే ఉభేనానార్థే పురుషంసినీతః।

(కఠో. ఉ.)

‘మోక్షేచ్ఛ, అభ్యుదయేచ్ఛ’ ఈ రెండును భిన్నార్థముల బురుషుని బంధించును.

మోక్షమన నహంకారపాశమునుండి విడిపించుకొనుట. 'నాకు' గావలెనని తలచినప్పు డహంకారానుసంధానము కలిగెను. అహంకారానుసంధానమువలన నహంకారమోక్ష మెట్లుకలుగు?

ఉత్తమభక్తుడు ఉత్తమజ్ఞాని 'నేను,' 'నాకు,' 'నాయొక్క' అనుభావములను సంపూర్ణముగ త్యజింతురు.

> నపారమేష్ఠ్యం న మహేంద్రధిష్ణ్యం న సార్వభౌమం నరసాధిపత్యం । నయోగసిద్ధీరపునర్భవం వా మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్ ॥
>
> (శ్రీభాగ. 11-11-14)

నాయం దర్పించబడిన మనస్సుకలవాడు నన్నువినా మఱిదేనియు నపేక్షించడు. పరమేష్ఠిపదము, మహేంద్రపదము, సార్వభౌమత్వము, రసాధిపత్యముకోరడు. యోగసిద్ధులు కావలెననికోరడు. జన్మరాహిత్యము కావలెనని సయితము కోరడు.

> సాలోక్య సార్ష్టి సామీప్య సారూప్యైకత్వమిత్యుత ।
> దీయమానం న గృహ్ణంతి జనామత్సేవనం వినా ॥
>
> (శ్రీభాగ. 3-29-14)

నాయందు నిర్గుణభక్తికలవారు నా సేవవినా మఱియొక్క దానిని గోరరు. సాలోక్య, సమానైశ్వర్య, సామీప్య, సారూప్య, సాయుజ్యమను భేదములుగల ముక్తులలో దేనినొసగినను నాకు గావలెననికోరరు.

గుణాతీతుడు నిర్గుణభక్తుడు అహంకారమను కవాటమును బంధించి చిత్తమిళ్వరుని యందే సంన్యసించి ధ్యానింతురు లేక లోకసంగ్రహ

కర్మ చేయుదురు. ఈశ్వరునియందహైతుకభక్తినునిచి ఈశ్వరుడు నన్ను దరింపజేయునని సంపూర్ణముగ శ్రద్ధయుండువాడు నాకు జ్ఞానముకాని మోక్షముకాని మఱియు దేనినిగాని కావలెనని కోర వలసియుండదు. 'నాకు' అను భావము కల్గిన నహంకారమనువాకిలిని దెఱచినట్టే; ప్రయాణమైపోవుచుండు వాడు వెనుకకు దిరిగి చూచి నట్టే. వెనుకచూచుకొనుచు "నేనెంతదూరమువచ్చినాను" అని లెక్క పెట్టుకొనుచుండువాడు బహుదూరము పోనేరడు. సర్వ యజ్ఞములకు భగవంతుడే ప్రభువు.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ।

(భ. గీ. 9-24)

సర్వఫలదాత అయనరే. అందరిపూజలను గైకొని వారివారికి దగు విధములుగ ఫలప్రాప్తి యాయన కలుగజేయును. లోకసమష్టి దృష్టిచే సర్వకర్మల ననుగ్రహించి వాని ఫలములనిచ్చుచుండును. మనము వ్యష్టిదృష్టిచే జూచువారము. మనము నిక్కముగ జ్ఞానాధి కులమైతిమో న్యూనులమైతిమో అభివృద్ధిజెందితిమో లేదో, ఈ విష యములలోవ్యష్టిదృష్టి గలవారమగుటవలన నయథార్థజ్ఞానులముగ నుం దుము. అట్లు వ్యష్టిదృష్టితో జూచి "నే నీశ్వరార్పణ కర్మచేసితిని. దాన జ్ఞానాధిక్యమును బొందనైతిని. అంతియకాక నాకు జ్ఞానము ఇం ద్రియమనోనిగ్రహబలము తక్కువైనట్లు సయితము తోచుచున్నది. నా యుద్దేశము విఫలమయినట్లున్నది" అని మనము తలచవచ్చును. వ్యష్టి దృష్టికి వెనుకకు బోవునట్లు కనుపడినను లోకసమష్ట్యపేక్ష యా వెనుకకు బోవుట సయితము జయఫలము యొక్క పూర్వగామిగ

నుండును. ఒక యుద్ధములో సేనాధిపతి శత్రు సైన్యహననము నుద్దే శించి తన సైన్యములో గొంతభాగమును వెనుదీయుట ట్లొకయుపా యమునుబన్ని, వెనుదీయుభాగమున కొక సమర్థుడైన భటనాయకుని నియమించును. అందువలన శత్రువులను జయించును. ఆజయఫలము లో నీ వెనుదీయుటయు నొకభాగమే. యుద్ధముయొక్క సమష్టి దృష్టిచే జూడక త్రోవబోవువాడు వెనుకకుబోవు సైన్యభాగమును మాత్రము చూచి యీ నాయకుడు పలాయనమగుచున్నాఁడు, పరా జయమునొందెను అని భావించవచ్చును. అట్లే మన మీశ్వరుని శరణుజొచ్చి సంగఫలాభిసంధి రహితముగ ఈశ్వరార్పణ బుద్ధితో గర్మజేయుచు ఈశ్వరుని సేవించుచుండ, మనము భక్తిజ్ఞానవైరాగ్య ములలో నభివృద్ధిజెందినామా, వెనుకకు బోవుచున్నామా ఈ విషయ ములను దీర్మానించలేము. ఎందువలన ననగా మనము వ్యష్టిదృష్టితో జూచువారము. మనకు గర్తవ్యమేమన, 'నేను' 'నాది' 'నాకు', అను అహంకారాభిమానములను వదలి భగవంతునియం దహైతుక భక్తిసలిపి అందువలన నేమి ప్రాప్తించునో ప్రాప్తించకపోవునో గణించుకొనక భక్తికి ఫలము నాకు జ్ఞానాదులుకావలెనని కోరక భక్తియందే ఆనందించుచుండవలెను. తామస రాజస గుణముల ద్వేషించగూడదు. సత్వగుణలక్షణములైన సుఖమునందు, జ్ఞానము నం దపేక్ష యుంచగూడదు. అన్నిటికన్న జ్ఞానమోక్షములయం దభిమానమును వదలుట మహాకష్టము. అయిన వానిని సయితము త్యజించవలెను. ఇట్లు సత్వరజస్తమోగుణములు మూటిని నతిక్రమించి గుణాతీతత్వము నిర్గుణభక్తి సాధించవలెనని యీ ప్రాచీనసూత్రము బోధించుచున్నది.

ఈ ప్రాచీనసూత్రమునకు సంబంధించిన ఎనిమిదవ వ్యాఖ్యాన సూత్రము.

"తనపై వాయుస్పర్శకలుగునట్లు తనహృదయమును విచ్చుకొనవలెనని మిక్కిలి కుతూహలపడుచు దనకు దెలియకయే తాను బెలుగు (వికసించు) పుష్పముపలె నీవు వెలుగుము. (దానివలె నీవును) నిత్యవస్తువుదెస నీ యాత్మ (కవాటము) ను దెఱచియుండ ప్రయత్నము చేయవలయును."

ఇచ్చట పుష్పసామ్యము చెప్పబడియున్నది. పుష్పము 'నేనెంత పెటిగినాను' అని చూచుకొనుచుండుటలేదు. ఫలప్రాప్తియగునో లేదో అను చింతయే దానికి లేదు. నిక్కముగ ఫలప్రాప్తికిముందే పడిపోవుచున్నది. అది పడిపోయిననే వృక్షము ఫలించును.

సూర్యరశ్మి వాయుస్పర్శకలుగునట్లు తెఱచుకొనియుండుటయే పుష్పముయొక్క స్వభావముకాని తాను బెరుగవలెననికాదు. వెలుగుటయను ఫలము సూర్యరశ్మి వాయుస్పర్శలచే దానంతనే ప్రాప్తించునుగాని పుష్పముయొక్క కార్యమచ్చట నేమియులేదు. అది నశించిన ఫలప్రాప్తియై ఆవృక్షజాతి వృద్ధియగుచున్నది. పుష్పనాశనమువలన వృక్షముఫలించుట, బీజము లుత్పత్తియగుట, అందువలన వృక్షజాతి వృద్ధియగుట అను ఫలము లీశ్వరసంకల్పానుసారము ప్రాప్తించును. అట్లే మన మీశ్వరునిదెస మనస్సునుద్రిప్పి నిశ్శేషముగ నీశ్వరునియందే సర్వము సంన్యసించవలెను. పుష్పము వికసించినట్లు మనయందాత్మగుణములు ఈశ్వరగతచిత్తమహిమచే వికసించును. పుష్పము నశించునట్లు మనయహంకారము నశించవలెను. పుష్పనాశనము వృక్షఫలప్రాప్తికి వృక్షజాతివృద్ధికి గారణమగునట్లు

అహంకారనాశనమువలన మన మీశ్వరసంకల్పానుప్రవర్తకులమై భక్త జ్ఞానవైరాగ్యనిధులైన ఋషిసంఘములో బ్రవేశించ బాత్రులమగుదుము. అదియే ఫలప్రాప్తి. అటుపిమ్మట లోకసంగ్రహాకర్మాచరణ తత్పరులమై మానవాది భూతకోటిజ్ఞానవృద్ధికి గారణభూతులమగుదుము. అంతియేకాని నాకు జ్ఞానపక్వము కావలెనని యిచ్ఛయుండ గూడదు. జ్ఞానపక్వము, అహంకారనాశనము సమకాలికులుగ నుండును గావున నాకు జ్ఞానపక్వమైనదని మన మెఱుగుటయే సాధ్యములేదు. నాకు జ్ఞానపక్వమైనదని తలచగలిగినచో నహంకార అజ్ఞానమండలవర్తులమే కాని పరిపక్వజ్ఞానులము కాలేదని నిస్సంశయముగ నమ్మవచ్చును.

"నిత్యవస్తువే నీ లోపలనుండు శక్తిని రమ్యత్వమును బహిర్వ్యాపకము చేయవలయును గాని అభివృద్ధి తృష్ణ కాదు."

> చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరాః ।
> (భ. గీ. 12-6)
>
> అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ।
> (భ. గీ. 18-57)
>
> తేషామహం సముద్ధర్తా మృత్యు సంసారసాగరాత్ ।
> భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్ ॥
> (భ. గీ. 12-7)

ఎవరు మనస్సుతో సర్వకర్మలను నాయందు సంన్యసించి, మత్పరులై, అనన్యయోగముతో నన్ను ధ్యానించి, ఉపాసింతురో, అట్టి నాయందు సమర్పించబడిన చిత్తముగలవారిని నేను శీఘ్రముగా మృత్యు సంసారసాగరమునుండి ఉద్ధరించెదను.

సర్వము భగవంతుని కర్పణముచేయుట, అనన్యయోగము (అనగా ఇతర సర్వచింతలు, సంకల్పములు విడిచి నాకు జ్ఞానము, మోక్షము లేక యితర ఫలములు కావలెనని కోరకయుండుట), ఇవి ముఖ్యములు. వానియందే మన కధికారము. ఎప్పుడీ ప్రకారము మనము ప్రవర్తింతుమో అప్పుడు స్వాభావికముగనే ఈశ్వరప్రసాదము కలుగును. అయనదయే సముద్రములో మునిగియున్న మనలను లేపనెత్తును. ఈ యుద్ధరణమే వ్యాఖ్యానసూత్రములో జెప్పిన "లోపల నుండుశక్తిని రమ్యత్వమును బహిర్వ్యాపకము చేయుట." ఆత్మశక్తులు కామక్రోధాది సంసారసముద్రములో మునిగి వ్యాపకము లేక యుండినవి. అనన్యభక్తిచే గట్టబడి భగవంతుడు తానే వానిని బహిర్వ్యాపకము చేయును. మనము కోరినందువలన గాదు.

వ్యాఖ్యానసూత్రము

"మొదటిమార్గమున బారిశుద్ధ్యవిస్తారముచే నభివృద్ధిజెంచెదవు. రెండవ మార్గమున స్వమహిమప్రాప్తివిషయమైన బలవత్తరమగు కోరికవలన (అధోమార్గమందు) స్తంభించెదవు."

మొదటిమార్గమన ననన్యయోగము. దానిచే సర్వమలాపహారమైన ఈశ్వరప్రసాదము కలుగును. అంతఃకరణశుద్ధి, అహంకారనాశనము, ఈశ్వరప్రసాదప్రాప్తి అను వానికన్న నెక్కుడభివృద్ధి యెక్కుడిది? రెండవ మార్గమన, "నాకు జ్ఞానప్రాప్తికావలెను." అను కోరిక. దానిఫల మహంకారము బలపడుటయే. దానివలన సంసారమండలమునందు బరిభ్రమించుటయే ఫలము. అదియే అధోమార్గమందు స్తంభించుట.

---

## నాల్గవ అధ్యాయము

### సుగుణసంపత్తి

#### ప్రాచీనసూత్రములు

9. నీలోపలనుండుదానిని మాత్రమే కోరుము.

10. నీకు అతీతమైనదానిని మాత్రమే కోరుము.

11. అప్రాప్యమగుదానిని మాత్రమే కోరుము.

#### వ్యాఖ్యానసూత్రము

12. ఎందువలననగా, ప్రపంచమును వెలిగింపజేయు జ్యోతి నీలోపలనున్నది. (మోక్ష) మార్గమునందు ప్రకాశమునిచ్చు జ్యోతి యది యొకటియే. దానిని నీయందుఁ జూడనోపవేని వేఱొండుచోట వెదకుట నిరర్థకము. అది నీకు అతీతమని యెందుకు జెప్పబడుచున్నదనగా, దానిని జేరునప్పటికి నీవు లయమును బొందుదువు. అది యప్రాప్యమనుటకు గారణమేమన నది యెల్లప్పటికి వెనుకకు బోవుచునే యుండును. నీవు వెలుగును ప్రవేశించెదవుకాని మంటను దాకనేరవు.

ప్రాచీనసూత్రములు

13. తమకముతో శక్తిని గోరుము.

14. తీవ్రముగ శాంతినిగోరుము.

15. అన్నిటికన్న హెచ్చుగ సంపదలను గోరుము.

వ్యాఖ్యానసూత్రము

16. అయితే ఆ సంపదలు పరిశుద్ధాత్మకు సంబంధించినవిగనే యుండవలయు. కనుక పరిశుద్ధాత్మలందఱకు సమానముగ జెందినవిగ నుండవలయు. మఱియు ఏకీభావమును జెందిన యందఱకు సంబంధించిన సొత్తుగ నుండవలయు. సర్వభూతాత్మ కొఱకై ధనము సేకరించవలయునని (యుద్దేశించి) పరిశుద్ధాత్మ యుంచుకొనదగు సంపదల నపేక్షించుము. ఆయఖండ చైతన్యస్వరూప సర్వభూతాత్మ నిక్కముగ నీయాత్మయే. నీవు కోరదగు శాంతి యెట్టిదనిన, దేని నెద్దియు జలింపజాలదో, దేనివలన నిశ్చల సరస్సునందు బవిత్ర పుష్పమువలె ఆత్మ పెఱుగునో, అట్టిశాంతి. శిష్యుడు కోరదగు శక్తి యెట్టిదనిన, దేనివలన లోకదృష్టికి దాననామికుడుగ గన్పడునో అట్టిది.

1, 2, 3, 5, 6, 7 ప్రాచీనసూత్రములలోను 4–8 వ్యాఖ్యాన సూత్రములలోను వర్జనీయములైన మనోమయ విజ్ఞానమయ కోశసంబంధములైన దోషములు వివరించబడినవి. విరాగము, నిస్సంగము బోధించబడెను. ఇకను సంపాదించదగు సుగుణములు 9, 10, 11, 13, 14, 15 ప్రాచీనసూత్రములవలనను 12, 16 వ్యాఖ్యాన సూత్రములవలనను బోధించబడును.

అన్ని సుగుణంబులలో నగ్రగణ్యంబు భక్తియే. అందు మూఢ భక్తికన్న జ్ఞానసహితభక్తి శ్రేష్ఠము.

> తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే ।
> ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం సచ మమ ప్రియః ॥
> (భ. గీ. 7–17)
>
> జ్ఞానీ త్వాత్మైవ మే మతం । (భ. గీ. 7–18)

కావున ప్రథమమందు బ్రహ్మజ్ఞానము కలుగవలెను. ఆత్మస్వరూపము, ఈశ్వరతత్వమిట్టిది యని మొదట తెలిసికొనవలెను. ఆ బ్రహ్మవస్తువునం దత్యంతప్రేమయు, అదియే ప్రాప్యవస్తువనెడి జ్ఞానమును, కలుగవలెను. ఈశ్వరుడే ప్రేమించదగిన వాడని నిశ్చయించిన, దతితర హీనవిషయవాంఛ తొలగును. ఈశ్వరుడే ప్రాప్యస్థానము, సర్వమాయననుండి బుట్టినది, ఆయనవలన జీవించియున్నది, ఆయనయందే లయించుచున్నది, అనెడి జ్ఞానమువలన "నేను" "నాది" అను నహంకారభావము తొలగును. దాన, లోకసంగ్రహ కర్మాచరణకు యోగ్యత కలుగును.

మొదటి మూడు ప్రాచీనసూత్రములలో మనోమయకోశదోషము లైన ఇంద్రియమనోవిజృంభణము, విషయభోగకాంక్ష వర్జనీయములని

చెప్పబడెను. బాహ్యవిషయములకు బోనేల? వానివలన సుఖము కల్గినను నది నశ్వరసుఖమే కావున వరణీయముకాదు. సర్వసుఖ ప్రదాయకమైన ఆత్మ నీలోపలనే యుండగా బాహ్య విషయభోగ కాంక్ష ఎందుకు? నీలోపలనుండెడి యాత్మనే ప్రేమించుము అని తొమ్మిదవ సూత్రము విధించుచున్నది. విజ్ఞానమయకోశదోషములైన అహంకారాభిమానములచే "నేను" "నాది" అను పృథగ్భావము కలుగగా "ఇంద్రియములద్వారా మనస్సుతోనే నీవిషయములను గ్ర హించితిని. ఇందువలన గలిగిన జ్ఞానము, సుఖమును నాది; నాకెక్కు డు జ్ఞానము కావలెను. నాకు శ్రేయస్సు కావలెను" అనెడి దోషము యొక్క ఫలమేమన "ప్రపంచమనగా నేను, అన్నియు నావి" అనెడిభావము దృఢపడును. ప్రపంచమనగా నీవేకాదు. ఈశ్వరుడు నీలోపలనే కాదు, నీ వెలుపలనయితె మున్నాడు. ప్రపంచమంతయు నీశ్వరమయమే కావున "నేను, నాది" అను మిథ్యాభావము వదల వలెనని 10-వ సూత్రము బోధించుచున్నది.

11 వ సూత్రము ఈశ్వరుని విశేషలక్షణమును దెలుపుచున్నది. 13, 14, 15 సూత్రములు భగవత్ప్రాప్తిసాధనములగు యోగ్యతలను దెల్పుచున్నవి.

1 మొదలు 16 వఱకుగల సూత్రము లిట్లు పరస్పర సంబంధములు గలవని తోచెడివి. ఇకను 9-16 సూత్రములను ప్రత్యేకముగా విచారించవచ్చును.

9 వ ప్రాచీనసూత్రము—"నీలోపల నుండు దానిని మాత్రమే కోరుము." 12 వ్యాఖ్యానసూత్రము—"ఎందువలన ననగా ప్రపంచ మును వెలిగింపజేయు జ్యోతి నీలోపల నున్నది. (మోక్ష) మార్గము

నందు ప్రకాశము నిచ్చు జ్యోతి యది యొక్కటియే. దానిని నీ యందు జూడనోపవేని వేఱొండు చోటవెదకుట నిరర్థకము.''

భగవంతుడు సర్వభూతములయం దంతరాత్మయై యున్నాడు.

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ॥

(భ. గీ. 10-20)

ఈశావాస్య మిదం సర్వం । (ఈ. ఉప)

ఆయన యంతరాత్మయై యుండుటవలననే ఏభూతమున కైనను రూప ధారణశక్తి కలిగియున్నది. ఏభూత మేకాలమందైన నెట్టి కార్యము చేసినను నాకార్యము చేయు సమర్థత దానికి భగవంతుని వలననే కల్గినది.

రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః ।
ప్రణవస్సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥

(భ. గీ. 7-8)

శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచోహ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః చక్షుష శ్చక్షుః ॥ (కేన. ఉప)

జలమునకు రసగుణము, సూర్యచంద్రులకు గాంత, శ్రోత్రాది సర్వేంద్రియములకును ప్రాణమునకును వానివాని శక్తి, భగవంతుని వలననే కల్గినవని పైప్రమాణముల తాత్పర్యము.

న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః । తమేవ భాంతమనుభాతి సర్వం తస్యభాసా సర్వమిదం విభాతి ॥ (కఠోపనిషత్)

అచ్చట (ఆ భగవంతుడుండుచోట) సూర్యుడు ప్రకాశించడు. (అనగా ఆయనకు సూర్యప్రకాశముతో నవసరములేదు.) చంద్రుడు నక్షత్రములు ప్రకాశించవు. మెఱుపులు మెఱయవు. ఇక నగ్ని ప్రకాశించదని చెప్పనేల? ఆ భగవంతుని ప్రకాశము ననుసరించియే సర్వము ప్రకాశించుచున్నది. ఆయన ప్రకాశమువలననే సర్వమునకు బ్రకాశము కలుగుచున్నది.

భగవంతుడు ప్రతిభూతమునందుండును. భగవంతునియందు సర్వ భూతములున్నవి.

మత్ స్థాని సర్వభూతాని. (భ. గీ. 9-4)

కావున ప్రతిభూతమునందును సర్వభూతము లున్నవి. అట్లుండ, బాహ్యవిషయ మెక్కడిది? బాహ్యవస్తువునకు రమ్యత్వము నొసగునది యాత్మయే. ఆ యాత్మ మనలోపలనే యుండగా ఇకను విషయ వాంఛ ఎందుకు? ఇట్లాత్మతత్త్వజ్ఞానముచే నాత్మయందే తృప్తి కల్గి బాహ్యవిషయచింత ఎవనికి నశించునో వాడే జ్ఞాని, స్థితప్రజ్ఞుడు.

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥ (భ. గీ. 2-55)

అట్టివానికి జేయవలసిన దేమియు లేదు. కోరవలసిన దేమియు లేదు. చేసినదానివలన బ్రయోజనము లేదు. చేయకపోయిన బ్రత్యవాయము లేదు. ఏ ప్రయోజనమునకు గాని వాడెవరి నాశ్రయించవలసి నది లేదు.

యస్త్వాత్మరతిరేవ స్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే ॥

నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥

(భ. గీ. 3-17, 18)

సర్వకామప్రదుడైన భగవంతుడు మనలోపలనే యున్నాడని తెలిసి కొని బాహ్యవిషయ కామములను ఏదలవలెనని ఈ సూత్రము బోధించుచున్నది.

మనస్సును బాహ్యవిషయములనుండి ఆత్మ వైపు త్రిప్పినగాని మన లోపలనుండినను మన మాత్మను జూడజాలము, తెలిసికొన జాలము.

యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితం ।
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః ॥

(భ. గీ. 15-11)

యోగులు ప్రయత్నముచేసి (ఇంద్రియములను నిగ్రహించి మనస్సును వశపర్చుకొని పరిశుద్ధిచేసికొని) తమయందుండెడి యాత్మను జూచె దరు. మనస్సును బరిశుద్ధము చేసికొననివారు ప్రయత్నము చేసినను జూడజాలరు.

అత్యంత సమీపమునుండి చూడదగియుండినను మూఢులా యా త్మను గనుగొనజాలరని భగవంతుడు పశ్చాత్తాపపడుచున్నాడని శ్రీ శంకరాచార్యులవారు వ్రాసిరి.

ఏవంభూతమపి (సన్నిహితతమత్వేన) అత్యంత దర్శన గోచరప్రాప్తం విమూఢా నాను పశ్యంత్యహో కష్టం వర్తత ఇత్యనుక్రోశతి భగవాన్ ॥

మనస్సును బరిశుద్ధి చేసికొని భగవంతునియందు భక్తి సల్పినయెడల తనతత్త్వము నెఱుగు జ్ఞానము మనకొసంగి, యజ్ఞానము దొలగించి, తనయందు మనలను జేర్చుకొనును.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥
తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥
(భ. గీ. 10–10, 11)

సతతయుక్తుఁడై ప్రీతితో నన్ను భజించువానికి నన్ను జెందించగలుగు బుద్ధి యోగమును నే నిచ్చుచున్నాను. వానియందు నాకను కంపము కల్గి వాని యాత్మ భావస్థుడనై జ్ఞానదీపమును వెలిగించి యజ్ఞానాంధకారమును దొలగించెదను.

ఇదియే మోక్షము. బంధమే అంధకారము. ఆ బంధమను చీకటిని దొలగించు జ్ఞానదీపమును మనలోపలనే భగవంతుడు వెలిగించును. అనగా మన కాత్మసాక్షాత్కారము కలుగును. ఆ సాక్షాత్కారము మనలోపల మనకు గావలయునేని వెలుపల వెదకగా గలుగదు. వెదకుటవలన నుపయోగములేదు. వెదకు చుండునంతకాలము సాక్షాత్కారము కానట్టే. మనలోపలి దీపమును జూడలేనివారమూ అంధులమే. అంధులు బయట బోయిన నేమి చూడగలరు? అట్లే ఆత్మతత్త్వమును యథార్థజ్ఞానముతో దెలిసికొని బాహ్యవిషయ చింతన వదలవలెను. ఈ సూత్రము ఆత్మాన్వేషణము, ఆత్మక్రీడ, ఆత్మతృప్తి, ఆత్మసంతుష్టి, ఆత్మ సాక్షాత్కార తీవ్రేచ్ఛను బోధించుచున్నది.

"నీకు అతీతమైనదానిని మాత్రమే కోరుము. అది నీకు అతీతమని యెందుకు జెప్పబడుచున్నదనగా, దానిని జేరునప్పటికి నీవు లయమును బొందుదువు."

ఈ ఆత్మ నీ లోపలమాత్ర ముండునది కాదు. వెలుపలనయిత మున్నది. అంతట నున్నది. అన్నిదిశల వ్యాపించియున్నది.

తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ॥ (ఈ.ఉప)

బహిరంతశ్చ భూతానాం అచరం చరమేవచ ॥

(భ.గీ. 13-16)

బ్రహ్మైవేదమమృతం పురస్తాత్ బ్రహ్మ పశ్చాత్ బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ । అధశ్చోర్ధ్వం చ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం ॥

(ముండ. ఉప)

సర్వం బ్రహ్మమే అను భావముతో 'నేను' 'నాది' అను భావమును బోగొట్టుకొనవలెను. "నీవు లయమును బొందుదువు" అనగా ఆత్మ 'నేను' అనుభావమున కతీతమని తాత్పర్యము. ఆత్మ సాక్షాత్కారమగునపుడు 'నేను' అను భావముండదు. కావున 'నేను' అని తలచుస్థితికి ఆత్మ సాక్షాత్కారస్థితి అతీతదశయే యని చెప్పవలెను. 'నేను' అను భావము అహంకారతాదాత్మ్యము. అది అనాత్మ. అది లయించిననే ఆత్మసాక్షాత్కారము కలుగునని వ్యాఖ్యానసూత్రము తెలుపుచున్నది.

"అప్రాప్య మగుదానిని మాత్రమే కోరుము. అది యప్రాప్యమనుటకు గారణమేమన, అది ఎల్లప్పటికి వెనుకకు బోవుచునే

యుండును. నీవు వెలుగును బ్రవేశించెదవుకాని మంటను దాక నేరవు."

ఈ సూత్రము బ్రహ్మవస్తువు ఎంతమాత్రము వేద్యమగునది కాదని బోధించుచున్నదని దురభిప్రాయపడగూడదు. అట్లభిప్రాయపడిన సర్వవేదాంతశాస్త్రమున కానర్థక్యము కలుగును. శ్రుతులలో బ్రహ్మవేద్యము కాదని చెప్పియుండునది నిజమే. అయితే ఇంద్రియములచేత మనస్సుచేత దెలిసికొనజాలినది కాదనియే వాని తాత్పర్యము.

నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుసా ॥
(కఠ. ఉప)

న చక్షుషా గృహ్యతే నాపి వాచా ।
నాన్యై ర్దేవైః తపసా కర్మణా వా ॥ (ముండ. ఉప)

మనస్సును బరిశుద్ధముచేసికొనిన సూక్ష్మబుద్ధిగల సూక్ష్మదర్శులచే సాక్షాత్కరింపబడునని స్పష్టముగా జెప్పబడియున్నది.

దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥
(కఠ. ఉప)

జ్ఞానప్రసాదేన విశుద్ధసత్వః తతస్తు తం పశ్యతే నిష్కళం ధ్యాయమానః ॥ (ముం. ఉప)

ఆత్మాస్యజంతో ర్నిహితో గుహాయాం తమక్రతుః పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదా న్మహిమాన మాత్మనః ॥
(కఠ. ఉప)

ఈ సూత్రమునందు బ్రహ్మ అప్రాప్యమని చెప్పబడియున్నది. బ్రహ్మ ప్రాప్యమని శ్రుతులు చెప్పుచున్నవి.

బ్రహ్మప్రాప్తో విరజోభూ ద్విమృత్యుః అన్యోప్యేవం యో విదధ్యాత్మమేవ. (కఠ. ఉప)

బ్రహ్మవిదాప్నోతి పరం ॥ (తైత్తి. ఉప)

సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా ॥ (ముండ. ఉప)

యమేవైష వృణుతే తేన లభ్యః ॥ (కఠ. ఉప)

బ్రహ్మప్రాప్తి, బ్రహ్మ లభించుట అని చెప్పుటయేకాక బ్రహ్మయే అగును అని సయితము చెప్పబడియున్నది.

బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి ॥ (ముండ. ఉప)

కొన్నిచోట్ల, "ప్రవేశించును" అని చెప్పబడి యున్నది.

తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ ॥ (ముండ. ఉప)

సర్వమేవావిశంతి ॥ (ముండ. ఉప)

భగవద్గీతలలో, నన్ను బొందుచున్నారు, నా సాధర్మ్యమును బొందుచున్నారు, నా స్థానము బొందుచున్నారు, నన్ను బ్రవేశించుచున్నారు అని యనేకవిధముల మోక్షమును గన్పర్చియున్నారు.

జ్ఞాతుం ద్రష్టుం చ తత్వేన ప్రవేష్టుం చ ॥ (భ. గీ. 11-54)

తతో మాం తత్వతో జ్ఞాత్వా విశతే తదనంతరం ॥ (18-55)

శాస్త్రములలో సాయుజ్యము, సాలోక్యము, సారూప్యము, సమానైశ్వర్యము, సామీప్యము అని మోక్షభేదములు చెప్పబడియున్నవి. ఏయేదశలో నేయే శ్రుతి ప్రమాణ మన్వయమో తెలిసికొనుట కష్టతమము. ఒక విషయముమాత్రము మనస్సున నుంచుకొనవలెను.

అనాత్మతాదాత్మ్య ముండునంతవఱకు సంపూర్ణమోక్షము లేదు. సగుణబ్రహ్మవఱకు ననాత్మాశ్రయ ముండనేయుండును. మన కింద్రియాత్మ తాదాత్మ్య ముండును. దాని నతిక్రమించిన నదియు నొకవిధమైన మోక్షమే (అనగా విడిపించుకొనుట). పిమ్మట విజ్ఞానాత్మతాదాత్మ్యము పోవలెను. పిదప మహదాత్మ, పిమ్మట శాంతాత్మ. ఒక బ్రహ్మాండ ఈశ్వరునితో నైక్యముచెందినను, అనేకకోటి బ్రహ్మాండములున్నవి. అనేక కోటి బ్రహ్మాండ నాయకులకును ప్రభువగు పరమ మహేశుడు, సదాశివుడు అనియు, త్రిపాద్విభూతి ఆది నారాయణుడనియు నెఱుంగబడు. సగుణబ్రహ్మపదవియు మఱియు నిర్గుణనిష్క్రియ నిర్విశేష పరబ్రహ్మపదవియు నున్నవి. ఇది అనంతము. అందువలన నీ సూత్రములో "అదివెనుకకు బోవుచునే యుండును" అని చెప్పబడియున్నది. అనగా, ఇంకను చెందవలసిన ఉన్నతదశ శేషించియే యుండునని తాత్పర్యము. "వెలుగును మాత్రము ప్రవేశించెదవు." అందువలననే గాయత్ర్యాదిమంత్రములలో బ్రహ్మతేజస్సే ధ్యేయముగా జెప్పబడియున్నది. ఈ సూత్రము సామీప్యమోక్షమును దెల్పుచున్నట్లు కనపడుచున్నది.

18 వ ప్రాచీనసూత్రము, 16 వ వ్యాఖ్యానసూత్రము

"18. తమకముతో శక్తిని గోరుము. 16. శిష్యుడు కోరదగు శక్తి యొట్టిదనిన దేనివలన లోకదృష్టికి దా ననామికుడుగ గన్పడునో అట్టిది."

శక్తియన ఆత్మనిష్ఠాజనితవీర్యము.

ఆత్మనా విందతే వీర్యం విద్యయా విందతేఽమృతమ్ !

ఈ శక్తి లేనివారికి ఆత్మప్రాప్తి కలుగనేరదు.

"నాయమాత్మా బలహీనేన లభ్యః" (ముండ. ఉప)

ఈశ్వరతత్త్వము నెఱిఁగి, ఈశ్వరునియందు భక్తికల్గి ఈశ్వరసేవ యనెడి లోకసేవవ్రతము ననుష్ఠించువాడు బలహీనుడుగ నుండిన సేవ చేయనేరడు. ఈశ్వరసేవ చేయుచురాగా, మఱియు నెక్కుడు నైపుణ్యముతో సేవించగలుగు. శక్తి నీశ్వరుడొసంగును. సాధారణముగ లోకులయొక్క ఆత్మశక్తి కామరూపమున విషయ భోగప్రాప్తియందు వినియోగించబడుచుండును. అట్లు చేయని యెడల ఆత్మశక్తి మనయందు నిండియుండును. ఏ లోకోపకార కార్యమునకైనను వినియోగించను సిద్ధముగనుండును. అట్టి కార్యమునకు వినియోగించిన నా శక్తి వృద్ధియగునేకాని జీర్ణము కానేరదు. ఆత్మగుణముల లక్షణ మిదియే. వినియోగించుకొలది వృద్ధియగుచుండును. లోకోపకారక్రియ యన నీశ్వరసేవయే. ఈశ్వరుడు సర్వశక్తికిని, సామర్థ్యమునకును సంపదలకు నాధారము.

బలం బలవతాం చాహం ।

ఆయనపని చేసిన నాయన మఱియు నెక్కుడుగ బలము నిచ్చుచుండును. ఆత్మబలమును లోకహితకర్మాచరణమందు వినియోగించవలెనన, దేహబలము, ఇంద్రియబలము సహిత ముండవలెను. ఆరోగ్యమైన దేహము లేనివాడే గొప్పకార్యమును జేయనేరడు. శరీరము ధర్మసాధనమున కేర్పడిన కొరముట్టు. కొరముట్టు బాగుగ లేనియెడల బనివాడెట్లు పనిచేయనేరడో అట్లే లోకసంగ్రహ కర్మచేయువానికి శరీరారోగ్య ముండవలెను. తనపనిచేయుటకు

వలయు స్థితిలో నుంచుకొని తనసేవచేయుమని భగవంతుడు మనకిచ్చిన శరీరమను కొరమట్టు నుపేక్షచేయుటకు మన కధికారము లేదు. ఆయనపని బాగుగ జేయుటకు దానిని శక్తిబలసామర్థ్యములు కల దానిగ నుంచుకొని ఆయన కార్యము నిర్వర్తించి తుది ఆయనకు సమర్పించవలయును. ఇంద్రియబలము, దేహబలము, మనోబలము ఆత్మవీర్యప్రకాశమునకు సహాకారులు. కావున, నీ వీర్యమును బల మును సాధించవలయునని ప్రాచీనసూత్రము బోధించుచున్నది. అయితే నేను బలవంతుడ నని గర్వించినను, నాబలమును బలహీనుల హింసించ నుపయోగించినను, అది యసురసంపదలలో జేరిన బలమే కాని ఆత్మనిష్ఠాజనిత వీర్యము కాదు.

అహంకారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః ।

(భ. గీ. 16-17)

అహంకారము, బలము, దర్పము, మానము, అను క్షేత్రవికా రములైన గుణములను వర్జించి ఇంద్రియములను మనస్సును సంపూర్ణ ముగ వశపరచుకొనిన వానికే ఆత్మనిష్ఠ, తజ్జనితవీర్యము సిద్ధించును. వాడు భక్తిజ్ఞానములు కలవాడుగ నుండును. శక్తి నాదికాదు; ఐశ్వర్యము నాదికాదు; జ్ఞానము నాదికాదు; అవియన్నియు ఈశ్వరునివే.

బలం బలవతాం చాహం; బుద్ధి ర్బుద్ధి మతామస్మి ।
మత్తస్స్మృతి ర్జ్ఞానమపోహనంచ ॥

ఆయన కార్యము చేయుభాగ్యము నాకు గల్గునా అని నేను సిద్ధ ముగ నుండునప్పుడు నాచేత దన పనిని జేయించుకొనుటకై నాకు

వలయు బల మాయన యిచ్చినాడు, నేను గర్వపడగారణము లేదు, అని తలంచి లోకులకు దనబలమును బ్రకటించుకొన గోరడు. అవధూతయదుసంవాదములో అవధూత బాహ్యదృష్టికి బాలునివలెను, జడునివలెను, ఉన్మత్తునివలెను నగుపడుచుండె నని చెప్పబడియున్నది. అయిన నాయన బ్రహ్మతేజస్సును జూచి ఆయన మహిమను యదుమహారాజు కనుగొనెను.

> కుతో ను ధీరియం బ్రహ్మ న్నకర్తు స్సువిశారదా ।
> యామాసాద్య భవా౯ లోకే విద్వాంశ్చరతి బాలవత్ ॥
> త్వం తు కల్యః కవిర్దక్షః సుభగో మితభాషణః ।
> న కర్తా నేహసే కించిత్ జడోన్మత్తపిశాచవత్ ॥
> జనేషు దహ్యమానేషు కామలోభ భవాగ్నినా ।
> న తప్యసేఽగ్ని నాముక్తో గంగాంభస్థ ఇవ ద్విపః ॥
>
> (శ్రీభాగ. 11. 7.)

బ్రాహ్మణోత్తమా, విద్వాంసుడవై లోకమున బాలునిరీతి దిరుగ నొదవిన యీ యతినిపుణమతి యకర్తయగు నీ కెట్లు కలిగె? కేవలము జడోన్మత్తపిశాచచర్య నడుపుదువు. అట్లున్నను కల్యుడు, కవి, దక్షుడు, సుభగుడు, మితభాషణుడు నై చూపట్టుదువు. కామలోభములనుండి పుట్టిన చిచ్చున జనులెల్ల తపించుచుండ గంగాప్రవాహమున నున్న యేనుంగు భంగి నీవు ముక్తుడవై యా సంతాపంబు నొందవు.

ఇట్లు గొప్పజ్ఞానమహిమచే వెలుంగువారు బాహ్యదృష్టికి అనామికులుగ గన్పడుదురు. లోకులు తమను మెచ్చుకొనవలెను, గౌరవించవలెను అనెడి కోరిక వారికి లేదు. వారు నిర్మానమోహులు.

నేను గొప్పవాడనను భావమే వారికి లేదు. ఆ భావముండువారు అహంకారమును జయించనివారే. కావున ఆత్మనిష్ఠాజనిత వీర్యమన గా మనస్సును అహంకారమును జయించిన బలమని యెఱుంగ వలయు.

"తీవ్రముగ శాంతినిగోరుము."

గడచిన సూత్రము బలమును సంపాదించవలెనని బోధించెను. ఆ బలము మనశ్శాంతి సహితముగ నుండవలెనని యీ సూత్రము విధించు చున్నది.

"బలం బలవతాం చాహం కామ రాగ వివర్జితం"

కామరాగవివర్జితమైన బలమే ఆత్మగుణము. అహంకారదర్ప సహిత బల మసురగుణ మని యిదివఱకే చెప్పబడెను. ఈ కామరాగవివర్జన మే యిచ్చట చెప్పబడిన శాంతి. ఇంద్రియక్షోభ శమించవలెను. మనస్సుయొక్క స్వేచ్ఛావిహారము శమించవలెను. వీని శాంతిలేని వాఁడు ఆత్మనిష్ఠాపరుడు కానేరడు.

రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥
ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥
నాస్తిబుద్ధిరయుక్తస్య నచాయుక్తస్య భావనా ।
నచా భావయత శ్శాంతి రశాంతస్య కుతస్సుఖం ॥
విహాయ కామాన్ య స్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః ।
నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి ॥
(భ. గీ. 2-64, 65, 66, 71)

దేహము, ఇంద్రియములు, మనస్సు స్వాధీనములోనుండి ఇంద్రియ ములు రాగద్వేషవిముక్తములై మనస్సు నియతము వశీకరమైయుండిన చో విషయములను భోగించినను ప్రసాదము కల్గును. దాన సర్వోప ద్రవములు పోవును. ఇట్లు ప్రసన్నమైన మనస్సుగలవానికి బుద్ధిస్థైర్య ము కలుగును. అయుక్తునికి బుద్ధిస్థైర్యము లేదు. భావనయును లేదు. భావనలేనివానికి శాంతి లేదు. శాంతిలేనివానికి సుఖ మెక్కడ? ఎవడు సర్వకామములను వదలి స్పృహ (విషయచింతన) మమకార అహంకారములను వదలి యుండునో వాడు శాంతిని బొందును.

కావున దేహేంద్రియములను వశపరచుకొని మనస్సును నిర్మలము చేసికొని బుద్ధిని ఆత్మదెసద్రిప్పి ఆత్మధ్యానపరుడై కామదోషము లను అహంకార మమకారములను వదలుటయే ఈ సూత్రములో విధించిన శాంతి యనెడి గుణము.

"నీవు కోరదగు శాంతి యెట్టిదనిన, దేని నెద్దియు జలించజాలవో, దేనివలన నిశ్చల సరస్సునందు బవిత్రపుష్పమువలె ఆత్మ వెలుగునో, అట్టిశాంతి శిష్యుడు గోరదగు." ఇదియే ఆత్మనిష్ఠాజనిత శాంతి.

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మ నాత్మానం పశ్య న్నాత్మని తుష్యతి ॥
సుఖమాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియం ।
వేత్తి యత్ర నచైవాయం స్థితశ్చలతి తత్వతః ॥
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥
తం విద్యా ద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితం ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణ చేతసా ॥

(భ. గీ. 6-20—23)

యోగసేవచేత నిరోధించబడిన చిత్తము ఎచ్చట శాంతించునో, ఎచ్చట నాత్మచేత నాత్మను జూచి తృప్తిచెందునో, ఇంద్రియముల వలన దెలియరానిదియును బుద్ధివలన గ్రహించదగినదియు నగు అత్యంతసుఖ మెద్దానియందున్నదో, దేనియందు స్థాపించబడినవాడై తత్వము నుండి చలించడో, దేనిని బొంది ఇకను బొందవలసిన దింతకన్న నెక్కుడగునది లేదని తలచునో, దేనియందు స్థాపించబడి ఎంత గొప్పదుఃఖము వలననైనను చలించబడడో, దానికే దుఃఖసంయోగ వియోగరూపమైన—అనగా దుఃఖముయొక్క స్పర్శను లేకుండ చేయగలుగు—యోగమని పేరు. నిశ్చయమైనట్టియు దీనత్వమును జెందనట్టియు మనస్సుతో నీ యోగము నభ్యసించవలెను.

ఈ ఆత్మధ్యానజనిత సుఖముకన్న నెక్కుడు సుఖములేదు. ఈ యోగమును సాధించవలెనని వ్యాఖ్యానసూత్రము బోధించుచున్నది.

"అన్నిటికన్న హెచ్చుగ సంపదలను గోరుము."

ఇచ్చట సంపదలనగా దైవీసంపదలు, అనగా ఆత్మగుణములు. ఈ గుణము లనేక గ్రంథములలో ననేక పేర్లతో వర్ణింపబడియున్నవి. జ్ఞానము, సత్యము, దమము, తపస్సు, మాత్సర్యరాహిత్యము, హ్రీ, తితిక్ష, అనసూయ, యజ్ఞము, దానము, ధైర్యము, శాంతి అను నీ పండ్రెండు బ్రాహ్మణునికి వ్రతములని చెప్పబడియున్నవి. మఱియు, సత్యము, అర్జవము, దయ, అహింస, శమము, దమము, ధృతి, ఇత్యాదు లాత్మగుణములని చెప్పబడియున్నవి. గీతాశాస్త్రమునందు దైవీసంపదలు విపులముగా వర్ణించబడియున్నవి. అందు అభయము, సత్వసంశుద్ధి, జ్ఞానయోగవ్యవస్థితి అనునవి ప్రాధాన్యగుణములని శ్రీ శంకరాచార్యులవారు చెప్పియున్నారు. ఈ గుణములన్నింటికి

సమానధర్మములు సర్వభూతైకత్వదర్శన లక్షణజ్ఞానము, సర్వభూతస్థ భగవద్దర్శనజనిత సర్వభూతప్రేమ, అనగా ఉత్తమమైన జ్ఞానము, ఉత్తమమైన భక్తి, అనగా ప్రేమ.

"అయితే ఆ సంపదలు పరిశుద్ధాత్మకు సంబంధించినవిగనే యుండవలయు."

ఈ గుణములలో నెద్దానియందును స్వార్థచింత చేరియుండ గూడదు. అది చేరిన గామసంబంధమై అనాత్మగుణమగునే కాని ఆత్మగుణము కానేరదు. ఆత్మగుణమునకు ననాత్మగుణమునకును ముఖ్యమైన భేద మెద్దియన, ఏకత్వభావమును గలుగ జేయునది యాత్మగుణము, భిన్నభావమును దోపజేసెడిది యనాత్మగుణము.

"కనుక పరిశుద్ధాత్మలందఱకు సమానముగ జెందినవిగ నుండవలయు. మఱియు ఏకీభావమును జెందిన యందఱకు సంబంధించిన సొత్తుగ నుండవలయు."

సకలగుణములకాశ్రయుడు భగవంతుడే. ఎవరియందెట్టి పారిశుద్ధ్యము, జ్ఞానము, ప్రకాశము, గొప్పతనము, కన్పడునో అదియంతయు ఈశ్వరవిభూత్యంశములే.

> యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
> తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంఽశ సంభవం ॥
>
> (భ. గీ. 10-41)

ఇట్లుండ నెవ్వరేనియు ఈ సుగుణము నాది, నా ప్రయోజనమునకు గాను అని చెప్పుటకు సాధ్యములేదు. ప్రతి సుగుణానుష్ఠానమునందును నొక ఫలము కలుగును. అది యెద్దియన ఈశ్వరప్రసాదము.

మనము ఈశ్వరార్పణముగా సత్కార్యమును జేయ నది ఈశ్వరుని జెంది ఆయననుండి అనుగ్రహప్రసాదము వచ్చునట్లు చేయును. ఆ యనుగ్రహరసము భూతకోటికి హితము కలుగజేయును. కావున ఆత్మగుణము సర్వభూతహితకారియనుటకు సంశయము లేదు. అందఱకు హితము కల్గును. అయితే అంతఃకరణశుద్ధియయిన వారికి నెక్కుడుగ జ్ఞానము ప్రకాశించును.

"సర్వభూతాత్మకొఱకై ధనము సేకరించవలయునని (యుద్దేశించి) పరిశుద్ధాత్మ యుంచుకొనదగు సంపదల నపేక్షించుము."

ఒక్కజీవుడు అహంకారమును వదలి లోకహితకర్మ చేయగా లోకమంతయు బవిత్రమగును. లోకములో నజ్ఞానదశయందుండి కామక్రోధాదులకు లోబడి పాపకార్యములు చేయుచు లోకదుఃఖమును హెచ్చుచేయుచుండువారే ఎక్కుడు సంఖ్యగలవారుగ నున్నారు. అనగా లోకమునందధ్యాత్మజ్ఞాన దారిద్ర్యము హెచ్చుగనున్నది. ఈ దారిద్ర్యమును బోగొట్టు భక్తిజ్ఞానలక్షణములైన ఆత్మగుణములను ధనము నార్జించి లోకములోని యజ్ఞానమును తజ్జనితదుఃఖమును నివారించుటకు శ్రద్ధతోబూనుకొని పనిచేయువలెనని వ్యాఖ్యానసూత్రము బోధించుచున్నది. లోకులందఱు పరిశుద్ధులగుదురా అని సదా చింతించుచు లోకదుఃఖనివృత్తియే ముఖ్యోద్దేశ్యముగ నుండవలయు.

స్వస్త్యస్తు విశ్వస్య ఖలః ప్రసీదతాం ధ్యాయంతు భూతాని శివం మిథోధియా ।

"ఆ అఖండచైతన్య స్వరూప సర్వభూతాత్మ నిక్కముగ నీయాత్మయే."

ఇట్లు తెలిసికొనుటయే యోగి లక్షణము.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥
(భ. గీ. 6-29, 30)

సమదర్శనుండైన యోగయుక్తుడు తనయందు సర్వభూతములను, సర్వభూతములయందు దనను, సర్వత్ర చూచును. ఎవడు నన్నంతటను జూచునో సర్వమును నాయందు జూచునో వానిని నేను వదలను, నన్ను వాడు వదలడు.

ఇది శాస్త్రజ్ఞానముతో రానేరదు. ఇంద్రియమనోనిగ్రహములతో యోగమును సాధించిన వానికే సర్వభూతాత్మయే తనయాత్మయని తెలిసికొనసాధ్యము. అప్పుడు తనమేలుకొఱకై పనిచేయవలెనని ఇచ్ఛ పుట్టనేరదు. ఎందువలన ననగా, లోకహితమే తనహితమని యు, లోకమునకహితము తనకు హితము కానేరదనియు దోచును. సర్వభూతైకత్వజ్ఞానముచే సర్వభూతహితార్థము పనిచేయవలయు ననియు నందుకు వలయు ఆత్మగుణసంపదలను సాధించవలె ననియు నీ ప్రాచీన వ్యాఖ్యానసూత్రములు బోధించుచున్నవి.

---

## అయిదవ అధ్యాయము

## I

## యోగమార్గాన్వేషణము, అన్వేషణ విధానములు

### ప్రాచీనసూత్రములు

### 17. మార్గాన్వేషణము చేయుము.

టీక

ఈ మాటలు ప్రత్యేక సూత్రముగ నుండుటకు మిక్కిలి అల్పమైనవిగ గన్పడవచ్చును గాబోలు.

"నేను మార్గాన్వేషణము చేయనివాడ నైతినేని యీ భావములను ఎన్నడైనను గమనించి యుందునా?" అని శిష్యుడు తలచవచ్చును. అయినను (ఈ సూత్రమును) వేగిరపడి దాటిపోవలదు. కొంతతడవు నిల్చి యోచించుము. మార్గమును నీవు కోరుచున్నావా, లేక నీ వారోహించదగు ఉన్నత స్థానములను, భావికాలమున నీవు పొందగల గొప్ప పదవియును, నీ దృష్టికి నల్పముగనైనను గోచరమైనవా?

హెచ్చరిక సుమా! మార్గమును దానికొఱకే యన్వేషించవలెను గాని దాన నడువబోవు నీపాదములకొఱకు కాదు.

ఈ సూత్రమునకును రెండవ భాగము పదునేడవ సూత్రమునకును సంబంధము గలదు. బహుకాలము పోరాడి యనేకసార్లు జయించి

కడపటి యుద్ధమునందు విజయమునొంది చరమరహస్యమును దెలియ గోరిన, నప్పుడు ఆనల నడుమవలసియుండు మార్గమునకు (యోగ్యత గలిగి) సిద్ధముగ నుందువు. ఈ మహాబోధయొక్క చరమరహస్యార్థము చెప్పబడినప్పుడు, అందులోనే (మఱియొక) క్రొత్తమార్గ రహస్యము వ్యక్తమగును. ఆ క్రొత్తమార్గ మెట్టిదియన, సర్వమానుషానుభవముల కతీతమగు స్థితిని జేర్పించునదియు, మానవునకు సంపూర్ణముగ గోచరాతీతమైనట్టియు, మననాతీతమైనట్టిదియును. ఈ (శ్రేణికయొక్క) పర్వములలో బ్రతిదానియందును బహుకాలము నిల్చి బాగుగ యోచించుట యావశ్యకము. ప్రతి యడుగునందును మార్గము దానికొఱకే కోరబడుచున్నదని మనస్సు నిశ్చయముచేసి కొనుట యవశ్యకము. మొదట మార్గము, సత్యమును గోచరమగు. పిదప దదనుష్ఠానము.

18. లోపలికి మఱలినవాడవై మార్గాన్వేషణము చేయుము.

19. ధైర్యముతో బహిర్గతుడవై మార్గాన్వేషణము చేయుము.

వ్యాఖ్యానసూత్రము

20. ఎద్దియేని ఒకమార్గముననే దానిని వెదకకుము. ఒక్కొక స్వభావమునకు మిక్కిలి యుక్తముగదోచు మార్గ మొక్కటి యుండును. అయితే (మోక్ష) మార్గ

ము భక్తితోనే కాని, ధ్యానముతోనే కాని, శ్రద్ధాయుత యభివృద్ధి (తృష్ణ) తోనే కాని, స్వార్థత్యాగపురస్సర కృషివలననే కాని, జీవితమును శ్రద్ధతో పరిశోధించుట వలననే కాని, కనుగొనబడదు. (వీనిలో) ఏయొక్కటి యైనను స్వయముగ శిష్యుని నొక్క మెట్టుకన్న నెక్కుడుగ నూర్ధ్వమార్గమున గొనిపోనేరదు. ఒక శ్రేణిక బూర్తియగుట కన్నిపర్వము లవశ్యకములే. మనుష్యుల దుర్గుణములను జయించుకొలదియు నొక్కొక్కటియును (మోక్షమార్గ) శ్రేణికయందలి పర్వమగును. మనుష్యుని సుగుణములు (సయితము) యథార్థముగా (ఆశ్రేణికయందలి) పర్వములే; అవశ్యకమైనటువంటివే; అవి యెంతమాత్రము వర్జనీయములు కావు. అయిన నవి కొంతమట్టుకు పరిశుద్ధ వాతావరణమును కలిగించునవి యయినను, భావికాల సుఖప్రదాయకములైనను, అవి మాత్రము ప్రయోజనకారులు కాజాలవు. మార్గమును ప్రవేశించ గోరువారు తమ తమ సర్వభావములను[1] వివేకపూర్వకముగ నుపయోగించవలెను. ప్రతిమానవుండును దనకు దానే మార్గము, సత్యము (ధర్మము,)

[1] జ్ఞాన, ఇచ్ఛా, క్రియా భావములు, దేహ, ఇంద్రియ, మనో, బుద్ధి భావములు.

అనుష్ఠానము. తనయొక్క "అహం[1]" అను భావము నంతయు దృఢముగ గ్రహించి, ప్రబుద్ధమైన యధ్యాత్మ నిశ్చయ బలముచే నీ యహంభావము తానుగాదని యు, అయితే ప్రయాసతో దన యుపయోగము కొఱకు దాను నిర్మించుకొనినదే యనియు, దాను బెఱుగు కొలదియు, దన బుద్ధికుశలత మెల్లమెల్లగ నభివృద్ధియగు చురాగా, అహంభావ అతీత దశను జెందించుటకు దానిని సాధనముగ జేసికొనుటయే తన యుద్దేశ్యమని యు దెలిసికొనినప్పుడు తానట్లు కాగలడు. ఇందుకొఱకే విచిత్రమైనట్టియు దురవగాహమైనట్టియు తన ప్రవిభక్త జీవిత మేర్పడి యున్నదని తెలిసికొనినపుడే వాడు మార్గ మునందు బ్రవేశించిన వాడగును. గూఢమైనట్టియు తేజోవంతమైనట్టియు నీ యంతరాత్మయందు లోతున దిగి దానిని వెదకుము. (నీ) అనుభవము నంతటిని బరీ క్షించుటవలనను, నీ సకలేంద్రియములను ఉపయోగిం చి, అహం అను భావ మెట్లు పెఱుగును, ఎట్లు ప్రయోజనకారి, అను విషయములను, మఱియు సజాతీ

[1] భిన్నభావము, నేను వేఱు అని తలచుస్థితి. సమష్టికి వ్యతిరేక మైన వ్యష్టిభావము. విజ్ఞానమయకోశాభిమాన జీవస్థితి, అనగా కర్తృత్వ భోక్తృత్వాభిమానస్థితి.

యులై నీతోఁగూడ శ్రమపడుచు నీతోఁగలిసి మానవ జాతియైయుండు, ఇతర ఈశ్వరాంశములయొక్క రమ్యత్వమును బ్రచ్ఛన్నత్వమును దెలిసికొనుటవలనను, దానిని వెదకుము. అధ్యాత్మిక తత్త్వములను, మఱియు దృశ్యాదృశ్య ప్రకృతి ధర్మముల బరిశీలించుటవలన దాని నన్వేషించుము. నీలోపల మందప్రకాశముతో వెలుగుచుండు నక్షత్రమునకు ఆత్మ సమర్పణ పూర్వక బ్రణిపాతము చేయుటవలన దానిని వెదకుము. నిలకడతో నీవు కాచుకొని పూజించుచుండగా దాని ప్రకాశము బలవత్తరమగును. అప్పుడు మార్గముయొక్క ప్రారంభమును గనుగొంటినని నీవు తెలిసి కొనవచ్చును. దాని యంతమును నీవు కనుగొని నప్పుడా వెలుగు హఠాత్తుగ ననంతజ్యోతియగును.

టీక

అనుభవముల నన్నిటిని బరీక్షించుటవలన దానిని వెదకుము; ఇట్లు చెప్పుటవలన "దానిని దెలిసికొనుటకై ఇంద్రియములయొక్క దుష్ప్రేరేపణకు లోబడవలెను" అని నేను జెప్పలేదని స్మరించుము. నీవు గుప్తవిద్యా సాధకుడవగుటకు బూర్వ మట్లు లోపడవచ్చునేమో గాని పిమ్మట గూడదు. నీవు నిశ్చయించుకొని మార్గమును బ్రవేశించిన పిదప ఈ దుష్ప్రేరేపణలకు లోబడెదవేని యవమానము కలుగక పోదు. అయినను వెఱగందక వాని ననుభవించవచ్చును. వానిని బా

గుగ నాలోచించి, పరిశోధించి, పరీక్షించి, అవి నిన్నెంతమాత్రము బాధించజాలని కాలము వచ్చుననను నమ్మకమువలన గలుగు నోర్పుతో గాచుకొని యుండదగు. అయితే వానికి లోబడిన మనుష్యుని నిందించవలదు. వాడు బురదలో జిక్కుపడి పాదములు బరువైన నీ సరి బాటసారియని యెంచి వానికి చేయిచాచి కైదండయొసగుము. ఓ శిష్యుడా! మంచివానికిని బాపాత్మునికిని విశేష. భేదముండినను ఆ మంచివానికిని జ్ఞానప్రాప్తి యయిన వానికిని అంతకంటె హెచ్చుభేదముండును. మంచివానికిని మోక్షసామీప్యముననుండు వానికిని గల భేదము నెన్న శక్యముకాదు. కనుక అతి శీఘ్రముగా [1] జనసామాన్యమున కతీతుడవని నీవు తలచెదవేమో జాగ్రతగా నుండుము. మార్గము యొక్క మొదలును గనుగొనినప్పుడు నీ యాత్మయను నక్షత్రము తన వెలుగును జూపును. ఆ ప్రకాశమువలన నది యెంత చీకటిలో వెలుగుచుండునది నీవు కనుగొనెదవు. తొలి గొప్ప యుద్ధములో జయమునొందువఱకు మనస్సు, హృదయము, మెదడు, ఇవి యన్ని యు బ్రచ్ఛన్నముగను జీకటిగ నుండును. చూచి విషాదము జెందకుము; వెఱగందకుము. చిన్న వెల్తురు పైన దృష్టియుంచి యుండుము. అప్పుడది వృద్ధియగును. వెల్తురును జూడనట్టియు, మిక్కిలి యంధకారములో నుండు నట్టియు జీవాత్మల దౌర్బల్యమును దెలిసికొనుటకు నీలోని చీకటి నీకు సహాయమగుగాక. వారలను నిందించవలదు. వారలనుండి తొలగిపోవలదు. అట్లుచేయక ప్రపంచము యొక్క కర్మభారమును గొంచెము తగ్గించ బ్రయత్నించుము. అసురులకు సంపూర్ణజయము కలుగకుండ ఆపుచుండెడి యల్ప సంఖ్యులగు

[1] పక్వము కాకమున్నే.

బలశాలురకు నీ సహాయము నిమ్ము. అప్పుడు నీవు వారితోడ ఆనం దానుభవదశను ప్రవేశించెదవు. అది గొప్ప కష్టమును విశేషదుఃఖ మును గలుగ జేసెడివి. అయిన నది సదా ప్రవర్ధమానమగు మహత్సుఖ మును గూడ గలుగజేయును.

---

మొదటి 8 సూత్రములవలన వర్జనీయములైన దోషములును, పిమ్మట 8 సూత్రములవలన సంపాదించవలసిన సుగుణసంపత్తియును బోధించి, యిప్పుడు 17-18-19 మూడు సూత్రములవలన మోక్షమార్గాన్వేషణ ము చేయుమని బోధించబడుచున్నది. 20 వ సూత్రము ఈ మూడు సూత్రములకు వ్యాఖ్యానసూత్రము. 17 వ సూత్రమునకును 20 వ సూత్రమునకును హైలేరియన్ అను ఋషి టీకను వ్రాసియున్నారు. మొదటి 16 సూత్రములు మోక్షమార్గము ప్రవేశించుటకుముందు సాధించవలయు యోగ్యతలను దెలుపుచున్నవి. ఆ మార్గలక్షణములు, నందలి కష్టములు, సిద్ధిపొందు విధములు, 17 వ సూత్రము మొదలు గ్రంథాంతమువఱకు విచారించబడియున్నవి.

17 వ ప్రాచీనసూత్రము టీక

"ఈ మాటలు (అనగా మార్గాన్వేషణము చేయుము అనునవి) ప్రత్యేక సూత్రముగ నుండుటకు మిక్కిలి యల్పమైనవిగ గన్పడ వచ్చును గాబోలు. 'నేను మార్గాన్వేషణము చేయని వాడనైతి నేని యీ భావములను ఎన్నడైనను గమనించి యుందునా?' అని శిష్యుడు తలచ వచ్చును. అయిన (నీ సూత్రమును) వేగిరపడి దాటి పోవలదు. కొంత తడవు నిల్చి యోచించుము. మార్గమును నీవు

కోరుచున్నావా? లేక నీవారోహించదగు ఉన్నత స్థానములును, భావికాలమున నీవుపొందగల గొప్పపదవియును, నీదృష్టికి నల్ప ముగనైనను గోచరమైనవా? హెచ్చరిక సుమా—మార్గమును దాని కొఱకే అన్వేషించ వలెను గాని దాన నడువబోవు నీపాదముల కొఱకు కాదు.''

మోక్షమార్గమును బ్రవేశించుటకు స్వలాభ మేరూపముననైన నుద్దేశముగ నుండగూడదని యీ వాక్యములు చెప్పుచున్నవి. ఆరంభ మునుండి తుదివఱకు నెద్దియో యొకవిధమున స్వార్థచింతన యుండు ను. తొలుత విషయభోగవిత్తాదులు, మఱియు స్వర్గలోక సుఖాను భవము, జన్మాంతర సుఖవృద్ధి, ఇట్లనేకవిధములుగ మనుష్యుని బంధించుచుండును. ఇవియన్నియు నశ్వరములని తెలిసికొని శాశ్వ త్సుఖాపేక్షను గోరి మోక్షమార్గమును బ్రవేశించును. ఈ కోరిక సైతము బంధించునని యిదివఱకే వ్రాయబడెను.

అన్యచ్ఛ్రేయోఽన్యదుత ప్రేయస్తే
ఉభే నానార్థే పురుషం సినీతః ॥ (కఠ. ఉప)

కేవల మోక్షాపేక్షసంకల్పో బంధః ॥ (నిరాలంబోపనిషత్)

ఇట్టి యతిసూక్ష్మమైన మోక్షేచ్ఛను వదలినను, అహంకారము మఱి యు సూక్ష్మతరమైన రూపమున నావిర్భవించ వచ్చును. తనకు మోక్షము కావలెనని కోరనివాడు లోకసంగ్రహార్థము పాటుపడును. అందులో సయితము అహంకారముండ గూడదు. ''నేను బెక్కు జనులకు సహాయము చేయువాడనైతిని; నేను గొప్పగా నీశ్వరకార్య మునకు దోడ్పాటగువాడ నగుదును; లోకముల నుద్ధరించెదను;

ఈశ్వరునికి మిక్కిలి సాన్నిధ్యమున నుండగలను." అని యిట్లు సంకల్పించి మోక్షమార్గాన్వేషణము చేయవచ్చును. ఇది మిక్కిలి గొప్ప యుద్దేశమే. శ్లాఘ్యమైనదే. అంతకంటే గొప్పయుద్దేశ ముండనేరదు. ఈశ్వరానుగ్రహమును బొందుటకు, ఈశ్వరప్రసాదమును బడయుట కింతకన్న శ్రేష్ఠతరమైన మార్గము లేదు. అయితే ఇందులోను 'నేను' అను భావ ముండగూడదు. లోకసంగ్రహార్థము ఈశ్వరార్పణబుద్ధితో బనిచేయుచుండిన నీశ్వరప్రసాదముచే శాశ్వతపదమును బొందునది నిశ్చయమే.

> సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
> మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥
>
> (భ. గీ. 18-56)

సర్వకాలములయందు సర్వకార్యములను నన్నాశ్రయించిచేసిన నా ప్రసాదముచే శాశ్వత పదమును బొందును.

అయితే ఆప్రకారము చేయవలసినది మన ధర్మమేకాని "ఆ ప్రసాదము నాకు గల్గును, నేను శాశ్వతపదమును బొందుదును" అని తలచుచుండగూడదు. 'నేను,' 'నాకు,' 'నాది' అని ఎంత కాలమువఱకు నేరూపముననైన జింతించుచుండునో అంతవఱకు నహంకార మండలవర్తియై యుండునేకాని నిజమైన మోక్షమును బొందినవాడు కానేరడు. ఎద్ది కర్తవ్యమో అది యనుష్ఠేయము. దాని ఫలము తనంతట దానే వచ్చును. వచ్చునో రాదో అను విచారము మనకుండగూడదు. ఈశ్వరసాధర్మ్యమును, ఈశ్వరభావమును బొందినవాడు స్వాభావికముగనే లోకసంగ్రహకర్మ చేయునుగాని

అందువలన దనకు గలుగబోవు ఫలము నుద్దేశించికాదు. ఈశ్వరభావ ము నొందువారి కెట్టి సూక్ష్మతమమైన రాగమునైత ముండగూడదు. వారీశ్వరమయులు, అనగా ఈశ్వరస్వభావ మెట్టిదో వారి స్వభావ మట్టిదే యగును. సర్వమలములను బోగొట్టుకొని పరిశుద్ధులైనవారు.

వీతరాగభయక్రోధాః మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥

(భ. గీ. 4-10)

ఇట్లీశ్వరమయులు కావలెనని ధృడసంకల్పము చేసినవారు, అనగా సర్వభావములచేత నీశ్వరధర్మమే తమధర్మముగ నుండవలెనని సంక ల్పించినవారు, "నేను గొప్పపదవిని బొందవలెను" అని తలచజాలరు. ఎందువలన నన, 'నేను' అనుభావముండు నంతవఱకు సర్వభూత ఏకీ భావము కలుగనేరదు. ఆ ఏకీభావమును బొందువఱకు నీశ్వరసా ధర్మ్యము, ఈశ్వరభావము బొంద సాధ్యముకాదు. కావున "మోక్షమార్గాన్వేషణము చేయుచున్నానని మోసపోవలదు. హెచ్చ రిక. ఎంత సూక్ష్మమైన రూపమునగాని, నీయుద్దేశములో నహం కారమును జేరనియ్యవలదు. సంసారమార్గమును వదలి మోక్షమార్గ మును బ్రవేశించుట కర్తవ్యమని ప్రవేశించవలయునేకాని ప్రవేశించిన పిదప నెట్టిఫలము లభించునో లభించకపోవునో అను చింతయే నీ కుండగూడదు. ఇది సులభమైనదని తలచవలదు. ప్రతిమెట్టునను వివేకముతో పరిశీలించుచు ననుష్ఠించుచుండవలెను" అని ఈ సూత్రే మన్వేషికి హెచ్చరిక చేయుచున్నది.

"ఈ సూత్రమునకును రెండవభాగము పదునేడవ సూత్రమున కును సంబంధము గలదు. బహుకాలము పోరాడి యనేకసార్లు

జయించి కడపటి యుద్ధమునందు విజయమునొంది చరమరహస్యమును దెలియగోరిన నప్పుడు అవల నడునపలసియుండు మార్గమునకు (యోగ్యత గలిగి) సిద్ధముగనుందువు. ఈ మహాబోధయొక్క చరమ రహస్యార్థము చెప్పబడినప్పుడు, అందులోనే (మఱియొక) క్రొత్త మార్గరహస్యము వ్యక్తమగును."

ఈ సూత్రములవలన దెలియదగిన విషయము లెవ్వియన:—

మనము దేహతాదాత్మ్యము చెంది ఇంద్రియములను మనస్సును వశపరచుకొనలేక కామక్రోధాదులకు లోబడి ఆత్మతత్వజ్ఞానము పొంద నేరని వారముగ నున్నారము. ఆత్మజ్ఞాన ప్రతిబంధకములైన కామక్రోధాదులు సులభముగ బోవునవి కావు. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అను వానిని తన స్థానములుగ జేసికొని కామము, ఆత్మనిష్ఠాపరుని నడ్డగించు శత్రువు.

ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్యదేహినం ॥ (భ. గీ. 3-40)
విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥ (భ. గీ. 3-37)

ఈ యధిష్ఠానములు సయితము బలవంతములే. మొద లింద్రియ జయము కావలెను.

తస్మాత్త్వం ఇంద్రియాణ్యాదౌ నియమ్య ॥ (భ. గీ. 3-41)

అవి యెట్టివియన:—

యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥
(భ. గీ. 2-60)

తెలివిగల్గి నియమించ బ్రయత్నించు పురుషునినైన నింద్రియములు బలవంతములు కావున వాని మనస్సును బలాత్కారముగ హరించును.

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ॥

(భ. గీ. 2-67)

చరించు ఇంద్రియములకు లోబడు మనస్సుగలవాని ప్రజ్ఞ నీటిలోని నావ గాలివలన హరించబడునట్లు హరించబడును.

ఇకను మనస్సు ఎట్టిది యన:—

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం ।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరం ॥

(భ. గీ. 6-34)

మనస్సు చలించునట్టిది, వంగనిది, బలవంతమైనది, దృఢమైనది, వాయువును నిగ్రహించుట యెంత కష్టమో దానిని నిగ్రహించుట అంతకష్టము. అయినను

అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥

(భ. గీ. 6-35)

ఆ మనస్సు అభ్యాస వైరాగ్యములవలన నిగ్రహించబడును.

క్రిందిమెట్టునందు రాగమును వదలుచు పైమెట్టును సాధించుట కభ్యసించుచు రావలెను. ఇంద్రియములను మనస్సును జయించినను బుద్ధిరూపమున కామ మడ్డగించును. అచ్చట కామము మిక్కిలి సూక్ష్మరూపమున నుండును. సత్త్వగుణరూపమున నుండును. సుఖ

జ్ఞానసంగములచే సత్వగుణము బంధించును. నా కెట్టిసుఖ మవశ్యకము లేదు, ఈశ్వర కార్యముచేయుటయే నాకు సుఖము, నాకు పాండిత్యము వలదు, గౌరవము వలదు. ఈశ్వర తత్వజ్ఞానమెఱిగి, ఈశ్వర సంకల్పమును తెలిసికొని, తదనుప్రవర్తకుడనై యుండుటయే నా స్వభావముగ నుండవలెను అని తలంచుచు జ్ఞానసుఖముల యందు వైరాగ్యముకలిగి లోకసంగ్రహకర్మ అభ్యసించుచు రాగా బుద్ధ్యాశ్రయమైన కామశత్రువును జయించ గల్గుదుము.

అట్లు బలవంతములైన స్థానముల నాశ్రయించుకొనియుండు బలవంతమైన కామశత్రువును జయించుట సులభమైన కార్యముకాదు. అందువలన సూత్రములో "బహుకాలము పోరాడి అనేకసార్లు జయించి కడపటి యుద్ధమునందు విజయమునొంది" అని చెప్పబడియున్నది. అనేకసార్లు జయించుట యనగా ఆ కామమొకసారి యొక రూపమున గన్పడును. దానిని జయించిన పిదపయొక సూక్ష్మరూపమున బైపెట్టున గన్పడును. ఇట్లే తుదవఱకు బోరాడుచు జయించుచుండవలెను. ఇంతపోరాడి జయించిన పిమ్మట గురుసాక్షాత్కారము కల్గును. వారు రహస్యోపదేశము చేసెదరు. ఆ యుపదేశము వలన నేమి తెలియవచ్చునది ఈ సూత్రము చెప్పుచున్నది. "నా కికను బనియేమియు లేదు; నే జేయవలసిన దేమియు లేదు; సుఖముగ నుందును" అని ప్రతియొక్కడనుకొనవచ్చును. అయితే చరమరహస్యబోధవలన నే నిక సుఖముగ నుందునని తెలియవచ్చుట లేదని ఈ సూత్రము చెప్పుచున్నది. జ్ఞానమున కంతములేదు. అనగా తెలిసికొనవలసిన విషయము శేషించియే యుండును. కర్తవ్యమున కంతములేదు. చేయవలసినది శేషించియే యుండును. భగవంతుడును

భగవత్సంకల్పము నెఱింగిన ఋషులును మాకికను జేయవలసిన పని యేమియు లేదని తలచి యిన్నక యుండరు.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ (భ. గీ. 3-22)

నాకు మూడు లోకములయందును జేయవలసిన దేమియు లేదు. పని చేసి నేను బొందవలసిన దేమియు లేదు. అయినను నేను బనిజేయుచునే యున్నాను.

ఎందుకు?

మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ।
(భ. గీ. 3-23)

అన్నివిధములచేత నా మార్గమును మనుష్యు లనువర్తించుచున్నారు.

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః । (భ. గీ. 3-21)

శ్రేష్ఠు లెట్లు వర్తింతురో యితరు లట్లు వర్తింతురు.

అనగా తమను జూచి అజ్ఞానులు వర్తించుకొనుటకై జ్ఞానులు, పెద్దలు, ఉత్తమ మార్గమును దామనుష్ఠించి వారికి దోవ జూపి వారల నుద్ధరించవలెను. నా కేమియు పనిలేదని తలచరాదు. కావున ఋషులు,

తీర్ణాస్స్వయం భీమ భవార్ణవం జనా
నహేతునాఽన్యానపి తారయంతః ॥

తాము భయంకరమైన సంసారసాగరమును దాటియు నితరులను దాటించుకొఱకై మహాత్ములు ప్రపంచములో నిల్చియున్నారు.

ఇకను దెలిసికొనవలసిన విషయములు మనకు భూలోకవిషయములే అనేకము తెలియనవి యున్నవి. గొప్ప భౌతిక శాస్త్రజ్ఞులు (Scientists) సయితము మఱియు మఱియు విచారముచేయుచు శోధించుచు గ్రొత్త క్రొత్త విషయములను గనిపెట్టుచున్నారు. ఒక్కొక్క లోకము దానిపైలోకములో నోతప్రోతమై యుండును. భువర్లోకము, సువర్లోకము, మఱియు బ్రహ్మలోకమువఱకు యోగమార్గమున నా యా లోకప్రజ్ఞను బొంది యా యా లోక విషయములను దెలిసికొనవలసి యుండును. ఈ బ్రహ్మాండములోని బ్రహ్మలోకమే కాదు. అనేకకోటి బ్రహ్మాండము లున్నవి.

> అస్య బ్రహ్మాండస్య సమంతతః స్థితా న్యేతాదృశాన్యనేక
> కోటిబ్రహ్మాండాని సావరణాని జ్వలంతి ॥

ఈ బ్రహ్మాండముచుట్టు ఇటువంటి బ్రహ్మాండము లనేకకోట్లు ఆవరణములతో గూడి ప్రకాశించుచున్నవి.

> సంఖ్యాచేద్రజసామస్తి విశ్వానాం న కదాచన ।
> బ్రహ్మవిష్ణుశివాదీనాం తథా సంఖ్యా న విద్యతే ।
> ప్రతివిశ్వేషు సంత్యేవ బ్రహ్మవిష్ణుశివాదయః ॥
>
> (దేవీభాగవతము)

ఇసుకరేణువులనైనా లెక్కపెట్టవచ్చును గాని బ్రహ్మాండము లిన్నియని గణించుట యసాధ్యము. బ్రహ్మలు, విష్ణువులు, శివులు, ఎంతమంది యుండునది లెక్కపెట్ట దుర్లభము. ప్రతి బ్రహ్మాండమునకు బ్రహ్మ, విష్ణు, శివాదులుండనే యున్నారు.

ఒక్కొక్క లోక తత్వజ్ఞానము నొందుచు బ్రహ్మాండనాయకుని తత్వమునెఱింగినను మఱియు గొప్పదియగు బ్రహ్మాండమునకు ప్రభువులగు బ్రహ్మ విష్ణు శివుల తత్వ మెఱుగవలసి యుండును. ఒక బ్రహ్మాండనాయకుని పదవిని బొందుటకే బహు జన్మములెత్తి సిద్ధి పొందవలసి యుండును. ఆ బ్రహ్మాండనాయకులైన ఈశ్వరులు సయితము ఆ స్థానములకు దపస్సుచేత వచ్చిరనియు మఱియు, నున్నత స్థానమునకు బోవలసి యుండుననియు మన గ్రంథములలో జెప్పబడి యున్నది. ఈశ్వరపదవి బొందినపిదప సయితము జ్ఞాతవ్యము లుండగా మనమికను జేయవలసినదేమియు నుండదని తలచుట సరికాదు. అనేకకోటి బ్రహ్మాండనాయకుడైన సగుణ బ్రహ్మసేవ ఏ బ్రహ్మాండములో నే భాగములోనైనను నే రూపముననైనను మనము చేయవలసి యుండును. ప్రతి మెట్టునందును మనకన్న గొప్పవారల సహాయము బొందుచూ మనకన్న దక్కువ మెట్టున నుండువారికి సహాయము చేయుచు వారిని నీశ్వర సన్నిధానమునకు బోవుమార్గమునందొక సోపానమునైన నెక్కించుచు లోకసంగ్రహ కర్మానుష్ఠాన రూపమైన సేవచే నీశ్వర ప్రసాదము బొందదగును. మఱియు నెక్కుడుగ సేవచేయుటకు సమర్థతను సంపాదించుచుండవలయునే కాని చేయవలసినపని ముగిసినదని తలచగూడదు. అయితే ప్రతిమెట్టునందును నప్పటి లోపములను బోగొట్టుకొనినగాని పై మెట్టుజ్ఞానము కలుగనేరదు. క్రింది మెట్టుయొక్క చరమరహస్యము తెలిసికొనిననే మఱియు బైమెట్టుకు బోవుమార్గము తెలియబడును. ఆ మార్గ రహస్యమే "మఱియొక క్రొత్తమార్గ రహస్యము" అని సూత్రములో జెప్పబడిన రహస్యము.

కర్తవ్యమున కంతములేనియెడల సదా విశ్రాంతిలేక పని చేయుట సాధ్యమా, అలసట జెందరా, ఆయాసము కలుగదా అని సంశయము కలుగవచ్చును. స్థూలశరీరమున కలసట కలుగునది నిజమే. అయిన నా శరీరముతో నద్భుతముగ బని చేయువారిని జూచుచున్నాము కదా. ఇందుకు దివ్యజ్ఞానసమాజాధ్యక్షురాలగు అనీ బెసంటమ్మగారిని నిదర్శనముగ దీసికొనవచ్చును. ఈ దినము మదరాసు, రేపు ప్రయాణము, పిమ్మట కలకత్తా, అటు పిమ్మట సిమ్లా, బొంబాయి, ఇట్లు ప్రయాణాయాసము లేక దేశ మంతయు గ్రుమ్మరుచుందురు. రాజకీయ వ్యవహారములు, సంఘసంస్కార వ్యవహారములు, విద్యా విషయము, ఆత్మవిచారము, ఇన్ని విషయములలో నుపన్యాసముల నిచ్చుచు, బోధచేయుచు, వ్యాసములు వ్రాయుచు, సంభాషించుచు, సకల దేశములనుండి వచ్చు వారికి బోధించుచు, వ్రాయువారికి బ్రత్యుత్తరము లిచ్చుచు, నేమరుబాటు లేక జాగరూకులై యసమానకౌశలముతో బని చేయుచుండుట సర్వులకు వేద్యమేకదా. ఇట్లు వార్ధిక్యదశలో (77 సంవత్సరములు) బ్రవర్తించుట మఱియు నాశ్చర్యమైన విషయము. ఇంతశక్తి వారికెక్కడనుండి వచ్చినది? కొంచె మాలోచించిన దీనిరహస్యము తెలియనగును. శరీరమునందలి ప్రతి యణువును నీశ్వరునివలన నియమించబడిన పరిమితి వఱకు బని చేయు శక్తికలిగి యుండును. పూర్ణముగ నాపరిమితివఱకు బనిచేసిన నద్భుతకార్యములు నెఱవేరగలవు. అయితే, స్వప్రయోజనార్థము శరీరబలమును వినియోగించునపుడు ఈశ్వరసంకల్పమునకు వ్యతిరేకముగ నుండునందున నదీప్రవాహమున కెదురుపోవునప్పు

డెక్కుడు శక్తి వినియోగించుటయు, నలసట జెందుటయు, దట స్థించునట్లు స్వప్రయోజనబుద్ధితో నెఱవేర్చు కార్యమునకు నెక్కుడుగ నాత్మశక్తి వినియోగింపబడి దేహమున కాయాసము గలుగ జేయును. రాగద్వేష సంయుక్తమగునపుడు అణువుకు ప్రామాణిక చలనశక్తి తగ్గి తామసచలనము (Low rate of vibration) కల్గినదై యుండును. తామసగుణప్రధాన అణువును బనికి ప్రేరేపించవలెనన నాత్మశక్తి యెక్కుడుగ వినియోగించవలసియుండును. తన్మూలమున దేహమున కలసట కలుగుట సహజమే. నచికేతసునికి యముడు ఇహపరలోకసంబంధములగు గొప్ప భోగముల (ధనకనక వస్తువాహనాదులు, చిరాయుష్మంతులైన పుత్రపౌత్రాదులు, సార్వభౌమత్వము, రథతూర్యనినాదములతో నప్సరస పరిచర్య) నిచ్చెదనని చెప్పిన నందుకు నచికేతసుడు తన కవియున్నియు వలదని యీ యద్భుత వాక్యమును నుడివెను.

> శ్వోభావా మర్త్యస్యయదంతకైతత్
> సర్వేంద్రియాణాం జరయంతి తేజః ।
> అపి సర్వం జీవితమల్పమేవ
> తవైవవాహాః తవనృత్య గీతే ॥ (కఠ. ఉప)

"ఓ యముడా! నీవు నాకివ్వదలచుకొన్న దంతయు నశ్వరము. సకలేంద్రియముల తేజస్సును జీర్ణముచేయును. జీవితమంతయు నల్పమేను. వాహనములు నృత్యగీతములు నీకే యుండనిమ్ము (నాకు వలదు)".

ఇచ్చట భోగేచ్ఛ ఇంద్రియముల తేజస్సును క్షీణింపజేయుచున్నదను మాటను ముఖ్యముగా గమనించవలెను. ప్రతియింద్రియము

ఈశ్వర కార్యమును నెఱవేర్చుట కేర్పడియున్నది. ఈశ్వరసంకల్ప మున కనుగుణము కాని చందమున వినియోగించినయెడల బైనజెప్పిన విధమున, నెక్కుడుగ నాత్మశక్తి వినియోగమగుటం జేసి తేజస్సు క్షీణించును. అట్లుకాక ఈశ్వర ప్రీతిగా ఈశ్వర కార్యముగా సంగఫలాభిసంధిరహితముగా బనిచేయునపుడు శరీరములోని యణు వులు వాని యాదిశక్తి పరిమితిని సమీపించుచూ తీవ్రచలనము (Rapid vibration) గలవిరై వర్తించును. అప్పుడు నదీప్రవాహ మునకు దోడు నడచిన నాయాస రహిత మగునట్లు ఆయాసము కలుగదు. మఱియు, గీడు బాహ్యమునుండి రాకుండునట్లు రక్షగా సయితముం డును. ప్లేగు, కలరా జాడ్యము లుండునపుడు తన్నివారణ నిమిత్తము పోవు డాక్టర్లు (అనగా వైద్యులు) సాధారణముగ మృతిజెందుట లే దను విషయము విదితమే కదా! లోకశ్రమ నివారణార్థము వారు పోవు నపుడు ఈశ్వర సంకల్పానువర్తులుగ నుందురు కావున జాడ్య కారణము లైన క్రిమి జాతులు తీవ్రచలనములో నున్నవారి దేహములను స్పృ శించి సహింపనోపవు. కనుక వారి నేమియు జేయజాలవు. ఇదియే అలసటజెందక అసాధారణమైన పనిచేయగల్గు విషయపు రహస్యము. మిక్కిలి స్థూలమైన ఈ స్థూలశరీరముతోనే అలసట జెందక బహు గొప్ప కార్యములు చేయనోపునెడ సూక్ష్మతర సూక్ష్మతమ అణువు లతో నిర్మింపబడిన మనోమయాది కోశములతో సూక్ష్మలోకము లలో రాత్రింబగళ్లు విసుకుచెందక బహుకాలము పనిచేయుచుం డుట సాధ్యమని చెప్పనేల? ఈ దివ్యజ్ఞానసమాజ అధ్యక్షులు సూక్ష్మలోకములలో శ్రద్ధాళువులును దీనులునగు అనేకులకు వలయు సహాయ మొనర్చుచు నీశ్వరప్రీతిగ లోకసేవ చేయుచున్నారు.

ఒక జీవితకాలములోనే శ్రవణ మనన నిదిధ్యాసలవలన నొక్కొ-క్కొ కోశజ్ఞానము సంపాదించి యాయాకోశములలో బూర్ణ ప్రజ్ఞతో బనిచేయ నభ్యసించి పనిచేయగల్గినచో నాయా లోకములో బరోప కార కర్మ చేయ సమర్థత గల్గును. జనసామాన్యమంతయు భూలోక జ్ఞానము మాత్రము కలవారుగ నున్నారు. సూక్ష్మకోశములలో బూర్ణప్రజ్ఞతో బనిచేయ నేరరు. అందువలన భువరాది లోకములలో జనోపకారకకర్మ చేయనేరరు. స్థూలశరీరములోనే ఇంద్రియజ్ఞానము పూర్ణముగ లేదు. ఇప్పటికి మానవకోటియం దైదింద్రియము లైదు ప్రాణములు పనిచేయుచున్నవి. కోశములు సయితమైదు. (అన్న మయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ). అంతయు నైదైదుగనున్నవి.

పాఙ్క్తం వా ఇదం సర్వం పాంక్తే నైవ పాఙ్క్తం స్పృణోతి ॥
(తై. ఉప)

అయిదింద్రియములతో బోరాడి కడపటి యుద్ధమునందు విజయము నొంది చరమరహస్య మడుగ జెప్పబడునది యేమన: "ఇంతవఱ కైదింద్రియములని తలచుకొని యుంటివి. మఱియు రెండు గలవు. వాని రహస్యమే యికను దెలిసికొనవలెను. అయిదింటిని జయించిన వెనుకనే ఏడింటి రహస్యము నడుగ నీకు యోగ్యత కల్గెను" అని యా రెండింద్రియముల విషయము బోధింతురు. మన గ్రంథములలో బంచ పంచ విభాగమే వెల్లడిగ జెప్పబడి యుండునది. దాని ననుస రించియే కీర్తిశేషులైన స్వామి సుబ్బరావుగారు పంచ పంచ విభాగ మే సరియని నుడివిరి. దివ్యజ్ఞానసమాజమువారే విషయమునను

భావికాలోపయోగమగు విషయములు సయితము బోధించు వారై నందునను, ఇక ముందీశ్వర సంకల్ప మేరీతిన నిర్వర్తించవలెనని తెలిసి యందుకు వలయు గ్రంథములు వ్రాసి బోధించి అభ్యాసకుల నీశ్వర సంకల్పానుప్రవర్తనకు సమర్థతగలవారుగా జేయుటయే ముఖ్యోద్దేశము గలవారైనందునను, భావికాలమునం దేడింద్రియ ములు పనిచేయుచుండును గావున వారు గురుప్రసాద లబ్ధజ్ఞానము వలనను యోగశక్తివలనను నిప్పుడు పనిచేయనివియు నికముందు పని చేయునవి యగు రెండింద్రియముల పేర్లను బ్రకటించి యున్నారు. వాని పేర్లు పిట్యూ్యటరి బాడి, పైనియల్ గ్లాండు (Pituitary body, Pineal gland). మొదటిదానిలో బనిచేయ నేర్చిన భువర్లోక ప్రజ్ఞ యు, రెండవ దానిలో బనిచేసిన సువర్లోకములో దెలివితో బనిచేయ సమర్థతయు గలుగును. ఈ రెండింద్రియములు శిరస్సునందున్నవి యని భౌతిక శాస్త్రజ్ఞులు (Scientists) అంగీకరించి యున్నారు. అయితే అయ్యవి రూడిమెంటిరీ అర్గన్సు (Rudimentary Organs అనగా ప్రకృతమం దుపయోగము లేనివి) అని యభిప్రాయ పడియున్నారు. యోగశక్తివలన వానిని బ్రబుద్ధముజేసి పని చేయ వచ్చునని యీ భౌతిక శాస్త్రజ్ఞులకు దెలియదు. దివ్యజ్ఞాన సమాజమువారి ద్వారా యీ యింద్రియముల యుపయోగము బయలుపడియున్నది. ఆ రెంటితో నేడింద్రియము లగుచున్నవి. అయిదింద్రియము లైదువిషయము లైదుప్రాణము లున్నట్లు సప్తేం ద్రియములైనచో సప్తప్రాణములు సప్తవిషయము లుండవలెను గదా. మన గ్రంథములలో నీ విషయము స్పష్టముగ జెప్పకపోయినను సూచింపబడియున్నది.

సప్తప్రాణాః ప్రభవంతి తస్మా
త్సప్తార్చిషస్సమిధస్సప్తహోమాః ।
సప్త ఇమే లోకా ఏషు చరంతి ప్రాణాః
గుహాశయా నిహితా స్సప్త సప్త ॥ (ముం. ఉ.)

సప్తసమిధలనగా సప్తవిషయములనిన్ని, సప్తహోమములనగా సప్త విషయవిజ్ఞానములనిన్ని, సప్తలోకములనగా సప్తేంద్రియ స్థానములనిన్ని, శ్రీశంకరాచార్యులవారు భాష్యములో వ్రాసియున్నారు[1]

ఇందువలన దివ్యజ్ఞానసమాజమువారు వ్రాసిన ప్రకారము సప్త సప్తవిభాగము సప్రమాణ మనియు, సప్తవిషయములెవ్వి, సప్త ఇంద్రియములెవ్వి అను విషయము అప్పటికాలమునకు గుప్తవిద్యగ నుండినందున భాష్యాదులలో వ్రాయలేదనన్ని, ఇప్పుడు భౌతికశాస్త్రజ్ఞులు వారి విమర్శలో బంచేంద్రియజ్ఞానము బాగుగ సాధించినందున నికను మిగిలిన రెండింద్రియముల సంగతిని దివ్యజ్ఞానసమాజమువారి ద్వారా పెద్దలు ప్రకటించి యున్నారనియు నెఱుగవలయు. ఈ సమాజమువారే Occult Chemistry అను గుప్త రసాయన శాస్త్రమను భౌతికతత్వ గ్రంథమును బ్రచురించి దానిలో భౌతికశాస్త్రజ్ఞు లింతకుమున్ను గనిపెట్టని కొన్ని తత్వములను గనిపెట్టి వానిని గుఱించి వ్రాసిరి. ఇప్పుడా భౌతికశాస్త్రజ్ఞులా తత్వములలో గొన్నింటిని

[1] సూర్యకరణములు, ఋషులు, ప్రాణములు, ఇంద్రియములు, లోకములు, విషయములు, ఇవన్నియు సప్తసంఖ్యాకములను విషయమున నిరుక్తశాస్త్రభాష్యమును జూచునది. మనస్సు, బుద్ధిచేరి సప్తేంద్రియములు గణించబడియున్నవి. కాళీకరాళ్యాది అగ్నిహోత్ర జ్వాలలు సయితే మేడు. (ముం. ఉప.)

గనిపెట్టి సమాజమువారి సిద్ధాంతము నంగీకరించిరి. దివ్యజ్ఞానసమాజము పవిత్రులును ముక్తులును జ్ఞానపూర్ణులగు ఋషులవలన స్థాపించబడియుండుటవలనను, ఆ ఋషుల ప్రసాదమును బొందినవారు యోగసిద్ధులైన వారు అధ్యక్షత్వమును వహించి ప్రముఖులై యుండ, నట్లే మహాప్రసాదమును పొందిన యితరులు వారికి దోడ్పడి పని చేయుచుండుటవలనను, నీ కాలము ననుసరించి లోకోపకారమునకు లోకపురోవృద్ధికి సహకారియగు జ్ఞానమును బోధించి ప్రకటించుచున్నారనియు, లోకసామాన్యమున కప్పటిస్థితిలో దురవగాహమైనందున వ్రాయని విషయములు మనగ్రంథములలో లేవని దివ్యజ్ఞాన సమాజమువారి బోధలను నిరాకరించ గూడదనియు ముఖ్యముగ దెలిసికొనదగియున్నది. జ్ఞానము ఒక్కటియే. అయితే దాని మూలమును బూర్ణముగ నెఱుగజాలము. క్రమక్రమమున నా యా కాల జనుల యోగ్యత ననుసరించి భగవదాజ్ఞా ప్రవర్తకులైన ఋషులవలన గొంచెకొంచెము వెల్లడి చేయబడును.

ఇట్లు స్థూలశరీరసంబంధమైన ఇంద్రియములు, విషయములు వీనిని గుఱించియే క్రమక్రమమున రహస్యము నెఱుగవలసియుండ, ఈ బ్రహ్మాండములో నన్నిలోకముల విషయము, అటుపిమ్మట ననేక బ్రహ్మాండముల విషయము, అనేక యుద్ధములలో బోరాడి కడపట జయించి రహస్యము దెలియగోర, మఱియు నెఱుగవలసిన రహస్య మున్నది, ఈశ్వరసేవచేయుటకు లోకసంగ్రహకర్మ చేయుటకు మఱియు నెక్కడవకాశములున్నవి, అని చెప్పుటయే రహస్యబోధయనిన్ని ఈ సూత్రములో బోధించబడియున్నది.

"ఆ క్రొత్తమార్గ మెట్టిది యన, సర్వమానుషానుభవముల కతీతమగు స్థితిని జేర్పించునదియు, మానవునకు సంపూర్ణముగ గోచరాతీతమైనట్టిదియు మనసాతీతమైనట్టిదియు."

ఈ సూత్రము "మోక్షమార్గము నన్వేషించుము" అని బోధించుచున్నది. ఆ మార్గమున జెందదగు పరమపదము, అందలి యానందము, అనుభవము, మన కిదివఱ కనుభవములో వచ్చినదానికి, చింతించ గలదానికి, ఊహించగలదానికి అతీతమైనదని చెప్పనేల? ఆ యానంద మనుభవించిన వారికే దాని సంగతి వేద్యమగును గాని యితరులకు జదువుట వలనగాని వినుటవలన గాని మననముచేయుట వలనగాని తెలియబడదు.

యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ ।
ఆనందం బ్రహ్మణోవిద్వాన్ నబిభేతి కదాచనేతి ॥

(తై. ఉప. ఆనందవల్లి)

ఆ యానందము సంప్రాప్తమగునప్పుడు తాననుభవించుచున్నాననుజ్ఞాన ముండనేరదు. అన్నము, తినుట, తినువాడు అను జ్ఞానము మనకు గలదు. బ్రహ్మానందము జెందినవాడు అన్న, అన్నాదుల భేదము పోగొట్టుకొని సర్వభేదజ్ఞాన రహితుడై అద్వైతానంద మనుభవించును. ఆ స్థితి యిట్లు వర్ణించబడి యున్నది.—

అహమన్న మహమన్న మహమన్నం ।
అహమన్నాదో అహమన్నాదో అహమన్నాదః ॥

(తై. ఉ. భృగువల్లి)

నే నన్నమును, అన్నము తినువాడను.

మోక్షమార్గగంతవ్య పరమపదానంద మిట్టిది యని యూహించ జాలము. అత్యంతస్వల్పముగ నూహించుట (తెలిసికొనుట కాదు) కుదాహరణ మిట్లు చెప్పబడియున్నది.—

యువాస్యాత్సాధు యువాధ్యాయకః । ఆశిష్ఠో దృఢిష్ఠో బలిష్ఠః । తస్యేయం పృథివీ సర్వావిత్తస్య పూర్ణాస్యాత్ । స ఏకో మానుష ఆనందః । తే యే శతం మానుషా ఆనందాః । స ఏకో మనుష్యగంధర్వాణా మానందః శ్రోత్రియస్య చా కామహతస్య ॥

(తై. ఉప. ఆనందవల్లి)

యౌవనము, సాధుత్వము, వేదాధ్యయనజ్ఞానము, శీఘ్రముగ గార్యము జేయుటయందు సమర్థత, అత్యంతదృఢత్వము, అత్యంతబలము, ఇట్టి సంపదలు గలవాని కశేష ధనసహిత భూమండలాధిపత్యము కలిగిన నెట్టి స్థితియో అయ్యది మనుష్యానందస్థితి యని భావించుకొనవచ్చు ననియు, నూరు మనుష్యానందము లొక మనుష్యగంధర్వానందము తో దుల్యమని భావించుకొనవచ్చుననియు, నట్లే దేవగంధర్వ, పితృ, ఆజానజదేవ, కర్మదేవ, దేవ, ఇంద్ర, బృహస్పతి, హిరణ్యగర్భ ఆనందములు పూర్వ పూర్వములకన్న నుత్తరోత్తరములు నూ అంతలు హెచ్చుగ నుండునని తలచవచ్చుననియు, ఉపనిషద్వాక్య తాత్పర్యము. మనుష్యానందమే పైన జెప్పినట్టిది యనుభవాతీత మని యే చెప్పవచ్చును. ఎందుకన గుణముచేత, యోగ్యతచేత, వయస్సు చేత, సంపదచేత, సార్వభౌమత్వముచేత, గొప్పతన మొక మనుష్యుని యందుండుట దుర్లభము. అయిన నిందొకొక్క యోగ్యత యెట్టిదైనది తెలిసియుండవచ్చును. కావున నన్నియు నొకనియందు

జేరిన నెట్లుండునని యూహించిన నూహించవచ్చును. ఇట్లూహించు టకు సాధ్యమైన మానుషానందమును వర్ణించుటకు గారణము—

"ఏష నిర్దిశ్యతే బ్రహ్మానందానుగమార్గం । అనేన హి ప్రసిద్ధేన వ్యావృత్తవిషయబుద్ధిగమ్య ఆనందో అనుగంతుం శక్యతే । లౌకికానందో బ్రహ్మానందస్యైవ మాత్రా ॥"

అని శ్రీ శంకరులవారు చెప్పిరి.

అనగా తెలిసిన ఆనందమును జెప్పిన, విషయములనుండి మఱలింప బడిన బుద్ధిచేతనే దృష్టమగు బ్రహ్మానందము, ఆ తెలిసిన యానంద మున కిన్నంతలని చెప్పిన నూహించ సాధ్యమని చెప్పబడినది. లౌకి కానందము బ్రహ్మానందముయొక్క భాగమే.

ఆనంద మొకటియే. అది పూర్ణానందము. అదియే బ్రహ్మానంద ము. ఆ పూర్ణానంద సంప్రాప్తికి నంతరాయములు కామము, అజ్ఞాన ము. (జ్ఞానము కామముతో నావరింపబడుట వలన—ఏతైః—ఇంద్రి యాణి మనోబుద్ధిభిః—విమోహయతి ఏషః—కామః—జ్ఞానమావృ త్యదేహినం—భ. గీ.). వైరాగ్యము, జ్ఞానము క్రమ క్రమముగ వృద్ధి యగుకొలదియు నానందానుభవము కొంచె కొంచెముగ వృద్ధియగును. హిరణ్యగర్భానందము వఱకు "శ్రోత్రియస్య చాకామహతస్య" అనగా, ఆయా మెట్టున, కామమును జయించిన శ్రోత్రియునకు అని ఉపనిషత్తులో జెప్పబడియున్నది. అనగా కామము తగ్గుట, జ్ఞానము హెచ్చుట. ఆ మర్యాదన, పూర్ణానందములో గొంచె కొంచె మెక్కుడుగ ననుభవములోకి వచ్చుచుండును. మహర్లోక జ్ఞానము నతిక్రమించి జనతపోలోక జ్ఞానము కల్గినప్పుడు సర్వభూతై

కల్వ మనుభవమునకు వచ్చుననియు, దత్పూర్వపు భేదజ్ఞానమునుండి అభేద జ్ఞానము కలిగినప్పుడు చెరసాలనుండి విముక్తికాబడినవాని కెట్లు సంతోషము కలుగునో అట్లు ఆనందము కలుగుననియు, ననుభవజ్ఞులు చెప్పుచున్నారు. అజ్ఞాన భేదమండల వర్తులమైన మనకు జనతపోలో కానుభవమే మననాతీతము, అనుభవాతీతముగ నుండునప్పుడు అంతకు పైస్థితి అనుభవ-గోచర-మననాతీతముగ నుండునని చెప్పనేల? సత్య లోకజ్ఞానప్రాప్తిమొదలు మోక్షప్రాప్తియనే చెప్పుదురు. ఆ స్థానము నయితము శాశ్వతమైనది కాదని తెలిసేయున్నది.

ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।
(భ. గీ. 8-16)

ఆ సత్యలోకము చేరినపిమ్మట ముక్తుడన్వేషించి ప్రాప్తించగోరు మార్గము లనేకము లున్నవనియు వినుచున్నాము.

భాగవత, ద్వితీయస్కంధ, ద్వితీయాధ్యాయ వ్యాఖ్యానములో బ్రహ్మలోకముబొందినవారికి మూడుగతులు గలవని శ్రీధరాచార్యుల వారు వ్రాసిరి—

"బ్రహ్మలోక గతానాం త్రిధా గతిః (1) యే పుణ్యోత్కర్షేణ గతాః తే కల్పాంతరే పుణ్యతారతమ్యేన అధికారికాభవంతి, (2) యే తు హిరణ్యగర్భాద్యుపాసనాబలేన గతాః తే బ్రహ్మణా సమా ముచ్యంతే, (3) యే భగవదుపాసకాః తే స్వేచ్ఛయా బ్రహ్మాండం భిత్త్వైవ వైష్ణవం పదం ఆరోహంతి."

దివ్యజ్ఞానసమాజమువా రేడుగతులను వర్ణించియున్నారు. (1) ధర్మ కాయమను శరీరముతో నిర్వాణసుఖము ననుభవించుట. వీరేమిపని

చేయుదురో తెలియరాదు. భావికాలమం దవతార పురుషులుగ రావచ్చునని యూహింపవచ్చును. (2) నిర్మాణకాయమను శరీరముతో దపస్సుచేయుచూ ప్రపంచములో బ్రహ్మతేజస్సు నింపుట. లోకసంగ్రహకర్మ చేయువారందఱకీ తేజస్సు సహాయమై కర్మచేయను బలము నిచ్చును. (3) అధికారిక పురుషుడు కావచ్చును. (4) మఱియొక మన్వంతరములో సృష్టివిధానమునకు దోట్పాటు కానచ్చును. (5) దేవగణములో జేరవచ్చును. (6) సంభోగకాయమను శరీరముతో నాధ్యాత్మిక విషయమున కాలము గడుపవచ్చును. (7) ఈశ్వరకార్యమెచ్చట జరగవలసియున్న నచ్చటికి బోవుటకు సిద్ధముగ నుండుట.

ఇవన్నియు నిజముగ మన కనుభవాతీతములు, గోచరాతీతములు, మనసాతీతములని నిస్సందేహముగ జెప్పవచ్చును.

"ఈ (శ్రేణికయొక్క) పర్వములలో బ్రతిదానియందును బహుకాలమునిల్చి బాగుగయోచించుట యావశ్యకము. ప్రతియడుగునందును మార్గము దానికొఱకే కోరబడుచున్నదని మనస్సు నిశ్చయము చేసికొనుట యావశ్యకము".

పైమెట్టుకు బోవుకొలదియు స్వప్రయోజనబుద్ధి యెద్దియో యొక సూక్ష్మరూపమున నుండును. ఎంతగొప్పదశలోనైనను గార్యము చేయుటయందు మనకు గల యుద్దేశమును జక్కగ గఠినముగ నిష్పక్షపాతముగ బరీక్షించి చూడవలెను. నేను బరోపకారబుద్ధితో జేయువాడనని తొందరపడి భావించవలదని టీక చెప్పుచున్నది. బాగుగ నాలోచించి మన యుద్దేశము (Motive) నిర్మలముగ నున్నదా, ఇప్పుడనుష్ఠించుచుండు మార్గమునకన్న బైమార్గము ననుష్ఠించనా యుద్దేశ మెద్ది, నాకేమైనను మేలు కలుగునని యుద్దేశమున్నదా,

స్వంతమునకు మోక్షము కావలెనని కోరుట సయితము అతిసూక్ష్మమైన స్వలాభేచ్ఛయేకదా, ఈశ్వరసేవకు గొఱంతయేకదా, కేవలమీశ్వరాజ్ఞాపరిపాలనకేకదా నేను శ్రోత్రరహస్యమును దెలిసికొనవలెను—అని బాగుగ నాలోచించి ఎంత గొప్పమేలైనను స్వంతమునకు గోరక యీశ్వరసేవయే కర్తవ్యమని భావించి శ్రోత్ర శ్రోత్ర రహస్యమును దెలిసికొనుకొలదియు నెక్కుడుగ సేవచేయనోపుదు మని మార్గము నన్వేషించి యనుష్ఠించవలెనని టీకాకారుల తాత్పర్యము.

"మొదట, మార్గము (Way), పిమ్మట ధర్మము లేక జ్ఞానము (Truth), పిదప దదనుష్ఠానము (Life)."

మార్గ మన సాధనము. ధర్మ మన సాధనవలన సాధింపబడిన జ్ఞానము. ఆ జ్ఞానమున బొందిన యానందానుభవము. దాని నీశ్వరసేవకై వినియోగించుటయే తద్ధర్మానుష్ఠానము. సామగ్రులసేకరించుట, అన్నము జేపికొనుట, దానివలన దేహపుష్టినిబొంది లోకసంగ్రహ కర్మానుష్ఠానమునకు వలయు బలమును బొందుటకై దానిని భుజించుట, ఈ మూటిని నుదాహరణములుగ దీసికొనవచ్చును. పైయానందమీమాంసలో అకామహతత్వమును మార్గముగను, శ్రోత్రియత్వము జ్ఞానముగను, అనుభవించునది యానందముగను భావించవచ్చును. క్రిందిమెట్టు జ్ఞానము ననుష్ఠించుటచే పైమెట్టుమార్గ మగుపడును. కావున నీమూడు నెల్లప్పటికి నన్వయించుచునే యుండును. మొదటిమెట్టు వైరాగ్యాది సాధనము, తజ్జన్యజ్ఞానము, లభించిన జ్ఞానానుసార మీశ్వరసేవ; దానరెండవమెట్టు సాధన గోచరమగును. తజ్జన్యజ్ఞానము తదనుష్ఠానము మూడవ మెట్టు సాధనమును జూపించును. ఇట్లే సర్వత్ర అనుష్ఠేయము.

17 వ సూత్రములో మార్గాన్వేషణము చేయవలెనని చెప్పి 18–19 సూత్రములలో నా యోగమార్గముయొక్క విధానములు చెప్పబడు చున్నవి.

18 వ ప్రాచీనసూత్రము

"లోపలికి మఱలినవాడవై మార్గాన్వేషణము చేయుము"

9 వ ప్రాచీనసూత్రములో "నీలోపలనుండుదానినే కోరుము" అనియు, మోక్షమార్గమును ప్రకాశింపజేయు జ్యోతి నీలోపల నున్నది, దాని నీలోపల గనుగొన నేరవేని యొండొకచోట గనుగొన జాలవని 12 వ వ్యాఖ్యాన సూత్రములోను, బోధించబడియున్నది. ఆ విషయము లాయాసూత్రముల క్రింద విచారించబడెను. లోపల నుండెడి యాత్మజ్యోతిని గనుగొనుటయే యోగసిద్ధి యనబడును.

అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో ।
యం పశ్యంతి యతయః క్షీణదోషాః ॥ (ముం. ఉ.)

ప్రయత్నము చేసి దోషములను క్షీణింపజేసికొనినవారు తమ లోపల నుండెడి శుభ్రమగు నాత్మజ్యోతిని గనుగొందురు.

కామమను మలమువలన నాజ్యోతి కప్పబడి మన కగోచరముగ నున్నది.

ధూమేనావ్రియతే వహ్నిః యథాదర్శో మలేన చ ।
. . . . . . . . . . . . తథా తేనేదమావృతం ॥ (భ. గీ. 3–38)

మంట పొగవలనను, అద్దము మాలిన్యమువలన నెట్లు కప్పుకొనబడి ప్రకాశింపనేరక యున్నవో అట్లే ఆత్మజ్ఞానము కామముచే నావరించబడియున్నది.

ఈ కామమునకు నింద్రియములు, మనస్సు, బుద్ధి యధిష్ఠానములు.

ఇంద్రియేభ్యః పరం మనో మనసస్సత్త్వముత్తమం ।
సత్త్వాదధి మహానాత్మా మహతోఽవ్యక్తముత్తమం ॥
అవ్యక్తాత్తు పరః పురుషో వ్యాపకోఽలింగ ఏవ చ ।
యజ్జ్ఞాత్వా ముచ్యతే జంతుః అమృతత్వం చ గచ్ఛతి ॥

(క. ఉప.)

ఇట్లొకదానికన్న నొకటి పరమని చెప్పుటకు గారణము పరమగు దాని నధిష్ఠానముగ జేసికొని దానికన్న గ్రిందిదానిని వశపరచుకొన వలెనని.

"యత్పదం గంతవ్యం తస్య ఇంద్రియాణి స్థూలాన్యారభ్య సూక్ష్మతారతమ్యక్రమేణ ప్రత్యగాత్మతయా అధిగమః కర్తవ్యః" అని శ్రీ శంకరాచార్యులు చెప్పిరి.

యోగశాస్త్రప్రకారము "ఇది నేను గాదు" అని భావించ సాధ్యమైనది దేహము లేక అనాత్మయనియు, అట్లు భావించ జాలనిది యంతయు నాత్మయనియు, దలచుచు నాత్మధ్యానము చేయవలెను. ఆదియం దింద్రియములు తద్విషయములే మనమని భావించుచు దజ్జనిత సుఖదుఃఖములతో దాదాత్మ్యమును జెంది జననమరణప్రవాహరూపమైన సంసారములో మునుగుచు దేలుచు నుందుము.

ఇంద్రియములు బహిర్గతములై విషయములను గూర్చి బోవుట ఇంద్రియములకు స్వాభావిక ధర్మముగా భగవంతుడే నియమించెనని యుపనిషద్వాక్యము గలదు.

పరాఞ్చిఖాని వ్యతృణత్ స్వయంభూః । (క. ఉప.)

అందువలన నవి యంతరాత్మను జూడక బహిర్గతములుగనే యుండును.

తస్మాత్పరాఙ్పశ్యతి నాంతరాత్మన్ । (క. ఉప.)

అయితే మన జన్మోద్దేశ్యము విషయోపభోగము కాదు. విషయానుభవముచే విషయభోగములందు విరాగము కలిగి నిజమైన సుఖము విషయమునందు లేదనియు, నా పదార్థములోని యంతరాత్మవలననే కలిగినదనియు, నంతరాత్మను దెలిసికొనినగాని యక్షయ సుఖము గలుగ నేరదనియు, గావున నాత్మావలోకనమునకు బ్రయత్నము చేయవలెననియు, దెలిసికొనవలెను. ఈ యంతరాత్మ అపరోక్ష జ్ఞానమే యోగము. తత్ప్రాప్తికే యోగశాస్త్ర విధులన్నియు విధించబడి యున్నవి.

ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥
(క. ఉప.)

బుద్ధిగుహాయందు గూఢముగానుండు ఆత్మను సూక్ష్మదర్శనులు యోగసాధనముచే వాడిచేయబడిన సూక్ష్మబుద్ధితో గనుగొందురు. ఆ సూక్ష్మబుద్ధి వృద్ధిచేసికొన గ్రమక్రమమున స్థూలము ననాత్మగాను దానికన్న సూక్ష్మమైనదాని నాత్మగా భావించి ఆత్మధ్యానము చేయుచురావలెను.

మొదలు స్థూలదృష్టిని విడిచినగాని సూక్ష్మవస్త్వధిష్ఠానము పట్టుబడదు. నే నాత్మప్రాప్తికై పాటుపడెదనను దృఢసంకల్ప ముం నిడినగా స్థూలమునందు విరాగము గలుగనేరదు. అయితే బాహ్య స్థూలవస్తుప్రాప్తికే ఇంద్రియములు స్వాభావికముగ బనిచేయు

చున్నవి. ఇట్లుండ నంతరాత్మధ్యానము సాధించుట యెట్లుండునన నదీప్రవాహమున కెదురు నడుచుట యెట్లు కష్టమో అట్లు కష్టముగ నుండునని శ్రీ శంకరాచార్యులవారు వ్రాసిరి.—

"ఏవం స్వభావేఽపి సతి లోకస్య కశ్చిత్ నద్యాః ప్రతి స్రోతః ప్రవర్తనమివ ధీరః ప్రత్యగాత్మానం స్వం స్వభావ మైక్షత్"

ప్రపంచసంసారము దెస జూచుచుండువాడు తన దృష్టిని నమృతత్వమును బొందించు నాత్మజ్ఞానప్రాప్తిదెస ద్రిప్పవలెను.

ఆవృత్తచక్షు రమృతత్వమిచ్ఛన్ ।

చూపును ద్రిప్పుట యన నెద్ది నేనే యని తలచుకొని దాని తాదాత్మ్యము నెందెనో అది నేనుగాదు అని తలచి దానినుండి దృష్టిని మఱలించవలెను. మొదట నింద్రియతాదాత్మ్యము పిమ్మట మనస్తాదాత్మ్యము అటుపిమ్మట బుద్ధితాదాత్మ్య ముండును. ఉపనిషద్వాక్యప్రకారమును యోగశాస్త్రప్రకారమును దొలుత మనస్సు నధిష్ఠానముగ జేసికొని యంతకన్న నపరమగు నింద్రియములను నియమించుకొనవలెను. అనగా అన్నమయ ప్రాణమయ కోశము లుపాధులనియు, మనోమయాది కోశసహిత ఆత్మను ఆత్మగాను, ధ్యానించుచుండవలెను. ఆ ధ్యానముచేత మనోమయకోశ ముపాధియే యనియు "అది నేను గాదు" అనియు తోచును. అప్పుడు అన్నమయ ప్రాణమయ మనోమయ కోశముల వరుసగ ననాత్మగా భావించి విజ్ఞానానందమయకోశ సహిత ఆత్మను ఆత్మగా ధ్యానించవలెను.

క్రమ క్రమమున యోగసిద్ధిచే ఆత్మ సర్వోపాధి రహితుడని ఆత్మ యాథార్థ్య జ్ఞానము కలుగును.

యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని ।
జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్ తద్యచ్ఛేచ్ఛాంత ఆత్మని ॥
(క. ఉప.)

అనగా, ఇంద్రియములను మనస్సునందును, మనస్సును విజ్ఞానమను బుద్ధియందును, విజ్ఞానమును మహదాత్మయందును, దానిని శాంతాత్మ (అనగా ఈశ్వరుని) యందును నియమింపవలెను.

ఇదియే క్రమ క్రమముగా స్థూలమునుండి సూక్ష్మమునకు దృష్టిని త్రిప్పుట. తపస్సుచేయుచురాగా సూక్ష్మాత్సూక్ష్మతరవస్తు దర్శనము కలుగును. వారుణివిద్యయందు భృగువు తొలుత అన్నమే బ్రహ్మమని తెలిసికొనెను.

తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ ।

తపస్సుచేత బ్రహ్మమును దెలిసికొనుమని గురువు చెప్ప, మఱియు దపస్సుచేసి ప్రాణమే బ్రహ్మమనియు, మఱియు దపస్సుచేయ గ్రమ క్రమమున మనస్సు బ్రహ్మమనియు, విజ్ఞానము బ్రహ్మమనియు దుదను ఆనందము బ్రహ్మమనియు తెలిసికొనెను.

ఇట్లు క్రమ క్రమముగా బాహ్యమునుండి యంతర్ముఖత్వము కావలెను. ఇంద్రియములు మనస్సు ఎట్లు లాగిన నట్లు పోవుచున్నంత వఱకు సంసారమే గతి.

యస్త్వవిజ్ఞానవాన్ భవతి అమనస్కస్సదాఽశుచిః ।
న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి ॥ (క. ఉప.)

అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా ॥

(లలితాసహస్రనామము)

లలితా దేవి అంతర్ముఖత్వముచే జక్కగా నారాధింపబడునదియు బహిర్ముఖత్వముచే దుర్లభమైనది.

ఈ యంతర్ముఖత్వరూపమైన యోగమే యీ సూత్రములో "లోపలికి మఱలినవాడవై మార్గాన్వేషణము చేయుము" అను మాటలచే విధించబడియున్నది.

ఇచ్చట నింద్రియములను మనస్సునందును, దానిని బుద్ధియందును, దానిని మహదాత్మయందును నియమించవలెనన నేమి యను విషయ మాలోచించవలెను. ఇంద్రియములకు మనస్సు రాజనునది విదితమే. మనస్సు పనిచేయనియెడల నింద్రియములు విషయజ్ఞానము కలుగ జేయనేరవు. అందువలన మనస్సు ఇంద్రియాపేక్షయా పరదేవుడని చెప్పబడుచున్నది.

ఏవం హ వై తత్సర్వం పరే దేవే మనస్యేకీభవతి ॥ (ప్ర. ఉ.)

అదంతయు (అనగా ఇంద్రియములు, విషయములు) వానికన్న ప్రకృష్టమగునట్టియు వాని ప్రకాశమునకు గారణమైనట్టి మనస్సు నం (స్వాపకాలమందు) దేకీభావము చెందుచున్నవి.

అట్టి కాలమం దింద్రియములు పనిచేయుట లేదు.

తేన తర్హి ఏష పురుషో న శృణోతి న పశ్యతి న జిఘ్రతి న రసయతే । ఇత్యాది.

మనస్సు వేఱొకచో బనిచేయుచున్న గన్నులు తెఱచుకొనియున్నను రూపమును గ్రహించనేరము, చెవులతో శబ్దమును విన నేరము,

ఆహారము లేకున్నను ఆకలి తోచదు, అను విషయము అనుభవము వలన మనకు తెలిసియున్నది. అందువలన నింద్రియములను మనస్సు చేతనే వశపరచుకొనవలెను.

మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ॥ (భ. గీ. 6)

రసనేంద్రియము తినగోరిన మనస్సుతో నాలోచించుకొని తినిన మేలా కీడా అని వితర్కించి మేలుకాదని తోచిన దినగోరిన పదార్థమును ద్యజించవచ్చును. మఱియు నంతకన్న గొప్పవిషయముపైన మన స్సును నిల్పిన భక్షణవిషయమైన కోరిక వదలును. అప్పుడు మన స్సుచే దత్కాలమునకు రసనేంద్రియమును జయించిన వారల మగు దుము. ఇట్లే ప్రతి ఇంద్రియమును మనస్సుచే నియమించ వలెను. ఇంద్రియములను గుఱ్ఱములను బట్టుటకు మనస్సు కళ్లెపుపగ్గము వంటిదని చెప్పబడుచున్నది.

మనః ప్రగ్రహమేవ చ ఇంద్రియాణి హయానాహుః
(క. ఉప.)

మనస్సు సంకల్పవికల్పాత్మకమైనదియు, భేదబుద్ధిని వృద్ధిపరచు నదియు, ప్రవృత్తిమార్గములో గామసంయుక్తమై యశుద్ధమనగుట వలనను, నింద్రియములను నియమించగల్గినను ప్రకృతజన్మ సుఖ దుఃఖములను గ్రహించునుగాని జన్మాంతరాపేక్షయా కార్యా కార్యములను బరిశీలించి కనుగొన నేరదు. కార్యాకార్య వ్యవస్థ యందు బుద్ధిసహాయములేనిదే మనస్సు పనిచేయ నేరదు. ఆ బుద్ధికే విజ్ఞానమని పేరు. దానికి సారథి సామ్యము చెప్పబడియున్నది. మనస్సు సయితము కరణమే. బుద్ధి పరతంత్రమగుటవలన మన

స్సను బుద్ధిచేత నియమించవలెనని చెప్పబడియున్నది. ఈ జన్మ చింతయే కాక జన్మాంతర విషయముకూడా పరిశీలించి యుక్తా యుక్తములను గనుగొని బుద్ధి నిశ్చయించును. సుబాలోపనిషత్తులో మనోమయ కోశాభిమాని సంకల్పాత్మ యనియు, విజ్ఞానమయ కోశాభిమాని కాలాత్మయనియు, నిరూపింపబడియున్నది. మఱియు, మనస్సు 'ఇదం' శబ్దబోధక మనియు, బుద్ధి 'అహం' శబ్దబోధకమనియు జెప్పబడుచున్నవి.

ఇకను బుద్ధిని మహదాత్మయందు నియమించుటయన వ్యష్ట్యపేక్షయా కార్యము చేయక సమష్ట్యపేక్షయా చేయవలెనని తాత్పర్యము. రాబోవు ఏడవ అధ్యాయమున తత్వనిరూపణలో నహంకార విముక్త బుద్ధి విశుద్ధబుద్ధి లేక మహత్ బుద్ధియని నిరూపించబడును. కావున విజ్ఞానాత్మను మహదాత్మవలన నియమించుటయన వ్యష్టిబుద్ధిమాని సమష్టిదృష్టితో బనిచేయవలెనని యర్థము. మహదాత్మను శాంతాత్మయం దుంచుటయన నాత్మసాక్షాత్కార ప్రాప్తియే.

19 వ ప్రాచీనసూత్రము

"ధైర్యముతో బహిర్గతుడవై మార్గాన్వేషణము చేయుము."

యస్తుసర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి ।
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ॥
(ఈ. ఉప.)

ఎవడు సకలభూతముల నాత్మయందే (తనయందే) చూచునో, మఱియు సర్వభూతములయం దాత్మను (తనను) జూచునో వాడు జుగుప్స చెందడు. ఆత్మయథార్థస్వరూపము నెఱుగగోరువాడు అంతర్ముఖి

రై తనయందే సర్వభూతములున్నవని తెలిసికొనును. ఈ సాధనము 18 వ సూత్రములో విధించబడెను. ఇది ధ్యానమార్గము. ఇందు విషయములనుండి మఱలించబడిన బుద్ధి ఆత్మసాక్షాత్కారసాధనము. విషయములందు విరాగము గల్గి ఆహారాదినియమముచే మనస్సును వశపరచుకొని ఏకాంతస్థలమందు ధ్యానము చేయుచుండవలెను. ఈ మార్గమునకు ఆత్మచేత ఆత్మను సాక్షాత్కరించుకొను మార్గమని పేరు.

ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా ॥

(భ. గీ. 13-24)

యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః ॥ (భ.గీ.6-10)

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ ।
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥
వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥
అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం ।
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయకల్పతే ॥

(భ. గీ. 18. 51-52-53)

18 వ సూత్రములో విధించబడిన ఈ అంతర్ముఖత్వమునే 20 వ వ్యాఖ్యానసూత్రములో "లోతుకుదిగి ఆత్మాన్వేషణము చేయుమ" ని విధించబడి యున్నది.

ఆత్మ లోపలను వెలుపలను వ్యాపించియున్నది. సర్వము తన యందుండునట్లు తాను సర్వమునందున్నానని తెలిసికొనవలయును. ఇది పై ఈశోపనిషద్వాక్యము రెండవపాదములో జెప్పబడియున్నది.

తనను సర్వభూతములయందు జూచుటయే 19 వ సూత్రములో విధించబడిన బహిర్గతత్త్వమనెడి సాధనము. పై గీతావాక్యములో ధ్యానమార్గమే కాక మఱియు గొన్ని మార్గము లుదహరించబడి యున్నవి.

అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥

(భ. గీ. 13-24)

మఱికొందఱు (అనగా ధ్యానానుష్ఠాతలు కాక) సాంఖ్యయోగము చేతను మఱికొందఱు కర్మయోగము చేతను (ఆత్మ సాక్షాత్కారము చేసికొందురు). కర్మయోగ విషయ మిదివఱలో వివరముగా నిరూపింపబడెను. సాంఖ్యమనగా

"సాంఖ్యం నామ—ఇమే సత్త్వరజస్తమాంసి గుణాః మయా దృశ్యాః। అహం తేభ్యో అన్యః, తద్వ్యాపారసాక్షిభూతో నిత్యో గుణవిలక్షణ ఆత్మేతి, చింతన మేవ సాంఖ్యో యోగః ॥" (శాం. భా.)

నా కగుపడుచుండునవి (అనగా విషయములు) సత్త్వ రజస్తమోగుణములు (గుణవికారములు). నేను వానికన్న వేఱు, వాని వ్యాపారములకు సాక్షిభూతుడును, నిత్యుడును, గుణవిలక్షణుడును నగు ఆత్మను అని చింతించుటయే సాంఖ్యయోగము.

19 వ సూత్రములో విధించబడిన ఈ రెండవ మార్గమునందు విషయములనుండి హేయత్వబుద్ధిచే మఱలుటలేదు. విషయములననుభవించుచు వానివలన జనించు సుఖదుఃఖములు శరీరసంబంధములే యనియు, ఆత్మనామరూపాతీతుడనియు, త్రిగుణాత్మకమైన ప్రకృతి విల

క్షణుడనియు, ప్రతిపదార్థము వ్యక్తమగు ఆత్మశక్తియే యనియు, నాత్మేతర వస్తువే లేదనియు, నెఱుగుటయే తనను సర్వభూతముల యందు జూచుట.

తనకన్న వేఱువస్తువు లేదని 18 వ సూత్రమువలన దెలిసికొనినట్లు తా నేవస్తువుకన్న వేఱుకాదని 19 వ సూత్ర విధివలన నెఱుగనగును. ఈ 19 వ సూత్రవిధి ప్రకారము విషయానుభవ మవశ్యకము. అంత ర్ముఖ మార్గమున సంసారమునుండి విరమించుట సాధనము. 19 వ సూత్రవిధిప్రకారము సంసారములోనుండియే విషయముల ననుభ వించుచుండియే ఆత్మతత్త్వము నెఱుగవలయును. భూలోకవిషయాను భవమే కాదు. ప్రతిలోకములోని పదార్థముల శోధించి శోధించి అనాత్మలక్షణముల బాగుగ నెఱిగి ఆత్మ తద్విలక్షణుడని తెలిసికొన వలెను. కావున సూక్ష్మలోక పదార్థశోధనజ్ఞానము కొఱకై ఈ మార్గమున యోగసిద్ధు లవశ్యకములు. ధ్యానమార్గమున యోగసిద్ధు లంతరాయములు. ఈ శోధనమార్గమున స్థూలసూక్ష్మలోక విషయా నుభవము యోగసాధనము. శోధనవలన నాత్మానాత్మ వివేకము కలుగును. దాన విరాగముద్భవిల్లు, అట్టి వివేక విరాగపూర్వక కర్మానుష్ఠానము చిత్తశుద్ధిని గలుగజేసి మోక్షసాధనమగును. పెక్కండ్రు విషయానుభవము మోక్షప్రతిబంధకమని సంన్యాస పూర్వక ధ్యాననిష్ఠయందే రతిగల్గినవారుగ నుందురు. సంసార ములో నుండినను విరాగముగల్గి నిర్లేపముగ గర్మానుష్ఠానము చేయుటకు సాహసముండవలెను. ఆ సాహసమే 19 వ సూత్ర ములో "ధైర్యముతో" అను పదమువలన సూచించబడియున్నది. సర్వభూత తాదాత్మ్యమును జెందువాడు తన దుఃఖనివృత్తి,

సుఖప్రాప్తి కెట్లు పాటుపడునో అట్లే పరులహితార్థము కర్మ చేయక యుండ నేరడు. వాడు విషయముల ననుభవించుచునే వాని యం దీశ్వరదర్శనము చేయుచునే ప్రపంచానుభవమును మోక్ష సాధనముగనే చేసికొనునుగాని విషయములనుండి తప్పించుకొన దలచడు. ఈ విషయానుభవరూప బహిర్గతత్వ సాధనమును గుఱించి 20 వ వ్యాఖ్యానసూత్రములో విపులముగా బోధించబడియున్నది. ఆ సూత్రబోధను అందుపైన వ్యాఖ్యను జూచునది.

ముఖ్యముగ నెఱుగవలసిన దేమియన 18, 19 సూత్రములు రెండును యోగసాధనములను బోధించుచున్నవనియు, రెండును ఆత్మాన్వేషణము నే చెప్పుచున్నవనియు, లోపలనుండు భగవత్సాక్షాత్కార మొక సూత్రమువలనను, బాహ్యమందుండు భగవత్సాక్షాత్కారము రెండవ సూత్రమువలనను నిరూపించబడి యున్నవనియు, ఆత్మబాహ్యాభ్యంతరుడనియు సర్వమాత్మయే యనియు నెఱుంగవలయు.

## 20 వ వ్యాఖ్యానసూత్రము

17 వ సూత్రము మార్గాన్వేషణము చేయవలెనని బోధించుచున్నది. దాని విధానములను 18–19 వ సూత్రములలో దెలుపబడెను. ఈ మార్గాన్వేషణమునుగుఱించి యొక గొప్పవ్యాఖ్యానసూత్రముండుటయే కాక దానిపైన విపులమగు టీక సయితే మున్నది. ఇందువలన నీ విషయము ముఖ్యమైనదని స్పష్టమగుచున్నది. అన్నివాక్యములను వివరముగా విచారించవలసియున్నది.

"ఒకమార్గముననే దానిని వెదకకుము. ఒక్కొక స్వభావమునకు మిక్కిలి యుత్తముగదోచు మార్గ మొక్కటి యుండును. అయితే

(మోక్ష) మార్గము భక్తితోనే కాని, ధ్యానముతోనే కాని, శ్రద్ధాయుత యభివృద్ధి (తృష్ణ) తోనే కాని, స్వార్థత్యాగపురస్సర కృషి వలననే కాని, జీవితమును శ్రద్ధతో పరిశోధించుట వలననే కాని, కనుగొనబడదు. (వీనిలో) ఏయొక్కటి యైనను స్వయముగ శిష్యుని నొక్క మెట్టుకన్న నెక్కుడుగ నూర్ధ్వమార్గమున గొనిపోనేరదు. ఒక శ్రేణిక పూర్తియగుట కన్నిపర్వము లవశ్యకములే."

ఈ వాక్యములవలన సాధించవలసినది యోగమనియు, భక్త్యాదు లందుకు సాధనములనియు దెలియవచ్చుచున్నది. యోగపరిపాకావస్థయగు సమ్యక్జ్ఞానము బొందినవాడు పర్వతము నారోహించిన వాడని భావింతము. పర్వతము నారోహించ ననేక త్రోవలుండును. అనేక దెసలనుండి వచ్చువారు వేలు వేలు మార్గముల వచ్చెదరు. అయితే శిఖరముననుండువా డన్నిమార్గముల నెఱింగియుండవలయు ను. ఎందువలన ననగా, ప్రతిమార్గమునుండి వచ్చువారలను వారు త్రోవతప్పిపోయిన సరియగుత్రోవను జూపించుచు వారు పైకిజేరుటకు వలయు సహాయము చేయవలసియుండును. ప్రతియొక్కనికి వాని మార్గముననే వానికి సహాయము చేయునలసియుండు. సమ్యక్జ్ఞాని తనయాత్మను బరమాత్మతో నేకీభావము చెందించుకొనిన వాడు.

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః ॥

(భ. గీ. 6-7)

"సమాహితః" అను పదమునకు "సాక్షాత్ ఆత్మభావేన వర్తత ఇత్యర్థః" అని శ్రీ శంకరాచార్యులవారు వ్యాఖ్యానము చేసిరి. ఆనందగిరులవారు "పరమాత్మావిశ్లేషేణ పునః పునః అనభిధ్యాయ

మానో నిరంతరం చిత్తే ప్రథత ఇత్యర్థః" అని టీక వ్రాసిరి. విక్షేప దోషమును తరించుటద్వారా పునః పునః చలించని మనస్సునందు సదా పరమాత్మసాక్షాత్కారముగ నుండును. ఇట్టివారే ఈశ్వర భావమును, ఈశ్వర సాధర్మ్యమును జెందినవారు. ఈశ్వరమయు లైనవారు.

> వీతరాగభయక్రోధాః మన్మయా మాముపాశ్రితాః ।
> బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥
>
> (భ. గీ. 4-10)

ఈశ్వరుని భావమన ఇచ్ఛా, జ్ఞాన, క్రియాభావముల సమ్మేళనము. ఆ భావమును జెందవలెనన నా మూడు భావములతో మన మూడు భావము లేకీభావము చెందవలయును. అన్ని భావము లేకీభవించిననే భగవత్ప్రసాద ప్రాప్తియగునని గీతాశాస్త్రమువలన దెలియవచ్చు చున్నది.

> తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।
> తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం ॥
>
> (భ. గీ. 18-62)

> యో మామేవ మసంమూఢో జానాతి పురుషోత్తమం ।
> స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత ॥
>
> (భ. గీ. 15-19)

ఈశ్వరతత్త్వము నెఱిగినవాడు సర్వభావములతో నన్ను భజించవలెను. అట్టులైన నన్ని మార్గములనుండి వచ్చువారలను వారి వారిని వారి వారి మార్గములనే యాదరించి సహాయము చేయగలుగును.

ఇందువలన మార్గములనేకములనియు, నా యా మనుష్యుని స్వభావము ననుసరించి వానికి నుపయుక్తమగు మార్గమొక్కటి యుండునని యు, సమ్యక్ దర్శనదశయందన్ని మార్గముల జ్ఞానము కలుగుననియు దెలియవచ్చుచున్నది. ప్రతిమనుష్యునియందన్ని భావము లున్నవి. అయిన నొక్కనియందు వాని (అనగా అంతరాత్మ యొక్క) సంకల్ప సంస్కారముల ననుసరించి యొక్క భావము హెచ్చుగను శేషించినవి తక్కువగను బ్రకాశించుచుండు. జ్ఞానభావ మెక్కుడుగ నుండు వానికి జ్ఞానమార్గ ముచితము. ఇచ్ఛాభావమభివృద్ధి చెందినవానికి భక్తిమార్గమును, క్రియాభావము ప్రాముఖ్యముచెందినవానికి గర్మ మార్గమును నూటిగనుండును. అయిన బ్రతియొక్కనియందన్ని భావములుండును గావున బ్రాముఖ్యమునొందిన భావమున కనుగుణ మైన మార్గము ననుష్ఠించి యా భావము నభివృద్ధిచేసికొనుచు వచ్చుకొలదియు నితరభావములు సయితము ప్రకాశమునకు వచ్చు చుండును. ఇందుకు గారణము స్పష్టముగనే యున్నది. మూడు భావములు గలవానియందేభావము వృద్ధిచెందినను శేషించిన రెండు వృద్ధికాకతీరదు. భక్తిమార్గమునందున్నతస్థితికి వచ్చినవానికి భగవంతుడే జ్ఞానమొసగుననని చెప్పబడియున్నది. జ్ఞాని భక్తులలో నుత్తముడనిసయితము చెప్పబడియున్నది. భక్తిలేనివాడు కర్మయోగి కానేరడు. కర్మయోగి ఈశ్వరప్రసాదమును బడయు, వానియందు జ్ఞానభక్తులు వికసించ, వాడు దరించును.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥

(భ. గీ. 10-10)

. . . . . . . . . . . . . . అజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥
(భ. గీ. 10–11)

తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తి ర్విశిష్యతే ॥
(భ. గీ. 7–17)

కర్మణ్యకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥
(భ. గీ. 4–18)

చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః ।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥
(భ. గీ. 18–57)

పై వాక్యములవలన జ్ఞాన క్రియా భక్తి భావములు మూడును యోగి యందు బూర్ణమై కలిసియుండునని తెలియవచ్చును.

ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥
అన్యే త్వేవమజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥
(భ. గీ. 6–46, 47)

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥

యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥
(భ. గీ. 6-46,47)

ఇందువలన ధ్యానము, సాంఖ్యము, కర్మ, శ్రవణము, వారి వారి స్వభావానుగుణముగా నేర్పడిన మార్గములనియు, నే యొక్క మార్గము ననుష్ఠించినవానికన్న యోగి యధికుడనియు, నట్టి యోగులలో భక్తియుతు డత్యంతోత్తమమైన యోగియనియు దెలియవచ్చుచున్నది. "యోగి" అనగా "కూడుకున్నవాడు". తన యాత్మను బరమాత్మ సాధర్మ్యముగా జేసికొన్నవాడు. ఈశ్వరభావమును బొందినవాడు. అట్టివా డన్నిభావములం బూర్ణుడైనవాడు. కావున నా యా మార్గము ననుష్టించుచుండు నభ్యాసికన్న నధికుడనియు బరమభక్తిగలవాడు సర్వయోగులలో నుత్తమోత్తముడనియు జెప్పనేల?

ఈ వ్యాఖ్యానసూత్రము ఈశ్వరసాధర్మ్య, ఈశ్వరభావరూపమైన యోగప్రాప్తిని సాధించవలయుననియు, నొక్కభావ పరిపూర్ణతమాత్రము లెస్సకాదనియు, నొక్కొక్కభావము ముక్తిమార్గశ్రేణికయం దొక్కొక్క పర్వముగ భావించవలయుననియు బోధించుచున్నది.

---

ఆఱువ అధ్యాయము

# II

## యోగమార్గాన్వేషణము, పుణ్యపాపములు

### 20 వ వ్యాఖ్యానసూత్రము

"మనుష్యుల దుర్గుణము లతిక్రమించుకొలదియు నొక్కొక్కటి యును (మోక్షమార్గ) శ్రేణికయందలి పర్వమగును."

ఈ వాక్యము చిత్రముగనున్నది. అయిన బరిశీలించిచూచిన దీని గూఢార్థము విశదము కాగలదు. దుర్గుణములన నేమి? సుగుణము లన నేమి? దుర్గుణములు మోక్షమార్గసాధనము లెట్లగు? ఈ సుగుణదుర్గుణము లన్యోన్యాశ్రయ పదములు (Relative terms). ఉభయగుణము లపరిపూర్ణదశకు సంబంధించినవియే. అపరిపూర్ణదశ యందు బైమెట్టుననుండి చూచిన గ్రిందిమెట్టుననుండువాని గుణము దుర్గుణముగ దోచును. క్రిందిమెట్టుగుణముతో బోల్చిచూచిన బై మెట్టు గుణము సుగుణముగ గన్పట్టు. అంతియకాని సుగుణదుర్గుణ విభజన అనుష్ఠానసౌకర్యార్థము ధర్మాధర్మబోధజనకములేకాని యథా ర్థముగ జూచిన బ్రతిమెట్టుననుండు వానికి నామెట్టున ననుష్ఠేయ ధర్మ ముండుననియు, నా ధర్మమును బైమెట్టు ధర్మముతో బోల్చిన నధర్మ ముగ గన్పడునే కాని యందులోనుండువానికి బైమెట్టుకు బోవ సాధనమే యనియు, నెంతమాత్రము హేయముకాదనియు ముఖ్య

ముగ నెఱుగవలయు. మిద్దెపైననుండిచూచిన నాయా మెట్టునం దనుష్ఠేయ ధర్మమాచరించబడుచున్నదనియే తోచును. క్రమక్రమ మున నుపాధిపరిశుద్ధమగుచురాగా ఆత్మశక్తి ప్రకాశమునకు వచ్చు చుండును. జూదమాడుట మహాగొప్పదుర్గుణమని తలచుచున్నాము కదా. దానివలన సయితముపయోగమున్నది. తమోగుణముతోనిండి, బుద్ధికౌశలము, జాగరూకత, కర్మానుష్ఠానమందు శ్రద్ధయు లేనివానికి జూదము రజోగుణధర్మముల నేర్పించును గావున నుపయుక్తమైనదే. అందువలననే భగవద్గీతాశాస్త్రమందు

ద్యూతం ఛలయతామస్మి ॥ (భ. గీ. 10-36)

"మోసముచేయువారి జూదమును నేను" అని భగవంతుడు చెప్పియున్నాడు. అది పైనుండిచూచిన దుర్గుణమయ్యు, నాదశ యం దుచితముగనే యున్నది. బుద్ధికౌశలాది గుణార్జన కుపయుక్త మగు కారణమున మోక్షమార్గశ్రేణికయందొక పర్వమని నిస్సందేహ ముగ జెప్పవచ్చును. ఇట్లే మనము దుర్గుణములని గణించు ప్రతి యొక్క గుణమును నాయా యజ్ఞానదశనుండి బైమెట్టుకుబోవ గా వలయు జ్ఞానవిషయ మొక్కటియైన గలచ సాధనమగుటచే శ్రేణిక యొక్క పర్వముగ నుండుననియే చెప్పవలెను. దుర్గుణ మాచరణ కాలమందు దుర్గుణముగ గన్పడదు. దానివలన దుఃఖము కలుగును. ఇకముం దట్లు ప్రవర్తించగూడదను జ్ఞానము దాన నుద్భవించును. ఆ జ్ఞానము సాధించినబైమెట్టుకుబోవును. అప్పుడు పూర్వపుదశయందు జేసినది దుర్గుణమనితోచును. అయిన దాజెందిన జ్ఞానప్రాప్తి కా దుర్గుణము అనుభవము కలుగజేయుటద్వారా సాధనముగ నుండె

ననియే తలంచవలయును గాని పై మెట్టుకుబోయిన తత్క్షణమే తా నతిక్రమించి జయించిన దుర్గుణముగలవారిని దూషించగూడదు. ఆ దుర్గుణము పూర్వము తనయందుండి దాన ప్రాప్తించిన దుఃఖాను భవముచే జ్ఞాన ముదయించి యిప్పుడు పై మెట్టున నున్నాననియు, గ్రిందిమెట్టువాడు సయితె మట్టి యనుభవముచే దన స్థానమునకు రాగల వాడేయనియు దెలిసికొని క్రిందిమెట్టుననుండు వానికి సహాయము చేసి ఆ రీతిన ఈశ్వరసేవ చేయవలయును. శ్రేణికయందన్ని పర్వములు పర్వములే. ప్రతిదానిపై నడుగిడవలసినదే. ప్రతిదాని నుండి చూడవలసినది చూచి, తెలిసికొనవలసినది తెలిసికొనిననే పై దాని నారోహించనగు. ఆరోహించినపిదప "క్రిందిమెట్టు నతి క్రమించితిని. ఇప్పుడా మెట్టుననుండు వాడిప్పుడు నేనున్నదానికి రాగలడు" అని తలంచవలయు. ఆట్లే ఆత్మశక్తి ప్రకాశమునకు వచ్చునొక్కొక్క దశయు మోక్షమార్గసాధనమే. ఆ యా దశ యందు సుఖదుఃఖానుభవముచే నెక్కుడుగ నుపాధిపారిశుద్ధ్యము, తద్వారా ఎక్కుడుగ నాత్మశక్తిప్రకాశమునకు వచ్చుటయే పై మెట్టెక్కుట. కావున అన్ని మెట్లు అన్నిదశలు మనము ద్రోవన గడవ వలసినవియే. అన్ని యవశ్యములే. హెచ్చుదశకు వచ్చినతరువాత నంతకన్న బై మెట్టుకుబోవు ధర్మము ననుష్ఠించవలెను. క్రిందికి బోవు నట్లు చేయగూడదు. అట్లుచేసిన నది దుర్గుణము. కామ మతిపాప హేతువైన దుర్గుణమని తెలిసియేయున్నది కదా. ఆట్టి కామము విశేష ముగ గలవాడు సయితము దూష్యుడుకాడనియు గ్రమక్రమమున నిర్గుణత్వమును జెందుననియు, నీ క్రిందివాక్యములవలన దెలియ నగును :—

వృత్త్యా స్వభావకృతయా వర్తమానః స్వకర్మకృత్ ।
హిత్వా స్వభావజం కర్మ శనైర్నిర్గుణతామియాత్ ॥
ఉప్యమానం ముహుః క్షేత్రం స్వయం నిర్వీర్యతామియాత్ ।
న కల్పతే పునస్సూత్యా ఉప్తం బీజం చ నశ్యతి ॥
ఏవం కామాశయం చిత్తం కామానామతిసేవయా ।
విరజ్యేత యథా రాజన్నగ్నివద్ఘృతబిందుభిః ॥
(శ్రీ భాగ. 7, 11, 32-34)

స్వభావవృత్తి ననుష్ఠించుచూ స్వకర్మ చేయుచుండిన గర్మనశించి క్రమమున నిర్గుణత్వము సిద్ధించును. బీజములు చల్లుచూ రాగా రాగా తుది దీర్ఘకాలమున భూమి నిస్సారమై సస్యప్రరోహమున కయోగ్యమగునట్లు కామమునందు విశేషముగ నిమగ్నుడయినవాని చిత్తము కాలపక్వమున గామబీజనాశముచే గామోద్భవమున కనుపయుక్తమగు. అగ్నియం దమితముగ ఘృతము బోసిన నగ్ని శమించును గదా!

శ్రీధరాచార్యులవారు—

"ఉత్కటవాసనావిశిష్టస్య సహసైవ కామత్యాగాసంభవాత్ వేదోక్తనియమేన బహుశః కామాన్ భుంజానస్యైవ నిత్యనైమిత్తికైః విశుద్ధచేతసః తద్దోషదర్శనేన యయాతిసౌభరిప్రముఖానామివ శనైర్విరాగో భవతి . . . . . అతః సర్వమనవద్యమ్".

వాసనలు బాహుళ్యముగ నుండువాడు తత్క్షణమందే కామత్యాగము చేయుట సాధ్యముకాదు. కనుక వేదోక్తనిత్యనైమిత్తికకర్మాను

స్థానముచే బరిశుద్ధాంతఃకరణుడై కామములను భోగించుచునే (వానివలన జనించు దుఃఖానుభవమువలన) వానియందలి దోషమును దెలిసికొనుచూ యయాతిసౌభరి మొదలగువారివలె క్రమక్రమమున గామమును నశింపజేసికొని విరాగమును బొందగలడు. ఎద్దియు దూష్యము కాదు.

ఇందువలన గామము నిష్కామమునకు సాధనము, సోపానము వంటిదని తెలియవచ్చుచున్నది. అట్లే అన్నిదోషములు, దుర్గుణములు మోక్షమార్గసాధనములే యని భావించవలయును. ఈ మాటలచేత నజ్ఞానదశయందుండు వారలను గలవర పెట్టగూడదని తెలియవలెను. అంతియకాని దుర్గుణములే మంచిది యని బోధించగూడదు. ఈ గ్రంథములోని విషయములు నివృత్తిమార్గమునందుండువారికే యన్వయించును. ఈ వాక్యముల ముఖ్య తాత్పర్యమేమన:— మోక్షమార్గమునందు బ్రవేశించినవాడు సమష్టి దృష్టితో, సకల వ్యవహారములను బరిశీలించవలెను. అట్లుచేసి సుగుణదుర్గుణభేదముల బాటించక సర్వజీవులు క్రమక్రమముగ భగవంతుని జెందుదురనియు, నెట్టిభూతమునైనను నిది హేయమని తలచక ఈశ్వరకళ కించిత్ప్రకాశకముగ నుండునవి కొన్ని, కొంచెము హెచ్చు మఱికొన్ని, మఱియు హెచ్చు మఱికొన్నియు, బూర్ణప్రకాశము ముక్తులయందే యనియు దెలిసికొనవలెను. తదర్థమే యీ బోధ యుపయుక్తముకాని అజ్ఞులనుద్దేశించి చెప్పినది కాదు.

న బుద్ధిభేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినాం ॥

(భ. గీ. 3–26)

"మనుష్యుని సుగుణములు (సయితము) యథార్థముగా (అశ్రేణిక యందలి) పర్వములే ; అవశ్యకమైనటువంటివే. అవి ఎంతమాత్రము వర్జనీయములు కావు"

ఇందుకు గారణము పైన వివరించబడెను. దుర్గుణములు హేయములుకావని చెప్పుటవలన దుర్గుణములు గలవాని నెంతమాత్రము ద్వేషించగూడదని చెప్పనేల? అయిన విపరీతార్థముచేసి దుర్గుణములు శ్రేయస్సాధనములు కావున నిక సుగుణములను వర్జించి దుర్గుణములనే ననుష్ఠించెదమని తలచగూడదు. సుగుణము లనుష్ఠేయములని చెప్ప నవసరమే లేదు. అయిన విపరీతార్థమును శంకించి స్పష్టముగా నవి యవర్జనీయములని చెప్పబడుచున్నది.

"అయిన నవి (సుగుణములు) కొంతమట్టుకు పరిశుద్ధ వాతావరణమును కలిగించునవి యయినను భావికాల సుఖప్రదాయకములైనను నేకాంతంబున ననుపయోగములగు."

సద్గుణసంపన్నుడొకడుండెనేని వాని యింటి యందలి జనులనే కాక వాని సాంగత్యమహిమచే నితరులను సయితము పవిత్రముచేయును. సుగుణమువలన సుఖముకలుగునని తెలిసిరయే యున్నది. ఈ గ్రంథము నీతిశాస్త్రము కాదు. సుగుణమువలన సుఖము కలుగును, దుర్గుణము వలన దుఃఖము కలుగును, సజ్జనసాంగత్యము మంచిది, అని సకల నీతి శాస్త్రము లుద్ఘోషించుచునే యుండును. ఇచ్చట మోక్షధర్మములు బోధించబడుచున్నవి. ముక్తలక్షణములు చెప్పి వాని ననుష్ఠించనగునని చెప్పబడుచున్నది. ద్వంద్వాతీతత్వము ముక్తలక్షణము. నిర్దోషత్వమే కాక సమత్వము బ్రహ్మలక్షణము.

నిర్దోషం హి సమం బ్రహ్మ । (భ. గీ. 5-19)

నిర్దోషము సాత్వికలక్షణము. సమత్వము గుణాతీతలక్షణము. ఇట్టిది సుగుణము, ఇట్టిది దుర్గుణమని గుణాతీతుడు తెలియనివాడు కాదు.

> అనాదిత్వాత్ నిర్గుణత్వాత్ పరమాత్మాయ మవ్యయః ।
> శరీరస్థోపి కౌంతేయ న కరోతి న లిప్యతే॥ (భ. గీ. 13,31)

ప్రతిశరీరమందున్నను నా యా శరీరమాలిన్య జనితదోషములచే బర మాత్మ అంటబడడు.

ఆత్మాపేక్షయా సర్వభూతములయందు సమత్వమును జూచు వానికి బుణ్యాపాపము లను భేదము లేదు.

పుణ్యాపాపములు వ్యక్త ప్రపంచమునకు సంబంధించినవి. వాని మూలములకు బోయి చూచిన నవి యన్నియు నీశ్వర సంకల్పము నను సరించి యా యా దశలో బ్రయోజనకారులే యనియు, బురో వృద్ధికి హితములే యనియు దెలియవచ్చును.

> బుద్ధిః జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః ।
> సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ।
> అహింసా సమతా తుష్టిః తపో దానం యశోఽయశః ।
> భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥
> (భ. గీ. 10-4, 5)

పైజెప్పిన గుణములన్ని నావలననే కలుగుచున్నవని భగవంతుడు చెప్పియున్నాడు. అందులో భయము, అపకీర్తి, దుఃఖము అను పాపగుణములు వాని ఫలములు చేరియున్నవి.

> మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ । (భ. గీ. 15-15)

మఱచుటయను గుణము సయితము భగవంతునివలననే కలుగుచున్నది. అనగా ఈశ్వరుని సంకల్ప మమోఘము. ప్రతి కార్యమునకు దానికి సరియైనఫలము కలుగకతీరదు. ప్రతిమనుష్యుడు ప్రతినిమిషము చేయు పనులన్నియు నాత్మశక్తి ప్రకాశకఫలము కలవియే. ఆ శక్తి ప్రకాశమునకు వచ్చునవు డితరులకు మేలు కలుగజేయవచ్చును. కీడు కలుగ జేయవచ్చును. దుఃఖము, అపయశస్సు నను నవి యందలి ఫలములు. తదనుభవమువలన జ్ఞానము కలుగును. కావున జ్ఞానోత్పత్తి కవి కారణములయ్యెను. జీవులు పురోవృద్ధిచెంది తనను జేరవలె ననియే ఈశ్వరసంకల్పము. మనకు దుర్గుణములుగా దోచునవి యా మనుష్యునికి వాని దశయందు దగినవియే యనియు, వానికి జ్ఞానము కలుగజేయుటకు సహకారులే యనియు, దెలిసిన దుర్గుణములవలన గలుగు నుపయోగములు తెలియవచ్చును. సుగుణదుర్గుణదర్శనుల యందు భేద మిట్లు చెప్పబడియున్నది.

అసూయకాః పరేషాం గుణేషు దోషానేవ గృహ్ణంతి నతు గుణాన్। కేచిత్ మధ్యస్థాః పరగుణేషు దోషాన్ న గృహ్ణంతి, కింతు, యథాస్థితాన్ గుణాన్ దోషాన్ వివేకేన గృహ్ణంతి । తే తు మహాంత ఉచ్యంతే। సాధవస్తు కేవలం గుణానేవ గృహ్ణంతి, న దోషాన్। తేతు మహత్తర ఉచ్యంతే। మహత్తమస్తు దోషాన్ న గృహ్ణంత్యేవ। ప్రత్యుత తుచ్ఛానపి గుణాన్ బహులీకరిష్ణవో భవంతి॥ (శ్రీభాగ. 4 శ్రీధరవ్యాఖ్య)

అసూయకలవారు పరులదోషములనే చూచెదరు. గుణములయందు సైతము గుణములను జూడనేరరు. మహాత్ములు గుణములను గుణ

ములుగాను, దోషములను దోషములుగాను, వివేకముతో దెలిసికొని యెదరు. మహత్తరులు దోషములను గణించక గుణములనే గ్రహించెదరు. మహత్తములు (అనగా ఉత్తమోత్తములు) మహత్తరులవలె గుణములనే గ్రహించుటయే కాక గుణము స్వల్పముగ నుండినను దానిని గొప్ప చేయుదురు (అనగా దానిని దలచుటవలన నది బలపడి దృఢమై వాని సుగుణసంపత్తిని వృద్ధిచేయుదురు.)

ఇవి యన్నియు భేదజ్ఞానమండలమునందు జేరినవియే. బ్రహ్మసాక్షాత్కారము కల్గినవాడు సుగుణదుర్గుణభేదము చూడడు. ఆ రెంటిమూలమును (బ్రహ్మయోనిం) జూచినవాడు కావున సర్వగుణములు సర్వచేష్టలు నాత్మశక్తి ప్రకాశకములని యాత్మదృష్టితో జూచును.

"నిరంజనః పరమం సామ్యముపైతి"

అనెడి ముండకోపనిషద్వాక్యములో పరమసామ్య మని చెప్ప బడునది యదియే. ద్వైతమండలమందలి సామ్యమునకన్న నిది శ్రేష్ఠమైనదని యీ యభేద దర్శనమును గూర్చి శ్రీశంకరాచార్యుల వారు పై వాక్యభాష్యమునందు వ్రాసిరి. ఈ విషయమున నొక యార్యవాక్యము పఠనీయము.

Every soul is a centre of out-going energy and is Divine. The life of man consists in the expression of the life of Atma and it finds expression outwards. In the ealier stages there was nothing to be called vice or virtue. We simply find an outrush of energies. All experience is equally necessary.

"మార్గమును ప్రవేశించ గోరువారు తమ తమ స్వభావములను (జ్ఞాన, ఇచ్ఛా, క్రియా భావములు, దేహ, ఇంద్రియ, మనో, బుద్ధి భావములు) వివేకపూర్వకముగ నుపయోగించవలెను."

ఇంతవఱకీ వ్యాఖ్యానసూత్రములో జెప్పినదాని నొక యుదాహరణమువలన గ్రహించవచ్చును.

ఒక సౌధము నెక్కుటకు మూడుమార్గము లున్న వనుకొందము. ప్రతిత్రోవన సోపానములున్నవి. ప్రతిత్రోవన నొక్కొక్క మెట్టెక్కుచు రావలయును. ఈ మూడుత్రోవ లొక్కచోట గూడును. అచ్చటినుండి మఱియొక శ్రేణికద్వారా సౌధాగ్రమును జెందవలెను.

ఒక మార్గము భక్తిమార్గ మనుకొందము. అందిచ్ఛాశక్తి ప్రాముఖ్యము చెందియుండును. ఆ మార్గమునందు రాగద్వేషములు దుర్గుణములు. ఒక్కొక్క దుర్గుణ మొక క్రిందిమెట్టు. దానిపైనుండునది తద్విరుద్ధసుగుణము. పైమెట్టును జూచుకొని క్రింది మెట్టును విడనాడి పైకి బోవలయును. దాని పైమెట్టు మఱియొక సూక్ష్మమైన రాగద్వేషరూపదుర్గుణము. దానికి వ్యతిరేకమైన సుగుణము దాని పైమెట్టు. ఇట్లు దుర్గుణములు సుగుణములు రెంటిని, సోపానములుగ జేసికొని యోగమార్గమును జేరవలెను. ఆ యోగస్థానమే మూడు కలిసినస్థలము. ఇక సౌధాగ్రము జెందించు శ్రేణిక యోగసాధనము. అగ్రమును జేరినవాడు ముక్తుడు. ఈ యోగమార్గమునం దన్ని భావములను బూర్ణము చేసికొనవలెను.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥
(భ. గీ. 6-46)




దుర్గుణ సుగుణములు ప్రతిమార్గమునందును శ్రేణికలయొక్క పర్వములు.

వ్యాఖ్యాన సూత్రములో సర్వభావములను వివేకములో నుపయోగించవలె నని చెప్పినమార్గము క్రింది యొక్కొక్క సాధనమార్గము కాదు. పైన జూపబడిన యోగమార్గము.

> యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।
> సర్వసంకల్పసంన్యాసీ యోగారూఢ స్తదోచ్యతే ॥ భ.గీ. 6-4

కర్మమార్గమునందు ఫలాపేక్ష, కర్మయందభిమానము (సంగము) అను దోషములను జయించవలెను. భగవత్కర్మగా జేయుచు రావలయును. ఇచ్చట యుపాధి స్థూలశరీరము (Physical Body). భక్తిమార్గమునందు విషయములయందలి రాగద్వేషములు దోషములు. ఆ విషయములయందీశ్వర దర్శనముచే ప్రేమనభ్యసించుచూ రాగద్వేషములను బోగొట్టుకొనవలయును. ఇచ్చట యుపాధి కామ

శరీరము (Astral Body). జ్ఞానమార్గమునందు భేదదర్శనము దోషము. మనస్సు సదా రెండవ వస్తువును జింతించుచుండును. విషయములను గూర్చికాని వాని వాసనలను గూర్చికాని సంకల్పించుచుండును. మనోమయకోశ మిట్లు తన యిష్టానుసారము సంకల్పించుచున్నంతవఱకు నఖండైకరసానుభవము కలుగ నేరదు. ధ్యాన, ధ్యాతృ, ధ్యేయముల లొక్కటి కావలెను. జ్ఞాన, జ్ఞాతృ, జ్ఞేయభేదము నశించవలెను. అందుకు మనోమయకోశము స్వేచ్ఛగా సంకల్పించకుండునట్లు చేయవలెను. ఇట్లు చేయుట సర్వసంకల్పసంన్యాసము. యోగారూఢు డీ మూడు విధములగు దోషములను జయించి మూడుపాధులను వశపర్చుకొని మూడు భావములను బరిపూర్ణము చేయవలెను. ఇదియే యీ వ్యాఖ్యానసూత్రములో జెప్పబడిన మార్గము, సర్వభావములను వివేకముతో నుపయోగించుట యని బోధించుటయును.

### వ్యాఖ్యానసూత్రము

"ప్రతిమానవుండును దనకు దానే మార్గము, సత్యము (ధర్మము), అనుష్ఠానము."

ఈ మార్గము, ధర్మము, అనుష్ఠాన మను మూడు పదములను గుఱించి 17 వ వ్యాఖ్యానసూత్రములో విచారింపబడెను.

మార్గమున నడచి లక్ష్యస్థానమును జేరినపుడు తానే మార్గమగును. అందువలననే మార్గమునకు సయితము గీతలో యోగమనే చెప్పబడియున్నది. తనకు దానే మార్గమగును అనగా ఆ మార్గమున సిద్ధిపొందునని యర్థము. తానే ధర్మమనగా ఆ ధర్మము వానియందు బూర్ణముగ నిమిడియున్నది యని భావము. తానే అనుష్ఠానమనగా ఆ ధర్మమును దెలిసికొని అనుభవించుచూ లోకసంగ్రహసేవజేయునని యర్థము.

## అయిదవ అధ్యాయము

## III

## యోగమార్గాన్వేషణము, అహంకారస్వరూపము

### 20 వ వ్యాఖ్యానసూత్రము

"'అహం' అను భావమునంతయు దృఢముగ గ్రహించి, ప్రబుద్ధమైన యధ్యాత్మనిశ్చయ బలముచే నీ యహంభావము తాను గాదనియు, అయితే ప్రయాసతో దన యుపయోగము కొఱకు దాను నిర్మించుకొనినదే యనియు, దాను ఔఱుగు కొలదియు, దన బుద్ధికుశలత మెల్లమెల్లగ నభివృద్ధియగుచురాగా, అహంభావ అతీత దశను జెందించుటకు దానిని సాధనముగ జేసికొనుటయే తన యుద్దేశ్యమనియు దెలిసికొనినప్పుడు తానట్లు కాగలడు."

అహంభావమన నెట్టిది, దాని నెందుకు బ్రయాసతో నైనను నిర్మించుకొనవలయును? అట్లు శ్రమపడి కల్పించుకొనిన దానిని "అది నేనుగాదు" అని ఎందుకు భావించి దాని నతిక్రమించవలెను?

అహంభావము ప్రకృతితత్వములలో జేరినదియే కాని ఆత్మకాదు. తత్వసంఖ్యనిరూపణంబు శ్రీమద్భాగవతమునం దనేక స్థలములలోను, (అందు ముఖ్యముగ, బ్రహ్మనారదసంవాదము 2-5, విదురమైత్రేయ సంవాదము 3-5, కపిలదేవహూతి సంవాదము 3-26, శ్రీకృష్ణోద్ధవ సంవాదము 11-22), భగవద్గీత, ఉపనిషత్తులలోను, మఱియు దివ్య

జ్ఞానసమాజమువారు రచించిన గ్రంథములలోను జేయబడియున్నది. ప్రథమతత్త్వము ప్రకృతి లేక మూలప్రకృతి, అవ్యక్తము లేక అవ్యాకృతము. ఇందు సత్త్వరజస్తమోగుణము లాదియందు సామ్యావస్థలో నుండును. ఈశ్వరుని కాలశక్తిచే నాగుణములకు క్షోభకలుగును. ఈశ్వరుని చిచ్ఛక్త్యంశ (చిదాభాసము) ప్రవేశముచే బ్రకృతికి బరిణమించు శక్తి కల్గును. కావున ప్రతితత్త్వమునకు మూడు కారణము లుండును. 1. ఉపాదానకారణమగు త్రిగుణాత్మకమైన ప్రకృతి 2. నిమిత్తకారణమగు చిదాభాసము 3. గుణక్షోభకరియగు కాలము. ఈ మూటికి 1 కాల 2 మాయ 3 అంశము లని పేర్లు. అవ్యక్తము నుండి రెండవతత్త్వమగు మహత్తత్త్వ ముద్భవించె. అది లయవిక్షేపశూన్యంబైనదనియు, జగదంకుర కారణంబనియు, విజ్ఞానాత్మకంబనియు, నాత్మగతవిశ్వవ్యంజకంబనియు, దమోనిరాసకంబనియు జెప్పబడును (3-5-26). ఇదియే (సమష్టి) బుద్ధియని గీతలలో వర్ణింపబడియున్నది. ప్రపంచ మింకను వ్యక్తము కాలేదు. ఈదశ "స ఈక్షత" అను దశకు సరివచ్చునని కొందఱు చెప్పుదురు. "అహం ఏతత్", "బహుస్యాం ప్రజాయేయేతి" అనుదశ యికను రావలెను. "నేను విశ్వమును సృజించెదను" అని "నేను", "ఇది" అను భేదము మనస్సులో సంకల్పము పుట్టవలెను. అంతవఱకు సృష్ట్యున్ముఖము కానేరదు.

సోఽప్యంశ [1] గుణ [2] కాలాత్మా [3] భగవద్దృష్టిగోచరః ।
ఆత్మానం వ్యాకరోదాత్మా విశ్వస్యాస్య సిసృక్షయా ॥
(3-26-28)

[1] నిమిత్తకారణం, [2] ఉపాదానకారణం, [3] క్షోభకరి.

ఈ సంకల్పమువలన నహంకారతత్త్వము పుట్టెను. ఇది మూడవ తత్త్వము. అహంకారతత్త్వము వైకారిక, తైజస, తామసంబని మూడు విధముల బరగె. వైకారిక లేక సాత్వికాహంకారమువలన మనస్సును, మన ఇంద్రియాధిష్ఠానదేవతలును, జనించిరి. ఇది జ్ఞానలక్షణ కర్తృరూపకము. తైజస లేక రాజసాహంకారమువలన జ్ఞానకర్మేంద్రియములును, దామసాహంకారమువలన బంచతన్మాత్రలును బంచశబ్దాది విషయములు నుద్భవించె. రాజసము క్రియాలక్షణ కరణ రూపకము, తామసము ద్రవ్యలక్షణకార్య రూపకము. ఇట్లహంకారమువలన నుత్పన్నమైన నిరువది యొక తత్త్వములు (1 మనస్సు, 2-11 ఇంద్రియములు, 12-21 తన్మాత్రలు, విషయములు) పైన జెప్పనిన మూటితో (అవ్యక్తము, మహత్, అహంకారము) జేరి యిరువది నాల్గు తత్త్వము లయ్యెను. ఇకను విరాట్ సృష్టివిధానం బెట్టులనిన: (360 వ పుట చూడుడు.)

మహదాదిగుణము లొండొంటిం జేర నేరక పరమేశ్వరుని గూర్చి తపస్సుజేయ నా భగవంతు డంతర్యామి రూపమున గ్రియాశక్తితోడ జొచ్చి తత్త్వగణంబునకు బరస్పర సంయోగంబు గావించె. దాన జరాచరలోకములు పుట్టెను. ఈ భగవదంశలే వ్యష్టిరూపులగు జీవులు. ఈశ్వరసంకల్పముచే విరాట్స్వరూప ముదయించెను. ఆ విరాడ్రూపముయొక్క యొక్కొక్క యింద్రియమునుండి యొక్కొక్క దేవత యుద్భవించె. ఆ దేవత వ్యష్టిజీవునియొక్క యా యా యింద్రియమున కధిష్ఠాతయై దానిలో బ్రవేశించెను.

కపిలదేవహూతి సంవాదములో విషయతన్మాత్రలు పదియును, దశేంద్రియములును, మనోబుద్ధ్యహంకారచిత్తములును జేరి తత్త్వము

| | | | | |
|---|---|---|---|---|
| 1. | విరాట్ స్వరూపవాక్ | అగ్ని దేవత | జీవునివాగింద్రియము | ముఖమధిష్ఠానము |
| 2. | నాసికలు | అశ్వినులు | ఘ్రాణము | నాసికలు |
| 2 (a) | ప్రాణము | వాయువు | ప్రాణము | నాసికలు |
| 3. | తాలువులు | వరుణుడు | రసము | జిహ్వ |
| 4. | నేత్రములు | ఆదిత్యుడు | చక్షుస్సు | నేత్రములు |
| 5. | కర్ణములు | దిశలు | శ్రోత్రము | కర్ణములు |
| 6. | త్వక్ | ఓషధివనస్పతులు | త్వక్ | చర్మము |
| 7. | పాణి | ఇంద్రుడు | పాణి | హస్తములు |
| 8. | పాద | ఉపేంద్రుడు | పాద | పాదములు |
| 9. | పాయు | మిత్రుడు | పాయు | గుదము |
| 10. | మనస్సు | చంద్రుడు | మనస్సు | హృదయము |
| 11. | బుద్ధి | బ్రహ్మ | బుద్ధి | } హృదయము |
| 12. | అహంకారము | రుద్రుడు | అహంకారము | |
| 13. | చిత్తము | క్షేత్రజ్ఞుడు లేక మహాన్ | చిత్తము | |
| 14. | ఉపస్థ | ప్రజాపతి | ఉపస్థ | మేఢ్రము |

లిరువదినాల్గని గణించబడియున్నది. గ్రంథవ్యాఖ్యాతలు చిత్తమన నవ్యక్తమనియు, బుద్ధియన మహత్తత్త్వమనియు, నహంకారమును, దదంశయగు సాత్త్వికమునుండి పుట్టిన మనస్తత్త్వమును, విషయ భూతేంద్రియ సముదాయ మిరువదియును జేరి యిరువదినాల్గు తత్త్వము అని వ్రాసియున్నారు. అవ్యక్తమహత్తుల కుపాస్యుడు వాసుదేవుడని యు, నహంకారమునకు సంకర్షణుడనియు, మనఃకారణ సాత్వికా హంకారమునకు ప్రద్యుమ్నుడనియు, దైజసాహంకారమున కనిరుద్ధు డనియు నుపాస్యవ్యూహములు చెప్పబడియున్నవి. మఱియు దైజ సాహంకారమునుండి యింద్రియములే కాక వాని యనుగ్రాహక మును ద్రవ్యస్ఫురణ విజ్ఞానాత్మక మైన బుద్ధితత్త్వ ముద్భవించెననియు బోధించబడియున్నది. ఆ కపిలదేవహూతి సంవాదములోనే వ్యష్టి తత్త్వము లిరువదినాల్గు సయితము వర్ణించబడియున్నవి. పది యింద్రియ ములు మనోబుద్ధ్యహంకార చిత్తములను నంతఃకరణ చతుష్టయములు, జేరి పదునాల్గు తత్త్వములును, దన్మాత్ర విషయములు పదితో నిరువది నాల్గయ్యెను. వ్యష్టితత్త్వాధిష్ఠాన దేవతల పేర్లు విరాట్ సృష్టివివర ములో బ్రస్తావించబడెను.

భగవద్గీతలో జెప్పబడిన ఇరువదినాల్గు తత్త్వము లివియే.

5 6 7 8
మహాభూతాన్య హఙ్కారో బుద్ధి రవ్యక్త మేవచ ।

9—13 19 20—24
ఇంద్రియాణి దశైకఞ్చ పఞ్చచేన్ద్రియ గోచరాః ॥

(భ. గీ. 13-5)

| సమష్టి తత్వములు | | | వ్యష్టి తత్వములు |
|---|---|---|---|
| | 1 | 2 | 1 |
| 1. | అవ్యక్తము | చిత్తము | 1. చిత్తము లేక అవ్యక్తము |
| 2. | మహాత్ | బుద్ధి | 2. మహాత్ లేక బుద్ధి |
| 3. | అహంకారము | అహంకారము | 3. అహంకారము |
| 4. | ,, | వైకారిక లేక సాత్విక | 4. మనస్సు |
| 5–14. | ,, | తైజస లేక రాజస | 4. (a) బుద్ధి<br>5–9. జ్ఞానేంద్రియములు<br>10–14. కర్మేంద్రియములు |
| 15–24. | ,, | తామస | 15–24. విషయ తన్మాత్రలు |

## వ్యష్టి తత్వములు (*continued*)

| 2 | 3 | 4 |
|---|---|---|
| 1. క్షేత్రజ్ఞుడు | (Nirvanic atom) | ఆనందమయకోశము |
| 2. బ్రహ్మ | (*a*) విశుద్ధబుద్ధి (Buddhi in Buddhic sheath) | |
| | (*b*) విజ్ఞానము | విజ్ఞానమయకోశము లేక (Causal Body) లేక (Individuality) |
| 3. రుద్రుడు | (3) అహంకారము | |
| 4. చంద్రుడు | (4) శుద్ధమనస్సు (Higher Manas) | |
| | (4) (*a*) అశుద్ధమనస్సు (Lower Manas) | మనోమయకోశము (Mental Body) |
| 5–14. అధిష్ఠానదేవతలపేర్లిదివఱలోనే వ్రాయబడెను. ఆ పుటను జూడుడు. | 5–9. జ్ఞానేంద్రియములు | |
| | 10–14. కర్మేంద్రియములు | ప్రాణమయకోశము Etheric Double |
| | 15–24. విషయ తన్మాత్రలు | అన్నమయకోశము Physical Body |

శారీరకోపనిషత్తులో మనస్సునకు గళాంతము స్థానమనియు, బుద్ధికి వదనమనియు, నహంకారమునకు హృదయమనియు, నవధారణలక్షణమగు చిత్తమునకు నాభి స్థానమనియు, జెప్పబడియున్నది. మఱియు జాగ్రదాద్యవస్థల నిరూపించునపుడు :—

ఇంద్రియ, అంతఃకరణచతుష్టయాఖ్య చతుర్దశ కరణయుక్తం జాగ్రదవస్థా । అంతఃకరణచతుష్టయ యుక్తం స్వప్నః । చిత్తైక కరణా సుషుప్తిః । కేవలం జీవయుక్తమేవ తురీయం ॥ అని చెప్పబడి యున్నది.

సుషుప్తియం దంతఃకరణ చతుష్టయము పైకి తక్కిన మూడు చిత్తమందు లయించి చిత్తమొకటియే యుండుటవలనను, నాభి లయస్థానమగుటవలనను, నాల్గు నొకటియగు దశకే చిత్తమని యూహించదగి యున్నది. ఇందువలన దివ్యజ్ఞానసమాజాధ్యక్షురాలగు శ్రీమతి అనీ బెసెంటమ్మగారు యోగవిషయిక యుపన్యాసములో జిత్తము తక్కిన మూడింటిచేరికయే యని చెప్పినది—that it is the summation of the remaining three—స్వప్రమాణముగ నున్నదని నమ్మవచ్చును.

## వ్యష్టితత్వములు

1. క్షేత్రజ్ఞుడు:—ఇతడే ఈశ్వరాంశయగు జీవుడు. స్వరూపతః అవినాశి, శుద్ధుడు, నిర్లేపుడు.

యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।

(భ. గీ. 13-32)

అవ్యక్తమను నవిద్యతో (Nirvanic atom) గూడి బుద్ధ్యాద్యుపాధి సహితుడై కర్మలజేయుచు దత్ఫలముల భోగించుచు సంసారమున బరిభ్రమించుచుండును. ఉపాధిధర్మములను దనవిగా భావించుటయే సంసారకారణము. దీనికే గుణసంగమని పేరు.

పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్ ।
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥

(భ. గీ. 13-12)

౨. బుద్ధి:—దీనికే సాంఖ్యులు మహత్ అని పేరిడిరి. దీని యనుగ్రాహకము సమష్టి మహత్తత్వము లేక హిరణ్యగర్భ సమష్టి బుద్ధి. ఇది యాత్మయొక్క అత్యంత సన్నిహితోపాధి. దీనిలోనే ఆత్మసాక్షాత్కారము కావలెను.

బుద్ధిగ్రాహ్యమతీంద్రియం । (భ. గీ. 6-21)
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥
(క. ఉప.)

దీనికే గీతయందు విశుద్ధబుద్ధియని పేరిడబడినది.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తః
(విశుద్ధయా = మాయారహితయా—భ. గీ. 18-51, ౫౦ ॥ భా)

ఈ బుద్ధియే కర్తృలక్షణము గలది. సకల ప్రవృత్తులకు వలయు జ్ఞానము దీనివలన గలుగుచుండుటవలన దీనికి విజ్ఞానమనియు పేరు గలదు.

విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపి చ ।
(తై. ఉప.—ఆనందవల్లి)

బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ।
విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః ॥ (క. ఉప.)

కర్తృత్వ భోక్తృత్వ కార్యములం దీ బుద్ధి యహంకార సంయుక్తముగ నుండును. "నేను" అను జ్ఞానముకలుగక ఎట్టి పనులుచేయ నసాధ్యమగుటవలన బుద్ధి, అహంకారము, వైకారికాహంకార జనిత మనస్సు (ఇది శుద్ధమనస్సు) అను నీ మూడును విజ్ఞానమయ కోశాభిమానులై పనులు చేయుచు ఫలముల భోగించునవి యగును.

అయం మహా నహంకారవృత్తిమాన్ కర్తృలక్షణః ।
సర్వసంసార నిర్వోఢా విజ్ఞానమయ శబ్దభాక్ ॥
(సర్వవేదాంతసార సంగ్రహము)

బుద్ధిశబ్దేన, విజ్ఞానశబ్దేన, అహంశబ్దేన తత్ర తత్ర వ్యవహ్రియతే—తత్రకఠాః కర్తరి, బుద్ధిశబ్దమేవ మానంతి— బుద్ధిం తు సారథిం విద్ధి । సోఽయం బుద్ధివిజ్ఞాన శబ్దాభ్యాం అభిధీయమానః పదార్థః సర్వైరపి అహంశబ్దేన వ్యవహ్రియతే—తేనైవ అహంకర్తా అహంప్రత్యయినా సర్వాః క్రియాః నిష్పాద్యంతే । తత్ఫలం స ఏవ అశ్నాతి ।
(తై. ఉప. విద్యారణ్య భాష్యం)

ఈ కర్తృలక్షణ విజ్ఞానమయ కోశమునకే శ్రీమద్భాగవతమునందు నారద ప్రాచీనబర్హి సంవాదములో మనఃప్రధాన లింగశరీరమని పేరిడిరి. ఆ లింగశరీరము ప్రతిజన్మకు మాఱక యుండునని నారదుల వారు సెలవిచ్చిరి. దివ్యజ్ఞానసమాజమువారు జన్మజన్మకు మాఱక సకల ఫలానుభవజ్ఞానము సేకరించుచుండెడి యీ విజ్ఞానమయకోశము

లేక మనఃప్రధాన లింగశరీరమనకే—అహంకార ఉపాధియనియు (vehicle of the Ego), శుద్ధమన ఉపాధియనియు (vehicle of higher manas), జన్మాంతర బీజముల గలిగియుండుటచే గారణ శరీర మనియు (causal body) బేరిడిరి. ఇట్లహంకార సంయుక్త బుద్ధి విజ్ఞానమనియు దద్వియుక్తబుద్ధి మహత్ లేక విశుద్ధబుద్ధి యనియు నెఱుగవలయు.

4 (a) ఈ బుద్ధి రెండవ తత్వమగు బుద్ధికాదని భాగవతవ్యాఖ్యాతలు వ్రాసిరి. అది కర్తృలక్షణముగలది. ఇది కరణలక్షణము. దివ్యజ్ఞానసమాజ గ్రంథములలో నిది యశుద్ధమనస్సనియు, నికృష్టమనస్సనియు (lower manas) బేర్కొనబడియున్నది. ఇది రాజసాహంకారమువలన నుత్పన్నమైనది. రెండవ తత్వము మహత్తత్వము కారణముగాగలది. నాల్గవ తత్వమైన శుద్ధమనస్సు సాత్వికాహంకారమువలన బుట్టినది. సాత్వికమే జ్ఞానలక్షణము, కర్తృగుణము గలది రాజసము కరణలక్షణమే కాని కర్తృలక్షణము కాదు. ఈ విషయమందు శ్రీ శాయనాచార్యులవా రిట్లు వ్రాసిరి :—

> "అంతఃకరణ చతుష్టయం కరణస్యైవ వ్యాపారవిశేషాః
> బుద్ధిరూపం తు కరణాత్ పృథగేవ తత్వం."

ఈ కరణలక్షణ తత్వముగ గనపరచబడియుండు బుద్ధియనునది శుద్ధమనస్సు, బుద్ధి, అహంకారముల ఛాయ (Ray). ఆ మాటి లక్షణము లిందున్నవి. వానిచే నింద్రియముల ననుగ్రహించుచు, వానితో జేరి క్రియారూపమున గరణలక్షణము గలదియై పనులుచేయుచు, నింద్రియవ్యాపారజనిత జ్ఞానము నొందుచుండును. ఈ తత్వసంఖ్య

నిరూపణము మిక్కిలి కఠినమైన విషయము. గ్రంథములలో ననేక భేదములుగ బోధించబడి యుండును. ఈ విషయములో నుద్ధవుని ప్రశ్నయును శ్రీ కృష్ణుల యుత్తరమును బఠనీయములు.

శ్రీభగవాన్—

పరస్పరానుప్రవేశాత్ తత్త్వానాం పురుషర్షభ ।
పౌర్వాపర్య ప్రసంఖ్యానం యథావక్తుః వివక్షితం ॥
ఏకస్మిన్నపి దృశ్యంతే ప్రవిష్టానీతరాణిచ ।
పూర్వస్మిన్నపరస్మిన్వా తత్త్వే తత్త్వాని సర్వశః ॥
పౌర్వాపర్యమతో మీషాం ప్రసంఖ్యాన మభీప్సితాం ।
యథా వివిక్తం యద్వక్త్రం గృహ్ణీమో యుక్తిసంభవాత్ ॥
. . . . . . . . . . . . . . . . . . . . . . . . .
సర్వం న్యాయ్యం యుక్తిమత్త్వాద్విదుషాం కిమశోభనం ॥

(శ్రీ భాగ. 11-22-8, 9, 20, 26)

"కార్యతత్త్వములో గారణతత్త్వప్రవేశము గలుగును. కారణతత్త్వములో గార్యతత్త్వము లయించును. ఇట్లు తత్త్వములకు బరస్పరానుప్రవేశము కలదు. చూచువాడు ప్రత్యేకముగనైన గణించవచ్చును. చేర్చి యొకటిగానైనను గణించవచ్చును. ఇట్లుచూచి చెప్పువాని దర్శన గణన భేదమున దత్త్వసంఖ్య భేదించును. అన్నియు సరియే. విద్వాంసుల కెయ్యది యశోభనంబు ?"

ఈ తత్త్వసంఖ్య విచారమువలన నహంకార మొక తత్త్వమేయనియు, నది విజ్ఞానమయకోశము లేక మనఃప్రధాన లింగశరీరము నాశ్రయించియున్నదనియు, నా కోశమున నహంకార సంయోగ

మున మనోబుద్ధులు కర్తృత్వభోక్తృత్వాది గుణముల బ్రవర్తించు చుండుననియు దెలియవచ్చెను. "నేను" అను బ్రత్యేకజ్ఞానము లేని యెడల బ్రపంచవిషయజ్ఞానము విస్పష్టముగ గలుగనేరదు. తల్లిగర్భములో ననేకులు బిడ్డలుండునపుడు తల్లి తిను నాహారమే ఆమె దేహపోషణకును బిడ్డలకును గావలసియుండును. గర్భములో బిడ్డలు పెఱిగి బలవంతులు కానేరరు. భూపతనమై బ్రత్యేకముగ జీవించ నారంభింప దన యాహారము తనకు జెందుచుండ బిడ్డ పుష్టి తుష్టిగలిగి పెద్దపెఱిగి బలము, శక్తి, తేజస్సును బొందును. వృక్షపశ్వాదులందు జీవులు గణములుగ (Group souls) నుండుటవలన నందఱుచేరి ఘనీభూతమైన యనుభవజ్ఞానము కొంచెము కొంచెముగ బొందుచుందురు గాని విశేషజ్ఞానము పొందజాలరు. మనుష్యజన్మ ప్రాప్తమైన వెంటనే అహంభావము పుట్టును. ప్రతియనుభవమును బ్రతిమనుష్యునికి బ్రత్యేకముగ జ్ఞాన మొసగుచుండుటవలన బెక్కుండ్రకు బ్రాప్తించ గలుగు జ్ఞానముకన్న మిక్కిలి యెక్కుడుగ బ్రాప్తించును. ఈ ప్రపంచజ్ఞానము మఱియు నెక్కుడుగ లభించుటకు నొక్కొక్క విషయగ్రహణమున కొక్కొక్క యింద్రియమును జీవుడు నిర్మించుకొనును. ప్రతిలోక విషయానుభవమునకు వేఱు వేఱు ఉపాధి కావలసియుండును. పైలోక ఉపాధికన్న గ్రిందిలోక ఉపాధి స్థూలతరము. అహంభావ కారణమున, 'నేనీయుపాధిని' అని దేహతాదాత్మ్యము కలుగుచు వచ్చును. అది విషయానుభవమునకు గావలసినదియే. విషయానుభవముచే విషయవిలక్షుణు డాత్మయను జ్ఞానము కలుగవలెను. ఆ జ్ఞానము నివృత్తిమార్గమునందు గాని కలుగదు. ప్రవృత్తిమార్గమునందుపాధి తాదాత్మ్యము "నేను విషయముల ననుభవించుచున్నా

ను" అను భావ మవశ్యమే. అన్ని యనుభవములు భోగించి యందు సారము లేదని తెలిసికొనినప్పుడు విరాగము కలుగును. అప్పుడు గురు ప్రసాదమువలనను స్వప్రయత్నమువలనను స్థూలదేహము నేనుగాదని మొదట దెలిసికొని, ఇంద్రియములు నేనుగాదని పిమ్మట, మనస్సు సయితము నేనుగాదని యటుపిమ్మట దెలియవచ్చును. అంతవఱకు నన్నమయ ప్రాణమయ మనోమయ కోశాభిమానియై భూతాత్మ, ఇంద్రియాత్మ, సంకల్పాత్మల సంఘాతము అగు విజ్ఞాన ప్రతిబింబమే (Personal ego, Lower self) పనిజేయుచుండును. ఈ ప్రతిబింబము వేలకొలది జన్మములెత్తి స్వీకరించిన యనుభవజ్ఞానములలో సర్వజన్మ సామాన్యధర్మములను మాత్రమే విజ్ఞానమయకోశము గ్రహించును. కామము, క్రోధము, కేవల స్వలాభార్థవిషయగ్రహణము, ఇవి మనోమయకోశము వఱకే కాని విజ్ఞానమయకోశమును జెందజాలవు. ఆ కోశము సత్వగుణ ప్రధానము కావున నందు సత్వగుణధర్మములైన కామరహిత పరిశుద్ధ గుణములు మాత్రమే చేరగలవు. అన్ని విషయములద్వారా అనుభవించునది జీవుడే. తొలుత విషయప్రచ్ఛన్నాత్మానుభవ తృష్ణ కలిగి యుండును. అటుపిమ్మట నఖండాత్మానుభవ తృష్ణ గలుగును. ప్రచ్ఛన్నాత్మానుభవ తృష్ణను బట్టి స్థూల స్థూలతర యుపాధుల నిర్మించుకొనుచు, వాని తాదాత్మ్యమును జెందుచు విషయములద్వారా అనుభవించబడునది యాత్మయని యెఱుగక విషయమని యనుభవించుచు గ్రమక్రమమున నొక్కొక్క యుపాధి తాదాత్మ్యమును వదలి నే నే యుపాధికాదని తెలిసికొనును. అత్యంత స్థూలమైన అన్నమయ ప్రాణమయ కోశానుభవములు సమాప్తిచెందినపుడు ఆ యనుభవములసారజ్ఞాన మా యుపాధుల

కారణమగు మనోమయకోశములో జేరును. అప్పుడు "నే నన్నమయ ప్రాణమయ కోశములు కాను" అను జ్ఞానము కలుగును. ఆ జ్ఞానముయొక్క ఫల మేమన, ఆ రెండు కోశములు కోశమాత్రములుగ నుండును. అనగా జీవుడెట్లు సంకల్పించునో అట్లు ప్రవర్తించును. జీవుని బూర్వమువలె నవి వశపరచుకొననేరవు. వాని వశములో నుండును. అట్లే మనోమయకోశమువలన సంపాదించవలసిన జ్ఞానమంతయు స్వీకరింపబడిన పిదప నా జ్ఞానసారము విజ్ఞానమయ కోశమును జేరును. అప్పుడు మనోమయకోశ తాదాత్మ్యము పోవును. తాను సంకల్పించమనిన సంకల్పములు మాత్రము కోశము సంకల్పించునుగాని కోశమునకు స్వేచ్ఛాప్రవర్తన ముండదు.

ఇట్లు లోహ, వృక్ష, జంతు కోట్లలో వేనవేలు జన్మములెత్తి, వ్యూహవ్యూహానుభవములను (Group experiences) జెంది కడపట మనుష్యజన్మమెత్తి యహంకారసంయుక్తమై, యొక్కొక్క యుపాధివలన నొక్కొక్క లోకానుభవము ప్రత్యేకముగా బొంది యొక్కొక్క యుపాధివలన లబ్ధమైన విషయజ్ఞానసారమును దాని కారణోపాధియగు సూక్ష్మతర యుపాధియందు గ్రహించి యసంఖ్యాతములగు జన్మములు గడచినపిమ్మట నన్నమయ ప్రాణమయ మనోమయకోశముల సారమును విజ్ఞానమయకోశమందు జేర్చుకొనును. ఇన్ని జన్మములెత్తి, ఇన్ని యనుభవములను బొంది, నిస్సారమును దోసివేసి సారమును మాత్రమే గ్రహించి, పెటిగినది విజ్ఞానమయ కోశము. పైన జెప్పినప్రకారము కేవల శుద్ధసంకల్పములే ఈ యుపాధియందు జేరగలవు. ఇందువలన జూడగా, బహుప్రయాసతోదన యుపయోగార్థము (ఆత్మజ్ఞానార్థము) విజ్ఞానమయకోశమను

"అహం" కార్యాశ్రయోపాధి నిర్మించుకొనబడెనని సూత్రములోఁ జెప్పినది నిజమేయని తెలియవచ్చును. అయితే ఈ సత్వప్రధానకోశము కూడ నశించవలెను. ఎంత సూక్ష్మమైనను దేహము నశించ వలసినదే కదా!

"అంతవంత ఇమే దేహాః నిత్యస్యోక్తాశ్శరీరిణః" ఏది పుట్టునో అది నశించును. "జాతస్య హి ధ్రువో మృత్యుః" అసత్తునకు సద్భావములేదు. అన్నిదేహము లసత్తులే. "నాసతో విద్యతే భావః" సత్వగుణము సయితము బంధించును.

కావున విజ్ఞానమయకోశము నతిక్రమించవలెను. ఆ కోశమునందు గర్తృత్వ భోక్తృత్వాభిమాన మున్నది. పరిశుద్ధసంల్పములను గోరి కలను బ్రేరేపించినను "నేను" అను భావమున్నది. జన్మబంధ వినిర్ముక్తి కీయుపాధిని సయితే మతిక్రమించవలెను.

స్వప్రయోజనార్థ మే కార్యమును జేయక, ఏసంకల్పమును సంకల్పించక, అన్నియుపాధులను వశపర్చుకొని, ఇంద్రియ మనోనిగ్రహ బలముచే గామము నణచి, సర్వభూతహితుడై, సర్వభూతములు భగవత్స్వరూపములని తలచి, యన్నింటిని బ్రేమించుచు, దన స్వంతవిషయమై సుఖము ప్రాప్తించినను దుఃఖము ప్రాప్తించినను సరకుచేయక, స్తుతినిందాది సర్వద్వంద్వసహిష్ణుడై, సమత్వబుద్ధి నాశ్రయించినప్పుడు విజ్ఞానమయకోశము ద్వారా లభ్యముకాగల యనుభవజ్ఞానముండదు. ఆ జ్ఞానసారమంతయు విశుద్ధబుద్ధి లేక మహత్ అను శుద్ధసత్వోపాధి యందు జేరును. అప్పుడు విజ్ఞానమయకోశము నశించును. దీనికే యొక మెట్టున లింగభంగమని పేరు. వలయునప్పుడు క్రొత్తగా నిర్మించుకొనబడును గాని దానివలన బొందబడవలసిన జ్ఞానముండదు.

ఈదశకే సూత్రములో "ప్రబుద్ధమైన అధ్యాత్మనిశ్చయబలము" అని వర్ణించబడియున్నది. ఈదశలో

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥

(భ. గీ. 6-29)

అను వాక్యార్థము బోధకువచ్చుటకు ప్రారంభమగును. పిమ్మట క్రమక్రమముగ నా యభేదబుద్ధి వృద్ధియగుచువచ్చును. కావున సూత్రములో జెప్పిన ప్రకారము "అహం" భావము, "అహం భావాతీతదశను" జెందించుటకు సహకారియని యెఱుగవలయును. మనోమయకోశము నతిక్రమించువఱకు "అహం" కారాశ్రయమైన విజ్ఞానమయకోశమే లక్ష్యస్థానముగ నుండును. ఎందువలన ననగా అందు బరిశుద్ధసంకల్పములు మాత్రము చేరును. అందువలననే దేవతలు విజ్ఞానమే బ్రహ్మయని యుపాసించెదరని తైత్తిరీయోపనిషత్తులో జెప్పబడియున్నది.

విజ్ఞానం దేవా స్సర్వే బ్రహ్మ జ్యేష్ఠముపాసతే ।
విజ్ఞానం బ్రహ్మ చేద్వేద తస్మాచ్చేన్న ప్రమాద్యతి ।
శరీరే పాప్మనో హిత్వా సర్వాన్ కామాన్ సమశ్నుత ఇతి ॥

"ఇందుకొఱకే విచిత్రమైనట్టియు దురవగాహమైనట్టియు లేన ప్రవిభక్త జీవితమేర్పడి యున్నదని తెలిసికొనినపుడే వాడు మార్గము నందు ప్రవేశించిన వాడగును."

ప్రవిభక్త జీవితమనగా అహంభావ సంయుక్త జీవితము. ప్రతి మనుష్యుడు భోగించిన భోగములు, అనుభవించిన విషయములు తనవి

యని తెలిసికొని వానిద్వారా జ్ఞానమును బొందుట. నశ్వరమగు దానినే స్థిరమనినమ్మి సంసారసాగర నిమగ్నుడగుటయే విచిత్రము. ఆత్మ యొక్కటియే సత్యము, అనాత్మయు దాని వికారము లసత్యములు కదా. ఇట్టి యసత్య ప్రకృతి వికారమైన 'అహం' భావము వలన నింత యుపయోగ మున్నదను విషయమును, దుది నశించునదైన, నాదియందు దానివలననే జ్ఞానము లభించి మోక్షమార్గమును బ్రవేశించుటకు సాధ్యమను విషయమును, దురవగాహాములే.



## అయిదవ అధ్యాయము

## IV

## యోగమార్గాన్వేషణము, విషయానుభవము

"గూఢమైనట్టియు తేజోవంతమైనట్టియు నీ యంతరాత్మయందు లోతున దిగి దానిని వెదకుము."

గూఢమైనట్టిదియు విభూతివంతమైనట్టిదియు నాత్మయే.

తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం
గుహాహితం గహ్వరేష్ఠం పురాణం ।
అధ్యాత్మయోగాధిగమేన దేవం
మత్వా ధీరో హర్షశోకౌ జహాతి ॥ (కఠ. ఉప.)

యః సర్వజ్ఞః సర్వవిద్యస్యైష మహిమా భువి ।
దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమన్యాత్మా ప్రతిష్ఠితః ॥
(ముం. ఉప.)

బుద్ధిగుహాయందు గూఢముగ నుండునట్టియు, నధ్యాత్మయోగము చేతనే తెలియదగినట్టిదియు మిక్కిలి మహిమగలదియునగు ఆత్మను సాక్షాత్కరించుటకు సాహసముతో బ్రయత్నించవలెనని సూత్రము బోధించుచున్నది. మనసొమ్ము లోతుభావిలో బడినయెడల సాహసముతో దానిలోనికి దూకి సొమ్మును గనిపెట్టి తెచ్చుకొనియెదము

కదా. ఆత్మ మనకు సదా సన్నిహితముగానే యున్నది. అయినను మనము సంసార సముద్రములో మునిగి, ఆత్మతేజస్సును బహిఃప్రకాశము చేయుట కుపయుక్తముగ స్వచ్ఛముగ నుండవలసిన యుపాధులను మలినము చేసికొని, యజ్ఞానపరవశుల మగుటచే నత్యంత సన్నిహితమైన యాత్మను జూడలేకయున్నారము.

యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః ।
(భ. గీ. 15-11)

ఆ యజ్ఞానావరణమును బోగొట్టుకొనవలెను. ఒక్కొక్క యుపాధిని బరిశుద్ధముజేసికొని యన్నిటి లోపలనుండు ఆత్మను సాక్షాత్కరించుకొనవలెను. సముద్రములోబడి మునిగిపోయినట్టువలె మనకు దోచుదానిని దుమికి లోతునుండి వెలుపలికి దేవలయును. అందుకు మూ డంతస్థులు సూత్రములో జెప్పబడియున్నవి.

మొదటిది :—ప్రపంచములో సుఖదుఃఖరూపమైన విషయానుభవము.

రెండవది :—ప్రపంచ మెద్దానిచే ధరించబడుచున్నదో అట్టి ధర్మజ్ఞానము.

మూడవది :—మార్గదర్శనము.

మొదటిదశ "నీ యనుభవము నంతటిని బరిక్షించుటవలన" ఇత్యాది వాక్యముచే దెలుపబడుచున్నది. రెండవదశ "అధ్యాత్మ తత్త్వములను మఱియు దృశ్యాదృశ్య ప్రకృతిధర్మముల పరిశీలించుట వలన" అను వాక్యముచే నెఱుగబడుచున్నది. మూడవదశను దెల్పు వాక్యము "నీలోపల మందప్రకాశముతో వెలుగుచుండు నక్షత్రమునకు సమర్పణము" అనునది.

మొదటిదశ:—నీయనుభవము నంతటిని బరిక్షించుటవలన దానిని వెదకుము.

"అనుభవముల నన్నింటిని బరీక్షించుటవలన దానిని వెదకుము; ఇట్లు చెప్పుటవలన 'దానిని దెలిసికొనుటకై ఇంద్రియములయొక్క దుష్ప్రేరేపణకు లోబడవలెను' అని నేను జెప్పలేదని స్మరించుము. నీవు గుప్తవిద్యా సాధకుడవగుటకు బూర్వ మట్లు లోపడవచ్చునేమో గాని పిమ్మట గూడదు. నీవు నిశ్చయించుకొని మార్గమును బ్రవేశించిన పిదప ఈ దుష్ప్రేరేపణలకు లోబడెదవేని యవమానము కలుగక పోదు."

విషయోపభోగముచేతనే జ్ఞానము క్రమక్రమమున బ్రాప్తమగునని 6–8 సూత్రములవలన దెలియబడెను. మఱియు నితర స్థలములలో నీ విషయము విపులముగా విచారించబడెను. ఈ యర్థమునే దక్షుడు నారదు నుద్దేశించి చెప్పెను.

> నానుభూయ న జానాతి పుమాన్ విషయతీక్ష్ణతాం ।
> నిర్విద్యేత స్వయం తస్మాత్ న తథా భిన్నధీపరైః ॥
>
> (శ్రీ భాగ. 6–5–41)

విషయముల ననుభవించనివాడు విషయముల తీక్ష్ణత నెఱుగజాలడు. (వాని ననుభవించి, వానియందు సారములేదని యెఱిగి, కాలపక్వమున) వానినుండి నిర్వేదము చెందవలయునే కాని ఇతరుల ప్రేరేపణవలన విరాగము కలుగనేరదు. ఈ బోధవలన దురభిప్రాయమును శంకించి టీకావచనము చెప్పబడుచున్నది. ఇంద్రియములద్వారా విషయములను భోగించవలసినదే యని చెప్పిన మాత్రమున నింద్రియలోల

త్వము బోధించబడి యుండలేదని టీక హెచ్చరిక చేయుచున్నది. ప్రపంచజ్ఞానార్జనముకొఱకే అనగా ప్రపంచవిషయమైన జ్ఞానమును సంపాదించుటకొఱకే ఇంద్రియము లేర్పడియున్నవి. వానితో మనము తాదాత్మ్యము నొంది వాని యిచ్ఛానుసార మవి వర్తించునెడ వానికి మనము విధేయులమై యుండువారల మగుదుము. అట్లు కాగూడదు. ప్రతి జ్ఞానేంద్రియమువలన నుపలబ్ధమగు విషయ మీశ్వరుడే యనియు, ప్రతి కర్మేంద్రియమువలన జేయబడుకర్మ ఈశ్వర పూజారూపచే యనియు నెఱిగి విషయోపభోగ, కర్మాచరణముల నవలంబించుటయే కాక ఇంద్రియముల రాగద్వేషములు మనవి కావనియు, నింద్రియములు మన యుపకరణములే యనియు, వాని రాగద్వేషములు మనకు మోక్షమార్గ పరిపంథులనియు నెఱుగవలయు. గురూపసత్తికి బూర్వ మజితేంద్రియులముగ నుండినను దదనంతర మట్లుండిన గురుప్రసాదమున కనర్హులమై తదప్రాప్తి నిమిత్తమైన యవమానము పొలగుదుము. క్రిందిమెట్టులలో నుండునప్పటికన్న బై మెట్టులలో నింద్రియ పరవశత్వముచే గలుగు ఫలములు బలవత్తర హానికరములుగ నుండును.

ఇందువలన నింద్రియములచే వాని వ్యాపారములను జేయించుచు, వానికి బరవశులము కాక వానివలన బొందగల జ్ఞానమును బొందవలయునని తెలియవచ్చుచున్నది. ముఖ్యమైన విషయమేమన, మనము యజమానులము, అవి సేవకులు, కొరముట్లు, సాధనములు, అని సదా మనస్సున నుంచుకొని యుండవలయును. ఈ రహస్యము నెఱుగక కొందఱు "సంసారమునుండి విరమించవలెను, విషయానుభవముచే నింద్రియజయము ప్రాప్తించదు, సంసారమునం దన్ని

విధములైన విషయభోగము లుండనేయుండును, కావున సంన్యసించుటయే కర్తవ్యము" అని తలచెదరు. భగవద్గీతాశాస్త్రము సంసారములోనుండియే నిస్సంగత్వము సాధించి మోక్షము చెందవచ్చునని బోధించుచున్నది. ఈ యర్థమునే టీకావాక్యము చెప్పుచున్నది.

"అయినను వెఱగందక వాని ననుభవించవచ్చును. వానిని బాగుగ నాలోచించి, పరిశోధించి, పరీక్షించి, అవి నిస్సారమాత్రము బాధించజాలని కాలము వచ్చునను నమ్మకమువలన గలుగు నోర్పుతో గాచుకొని యుండదగు."

విషయగ్రహణమునం దేమియు దోషము లేదు. ఆత్మార్థమే యవి సృజించబడియెను. ఇంద్రియములచే నవి గ్రహించబడు. అందుకొఱకే యింద్రియములు నిర్మింపబడెను. ఒక్కొక్క యింద్రియముతో నొక్కొక్క విషయము గ్రహించి సర్వవిషయ గ్రహణంబువలన జ్ఞానసిద్ధియయినచో నింద్రియములకు గర్తవ్యం బెద్దియునుండదు. అప్పుడాదియందువలె నింద్రియములకు విషయములను గూర్చి రాగద్వేషము లుండవు. జీవాత్మ లోకహితార్థము పనిజేయవలెనని తలచి యా యా యింద్రియముతో నా యా విషయగ్రహణం బొనర్చును. ఏ యుపాధియేకాని దాన నొందదగ జ్ఞానము సిద్ధించినవెంటనే ఆ సారమును మాత్రము జీవాత్మ గ్రహించును. అప్పుడుపాధి యనవసరంబగుటంజేసి దాని కారణమందు లయమగును. అయిన లోకసంగ్రహకర్మాచరణకా లోకసంబంధమగు యుపాధి కావలసినయెడల దానిని నిర్మించుకొనుట యాదశయందసాధ్యము కాదు. అట్లు స్వేచ్ఛానిర్మితమైన యుపాధితో నొనర్చబడు కర్మయంతయు నీశ్వర ప్రీతిగా ఈశ్వరసంకల్పానుసారముగ నుండును.

యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనం ॥

ఇంద్రియములతో విషయములను భోగించిన నది ఈశ్వరారాధన మగును.

పూజా తే విషయోప భోగరచనా ।

ఆ యా యింద్రియములతో గ్రహింపబడిన యా యా విషయ మాత్మకు సమర్పించబడిన షోడశోపచార స్వరూపముగ దలచును.

యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్త దాత్మేతి భావయేత్ ।
యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్త దాత్మేతి భావయేత్ ।
నాసయా లభతే యద్యత్ తత్తదాత్మేతి భావయేత్ ।
జిహ్వయా యద్రసం హ్యత్తి తత్త దాత్మేతి భావయేత్ ।
త్వచా యద్యత్ స్పృశేత్ యోగి తత్తదాత్మేతి భావయేత్ ।
ఏవం జ్ఞానేంద్రియాణాం తు తత్తత్సౌఖ్యం తు సాధయేత్ ॥
(యోగతత్వోపనిషత్)

ఇట్లు విషయభోగమం దాత్మదర్శనసౌఖ్య మనుభవించినట్లగును. విషయభోగమునకు వెఱగంద బనిలేదు. విషయములకు ఇంద్రియ మనంబులను జలింపజేయుశక్తి లేకయుండును. జ్ఞానము కలిగినపిదప సయితము ఇంద్రియములలో బహుకాలానుభవమువలన జేరియుండు రాగవాసనలు బాహ్యస్పర్శచే బైకివచ్చి యడ్డగించవచ్చును. అప్పుడు సయితము వెఱగందక "నీవు ఉపాధివాసనాజనిత దోషమే కాని యితరముకాదు. ఆత్మస్వరూపుడనగు నన్ను నీవేమి చేయగలవు" అని యనాదరణ చేసినయెడల దనంతటనే తాను నశించును. కాల క్రమమున నవి ఏలాటి బాధపెట్ట నేరక పోవును. మనము వెఱగం

దుటవలన మనకుపయోగములేని కార్యము చేయుటయే కాక ఇతరుల కు సహాయము చేయనోపము. మన రాగవాసనలు పైకివచ్చిన ట్లితరుల కు గూడ వచ్చిన మనము భయపడక చలించక వాని యథార్థస్థితి నెఱిగి తగు సహాయ మొనర్చవలెను.

పరిపూర్ణమైన సముద్రమునం దెన్నినదులు చేరినను సముద్రము చలిం చని విధమున నాత్మావలోకన సంతుష్టిచెందిన మనుష్యుని విషయ ములు తాకినను జలింపజాలవు.

> ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
> సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।
> తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే
> స శాంతి మాప్నోతి న కామకామీ ॥
>
> (భ. గీ. 2-70)

ఇట్లింద్రియముల నాదియందు జ్ఞానప్రాప్తికొఱకును, ననంతరము లోక సంగ్రహ కర్మాచరణము కొఱకును నుపయోగించవలెనని తెలియ వచ్చును. జ్ఞానప్రాప్త్యనంతరము "నేను జితేంద్రియుడ నైతిని, వీరందఱింద్రియలోలురై యున్నారు, వీరు పాపాత్ములు, వీరికి నే దవ్వున నుండవలెను" అని గర్వించవచ్చును. అది జ్ఞానలక్షణము కాదు. తా నారోహించిన మెట్లన్నియు స్మరించుచుండవలెను. "అజ్ఞానమువలన నింద్రియలోలురై యున్నవారివలెనే పూర్వము నే నుంటిని. ఇప్పుడు నేనుండుదశకు వారు భావికాలమున గాలపక్వ మున రాగలరు. ఆ యా మెట్టున నందు కనుగుణముగ నాత్మక్రీడా, ఆత్మరతి జరుగుచుండును. ఆత్మజ్ఞానముగలవా డనాత్మజ్ఞునియందలి యాత్మ శీఘ్రముగ ప్రకాశమునకు వచ్చునట్లు సహాయముచేయుట

కర్తవ్యము. అదియే ఈశ్వరసేవ. దాన నీశ్వరుడు తృప్తియగునట్లు స్వార్థప్రేరిత ధ్యానాదుల దృప్తినొందడు." ఇట్లు చింతించి యజ్ఞానులకు సహాయమొనర్చి వారిని బైమెట్టుకు దేవలయును. ఈ యర్థము నే వ్యాఖ్యానమాత్రము టీకయు బోధించుచున్నవి.

"మఱియు సజాతీయులై నీతోఁగూడ శ్రమపడుచు నీతోఁగలిసి మానవ జాతియైయుండు, ఇతర ఈశ్వరాంశములయొక్క రమ్యత్వమును ప్రచ్ఛన్నత్వమును దెలిసికొనుటవలనను, దానిని వెదకుము."

సజాతీయులనగా అందఱు మానవజాతివారని యర్థము. మానవ జన్మ పుణ్యపాపమిశ్ర ఫలము.

> పుణ్యేన పుణ్యం లోకం నయతి పాపేన పాప ముభాభ్యా
> మేవ మనుష్యలోకం ॥ (ప్రశ్న. ఉ.)

పుణ్యపాపమిశ్ర మనగా ఆత్మానాత్మ గుణమిశ్రము. దేహతాదాత్మ్య రూపగుణము లనాత్మగుణములు. దానిని వదలించుగుణము లాత్మగుణములు. ఈశ్వరుడు సర్వజనులు జ్ఞానపూర్ణులై తన్నుజెంద వలెనని చేయుసంకల్పబలము (Pressure of the Law of Evolution), ఋషుల తపోబలము, భక్తిజ్ఞాన వైరాగ్యయుతులైన ఋషి శిష్యవర్గములోఁ జేరిన సత్పురుషుల పరిశుద్ధసంకల్పబలము ప్రతి మనుష్యుని నీశ్వరుని దెసకు ద్రిప్ప నుద్యమించుచుండును.

అపరిశుద్ధమనస్సు ఇంద్రియములకు లోనై సంసారము దెస ద్రిప్పుచుండును. ఇట్లు ప్రతి మనుష్యునియందును సదా కురుక్షేత్ర యుద్ధము జరుగుచునే యుండును. అదియందు దుష్పాధులకే జయము కలుగుచుండును. నివృత్తిమార్గమును బ్రవేశించి గురుప్రసాదము బొందినప్పటినుండి ఆత్మగుణ పక్షమున జయము కలుగుచుండును.

అనాత్మగుణములు సంపూర్ణముగ బరాభవము జెందునప్పటికి ముక్త దశవచ్చును. అంతవఱకు బోరాటము జరుగుచునే యుండును. ఒక మనుష్యునికిని మఱియొకనికిని నిందులో భేదము లేదు. ప్రతివాని యందును ఆత్మానాత్మ గుణముల యుద్ధము జరుగుచునే యుండును. పై మెట్టులనుండువారి శత్రుబలము క్షీణించుచుండును. క్రింది మెట్టుల నుండువారి శత్రుబలము విజృంభించియుండును. ఇంతియ భేదము. అందువలననే "నీతో గూడ బోరాడుచుండెడు ఇతర ఈశ్వరాంశలు" అని వ్యాఖ్యానసూత్రములో వ్రాయబడియున్నది. అనాత్మగుణముల నణగద్రొక్కజేయు ప్రయత్నమంతయు రమణీయ మగు కార్యమే. ఆ యుద్ధ మంతరంగమందు జరుగునది కావున ప్రచ్ఛన్నమని చెప్పబడియున్నది. పైన వ్రాయబడిన యోగ తత్వోప నిషద్వాక్యమువలన బ్రతి యింద్రియమువలన గ్రహించబడునది యాత్మ యే యని తెలియవచ్చును. ఏ జీవాత్మను జూచినను, వాడే దశయం దుండు వాడైనను, వానియందాత్మ యాదశకు సూటిగనే క్రీడించు చున్నదనియు, ననాత్మను జయించ బోరాడుచున్నదనియు, ఆత్మ జ్ఞాని దెలిసికొని యానందించును. క్రింది మెట్టున నున్నవారిని జూచు కొలదియు నాత్మవిభూతు లిన్నివిధముల గన్పట్టుచున్నవని పరమ సంతోషము చెందును. అట్లు ప్రతివిషయమునందు ఆత్మ క్రీడ, ఆత్మ రతిని జూచుట కొఱకే యింద్రియములు నిర్మించుకొనబడినవని తెలిసికొనును.

---

## అయిదవ అధ్యాయము

## V

## యోగమార్గాన్వేషణము :

### పామర జనోద్ధరణము—మార్గదర్శనము

"అయితే వానికి లోబడిన మనుష్యుని నిందించవలదు. వాడు బురదలో జిక్కుపడి పాదములు బరువైన నీ సరి బాటసారి యని యెంచి వానికి చేయిచాచి కైదండయొసగుము."

అందఱు జీవలోకమున కవిద్యాపరవశులై వచ్చినవారలే. అందఱు పెక్కుజన్మము లెత్తి జ్ఞానపూర్ణులై ఈశ్వర సన్నిధానమునకు బోవు వారలే. కావున ప్రతియొకనికి బ్రతి యితర మనుజుడును సరి బాటసారియే. సంసారమంతయు బురదయే. దానిని బ్రక్షాళనము చేయు జ్ఞానగంగ అమర్చబడియున్నది. అవిద్యాంధకారము వలన నా గంగను జూచి యుపయోగించుకొన జాలక బురదకాళ్లతోనే నడుచుచుందుము. క్రమ క్రమముగ గొంత కొంత గంగ లభించ, గొంతమాత్రము బురదను గడుగుకొనుచుందుము. జ్ఞానపూర్ణుల మగు కాలమునకు బురదయంతయు విడిచిపోయి పరిశుద్ధ పాదములతో నీశ్వరుని సన్నిధికి బోయి వారికి బ్రదక్షిణపూర్వక నమస్కారములు సమర్పింప నర్హులమగుదుము. సంసారములో దిగినది మొదలు

మోక్షము చెందువఱకు నందఱు బురదలోనుండువారే. బురదలో మిక్కిలి లోతున దిగబడినవారు కొందఱు, కొంతవఱకు గడుగుకొని బురదభారమును తగ్గించుకొనినవారు కొందఱు. ఇట్లు బురదభారము లో నొండొరులకు దారతమ్య ముండునే కాని పంక నిమగ్నులను విషయములో నందఱు నొకటియే. కావున నొకడు మఱియొకని నిందించ గారణము లేదు. నిందించువాడు తాను బురదలో జిక్కుపడిన వాడనని యెఱుగని వాడే. నిందించబడువాని దశలో దాను బూర్వ ముంటినని స్మరించనివాడే. వివేకి పరుల యజ్ఞానమును జూచి యెంతమాత్రము నిందించడు. ద్వేషించడు. అయితే, నిందించక యుండుటవలన మాత్ర ముపయోగము లేదు. క్రింది మెట్టున నుండు వానిని పైమెట్టుకు దెచ్చు సహాయము చేయవలయును. పై మెట్టున నుండువారి జ్ఞానము క్రిందివారి నుద్ధరించు నిమిత్తమే తమ కివ్వబడినదని తెలిసి ఆ విధమున నా జ్ఞానమును సద్వినియోగము చేయవలెను. జ్ఞానమను పదార్థము సద్వినియోగము చేయుచుండ వృద్ధియగును. మిన్నక నుంచుకొనుట వలన ననుపయోగకారి యగును. చెలమలోని నీరు చల్లివేసిన మఱియు నెక్కుడు పరిశుద్ధమగు నీరు ఊరి నీరు పరిశుద్ధమగుటయే కాక వృద్ధి నయిత మగును. చల్లక యుండిన యెడల నీరు దుర్గంధమై చెడి పానాదుల కనుపయుక్త మగును. అట్లే ఒక మనుజునికి మఱియొకనికన్న నెక్కుడు జ్ఞానము, బలము, తేజస్సు, మొదలగు సంపత్తి యున్నచో వానిని తనకన్న దక్కువ దశలో నుండువారికి సహాయముచేయ వినియోగించిన, వడ్డికియిచ్చిన ధనమువలె వృద్ధియగును. టీకలో జెప్పినప్రకార మొక సరి బాటసారికి జెయిచాచి సహాయ మొసగిన, నట్లు సహాయము మఱి

యు నెక్కుడుగ జేయగల్గు జ్ఞానము, బలము వాని కీశ్వరు డొసం
గును. వానిని బరహితార్థ ముపయోగించనిచో నవి వృద్ధికానేరవు.
ఈశ్వర ప్రసాదరాహిత్యముచే క్షీణించి నశించును. కొన్ని సం
దర్భములలో బరహిత మొనర్చకపోవ ననేక కారణములు మనమే
కల్పించుకొను చుందుము. "వాడు సహాయమునకు బాత్రుడు కాడు,
నన్ను ద్వేషించువాడు, ఉపకారమును మఱచువాడు, కృతఘ్నుడు,
వానికెంత చెప్పినను మేలుపొందువాడు కాడు, నా కాల మెం
దుకు వ్యర్థపరచుకొనవలెను." అని యిట్లనేక కారణముల గల్పించు
కొన వచ్చును. అట్లు తలచుట ఎంతమాత్రము సరికాదు. అజ్ఞాన
దశలో నుండువా అందరాదరణీయులే. వారు కృతజ్ఞతలేనివా
రనుకొనుటవలన మనకు బ్రతిఫలాపేక్ష యున్నదని తెలియవచ్చును.
సహాయము చేయవలసినది మన పనియే కాని దానివలన గలుగు ఫల
మందు మన కధికారము లేదు.

కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన । (భ. గీ. 2-47)

కొందఱు బాహ్యాచారమున మిక్కిలి గర్హితులుగ నుండవచ్చును.
వారికి బహిరంగముగ నెట్టి సహాయముచేసినను, అది సఫలముగాక
పోవచ్చును. అట్టివారియెడల సయితము మన ముపేక్షభావ ముంచ
గూడదు. వారి కంతరంగ సహాయము చేయవచ్చును. అనగా
వారికి మంచిబుద్ధి పుట్టునుగాక, సుప్తముగ నుండెడి యాత్మశక్తి
కొంచెమైన బ్రబుద్ధమై ఇంద్రియ విజృంభణము నణగించుకొనును
గాక, అని సంకల్పముచేసి ఆ విధమున వారి సంకల్పశుద్ధికై పాటు
పడవచ్చును. మనశ్శుద్ధియైనచో బాహ్యాచారముకూడ బరిశుద్ధమగును.

సమ్యగ్వ్యవసితోహి సః । క్షిప్రం భవతి ధర్మాత్మా ।
(భ. గీ. 9-30, 31)

మనయెడల వారికి ద్వేషముండినను మనః పారిశుద్ధ్యమువలన నది కాల క్రమమున నశించవచ్చును. వారు సహాయమునకు పాత్రులుకా రని మన మూరకున్నయెడ నీశ్వరసేవా ప్రతిబంధకము మనచే కల్పిత మగుటంచేసి ఆ దోషము మనల నంటియుండునని స్మరించవలెను.

"ఓ శిష్యుడా! మంచివానికిని పాపాత్మునికిని విశేష భేద ముండినను ఆ మంచివానికిని జ్ఞానప్రాప్తి యయిన వానికిని అంతకంటె హెచ్చు భేదముండును. మంచివానికిని మోక్షసామీప్యమున నుండు వానికిని గల భేదము నెన్న శక్యముకాదు."

మంచి, చెడ్డ, పుణ్యము, పాపము, ధర్మము, అధర్మము అను పదము లన్నియు నపరిపూర్ణ దశకు సంబంధించినవియే యనియు, అవి యా యా దశలలోని యాత్మక్రీడాభేద వైచిత్ర్యములే యని నాత్మ సాక్షాత్కారమైన వాడు భావించుననియు, నిదివఱలో వివరముగా దెల్పబడెను. ఈ టీకలో జెప్పబడిన జ్ఞానప్రాప్తి యనునది ఆత్మ సాక్షాత్కార జ్ఞానము కాదు. చెడ్డవాడు మంచివాడు అనువారు ప్రవృత్తి మార్గమున నుండువారనియు, నందులో కేవల స్వార్థచింతన గలిగి ధర్మదృష్టి లేనివాడు పాపియనియు, దనకై యితరులను జెర చక తన మేలునందు దృష్టియుంచినను ధర్మావిరుద్ధ ప్రవర్తకుడు మంచివాడనియు భావించవచ్చును. వీ రిరువురికి జాల భేదమున్నది. జ్ఞానప్రాప్తి యయినవాడన నివృత్తిమార్గమునం దడుగిడినవాడు. వా డాత్మదెస దృష్టిని ద్రిప్పుకొనినవాడు. స్వార్థత్యాగము, పరహిత చింత వ్రతములుగ గైకొన్నవాడు. పూర్ణముగ విజితేంద్రియుడు

గాకున్నను సంసారసుఖము నిస్సారమని యనుభవముచే నెఱిగి, శ్రేయోమార్గమునందు ప్రవేశించినవా డగుటవలన నొకానొకప్పుడు విషయభోగములకు లోబడినను శీఘ్రముగనే మేల్కాంచి తన వ్రతము స్మరించి నివృత్తిధర్మముల ననుష్ఠించును. వీనికిని ప్రవృత్తి మార్గమునందుండు మంచివానికిని మిక్కిలి భేదముండునది విదితము. ఒకని దృష్టి సంసారము దెసను మఱియొకని దృష్టి యాత్మదెసను వ్యాపించియుండుటవలన వీ రిరువురకు జాల దూరము. నివృత్తిమార్గమునందు బహుకాలము గడపి మోక్ష సామీప్యమున నుండువారికిని, నివృత్తిమార్గమును ప్రవేశించకయే యుండు మంచివానికిని అత్యంత భేద ముండునని చెప్ప నేల?

దూరమేతే విపరీతే విషూచీ అవిద్యాయాచ విద్యేతి జ్ఞాతా ॥
(క. ఉప. 2-4)

"కనుక అతి శీఘ్రముగా జనసామాన్యమున కతీతుడవని నీవు తలచెదవేమో జాగ్రతగా నుండుము."

నివృత్తిమార్గమునందు ప్రవేశించగనే మోక్షము సాధించబడినదని తలచరాదు. ఆత్మదెస మనస్సును ద్రిప్పుకొనెనే కాని లోపములను నిశ్శేషముగా బోగొట్టుకొన్నవాడు కాడు. ఇంద్రియ దుష్ప్రేరణలకు లోబడుచు దుఃఖానుభవముద్వారా జ్ఞానమొందుచుండును. ప్రవృత్తి మార్గమున నుండువానికన్న నేను హెచ్చని వాడు తలచగూడదు. వాస్తవమున నెవరును హెచ్చులేదు. తుదిమెట్టువఱ కంద అపరిపూర్ణులే. జనసామాన్యమునకన్న నేను హెచ్చని తలచువాడు మోక్షమునకు జాల దవ్వున నుండువాడే. ఏలయన వానియందు

నేను అనుభావము మిక్కిలి బలముగ గనపడుచున్నది. పరమ యోగి సర్వభూతములయందు దానున్నాననియు దనయం దన్నిభూతము లున్నవనియు జూచువాడు కావున తా నతీతుడ ననుకొనడు. పాపాత్ముడును తాను నొక్కటియే యనియు వాడు పాపియనగా తనలో నొకభాగము దుర్బలముగ నున్నదని యెఱిగి దాని బలపరచ యత్నించును. అంతియకాని ఎవరిని నిందించి దూషించడు. తనకు నితరులకు సంబంధము లేదని తలచడు.

ఇదియంతయు మొదటి దశ. అనగా విషయానుభవము, తజ్జనిత జ్ఞానము. ఇకను రెండవ దశనుగూర్చి విచారించవలయును.

"అధ్యాత్మిక తత్త్వములను, మఱియు దృశ్యాదృశ్య ప్రకృతి ధర్మముల బరిశీలించుటవలన దాని నన్వేషించుము."

అది ధర్మజ్ఞానము. అనగా అధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక ధర్మముల నెఱుగుట.

క్షరప్రపంచ విషయ మధిభౌతికము.

అధిభూతం క్షరోభావః ।

భూ ర్భువ స్సువర్లోక ధర్మములు, అన్నమయ ప్రాణమయ మనోమయకోశ ధర్మములు అధిభౌతికములని భావించవచ్చును. ఈ కోశముల బనిచేయు నింద్రియములు, మనస్సు విషయభోగార్థము, తన్మూలమున విషయజ్ఞానము సంపాదించుట కాత్మనిర్మించుకొనిన యుపకరణములని యెఱుగుటయే అధిభౌతిక ధర్మజ్ఞానము.

మహర్లోక, జన, తపోలోకముల విషయము, విజ్ఞానమయ ఆనందమయకోశముల విషయము, వానియందలి యభిమానియగు విజ్ఞానాత్మయను పురుషుని విషయజ్ఞానమే అధిదైవిక ధర్మజ్ఞానము.

పురుషశ్చాధి దైవతం । (భ. గీ. 8-4)

తా నుపాధులు కాదనియు వాని నియంతయనియు, నీశ్వరుడొకడే యనియు, నాయన చరాచరాత్మకమైన ప్రపంచమున కంతయు ప్రభువనియు, విశ్వోత్పత్తి స్థితిలయముల కాయనయే కారణమని యు, నాయన సంకల్పానుసారమే బ్రహ్మాద్యధికార పురుషులు వారి వారి కార్యముల నిర్వర్తించు చుందురనియు, తత్సంకల్పాను గుణప్రవర్తనమే కర్తవ్యమనియు, వ్యష్టి ప్రయోజన బుద్ధిని నిరసించి సమష్టి ప్రయోజనార్థము వర్తించుటయే జీవితోద్దేశము, సంసార తారణోపాయ మనియు నెఱిగి భక్తిజ్ఞానములు పూర్ణము చేసికొనుట యే అధిదైవిక ధర్మజ్ఞానము.

అధ్యాత్మజ్ఞానమన, ఆత్మవిషయ జ్ఞానము. ఆత్మ యిట్టిదని నిరూ పింప శక్యముకాదు. దృశ్యజాతమంతయు "కాదు" "కాదు" అని నిషేధించుటవలననే అది భావ్యముకాని ఇంద్రియములచేతగాని మనస్సుచేతగాని గ్రహించబడనేరదు.

అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా అప్నువన్ పూర్వ మర్షత్ । తద్ధావతో అన్యానత్యేతి తిష్ఠత్ ॥ (ఈశ. ఉప.)

'ఇది కాదు' 'ఇది కాదు' అని మాత్రమే ధ్యానించి సాధించుట కష్టము. ఆత్మస్వరూప మెట్టిదియని శ్రుతులలో జెప్పినది తెలిసి కొని అట్టిదానినిగా ధ్యానించ వచ్చును.

తమేవైకం జానథాత్మానం । (ముం. ఉప.)

న జాయతే మ్రియతే వా విపశ్చిత్
నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్ ।

అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ (క. ఉప.)

అణోరణీయాన్ మహతో మహీయాన్
ఆత్మాఽస్య జంతోర్నిహితో గుహాయాం ।
(క. ఉప.)

ఆత్మ ఏకము, అజుడు, నిత్యుడు, శాశ్వతుడు, పురాణుడు.

అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రః । (ముం. ఉప.)

శరీరములోపల నుండువాడు, జ్యోతిర్మయుడు, శుభ్రుడు.

ఇట్లు స్మరించి ధ్యానించుటవలన నాత్మతేజస్సు మనస్సులో బ్రవేశించును. జ్ఞానప్రసాదము కలుగును.

మూడవదళ, మార్గదర్శనము :

"నీలోపల మందప్రకాశముతో వెలుగుచుండు నక్షత్రమునకు ఆత్మసమర్పణ పూర్వక బ్రణిపాతము చేయుటవలన దానిని వెదకుము. నిలకడతో నీవు కాచుకొని పూజించుచుండగా దాని ప్రకాశము బలవత్తరమగును. అప్పుడు మార్గముయొక్క ప్రారంభమును గనుగొంటినని నీవు తెలిసికొనవచ్చును. దాని యంతమును నీవు కనుగొని నప్పుడా వెలుగు హఠాత్తుగ ననంతజ్యోతి యగును."

"మార్గముయొక్క మొదలును గనుగొనినప్పుడు నీ యాత్మయను నక్షత్రము తన వెలుగును జూపును."

ఆ నక్షత్ర మాత్మజ్యోతి, ప్రథమమందు బూర్ణముగా దాని ప్రకాశము మన కగుపడదు. అహంకారము క్షీణించుకొలదియు గొద్దికొద్దిగ గనపడుచుండును. ఇచ్చట బ్రస్తాపించబడినది విజ్ఞాన

మయ కోశాభిమానము నశించుదనుక ఆనందమయకోశమున ప్రచ్ఛన్నముగ నుండు ఆత్మజ్యోతి. కోశావరణ ముండుటవలన మంద ప్రకాశముగ నుండును.

"ఆత్మ సమర్పణము" అనగా తన సర్వస్వము నివేదించుట. "నేను" "నాది" అను భావము సంపూర్ణముగ నశించవలెను.

> కాయేన వాచా మనసేంద్రియైర్వా ।
> బుద్ధ్యాత్మనావానుసృతి స్వభావాత్ ॥
> కరోతి యద్యత్ సకలం పరస్మై ।
> నారాయణాయేతి సమర్పయేత్తత్ ॥ (శ్రీ భాగ.)

ఇట్లహంకారము నశించుచుండ నాత్మజ్యోతిస్సు ఎక్కువగ గనపడుచుండును. ఆనందమయకోశములోనుండెడి యాత్మ దర్శనమగుటకు ప్రారంభమగుటయే మోక్షమార్గదర్శనము. అవిద్య పూర్ణముగ నశించిననే అఖండజ్యోతి సాక్షాత్కారమగును. అదియే మార్గము యొక్క అంత్యము.

"ఆ ప్రకాశమువలన నది యెంత చీకటిలో వెలుగుచుండునది నీవు కనుగొనెదవు."

ప్రదేశమంతయు జీకటిగ నున్నది. అంత చీకటిలో సన్న వెల్తురు కనుపడుచున్నది. సన్న వెల్తురగుపడిననే ఎంత చీకటిలో నది వెలుగుచుండునది తెలియవచ్చును. చీకటిలోనే యుండువానికి దా నంధకారములో నున్నానను విషయమే తోచదు. చీకటియన, నజ్ఞానము. అట్లజ్ఞాన సాగర నిమగ్నులైనవారియందు సంతాపము కలిగి వారి నుద్ధరించ బూనుకొనవలెను. వెలుగును గనుగొనినందు కిదియే ప్రయో

జనము. గొప్ప చీకటిలో నున్న వెలుగును జూడ, నెంతమంది జను లజ్ఞానదశలో నున్నారు, జ్ఞానము కొంచెముగ నైనను బొందిన వా రెంత కొంచెముగ నున్నారని తెలియవచ్చును. ఈ యర్థమునే టీక విపులముగా బోధించుచున్నది.

"తొలి గొప్ప యుద్ధములో జయమునొందువఱకు మనస్సు, హృదయము, మెదడు, ఇవి యన్నియు బ్రచ్ఛన్నముగను జీకటిగ నుండును. చూచి విషాదము జెందకుము; వెఱగందకుము. చిన్న వెల్తురు పైన దృష్టియుంచి యుండుము. అప్పు డది వృద్ధియగును. వెల్తురును జూడనట్టియు, మిక్కిలి యంధకారములో నుండు నట్టియు జీవాత్మల దౌర్బల్యమును దెలిసికొనుటకు నీలోని చీకటి నీకు సహాయ మగుగాక. వారలను నిందించవలదు. వారలనుండి తొలగిపోవలదు. అట్లుచేయక ప్రపంచము యొక్క కర్మభారమును గొంచెము తగ్గించ బ్రయత్నించుము."

మొదలు వెల్తురు సన్నగనే కన్పడును. మెఱుపు తీగవలె నగుపడి యప్పపాటు కాలమున నంతర్ధానము చెందునని, కేనోపనిషద్వా క్యము కలదు.

> తస్యైష ఆదేశో యదేతద్విద్యుతో వ్యద్యుతదా ।
> ఇతీన్న్యమీ మిషదా ఇత్యధిదైవతం ॥

మఱియు విఘ్నములు వచ్చును, వానితో బోరాడవలెను. ఇంకయు నవిద్యావ్యాప్తియుండును. దానికే టీకలో మనస్సు, హృదయము, మెదడు ప్రచ్ఛన్నముగను జీకటిగ నుండునని చెప్పబడియున్నది. ఆ విఘ్నములను శత్రువులను జయించి, నిరంతర ప్రయత్నముతో సాధిం చుచు రాగా సన్న వెల్తురు పెద్దదియగును. అది పెద్దదియగుకొలదియు

జీకటియొక్క వ్యాప్తి క్షీణించుచుండును. తుది, బూర్ణజ్యోతి ర్మయుడగును. అప్పు డవిద్య నశించును. అజ్ఞానాంధకారము పూర్ణ ముగ నివర్తించును. కొంచెముగ వెల్తురగుపడి నప్పుడు ఆ కొంచెము మాత్రమే ప్రకాశముగను, శేషించినదంతయు జీకటిగను గనుపడి నందుకు బ్రయోజన మేమన, కొంచెము వెలుతురు కనుపడినవారికే యింత చీకటి ప్రదేశమున్నదే, అంతా చీకటిగా నుండువారి దుఃఖ మేమని చెప్పవచ్చును, అని వారిమీద గరుణనలన గరిగిన మనస్సు గల వాడు కావలెను. చీకటిని జూచి భయపడగూడదు. దానిని సరకు చేయక సన్నగా వెలుగుచుండు దీపము దెసనె చూచుచురాగా అది పెద్దవెలుగగును. అనగా లోపములను దెలిసికొని వానిని గూర్చి విచారించుచుండక ఆత్మధ్యానమునే బలపరుచుచుండ ఆత్మ అపరోక్ష జ్ఞానము అనగా సాక్షాత్కారము కలుగును. చీకటిని జూచి వెఱగందు వాడు సిద్ధిపొందనేరడు. ఇతరులకు సహాయమొనర్ప నేరడు. ప్రపంచమంతయు నొక కుటుంబమే కావునను, నొక యవిభక్త కుటుంబములో నెవరు ఋణముచేసినను గుటుంబ ఋణమున కంద ఱును బాధ్యులైయుందురు కావునను, బ్రతియొకడు తన ఋణమును మాత్రమే తీర్చుకొనినజాలునని తలచక కుటుంబ ఋణమును దీర్చవలె నని తెలిసికొనును గదా. అట్లే తా నజ్ఞానభారమును దొలిగించు కొనినను లోకభారమును దీర్చవలెను. ఇదియే గీతాశాస్త్రములో జెప్పిన, లోకసంగ్రహ కర్మ. దీనికే టీకలో బ్రపంచకర్మభారవహన మని చెప్పబడియున్నది.

“అసురులకు సంపూర్ణజయము కలుగకుండ అపుచుండెడి యల్ప సంఖ్యులగు బలశాలురకు నీ సహాయము నిమ్ము.”

అసురలన నెవరు? వారుండు ప్రదేశము ప్రత్యేకముగ నున్నదా? వారేమిపని చేయుదురు? ఈ విషయములను విచారించి తెలిసికొన వలసినది యవశ్యకము.

అసురులు, సురలు ఉభయులు కశ్యప ప్రజాపతి బిడ్డలే. అసుః— అనగా ప్రాణము. తమ ప్రాణ సంరక్షణమే ముఖ్యజీవితోద్దేశమని తలచువా రసురులు. తద్విపరీత మనస్కులు సురలు లేక దేవతలు.

> ద్వయాహ ప్రాజాపత్యాః దేవాశ్చాసురాశ్చ । తతః కానీయసా ఏవ దేవా జ్యాయసా అసురాః త ఏషలోకేష్వ స్పర్ధంత ॥ (బృ. ఉప.)

దేవతలు, అసురులు ప్రజాప త్యపత్యములు. అందులో దేవతల సంఖ్య స్వల్పము, అసురులసంఖ్య హెచ్చు, వారికి బరస్పర స్పర్థకలిగెను.

దేవాసురు లుభయులు ప్రజాపతి బిడ్డలే. ఒక ప్రదేశమునకే వీరుభయులు పోరాడుచుందురు. మన వాగాది ఇంద్రియములు దేవతలకధిష్ఠానములని తెలిసియున్నది కదా. వాని యధిష్ఠానమున కసురులు సయితము పోరాడు చుందురు. ఇంద్రియవృత్తులు తమ స్వభావము ననుసరించవలెనని సురలును, దమ స్వభావము నను సరించవలెనని యసురులును, గలహించుచుందురు. శాస్త్రజన్య జ్ఞానసహిత కర్మాచరణము దేవస్వభావమనియు, బ్రత్యక్ష ప్రమాణా శ్రయము, దృష్టఫలభోగ మసుర స్వభావములనియు, నే కాలమందు స్వార్థమునకై యింద్రియ ప్రవృత్తి కలుగునో అప్పుడు అసురులకు జయము దేవతల కపజయమనియు, అట్లే శాస్త్రజనిత జ్ఞానముతో బ్రవృత్తి కలిగినయెడల దేవతలకు జయము అసురుల కపజయమనియు శ్రీ శంకరాచార్యులవారు భాష్యములో వ్రాసిరి.

దేవానాం చ అసురాణాం చ వృత్త్యుద్భవ అభిభవా స్పర్ధా । కదాచిత్ శాస్త్రజనితకర్మజ్ఞానభావనా రూపా వృత్తిః ప్రాణానాముద్భవతి । యదాచోద్భవతి తదా దృష్ట ప్రయోజనా ప్రత్యక్షానుమాన జనితకర్మజ్ఞాన భావనారూపా తేషామేవ ప్రాణానాం వృత్తిః ఆసురీ అభిభూయతే । స దేవానాం జయో అసురాణాం పరాజయః కదాచిత్ తద్విపర్యయేణ దేవానాం వృత్తిరభిభూయత ఆసుర్యా ఉద్భవః । సోఽసురాణాం జయో దేవానాం పరాజయః ॥

ఇట్లు దేవాసురుల యుద్ధము మన శరీరములోనే జరుగుచుండును. స్వార్థప్రయోజన బుద్ధి జనించి తదర్థప్రవర్తకుల మగునపుడు మన మసురులమే. మన సంకల్పప్రవర్తనానుసారముగా మనమే దేవతలము, మనమే అసురులము. క్రమ క్రమముగ నసురగుణములను వదలి దైవగుణముల ననుష్ఠించుకొలదియు దైవీప్రకృతికి జయము కలుగును. తత్ఫలమగు మోక్షప్రాప్తియగును.

దేవానాం జయే ధర్మ భూయస్త్వాత్, ఉత్కర్ష ఆప్రజాపతిత్వప్రాప్తేః । అసురజయే అధర్మ భూయస్త్వాత్ అపకర్ష ఆస్థావరప్రాప్తేః । ఉభయసామ్యే మనుష్యత్వప్రాప్తిః ॥

(బృ. ఉ. శాం. భా.)

దైవీసంపద జయము పొందగా ధర్మ మభివృద్ధియగుటవలన ప్రజాపతిత్వ ప్రాప్తిపఱకు (మోక్షప్రాప్తి) నారోహణమును, నసుర జయమునం దధర్మాభివృద్ధివలన స్థావరాంత మవరోహణమును (హీన జన్మప్రాప్తి), రెండు సమానముగ నున్న మనుష్యత్వప్రాప్తి కలుగును.

దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ॥

(భ. గీ. 16-5)

ఇంద్రియ వృత్తులకు దైవాసుర జయాపజయముల విభాగ మిట్లు శ్రీ శంకరాచార్యులవారిచే వర్ణింపబడియున్నది.

యజమానాః . . . . . . . . వాగాద్యధ్యాత్మిక పిండ మాత్ర పరిచ్ఛిన్నా[1]త్మాభిమానం హిత్వా వై రాజ[2]పిండాభిమానం వాగాద్యగ్న్యాది ఆత్మవిషయం వర్తమాన ప్రజాపతిత్వం శాస్త్రప్రకాశితం ప్రతిపన్నః ॥

ప్రతి మనుష్యుని యొక్క వాగాది ఇంద్రియములు, వాని వాని స్వంత సుఖము కొఱకు నిర్మించబడినవి యను పరిచ్ఛిన్నాత్మాభిమానమును (Individual interests) వదలి ఐకాత్మ్యదృష్టితో సర్వుల సర్వేంద్రియములు ఈశ్వర కార్య నిర్వర్తనమునకే యుపయోగింపబడవలెనను బుద్ధిని గ్రహించవలెను. అనగా ప్రతియింద్రియము సమష్టి కార్యమునకే వినియోగించవలెనని యెఱుగవలయును.

ఈ యింద్రియముతో నే నీపని చేసితినని యింద్రియముతోను దాని పనితోను సంగము కల్పించుకొనిన యెడల నా యింద్రియము అసురాధిష్ఠానమయిన దగును. సంగదోషమను రంధ్రముద్వారా అసురప్రవేశము కలుగునని శ్రీ శంకరాచార్యులవారు వ్రాసిరి.

కావున స్వార్థపరత్వము ప్రపంచమం దభివృద్ధిగ నుండువఱకసురపక్షము జయప్రదముగ నుండును. దాని నణచి లోకుల నుద్ధరించ దైవీసంపన్నులగు ఋషులును వారి శిష్యప్రశిష్యులును ధ్యాన, సంకల్ప, కర్మలద్వారా సదా ప్రయత్నించుచుందురు. మన

[1] Limited self. [2] Universal Self

మందలము దైవీసంపద్గుణములను వృద్ధిచేసికొనుచు, నసురప్రవేశము కాకుండునటుల జాగరూకులపై యుండుచు, ఋషి సంఘమువారి యుద్యమమునకు దోట్పాటు కావలెనని టీక బోధించుచున్నది. ఉప నిషత్తులో జెప్పిన ప్రకారము దైవీసంపద గలవారి సంఖ్య అల్పము. ఎందువలన ననగా వైరాగ్యము నభ్యసించుచు, నీశ్వరార్పణ బుద్ధితో బనిచేయువారు మిక్కిలి యరుదు. ఆ సంఖ్యలో మనముచేరి వారి కార్యము జయించునట్లు సహాయమొనర్చవలెను.

"అప్పుడు నీవు వారితోడ ఆనందానుభవదశను బ్రవేశించెదవు. అది గొప్ప కష్టమును విశేషదుఃఖమును గలుగ జేసెడిది. అయిన నది సదా ప్రవర్ధమానమగు మహాత్సుఖమును గూడ గలుగజేయును."

ఆత్మతత్వము ప్రబుద్ధమగుటయే ఆనందము. సుప్తముగ నుండుట యే దుఃఖము. అన్నమయాది విజ్ఞానమయాంత కోశాభిమానముండు వఱకు నయిదావరణములు కప్పుకొని యుండుటవలన నాత్మజ్యోతి ప్రకాశము కనబడదు. అయినను మనోమయ కోశాభిమానము వదలి నంతనే మూడావరణములు తగ్గినందున గొంచె మానంద మెక్కుడగు ను. ఆనందమయకోశము మాత్రము మిగిలియుండునప్పుడు తత్పూర్వ దశతో బోల్చి చూడ జెరసాలలో నుండువానిని విడిపించిన యెడల నెంత సంతోషమొందునో అంత సంతోషము కలుగును: కన్నులకు బట్ట కట్టుకొని యుండినవానికి దానిని విడువగా దర్శన లాభమువలన నెంత సంతోషము కలుగునో అంత సంతోషము ప్రాప్తమగును. అహంకారము క్షీణించగా జ్ఞాన మెక్కుడై సర్వభూతైకత్వ సాక్షా త్కార మగుచుండగా ఋషిసంఘమువారి లోకోపకార కర్మకు సహాయముచేయ శక్తికలుగు గొప్ప ఆనందము కలుగక తీరదు.

టీకలో జెప్పబడిన కష్టము, దుఃఖమెట్టిదియన సర్వభూతైకత్వ దృష్టి వృద్ధియగు కొలదియు సర్వభూతముల దుఃఖము తన దుఃఖముగా గన్పడి వారి దుఃఖమునకు దానుబాధపడుట. ఆ బాధపడు కాలమందు గొంచె మవిద్య లేశమున్నదనియే యెఱుంగవలయు. ఆత్మయొక్క పూర్ణ జ్యోతి ప్రకాశమునకు రాగా నా దుఃఖము నశించును. వారల దుఃఖమును గూర్చి పశ్చాత్తాపపడి సహాయ మొనర్చును గాని ఖేదము జెందడు. దుఃఖానుభవము దుష్కర్మ ఫలమే యనియు, అనుభవముతో గర్మక్షయమగుటవలన మోక్షమార్గ ప్రతిబంధకములలో నొకటి తొలగి పోయెననియు, ఈశ్వరాజ్ఞా రూపమగు కర్మ విధి న్యాయముగనే ప్రవర్తించుచున్న దనియు నెఱిగి బాధపడక సర్వ మాత్మక్రీడయే యని యానందించును.

సర్వాత్మైకత్వభావన దశయందు బరదుఃఖ చాలన ముండునా లేదా అను విషయమున శ్రీ శంకరాచార్యులవా రిట్లు వ్రాసిరి.

అథ ఇద మాశంక్యతే । సర్వప్రాణినా మాత్మా భవతీత్యుక్తం । తస్యచ సర్వప్రాణి కార్యకరణాత్మత్వే సర్వప్రాణి సుఖదుఃఖైః సంబధ్యేతేతి । తన్న । అపరిచ్ఛిన్న బుద్ధిత్వాత్ । పరిచ్ఛిన్నాత్మ బుద్ధీనాం హ్యాక్రోశాదౌ దుఃఖ సంబంధో దృష్టో అనేన అహమాకృష్ట ఇతి । అస్యతు సర్వాత్మనోయ ఆకృశ్యతే యశ్చ ఆక్రోశతితయో రాత్మత్వ బుద్ధి విశేషాభావాత్ న తన్నిమిత్తం దుఃఖ ముపపద్యతే । మరణ దుఃఖవచ్చ నిమిత్తాభావాత్ । . . . . తథా ఈశ్వరస్యాపి అపరిచ్ఛిన్నాత్మనో మమ తవాది దుఃఖనిమిత్త మిథ్యాజ్ఞానాది దోషాభావాత్ నైవ దుఃఖ ముపజాయతే ॥

సర్వభూతాత్మైకత్వమును సాధించినవాని విషయములో నొక సంశయ ముత్పన్నమగుచున్నది. సర్వభూతములతో నైక్యము జెంద వాని సుఖదుఃఖములతో సంబంధము కలుగదా? అట్లు కలుగదు. ఎందువలన ననగా వాని బుద్ధి పరిచ్ఛిన్న బుద్ధి కాదు. పరిచ్ఛిన్నబుద్ధి గల వాని నెవరైనను నిందించిన, వాడు నన్ను నిందించెను అని నిందించిన నిందించబడిన వారలకు భేధముండునట్లు భావన కలిగియుండును. అపరిచ్ఛిన్నబుద్ధిగల వాని కట్లు భేదభావము లేదు. మరణము విషయ ములో సయితమట్లే యుండును. అనగా నావారు మృతినొంది రను దుఃఖమును బొందడు. అపరిచ్ఛిన్నుడైన ఈశ్వరునికి 'నేను,' 'నీవు' అను అజ్ఞానకృత భేదబుద్ధి లేనందువలన దుఃఖములేదని తెలిసియున్నది కదా. అట్లే సర్వభూతాత్మ భూతాత్ముడు భూత ముల క్షేత్రసంబంధమైన సుఖదుఃఖములచే నంటబడడు. ఏలయన 'నేను' అను భావముండిన గదా సుఖదుఃఖము లుద్భవించును. సుఖదుఃఖములు క్షేత్రవికారములు.

సూర్యో యథా సర్వలోకస్యచక్షుః
న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః ।
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః ॥ (క. ఉప.)

సూర్యుడు సర్వజనులకన్నుల యధిష్ఠాన దేవతయైనను గన్నుల దోష ములవలన నెట్లు బాధించబడడో అట్లే సర్వభూతములలో నుండెడి యాత్మ యా భూతముల బాహ్యదోషములచే నంటబడడు.

## అయిదవ అధ్యాయము

## VI

## యోగమార్గాన్వేషణము, మనఃప్రసాదము

### 21 వ్యాఖ్యానసూత్రము

**21.** తుపానుగాలి వీచిన వెనుక గలుగు నిశ్శబ్దమున బుష్పవికాసమును గనుగొనుము; అంతవఱకు గనుగొన నేరవు. తుపానుగాలి వీచుచు యుద్ధము జరుగుచుండు నంతకాల మది మొలచును, పెఱుగును, రెమ్మలు ఆకులు మొగ్గలు వేయును. (అంతయే). మనుష్యునియొక్క స్వార్థచింతన[1] యంతయు నశించి కరిగిపోవువఱకు, దానిని నిర్మించుకొన్న ఈశ్వరాంశ తాను శ్రద్ధతోను గమనముతోను బరీక్షించుటకును, అనుభవజ్ఞానముచు బొందుటకును మాత్రమే యుపయోగించు సాధనముగ దానిను సంచుకొన గలుగు వఱకును, (మనుష్యునియొక్క) స్వ

[1] అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశాభిమాని.

భావమంతయు వశీకరమై అంతరాత్మకు లోబడువఱకును, పుష్పము వికసించ నేరదు. అతి త్వరితముగను, ఎల్లఱకు స్పష్టముగ గోచర మగునట్లును, ప్రకృతి ధర్మములు మాఱునట్టి ఉష్ణదేశములలో గొప్పవర్షము గురిసి వెలియగనే కలుగు శాంతివంటిది సుమా యా శాంతి. కష్టములనొందిన జీవుని కట్టి శాంతి కలుగును. ఆ గొప్ప నిశ్శబ్దములో గుహ్యమగు విషయము తటస్థించును. మార్గము కనుగొనబడిన దనుట కదియే నిదర్శనము. దానికి నీ యిష్టానుసార మెట్టి నామ మిడినను సరే. అది మాటాడువా రెవరు లేని చోట పలికెడి వాక్కు. అది రూపము ఆధారము లేనిదూత; అదియే వికసించిన యాత్మపుష్పము. దానిని ఉపమానముతో వర్ణింప శక్యము గాదు. తుపాను ప్రబలముగ వీచుచుండునపుడు సయితము దాని భావించవచ్చును; ఎదురు చూడవచ్చును; కోరవచ్చును. ఆ నిశ్శబ్ద మొక క్షణ ముండవచ్చును, లేక సహస్రవర్షము లుండవచ్చును. అయితే దాని కంతము కలదు. ఆయిన దాని బలమును నీవు వెంటగొని పొమ్మెదవు. పునః పునః యుద్ధము జరుగవలెను; జయమును బొందవలెను. మధ్యకాలమునందే ప్రకృతి తత్త్వము శాంతమును జెందియుండును.

## టీక

పుష్పము వికసించునప్పుడు (యథార్థ) దృష్టి మేల్కొను దివ్య
మైన సమయము. దాని ననుసరించి శ్రద్ధయు, జ్ఞానమును నిశ్చయ
జ్ఞానమును వచ్చును. జీవుడు నిలిచి చూచునది యాశ్చర్యపడు సమయ
ము; తృప్తికలుగు మరుక్షణము; అదియ నిశ్శబ్దము.

ఓ శిష్యుడా, ఈ నిశ్శబ్దమును అనుభవించి, దాని శాంతిని గని,
దానిబలమును నిలుపుకొన్నవారు నీవు సయితము ఆ అనుభవమును
బొందవలయు నని కోరుదురు. కనుక బోధామందిరములో శిష్యుడు
ప్రవేశించ గలుగునప్పుడు తప్పక తన గురుదేవుని గనుగొనును.
అడిగినవారు పొందగలుగుదురు. సాధారణ మనుష్యుడు నిరంతర
మడిగినను వాని మొఱ యాలకించబడదు. ఎందువలన ననగా వాడు
మనస్సుతో మాత్రమే యడుగుచున్నాడు. మనస్సుతో జేయు మొఱ
మనస్సు పనిచేయు లోకములోనే యాలకించబడును. కనుక తొలి
యిరువదియొక్క సూత్రములు (అనుష్ఠించి) గడుచునంతవఱకు
అడిగినవారు పొందగలరని నే జెప్పను.

గుప్తవిద్యా సంప్రదాయమున "చదువుట" యన ఆత్మచక్షుస్సు
తో జదువుట. "అడుగుట" యన లోపల నాకలి పుట్టుట. అనగా
తీవ్ర ఆత్మప్రాప్తికాంక్ష. "చదువుటకు శక్తికలుగుట" అనగ ఆ
యాకలిని దీర్చుకొన గొంతమాత్రము శక్తిని సంపాదించి యుండుట.
నేర్చుకొన సిద్ధముగా నుండునప్పుడు శిష్యుఁడంగీకరించబడును;
(యోగ్యతగలవాడని) ఒప్పుకొనబడును; గురువుచే మనస్కరించ
బడును. అది యట్లుండవలసినదే. ఎందువలన ననగా వాడు దీపమును
వెలిగించినాడు. దానిని దాచిపెట్ట సాధ్యముకాదు. అయితే మొదటి

గొప్ప యుద్ధములో జయమునొందువఱకు నేర్చుకొనుటకు సాధ్యము కాదు. మనస్సు తత్త్వమును దెలిసికొనవచ్చునే కాని ఆత్మ దాని గైకొననేరదు. ఒకసారి తుపానుగాలిని (అనుభవించి) గడిచి, శాంతిని బొందిన వెనుక శిష్యుడు చలించినను, దృఢనిశ్చయము లేనివాడైనను, వెలిదొలిగినను, నేర్చుకొనుట కెప్పటికి సాధ్యముండును. నిశ్శబ్ద వాక్కు వానిలోపల నిలిచియే యుండును. వాడు మార్గమును బూర్తిగ వదలినను గూడ నెప్పుడో యొకదిన మది మఱల వినబడును; వానిని (చెడ్డమార్గమునుండి) బలాత్కారముగ మఱలించును. వాని కామక్రోధాదులను భగవత్ప్రాప్త్యవకాశములనుండి వేఱుపరచును. అప్పుడు విడనాడబడిన (వాని) యపరిశుద్ధస్వభావము[1] దుఃఖమును జెంది ఆశాభంగముచే విలపించుచుండగా వాడు (అనగా శిష్యుడు) (సన్మార్గమునకు) మఱలివచ్చును.

కనుక నేను జెప్పిన దేమన "నీకు శాంతి కలుగుగాక", "నా శాంతిని నీ కొసగెదను" అను వాక్యములు తన స్వరూపులైన ప్రియతమ శిష్యులకు మాత్రమే గురువులన ఉచ్చరించబడ గలవు. ప్రాగ్దేశ జ్ఞానము లేనివారలలో గూడ వీనిని జెప్పదగినవారు కొందఱు గలరు. వారలకు ప్రతిదినము ముందుదినమునకన్న విశేషసంపూర్ణముగా జెప్పవచ్చును.

---

"తుపానుగాలివీచిన వెనుక గలుగు నిశ్శబ్దమున బుష్పవికాసమును గనుగొనుము; అంతవఱకు గనుగొన నేరవు."

పుష్పమన నాత్మజ్ఞానము. వికసించుటయన నది ప్రకాశమునకు వచ్చుట. తుపానుగాలి సముద్రమున నడుచు నావను ఛేదించునని

[1] అన్నమయ ప్రాణమయ మనోమయ కోశాభిమానియగు జీవుడు.

తెలిసియున్నది. సంసార-సముద్రమును దరింప నహింసాది యాత్మ గుణోపపత్తి సహిత జ్ఞానమే నావ. కామక్రోధ అభిమానాది యనాత్మ గుణములు తుపానుగాలి సామ్యములు.

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వా యుర్నావమి వాంభసి ॥

(భ. గీ. 2-67)

ఆత్మయందు సంస్థాపించబడవలసిన మనస్సు విషయములలో బ్రవర్తించెడి యింద్రియములతో జేరి వానిని బ్రేరేపించునెడ నవి పెనుగాలి సముద్రము నందలి నావను నాశము చేయునట్లు ఆ పురుషుని యాత్మానాత్మ వివేక విజ్ఞానమును హరించును.

సంసారసముద్ర మెట్టిది, దానిని దరింపజేయు నావ యెద్దియను విషయమున శ్రీ శంకరాచార్యులవారిట్లు వ్రాసిరి.

తా ఏతా దేవతాః సృష్టాః అస్మిన్ మహత్యర్ణవే ప్రాపతన్ ।

మహత్యవిద్యా కామకర్మ ప్రభవదుఃఖోదకే, తీవ్రరోగ జరామృత్యు మహాగ్రాహే, అనాదావనంతే అపారే నిరాలంబే, విషయేంద్రియ జనిత సుఖలవలక్షణ విశ్రామే, పంచేంద్రియార్థ తృష్ణామారుత విక్షోభోత్థితా నర్థశతమహోర్మౌ, మహారౌరవాద్యనేక నిరయగత హాహేత్యాది కూజితా క్రోశనోద్భూత మహారవే, సత్యార్జవ దానదయా హింసాశమదమ ధృత్యాద్యాత్మ గుణపాథేయ పూర్ణజ్ఞానో డుపే, సత్సంగ సర్వ త్యాగమార్గే, మోక్షతీరే, ఏ తస్మిన్మహత్యర్ణవే పతిత వత్యః ।

(ఐ. ఉప. భాష్యము)

1. అవిద్యా కామకర్మములవలన బుట్టు దుఃఖము ఉదకము. 2. రోగము, ముసలితనము, మృత్యువు మొసళ్లు. 3. తత్వజ్ఞానమువినా ఇతర విధముల నశించక పోవుటవలన ననంతము, అజ్ఞానులకు దెలియరామిచే నపారము, విశ్రాంతి లేనందున నిరాలంబము. 4. విషయభోగమువలన గలుగు సుఖలేశము విశ్రామము (అభాసము, నిజమైన విశ్రాంతి కాదు). 5. విషయతృష్ణ గాలి. 6. అందువలనగలుగు అనర్థములు గాలివలనగలంగు అలలు. 7. మహారౌరవాది నరకములలోబడి హా హా అని ఏడుచుటవలన జనించు స్వల్పధ్వనులు పెద్ద ధ్వనులు సముద్ర ధ్వనులు.

ఈ సముద్రమును దాటుటకు ప్రయాణము:—1. సత్యము, ఆర్జవము, దయ, అహింస, శమము, దమము ఇత్యాద్యాత్మ గుణములు, త్రోవన భక్షించ దీసికొనిపోబడు అన్నము (దోవభత్యము). 2. పూర్ణజ్ఞానము నావ. 3. సత్సంగము, సర్వత్యాగము త్రోవ. 4. మోక్షము, ఆవలిగడ్డ.

ఈ యుపపత్తులు పూర్ణముగ నమరిననే నావ దరి జేరగలదు. అట్లు లేనిచో నింద్రియములు మనః ప్రేరితములై మోక్షమార్గాభ్యాసిని నిరోధించును. ఇదియే గొప్పయుద్ధము. ఇదియే తుపానుగాలి. ఇందు జయించిన, అనగా మనస్సును బుద్ధిని విషయములనుండి మరలించి యాత్మవెస త్రిప్పిన నాత్మజ్ఞానము కొంచె కొంచెముగ ప్రకాశమునకు వచ్చుచుండును. ఆ మనఃప్రసాదమే నిశ్శబ్దము.

ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥
(భ. గీ. 6-25)

విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥ (భ. గీ. 2-64)

ఆత్మజ్ఞానము ప్రకాశించ నారంభించుటయే పుష్పించుట. అది ప్రకాశమునకు వచ్చుచుండుటయే పుష్పము వికసించుట.

"తుఫానుగాలి వీచుచు యుద్ధము జరుగుచుండు నంతకాల మది మొలచును, పెఱుగును, రెమ్మలు ఆకులు మొగ్గలు వేయును. (అంతయే). మనుష్యునియొక్క స్వార్థచింతన యంతయు నశించి కరిగి పోవునఱకు, దానిని నిర్మించుకొనిన ఈశ్వరాంశ తాను శ్రద్ధతోను గమనముతోను బరీక్షించుటకును, అనుభవజ్ఞానమును బొందుటకును మాత్రమే యుపయోగించు సాధనముగ దాని నుంచుకొనగలుగు నఱకును, (మనుష్యునియొక్క) స్వభావమంతయు వశీకరమై అంతరాత్మకు లోబడువఱకును, పుష్పము వికసించ నేరదు."

ఇంద్రియములతో మనస్సుతో యుద్ధముజరిగి నిల్చి అవి వశములై శాంతస్థితికి వచ్చినప్పుడే జ్ఞానపుష్పము వికసించును. అంతవఱకు సాధనమే కాని ఫలము ప్రాప్తించదు. ఇంద్రియములు మనస్సు ఈశ్వర కార్య నిర్వర్తనముకొఱకు నిర్మించుకొనబడిన కొరముట్లే యని తలచు స్థితి వచ్చునఱకు బుష్పవికాసము కలుగ నేరదు.

"అతిత్వరితముగను, ఎల్లఱకు స్పష్టముగ గోచర మగునట్లును, ప్రకృతి ధర్మముల్లు మాఱునట్టి ఉష్ణదేశములలో గొప్పవర్షము గురిసి వెలియగనే కలుగు శాంతివంటిది సుమా యీ శాంతి. కష్టముల నొందిన జీవుని కట్టి శాంతి కలుగును."

కష్టములనొందిన జీవుని కట్టి యుద్ధము ముగిసినతోడనే శాంతి (Peace) కలుగుట సహజమే. (14 ప్రాచీనసూత్ర విచారములో వ్రాయబడిన భ.గీ. 2-64, 65 శ్లోకములను జూచునది).

[1] అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశాభిమాని.

మొదటి యుద్ధములో మనస్సు ఇంద్రియములను జయించవలెను. రెండవ యుద్ధములో మనస్సు ఆత్మవశమగును. అదే శాంతి, ప్రసాదస్థితి.

"ఆ గొప్ప నిశ్శబ్దములో గుహ్యమగు విషయము తటస్థించును. మార్గము కనుగొనబడిన దనుట కదియే నిదర్శనము."

"పుష్పము వికసించునప్పుడు (యథార్థ) దృష్టి మేల్కొను దివ్యమైన సమయము. దాని ననుసరించి శ్రద్ధయు, జ్ఞానమును నిశ్చయభావమును వచ్చును."

గుహ్యవిషయ మన జ్ఞానదీక్ష. అప్పుడు మనఃప్రసాదమువలన బుద్ధి అహంకార వియుక్తమై ఆత్మదెస జరిగి నిశ్చలమై యుండును. అదియే విశుద్ధబుద్ధి. జ్ఞానదీక్ష (జ్ఞానోపదేశ) కాలమునం దీ బుద్ధి వికసించును. అదియే టీకలో జెప్పిన యథార్థదృష్టి మేల్కొను కాలము. అప్పుడు శ్రద్ధ, జ్ఞానము, నిశ్చయభావ ముదయించును. అనగా అనేక విషయములలో నుండిన సంశయములు తీరి నిజమైన జ్ఞానము కలుగును.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥

(భ. గీ. 6–29)

వాదించి విచారించు కాలము కాదు. సర్వభూతములయందు దానున్నా ననియు, దనయందు సర్వభూతము లున్నవి యనియు, జూచును (అనగా శాస్త్రజ్ఞానమున గాదు, సాక్షాత్కారమువలన). ఏకత్వ విషయములో సంశయము తీరును. యథార్థజ్ఞానము కలుగును.

కర్మ పునర్జన్మము మొదలగు గొప్ప సిద్ధాంతములను గూర్చి గ్రంథ ములం జదివినమాత్రమున యథార్థజ్ఞానము కలుగదు. శాస్త్ర గురు వాక్యములయందలి శ్రద్ధవలన మనము నమ్మవచ్చును. అయిన నెప్పుడో యొక కాలమున మన మనస్సు బలపడుకొలదియు సంశయము కలుగవచ్చును. విశుద్ధబుద్ధి ప్రకాశించువప్పుడా సంశయములు వీడును. అయితే అన్నిసంశయములు నప్పుడే తీరవు. జ్ఞానము క్రమముగ వృద్ధియగుచుండ నొక్కొక్క విషయమైన సంశయము తీరుచు యథార్థజ్ఞాన ముదయించుచువచ్చును. తుది ఆత్మ సాక్షాత్కారము పూర్ణముగ గలిగినప్పుడు అహంకార మమకార ములు పోవును ; కర్మవాసనలన్నియు నశించును ; సంశయములన్నియు దొలగును.

> భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః ।
> క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥
>
> (ముం. ఉప)

"జీవుడు నిలిచి చూచునది యాశ్చర్యపడు సమయము; తృప్తి కలుగు మరుక్షణము ; అదియ నిశ్శబ్దము."

ఒక్కొక్క విషయమైన సంశయము తీరి యథార్థజ్ఞానము కలుగు నంతకు మున్నా విషయమునందు మనకుండిన యజ్ఞానమును, దాన జేసిన పాప కార్యములను దలచుకొన, మనమే యచ్చెరు వొందెదము. సంశయము తీరెనని తృప్తికలుగును. "అదియ నిశ్శబ్దము" అనగా జనించిన జ్ఞానమువలన గలిగిన తృప్తి పరమానందరూపమున నుండును. దాని వివరింప [illegible] అశక్యము. నిశ్శబ్దముగ నానందించును.

"దానికి నీ యిష్టానుసార మెట్టి నామమిడినను సరే. అది మాటాడువా రెవరు లేనిచోట పలికెడి వాక్కు. అది రూపము, ఆధారము లేనిదూత; అదియే వికసించిన యాత్మపుష్పము. దానిని ఉపమానముతో వర్ణింప శక్యము గాదు."

అత్యంత సూక్ష్మలోకములలో జరుగు విషయములను గ్రిందిలోకములలో మాటలతో వర్ణింప శక్యముకాదు. అందువలన దాని నిర్దేశించు నామ మిడనేరము. అంతరంగమునందు బ్రతిమనుజునికి సాక్షాత్కారము కావలసియుండు గావున మాట్లాడువా రెవరును నితరులుండరు. ఆ నాదమును దనకు దానే వినవలెను. జ్ఞాన సాక్షాత్కారము నామరూపాతీతము.

"తుపాను ప్రబలముగ వీచుచుండునపుడు సయితము దాని భావించవచ్చును. ఎదురు చూడవచ్చును. కోరవచ్చును."

సంసారములో నింద్రియములతోను మనస్సుతోను యుద్ధము జరుగుచుండు నపుడు ఆత్మసాక్షాత్కార శాంతమును మఱువక యుండుటయే కర్మయోగానుష్ఠానము. భగవద్గీతా శాస్త్రమునందు విగతజ్వరుడవై యుద్ధము చేయుమనియు, సర్వకాలముల యందు (అనగా యుద్ధకాలమందు సయితము) దన్నను స్మరించుచునే యుద్ధము చేయు మనియు శ్రీకృష్ణు డర్జునున కుపదేశించెను. (భ. గీ. 8–30, 5–7 చూడుము). ఇట్లు స్మరించుటవలన నింద్రియాది రూపమున నెదిరించు శత్రువును జయించుట సుసాధ్యమగును. ఎందువలన ననగా ఆత్మ వానితో దాదాత్మ్యము చెందినందువలననే వాని కెదిరించు శక్తికలిగెను. ఆత్మ ఇంద్రియాదులకు విలక్షణుడనియు, సర్వశక్తుల కాధారమైన వాడనియు, ననాత్మ వస్తువునకు సత్యత్వ మా

యన వలననే కలుగుచున్నదనియు, నా యాత్మస్మరణమున నింద్రియ ములు నిస్సంశయముగా వశపడుననియు విశ్వసించవలెను. కావున నెన్ని కష్టముల ననుభవించుచున్నను భగవంతుని పైన మనస్సు నిల్పిన, నన్నియు నశించును.

మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి ।

(భ. గీ. 18–58)

లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః ।
ఏషామిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః ॥

ఎవరి హృదయమునం దిందీవరశ్యాముడగు జనార్దను డుండునో వారికి లాభము కలుగును, జయము కలుగును, వారి కపజయ మెక్కడిది!

"ఆ నిశ్శబ్ద మొకక్షణ ముండవచ్చును లేక సహస్రవర్ష ముండ వచ్చును. అయితే దాని కంతము కలదు. అయిన దాని బలమును నీవు వెంటగొని పొయ్యెదవు. పునః పునః యుద్ధము జరుగవలెను; జయమును బొందవలెను. మధ్యకాలమునందే ప్రకృతి తత్త్వము శాన్త్యమును జెంది యుండును."

ఈ వాక్యము లోకమున నొక మెట్టునుండి మఱియొక మెట్టుకు బోవుచో గలుగు అనుభవములను గూర్చి బోధించుచున్నది. ఒక మెట్టు నతిక్రమించి పైకి బోయిన, నక్కడ జయించవలసిన లోపము లుండు ను. ప్రతి లోపమును బోగొట్టుకొనుటయందు యుద్ధము జరుగవలసి యుండును. ఒక మెట్టున జరుగవలసిన పని ముగిసినపిదప మఱియొక మెట్టుకు సంబధించిన కష్టములు, సంకటములు ప్రాప్తించ గొంత కాలము పట్టును. ఆ మధ్యకాలమే సూత్రములో జెప్పిన మధ్యకాల ప్రకృతితత్త్వ శాంతత్వము.

అయితే ఎప్పుడో ఒకప్పుడు ఆ శాంతదశ గడిచిపోవలెను. పైపెట్టున మఱియు యుద్ధము జరగవలెను.

"ఓ శిష్యుడా, ఈ నిశ్శబ్దమును అనుభవించి, దాని శాంతిని గని, దానిబలమును నిలుపుకొన్నవారు నీవు సయితము ఆ అనుభవమును పొందవలయునని కోరుదురు."

ఇది పరమయోగియొక్క లక్షణము. తాను సుఖము చెందినట్టయిన దాని నితరులు సయితము పొందవలెననియు, నితరులు దుఃఖించుచుండ దాను సుఖముగ నుండ నేరననియు, దా నితరులతో గూడి యానందించవలెనే కాని స్వంతముగా నానందించ నేరననియు దలచును.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥

(భ. గీ. 6-32)

మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయంతః పరస్పరం ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥

(భ. గీ. 10-9)

ఆత్మ ఆనందస్వభావము కలదియగుటవలనను, నద్వితీయంబైనందువను నందఱితో జేరి యానందించవలెనని కోరుట సహజమే. తాను మాత్రము సుఖముగ నుండవలయునని కోరువా డాత్మతత్త్వము నెఱుగక అహంకార విమూఢాత్మయని యెఱుంగవలయు.

# అయిదవ అధ్యాయము

## VII

## యోగమార్గాన్వేషణము, గుహాపసక్తి

"కనుక బోధామందిరములో శిష్యుడు ప్రవేశించ గలుగునప్పుడు తప్పక తన గురుదేవుని గనుగొనును."

బోధామందిరమన నీలోకములోని విద్యాశాలగాని దేవాలయము గాని కాదు. గురుదేవుడు ప్రసన్నమయ్యెడి స్థలము. భూలోకములో స్థూలశరీరముతో గురుదేవుడు-లేక పరమగురువు ప్రాయశః ప్రత్యక్షమగుట లేదు. అవశ్యకము కలుగునప్పుడు స్థూలదేహమును వారు నిర్మించుకొని రాగలరు. అయిన నట్లు చేయుటవలన వారి యితర గొప్పపనుల కభ్యంతరము కలుగును. ఈ ప్రపంచములోని మనుష్యుల స్థూల అణువుల అపారిశుద్ధ్యమునకు వారి శుద్ధసత్వదేహ మోర్వ జాలదు. మఱియు శిష్యుడు జాగ్రదవస్థలో నుండునప్పుడు స్థూల శరీరమున మెదడుతో బనిచేయుచుండును. అది స్థూలము కావున దాని ద్వారా సూక్ష్మబోధలు బోధించుట కష్టము. కావున సాధారణముగా స్థూలశరీరమును విడిచి సూక్ష్మశరీరధారి యగుటకు శక్తి గలిగినప్పుడే గురూపదేశమగును. మనమందఱము నిద్రలో స్థూలశరీర మును విడిచి సూక్ష్మశరీరములో బనిచేయుచుందుము. అయిన మన

నిద్రయందు జాగ్రదవస్థలో ననుభవించిన విషయములనే స్వప్నములో బునః పునః అనుభవించుచు గాలము గడుపుచుందుము. అట్టి మనస్సు గురూపదేశమునకు యోగ్యత కలిగినది కాదు. నాస్త్యకృతః కృతేన (=బ్రహ్మవస్తువు ప్రపంచ విషయాసక్తితో బ్రాప్తించనేరదు) అని నిర్వేదమును బొంది ప్రశాంతచిత్తుడైన వాడు సూక్ష్మశరీరములో నుండునపుడు ఆ శరీరము స్థూలవిషయ భోగవాసనలకు బరవశము కాక స్వతంత్ర వ్యాపారశక్తి గలదియై నిలకడగనుండును. అట్టి మనస్సు గురూపదేశమునకు యోగ్యత గలది యగును.

"అడిగినవారు పొందగలుగుదురు. సాధారణ మనుష్యుడు నిరంతర మడిగినను వాని మొఱ యాలకించబడదు. ఎందువలన ననగా వాడు మనస్సుతోమాత్రమే యడుగుచున్నాడు. మనస్సుతో జేయు మొఱ మనస్సు పనిచేయు లోకములోనే యాలకించబడును. కనుక తొలి యిరువదియొక్క సూత్రములు (అనుష్ఠించి) గడుచునంతవఱకు అడిగినవారు పొందగలరని నే జెప్పను."

శిష్యయోగ్యతను గూర్చి యిచ్చట ప్రస్తావింపబడినది. ఈ యిరువదియొక్క సూత్రములలోని బోధప్రకారము ప్రవర్తించిన యెడల సాధనచతుష్టయ సంపన్నుడై ధర్మజిజ్ఞాసను గడిచి బ్రహ్మజిజ్ఞాసకు యోగ్యుడగును. వాడు మనస్సును విశుద్ధబుద్ధితో జేర్చియుండును. ఆ విశుద్ధబుద్ధి ఆత్మకత్యంత సన్నిహిత యుపాధియగుటవలన నాత్మ జ్ఞానమును గ్రహించగలుగు. మనస్సు సంకల్పవికల్పాత్మకము—భేదదర్శనమే చేయుచుండును. తర్క-వ్యాకరణాది శాస్త్రముల బోధ మనస్సుతో గడింపబడును. మనస్సుతో నడుగు ప్రశ్నలకు అట్టి జ్ఞానమే ఉత్తరము. మనస్సు పనిచేయు లోకమునుండి అట్టి

బోధయే రాగలుగును. ఆత్మజ్ఞానమన్ననో—పరావిద్య—మనస్సువలన గ్రహించబడనేరదు.

యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ । (తై.ఉ.)
నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా ॥
(కఠ. ఉ.)

మనస్సు వాదించును, తర్కించును. ఆత్మ యీ విధమున నలనడదు.

నైషా తర్కేణ మతిరాపనేయా । (కఠ. ఉ.)

బుద్ధి సాక్షాత్కరించును.

దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥
(కఠ. ఉ.)

కావున మనస్సు నతిక్రమించి శుద్ధ విజ్ఞానదశయందే ఆత్మజ్ఞానోపదేశము కలుగును. భేదదృష్టిని విడుచుట కభ్యసించుటయే ఈ విశుద్ధ బుద్ధి ప్రకాశమునకు ముఖ్యసాధనము.

"గుప్తవిద్యా సంప్రదాయమున 'చదువుట' యన ఆత్మ చక్షుస్సుతో జదువుట. 'అడుగుట' యన లోపల నాకలిపుట్టుట. అనగా తీవ్ర ఆత్మప్రాప్తికాంక్ష. "చదువుటకు శక్తికలుగుట" అనగ ఆ యాకలిని దీర్చుకొన గొంతమాత్రము శక్తిని సంపాదించి యుండుట."

అధ్యాత్మ శాస్త్ర మాత్మవిషయమును బోధించునది. స్థూల చక్షుస్సు బాహ్యవిషయములను గూర్చి పోవునది. దానికి నాత్మ విషయ మెట్లు గ్రాహ్యమగును!

ఆత్మసాక్షాత్కారమున కాత్మ చక్షుస్సు కావలెను. ఆత్మ చక్షుస్సుతో జదువుటయనగా ఇంద్రియములకు బరవశమై సాంసారిక విషయాసక్తితో గూడిన మనస్సును సంసారము దెసనుండి ఆత్మ దెసకు ద్రిప్పి ఆత్మసాక్షాత్కారమునకై నిరంతర మభ్యాసము చేయుట. దీనికే వేదాంత గ్రంథములలో అధ్యాత్మచేతస్సనియు, దివ్యచక్షుస్సని యు జెప్పబడినది.

అడుగుట యనగా గురువుచెంతజేరి యాత్మవిషయమై బోధించ గోరుట. పెక్కండ్రు గురువేమి చెప్పునో తెలిసికొందమనియెడి యభిలాష గలిగినవారుగ నుండవచ్చును. అందుకై సంన్యసించువారు సయితము కొందఱుండెదరు. అంతమాత్రమున గురూపసక్తి యోగ్యత గలవారనుటకు సాధ్యము కాదు. యథార్థతత్త్వము దెలియ గోరి, దానికై సర్వమును త్యాగముచేయ సిద్ధులై, ఆ జ్ఞానము సైత ము తన అభివృద్ధికొఱకే కోరక, ఈశ్వరసంకల్ప మెఱింగి సర్వభూత సేవయందు వినియోగించుటకొఱకు కోరువారే యథార్థముగ "అడుగు వారు." వారల ఇచ్ఛ తీవ్రేచ్ఛ. ఇంద్రియమనస్సుల కతీతమగు విజ్ఞానమునుండి పుట్టునది. ఇట్టి యిచ్ఛలేక వాక్కుతోడను, మనస్సు తోడను మాత్రము అడుగువారు గురూపసక్తికి యోగ్యత లేనివారు. మనస్సులో దీవ్ర వైరాగ్యముకలిగి ఆత్మజ్ఞానప్రాప్తియం దత్యంత రతి గలిగి తద్విజ్ఞానార్థము గురువుచెంత జేరి శ్రవణాదికముచే సాక్షా త్కారము పొందవలయునే కాని బాహ్యాడంబరమువలన నేమి యుపయోగము లేదు.

యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్ ॥

ఏదినము వైరాగ్యము కలుగునో ఆదినమే సంన్యసించవలెను.

వమనాహారవత్ యస్య భాతి సర్వేషణాదిషు ।
తస్యాధికారః సంన్యాసే త్యక్తదేహాభిమానినః ।
యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు ।
తదైవ సన్యసే ద్విద్వాన్ అన్యథా పతితో భవేత్ ॥

(మైత్రేయోపనిషత్)

బ్రహ్మవిద్యాధికారి యోగ్యత విషయమై ఇదివఱలో విపులముగా వ్రాయబడెను.

సాధారణ మనుజు లధ్యాత్మవిషయములను వ్యష్టిసాంసారిక దృష్టిచే జూచెదరు. దాన దురభిప్రాయములు కల్గి కలవర పడుదురే కాని జ్ఞానమును బొందనేరరు. బుధులు ప్రాపంచిక విషయములను సమష్టిదృష్టితో జూచెదరు. కావున వారు సాంసారిక విషయముల ను సయితము నేర్పుతో నిర్వర్తించెదురు.

యోగస్థః కురు కర్మాణి । యోగః కర్మసు కౌశలం ॥

"నేర్చుకొన సిద్ధముగా నుండునప్పుడు శిష్యుం డంగీకరించబడును; (యోగ్యతగలవాడని) ఒప్పుకొనబడును. గురువుచే మనస్కరించ బడును; అది యట్లుండవలసినదే. ఎందువలన ననగా వాడు దీప మును వెలిగించినాడు. దానిని దాచిపెట్ట సాధ్యములేదు."

రాత్రికాలమందొక కొండపైన గూర్చుండి క్రిందిదేశమును జూడ సర్వత్ర అంధకారమయముగ గన్పడును. అప్పుడే గ్రామము ఏ మనుజు డెచ్చట నుండునది కన్పడదు. అయితే ఒకానొక గృహ యజమాని తన సమీపమునం దుండు వారికి వెల్తురుండవలెనని తలచి ఎత్తున (ఆకాశదీపము లేక కార్తీక దీపమువలె) నొక దీపమును

వెలిగించి యుంచిన యెడల గొండపైనసుండు వాని కా దీప మగు పడును. ఆ దీపముందు ప్రదేశమును గనిపెట్టి యచ్చటికి గొండపై నుండువాడు వచ్చుట కవకాశము కల్గును.

అంధకారమయము జనసామాన్యము. చుట్టుప్రక్కన నుండువారికి వెల్తురుకలుగ జేయునట్లు దీపము వెలిగించువా డాత్మగుణోపేతుడు. పరోపకారమే కర్తవ్యమని నిశ్చయించు కొన్నవాడు. దీపమును దన యింటిలోపల నిడినయెడల గొండపై కగుపడదు కదా. అట్లే జ్ఞానమునొంది తనలోనుంచుకొని ఇతరులకు బోధించనివాడు గురుప్రసాదమునకు యోగ్యుడు కానేరడు. కొండపైనుండి చూచువాడు గురువు. ఆయన సదా ఎవరు స్వార్థచింతనుమాని పరార్థమే జీవితోద్దేశ్యముగ భావించి యహింసాది యాత్మగుణములను సంపాదించి వానిని బరోద్ధారణార్థము వినియోగింతురు, వారిని నేనను గ్రహించి భగవత్పాదమూలమును జేర్చెదనని కాచుకొని యుండును. సిద్ధముకాక యుండుట మన లోపమేకాని సిద్ధమైన తక్షణమే వారు వచ్చి యనుగ్రహింతురను విషయమందు సంశయమే లేదు. దీపము వెలిగించకుండుట మన తప్పితము. వెలిగించిన క్షణమందే గురువీక్షణ కల్గుననుటకు సంశయము లేదు.

విష్ణోర్భక్తా హి లోకానాం పావనాయ చరంతి హి ॥
(శ్రీ భాగ.)

సర్వమీశ్వరాజ్ఞప్రకారము జరుగును. ఆ ధర్మము తప్పిపోనేరదు. ఇట్టి కార్యమున కిట్టి ఫలమని యీశ్వర సంకల్పముగనుండ నా యా కార్యము జేసినచో నా యా ఫలము కలిగితీరును. ఒక రాయిని పైకివేయ, గ్రిందబడునను ధర్మము (Law of Gravitation) మనకు

విదితమైయున్నది కదా. మఱియొక ప్రకృతి ధర్మము నుపయోగించి, దానికి ప్రతిబంధకము గలిగించనియెడల రాయి పైనుండి క్రిందబడనే పడును. అట్లే మనము గురూపదేశమునకు వలయు యోగ్యతలను సంపాదించిన గురుసాక్షాత్కారము కలుగక పోదు. గురువులు సయితము భగవదాజ్ఞానుసారులే.

హిరణకశ్యపుడు తపస్సుచే గొప్ప వరములను బొందెను గదా. లోకపీడ యా వరములవలన గల్గునని తెలిసియు బ్రహ్మదేవుడు వరములనెందు కిచ్చెను? ప్రతికార్యముచే నాత్మశక్తి వ్యక్తమగును. అది ఫలించక తీరదు.

వ్యవసాయేన తేనైవ దుష్కరేణ మనస్విభిః ।
తపోనిష్ఠేన భవతా జితోఽహం దితినందన ॥ (శ్రీ భాగ.)

మనస్కులకు దుస్సాధ్యమైన నిశ్చయముతో నీవుచేసిన తపస్సుచే నేను జయించబడితిని అని బ్రహ్మ హిరణ్యకశ్యపుతో జెప్పెను. తపస్సను శక్తి (Force) వినియోగించబడగా దానిఫలము వచ్చితీరును. అది ఈశ్వరాజ్ఞ. అట్లే మనము జ్ఞానలబ్ధ్యుపకరణముల నేకరించిన గురువు జ్ఞానోపదేశము చేసితీరును.

తస్మై తదుపపన్నాయ సమ్యక్ ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ । యే నాక్షరం పురుషం వేదసత్యం ప్రోవాచ తాం తత్వతో బ్రహ్మవిద్యాం ॥ (ముం. ఉప.)

తన యంతికమునకు వచ్చినట్టియు, బాగుగ శమించిన మనస్సు గలవాడును (అనగా రాగాదికాలుష్య రహితమనస్సు గలవాడు) నగు శిష్యుడు జ్ఞానముచే సత్యస్వరూపుడును అక్షరుడునగు పురుషుని

దెలిసికొన గలుగునో అట్టి బ్రహ్మజ్ఞానమును గురువు ఉపదేశించ వలెను. ఈ మంత్రమునకు భాష్యములో శ్రీ శంకరాచార్యులవా రిట్లు వ్రాసిరి:—

ఆచార్యస్యాపి అయం నియమో యన్న్యాయ ప్రాప్త
సచ్ఛిష్య నిస్తారణం అవిద్యామహోదధేః ॥

ఆచార్యులవారికైన నిది నియమము. ఎద్దియన—తనయొద్దకు విధి ననుసరించివచ్చిన సచ్ఛిష్యుని అవిద్యా సాగరమునుండి యుద్ధరించుట. సామాన్యజనుడు తన నియమమును దప్పినను దప్పునుగాని వారి నియమమును వారు ఇంచుకయైనను దప్పరు. కావున మనము సిద్ధముగ నుండునప్పుడు వారు మనలను శిష్యులనుగా గైకొని యనుగ్రహించెద రనునది నిస్సంశయ విషయము. దీపము వెలుగుటకు వలయు యుపపత్తులను మన మమర్చినయెడల దీపమును భగవంతుడే వెలిగించునని గీతా శాస్త్రమందు జెప్పబడియున్నది.

తేషామేవానుకంపార్థమహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥

(భ. గీ. 10-11)

వారియందు (నన్ను సతతము ప్రీతితో భజించు వారియందు) అనుకంపతో నేను వారి హృదయమందుండి జ్ఞానమను దీపమును వెలిగించి యజ్ఞానమను నంధకారమును నాశము చేసెదను.

ఈ జ్ఞానదీపమునకు గావలసిన యుపపత్తు లెట్టివియను విషయమున శ్రీ శంకరాచార్యులవా రిట్లు వ్రాసిరి.

జ్ఞానదీపేన = వివేకప్రత్యయరూపేణ, భక్తిప్రసాదస్నేహాభిషిక్తేన, మద్భావనాభినివేశవాతేరితేన, బ్రహ్మచర్యాది సాధన సంస్కారవత్ ప్రజ్ఞావర్తినా, విరక్తాంతః కరణాధారేణ, విషయ వ్యావృత్తచిత్త రాగద్వేషా కలుషితనివాతాపవరకస్థేన, నిత్యప్రవృత్త ఏకాగ్ర్య ధ్యాన జనిత సమ్యగ్దర్శన భాస్వతా జ్ఞానదీపేన ।

ఆ జ్ఞానదీపము వివేకవిజ్ఞాన స్వరూపమైనది. దానికి చమురు భక్తి జనిత భగవత్ప్రసాదము. ఈశ్వర భావమునుగూర్చి ధ్యానించుటయందాసక్తియే దీపమును వెలిగింపజేయు వాతావరణము. బ్రహ్మచర్యాది సాధనసంస్కారములుకల వివేకమే వత్తి. వైరాగ్యముగల యంతఃకరణమే ప్రమిదె. విషయములనుండి మఱలి రాగద్వేషముల నెడి గాలిలేక నిశ్చలమగు చిత్తమే స్థానము. నిరంతర ఏకాగ్ర ధ్యానమువలన గలుగు సమ్యగ్దర్శనమే (అనగా స్వానుభవము) వెలుగు.

జ్ఞానదీపమునకు గావలసిన భక్త్యాది సామగ్రుల నమర్చియుంచుకొని యుండిన భగవంతుడేవచ్చి దీపము వెలిగించునని పై గీతా వాక్యమునందు జెప్పబడియున్నది. ఇచ్చట సన్నదీపము మనము వెలిగించిన గురు వనుగ్రహించి దానిని పెద్దవెలుగుగ జేయుచురని గ్రహించవలెను.

"అయితే మొదటిగొప్ప యుద్ధములో జయము నొందువఱకు నేర్చుకొనుటకు సాధ్యములేదు. మనస్సు తత్త్వమును దెలిసికొనవచ్చునే కాని ఆత్మ దాని గైకొననేరదు. ఒకసారి తుపానుగాలిని (అనుభవించి) గడిచి, శాంతిని బొందిన వెనుక శిష్యుడు చలించినను,

దృఢనిశ్చయము లేనివాడైనను, వెలిదొలిగినను నేర్చుకొనుట కెప్పటికి సాధ్యముండును."

ఈ మొదటి యుద్ధము ఇంద్రియములను జయించు యుద్ధము.

ఇచ్చట మొదటి యుద్ధమును గూర్చి చెప్పబడినది. ఇకను మనస్సు, బుద్ధి జయించబడవలెను. అట్లుండ, మొదటి యుద్ధములో జయించినను శిష్యుడు చలించి క్రిందబడుట విపరీతము కాదు. మనస్సు స్వాధీనమైన పిమ్మట సయితము శాస్త్రజ్ఞాన చాతుర్యము మాత్రచే కల్గును. ఆత్మసాక్షాత్కారము లింగ భంగము (Disintegration of the causal body) అనగా అహంభావ నివృత్తి అగువఱకు గలుగ నేరదు. అయితే మోక్షభూమిక నారోహించిన వాడు తల్లిగర్భమునుండి వెడలివచ్చిన వానివంటి వాడు కావున కొంత మాత్రము త్రోవతప్పినను, రాగద్వేషాది కాలుష్యవాసనాబలముచే నుపాధులు తిరస్కరించు బలమునొంది వానినెదిరించినను, బహుకాలాభ్యాసమువలన గల్గిన ఆత్మగుణములు అవకాశము కల్గిన తోడనే ప్రచ్ఛన్నత్వమునుండి ప్రబుద్ధత్వము నొందును. అప్పుడు త్రోవ తప్పినవాడు తాను దప్పిపోయినానని తెలిసికొని సరియైన త్రోవను వచ్చునట్లును, నిద్రమేల్కను వాని భంగిని, పునః శ్రేయోమార్గమునందు ప్రవేశించి సిద్ధికి ప్రయత్నించును. ఎందువలననగా భక్తి ధ్యానములు అనగా యోగసాధన ప్రయత్నమునకు నాశనములేదు.

నేహాభిక్రమనాశోఽస్తి । (భ. గీ. 2-40)

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపిసః ॥

(భ. గీ. 6-44)

పూర్వకాలమం దభ్యసించినందువలన నది బలాత్కారముగా వానిని యోగమార్గమునకు ద్రిప్పును.

నహి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాతగచ్ఛతి ॥
(భ. గీ. 6-40)

మంచిపని చేసినవానికి దుర్దశ కల్గనేరదు.

మనము చేసిన కల్యాణ కర్మ వాసనారూపమున సూక్ష్మమగు దేహ బీజమునందుండి (Permanent atom) అవకాశము కల్గినపుడు ఫలించును. (చెడ్డమార్గమునుండి) బలాత్కారముగా దొలగించును. వాని కామ క్రోధాదులను దొలగించును.

"నిశ్శబ్దవాక్కు వానిలోపల నిలిచియే యుండును. వాడు మార్గమును బూర్తిగ వదలినను గూడ నెప్పుడో యొకదిన మది మఱల వినబడును. వానిని (చెడ్డమార్గమునుండి) బలాత్కారముగ మఱలించును. వాని కామక్రోధాదులను భగవత్ప్రాప్త్యవకాశములనుండి వేఱుపరచును. అప్పుడు విడనాడబడిన (వాని) యపరిశుద్ధస్వ[1] భావము దుఃఖమును జెంది ఆశాభంగముచే విలపించుచుండగా వాడు (అనగా శిష్యుడు) (సన్మార్గమునకు) మఱలివచ్చును."

ఇందుకు అజామిళ పురంజనోపాఖ్యానములను నిదర్శనములుగ దీసికొనవచ్చును. వారు పూర్వజన్మములందు భక్తివైరాగ్యముల నభ్యసించియుండియు లోపల నిర్మూలముగ నశించక దాగియుండిన రాగాది కాలుష్యములకు జిక్కుపడి పూర్వపుజ్ఞానము ప్రచ్ఛన్నమగుటచే అవివేకయుక్తమగు సంసారమందు బడి, బహుకాలము సుఖదుఃఖానుభవములకు లోబడి, పాపకర్మ క్షీణించగా పూర్వపుజ్ఞానము

[1] అన్నమయ ప్రాణమయ మనోమయ కోశాభిమానియగు జీవుడు.

స్మరించుట కించుక అవకాశము కలిగినమాత్రమున లబ్ధ స్మృతులై పరమపదమును బొందిరని భాగవతగ్రంథమువలన దెలియవచ్చుచున్నది. మఱియు మహాయోగులగు భరతుడు (జడభరతుడని యెన్నబడిన రాజర్షి) మొదలగువారు మోక్షమున కత్యంత సామీప్యమున నుండినవారైనను స్వల్పవిషయములలో మోసమును జెంది తత్ఫలముగ సంసారభ్రమణమునకు బాత్రులైరని తెలియవచ్చుచున్నది. అంతటి వారే క్రిందబడ దక్కువవా రెట్లు తప్పించుకొన గలరని యోచించి హెచ్చరికగొని జాగ్రతగ నుండవలెనని గ్రహించవలయు. నిశ్శేషముగా అనగా బీజసహితముగా రాగద్వేషాదులు నశించువఱకు నవి వానికవకాశము కలిగినపు డంకురించి సాధకుని ఉన్మార్గ ప్రవృత్తునిగ జేయునని యెఱుంగవలయు. ఆ కాలుష్యము సమూలముగా నశించుకాలమే అది విలపించుకాలమని యిచ్చట జెప్పబడియున్నది.

"కనుక నేను జెప్పునదేమన 'నీకు శాంతి కలుగు గాత' 'నా శాంతిని నీ కొసగెదను' అను వాక్యములు తన స్వరూపులైన ప్రియతమ శిష్యులకు మాత్రమే గురువువలన ఉచ్చరించబడగలవు."

నివృత్తిమార్గమునందు బ్రవేశించి గురుసాక్షాత్కారము గోరు శిష్యులలోని తరగతులను గుఱించి యిదివఱలో వివరముగా వ్రాయబడెను. ఆ తరగతులు, (1) ఈక్షణగతులు, (2) స్వీకృతులు. (3) గురుపుత్రులు. (4) ఉపదేశము పొందినవారు (దీక్షితులు).

రెండవ తరగతికి గ్రిందివారి కీ శాంతివచన మన్వయించదు. అంగీకరించబడిన శిష్యులను గురువులు "ఆత్మైవ మే మతమ్" తమ స్వరూపులుగా నెన్నుకొనెదరు. వారియందు గురువులకుండు ప్రేమ యిట్టిదియని వర్ణించ నలవికాదు. వారు "నీకు శాంతికలుగు గాత;

నా శాంతిని నీ కొసగెదను" అని చెప్పగనే ఆత్మతేజస్సు, గురువు నుండి శిష్యుని మనస్సులో బ్రవేశించి వానికి జ్ఞానోత్కర్షయు, ఉపాధుల క్షోభను నణచుకొను బలము, కలుగజేయును. ఈ గుర్వనుగ్రహ ప్రసాదప్రాప్తి గొప్ప అభ్యుదయ ప్రాప్తికన్న వెయ్యంతలు హెచ్చని నమ్మి యందుకొఱకై పాటుపడి లబ్ధప్రసాదులు కానుద్యమించవలెను.

"ప్రాగ్దేశజ్ఞానము లేనివారలలో గూడ వీనిని జెప్పదగినవారు కొందఱు గలరు. వారలకు బ్రతిదినము ముందు దినమునకన్న విశేష సంపూర్ణముగా జెప్పవచ్చును."

ప్రాగ్దేశజ్ఞానమనగా అధ్యాత్మ విద్య.

△ ఈ త్రికోణము గ్రంథకర్తగారి సంతకపు చిహ్నమని యూహించదగి యున్నదని చెప్పబడుచున్నది.

ఈ గ్రంథము ప్రథమభాగము సమాప్తమాయెను. దానికి జేరికగా హైలేరియన్ అను ఋషి వారి గురువులయాజ్ఞ చొప్పున ఈజిప్టుదేశములో బోధించిన మూడు ధర్మముల నిచ్చట వ్రాసియున్నారు. వానిని ఆఱవ అధ్యాయములో అనుబంధముగా చేర్చడమైనది.

---

# ఆఱవ అధ్యాయము

## అనుబంధము

## సనాతనధర్మత్రయము

మూడు ధర్మములను గౌరవించుము. అవి సమాన ములు.

ధర్మములు తత్కాలానుసారముగా ప్రచురించబడును. ఆ దేశము స్థితిగతులనుబట్టి ముఖ్యధర్మములు మాత్రము బోధించబడినవని తెలియదగియున్నది. ఆ మూడు ధర్మము లనన్యాశ్రయములు, అవి నాశములు, అని చెప్పబడియున్నవి.

మూలధర్మములు మాఱునవి కావు. సర్వకాలములయందు సర్వదేశములయం దన్వయించునవి. యుగధర్మములు, వర్ణాశ్రమధర్మములు, రాజధర్మములు మొదలగునవి ప్రత్యేకవ్యాప్తి, కాలానుసారవ్యాప్తి కలిగియుండును. దేశకాలానుసార ధర్మములు మాఱును. దేశకాలాతీతుడగు భగవద్విషయ ధర్మము లవ్యయములు, అవినాశములు.

“అయిన వాక్కు లేమిచే మౌనముగా నుండవచ్చును.”

అనగా ప్రవక్తలు, అనుష్ఠాతలు లేమిచే అననుష్ఠేయములై మఱుగుపడి పోవును.

ఆ మూడు ధర్మము లెవ్వియన:—

"(1) ఆత్మ అమృత స్వరూపము. దాని భావికాలదశ అవ రిచ్ఛిన్న వృద్ధి ప్రకాశములుగల వస్తువుయొక్క భవిష్యత్కాల దశ వంటిది.

"(2) ప్రాణమునొసగు ధర్మము మన లోపలను వెలుపలను నివసించియున్నది. అది మరణము నొందునది కాదు. నిత్యహితకారి. వినబడదు, చూడబడదు, ఆఘ్రాణించబడదు; అయితే చూడగోరు మనుష్యునివలన జూడబడును.

"(3) ప్రతిమనుజుడు తనకు దానే శాసనాధిపతి. తన సుఖ దుఃఖప్రాప్తికి దానేకర్త."

మొదటి ధర్మము జీవాత్మ విషయము. జీవుడీశ్వరాంశయే, కావున అమృతస్వరూపుడు. ఆదియందజ్ఞుడై పరిపాకదశయందీశ్వర భావమును బొందును.

వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥

(భ. గీ. 4-10)

ఈ సూత్రము జీవుని జీవయాత్ర ధర్మమును (law of evolution) దెలుపుచున్నది.

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిం ॥

(భ. గీ. 6-45)

ప్రతిజన్మములో గొంచ కొంచె ముపాధి అపారిశుద్ధ్యమును దొల గించుకొనుచు ననేక జన్మముల తుది బరమపదమును బొందును. అదియే జీవుని భావికాలదశ. మిణుగురు (విస్ఫులింగము)గ నుండు వాడు మంటవలెనగుట ; బీజముగ నుండువాడు వృక్షమువలె నగుట.

రెండవ ధర్మము పరమాత్మ విషయము. పరమాత్మ సర్వభూతాం తర్యామి. ఆయన అంతర్యామిగా లేనిపదార్థ మొక్కటియును లేదు.

ఆ పరమాత్మ మన ప్రాణమున కాధారము.

స ఉ ప్రాణస్య ప్రాణః ॥ (కే. ఉప.)

జీవనం సర్వభూతేషు ॥ (భ. గీ. 7-9)

అది లోపలను వెలుపలను నున్నది.

స భాహ్యాభ్యంతరో హ్యజః ॥ (ముం. ఉప.)

అది మరణము నొందునది కాదు.

తదేతత్సత్యం తదమృతం ॥ (ముం ఉప.)

నిత్యహితకారి.

సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ॥ (భ. గీ. 5-29)

వినబడదు, చూడబడదు, ఆఘ్రాణించబడదు.

న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యైః దేవైః తపసా కర్మణా వా ॥ (ముం. ఉప.)

చూడగల మనుష్యునివలన జూడబడును.

దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మ దర్శిభిః ॥ (క. ఉప.)

మూడవ ధర్మము కర్మవిధినిగూర్చి భోధించుచున్నది. ప్రతిమనుజుడు వాని శుభాశుభకర్మ ననుసరించి సుఖదుఃఖముల ననుభవించును., కావున శుభాశుభ ఫలములకు బ్రతిమనుజుడు తనకుదానే కర్త.

ఇట్లు ఈ మూడు ధర్మములవలన జీవుని తత్వము, ఈశ్వరతత్వము, జీవు డీశ్వరుని జెందుమార్గ ధర్మము బోధించబడెను. ఇంతకన్న నెఱుగవలసిన విషయము లుండనేరవు.

పైన వ్రాయబడిన ధర్మములు బోధామందిర గోడల పైన వ్రాయబడిన విధులలో మొదటివి. అడిగినవారు పొందుదురు. చదువ గోరువారు చదువుదురు. నేర్చు కొనగోరువారు నేర్చుకొనెదరు.

నీకు శాంతికలుగు గాక



---

## అనుశాసనము

### పూర్వవచనము

శాంతిరూపమైన నిశ్శబ్దమునుండి యొక గంభీరమగు శబ్దము పుట్టును. అది యేమి చెప్పునన:—ఇది సరి కాదు; ఫలము ననుభవించితివి; ఇప్పుడు విత్తనము వేయవలెను. ఈ వాక్కు నిశ్శబ్దవాక్కు యని తెలిసి కొని దానికి విధేయతగా ప్రవర్తింతువు.

ఇప్పుడు శిష్యుడవైన నీవు నిలువ శక్తిగల్గిన వాడవైతివి; విన శక్తిగలవాడవైతివి; చూడ శక్తిగలవాడవైతివి; వచించ శక్తిగలవాడవైతివి; కామమును జయించితివి; ఆత్మజ్ఞానమును బొందితివి; పూర్ణవికాసము నొందిన ఆత్మపుష్పమును జూచితివి; దానిని గుర్తించితివి; నిశ్శబ్ద వాక్కును వింటివి. బోధామందిరమునకు బొమ్ము. నీ కొఱకచ్చట వ్రాయబడియుండు దానిని జదువు కొనుము.

టీక

నిలువ శక్తికలుగుట యనగా శ్రద్ధకలుగుట ; విన శక్తికలుగుట యనగా ఆత్మకవాటములను తెఱచుట ; చూడ శక్తికలుగుట యనగా ఈక్షణ శక్తి కలుగుట ; వచించ శక్తికలుగుట యన పరోపకారశక్తి గలిగియుండుట ; కామమును జయించి యుండుట యనగా ఉపాధులను నియమించుకొని యుపయోగించుకొన నేర్చుకొని యుండుట ; ఆత్మజ్ఞానమును బొందితివి అనగా ఎచ్చట స్థాపించబడిన వాడవై అహంకారకోశాభిమాని ప్రవర్తనలను నిష్పక్షపాతముగ జూడగలవో అట్టి కోటలోకి మఱలియుండుట; వికసించిన ఆత్మపుష్పమును చూచుట యన కాలపక్వమున మానుషాతీతదశను జెందించునట్టి మార్పును నీలో నీవు క్షణకాలము సాక్షాత్కరించుట ; దానిని గుర్తించుట యనగా, కన్నులు మూయకయును, భయంకరమైన పెనుభూతమును జూచినపుడు భయపడినట్లు భయపడి వెనుదీయకయును, దేదీప్యమాన మగు వెలుగును జూచుట యను గొప్పకార్యమును సాధించుట. కొందఱ కిట్లు తటస్థించును. (ఇంతదూరము పోరాడి చివరన) జయము సమీపించినపుడు పోగొట్టు కొనుచురు.

నిశ్శబ్దవాక్కును వినుటయనగా యథార్థమైన బోధ తనలోపల నుండియే రాగలదని తెలిసికొనుట ; బోధామందిరమునను బోవుట యనగా బోధను గ్రహించుదశ ప్రాప్తించుట. అప్పుడచ్చట నీ కొఱకు ఠెక్కుమాటలు వ్రాయబడి యుండును. నీవు సులభముగ జదువుకొన గలుగుటకై ప్రకాశమైన అక్షరములతో వ్రాయబడి యుండును. శిష్యుడు సిద్ధముగ నుండునప్పుడు గురువు సయితము సిద్ధముగ నుండనే యుండును.

'తారకో (గురూ) పదేశము కాగా అందువలన బ్రాప్తించిన యొక్క డనుభవజ్ఞానమునకు విస్మయ మంది శిష్యుడు శాంతముగ బరిశీలించుచుండును. ప్రథమ తారకోపదేశమైన పిమ్మట రెండవది కావలయును. మూడవదియు నటు పిమ్మట నాల్గవదియు నిట్లు క్రమ క్రమముగ బైమెట్టుకు బోవలసియుండును. అనగా కుటీచక, బహూదకాది దశలు గడవవలెను. బహుకాల మొక్క బోధనే నిశ్శబ్దముగ గూర్చుండి శాంతముగ బరిశీలించు చుండ సాధ్యములేదు. శీఘ్రముగ లేచి మఱియు బైమెట్టుకు బోవ బ్రయత్నించుమని గురువు చెప్పును.

సరికాదనగా బహుకాలముండిన మెట్టుననే యుండ గూడదని.

ఫలమనుభవించితివి=పూర్వపు ప్రయత్నమువలన గురు సాక్షాత్కారము, తారకోపదేశము అను ఫలముల ననుభవించితివి. ఇప్పుడు విత్తనము వేయవలెను=పైమెట్టుకు బోవలెను.

నిశ్శబ్దముయొక్క వాక్కు=ఆత్మ ప్రేరిత వాక్కు.

ఇప్పుడు శిష్యుడ వైతివి=గురూపదేశము పొందిన శిష్యుడవైతివి.

"నిలువ శక్తికలుగుట యనగా శ్రద్ధకలుగుట."

అనుభవజ్ఞానము కలుగుటవలన నమ్మకము కలుగును. ఈ విషయము మొదటి భాగము, 21 వ సూత్రము వ్యాఖ్యానములో విచారించబడి యున్నది.

"విన శక్తికలుగుట యనగా ఆత్మకవాటములను దెఱచుట."

తలుపులను దెఱచుట యనగా మూయబడిన ద్వారమును దెఱచుట. ద్వారము తెఱవబడిన యెడల దేని దేనికి మధ్య అది ద్వారమో యా రెంటిలో నొకదానినుండి మఱియొక దానికి [illegible] మార్గ

మేర్పడును ఈ సామ్యము వేదాంత గ్రంథములలో సహజముగ ప్రయోగించబడియున్నది. "స్వర్గద్వార మపావృతం" అనియు,

విపృతం సద్మ నచికేతసం మన్యే । (కఠ. ఉ.)

తత్ త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే ॥

(ఈశ. ఉ.)

అనియు సందర్భాను సారముగ ప్రయోగించబడియున్నవి. స్వర్గ ద్వారము తెలియబడుట యనునది క్రిందిమెట్టు. ఉపనిషద్వాక్యముల లో నాత్మద్వార విషయము ప్రస్తావించబడియున్నది. ఆత్మ కత్యంత సన్నిహితోపాధి బుద్ధియని యిదివఱకే తెలియ జేయబడెను. ఆత్మ తేజస్సు బుద్ధియందు ప్రచారమై యుండును. అయితే మనస్సు అత్యంత విశుద్ధమగువఱకు బుద్ధినుండి యాత్మ తేజస్సు మనస్సునకును, దానినుండి ఇంద్రియములకును, స్థూలదేహమునకును, రానేరదు. మనస్సునందలి యపారిశుద్ధ్య వాసనలకే ఈశవాశ్యోపనిషత్తులో సత్యము పైన గప్పిన హిరణ్మయపాత్ర యని నిరూపించబడియున్నది. ఆ సత్యమే ఆత్మతేజస్సు క్రిందిలోకములకు రాగలుగు ద్వారము. దానిని తెఱవమని యోగ్యతగల శిష్యుడు ప్రార్థింప, తెఱవబడును. అప్పుడు క్రిందిలోకములలో బనిచేయుచున్నను ఆత్మతేజస్సు సదా ప్రవహించుచునే యుండును. అట్లు పనిచేయుమనియే "యోగస్థః కురు కర్మాణి" అను గీతా వాక్యము బోధించుచున్నది. తెఱవమని ప్రార్థించగల యోగ్యత సత్యధర్మానుష్ఠానము అని పై యుపనిష ద్వాక్యము బోధించుచున్నది. సత్యద్వార ప్రవేశమునకు సత్యధర్మాను ష్ఠానమే కావలయును. సర్వ భూత ఏకీభావమే సత్య స్వరూపము.

కావున సర్వభూతైకత్వభావాభ్యాసము సదా కర్తవ్యము. అట్లు చేసినచో సత్యద్వారము తెఱవబడును. అప్పుడాత్మ శబ్దమును విన గలుగుదుము.

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం ।
తత్ త్వం పూష న్నపావృణు సత్య ధర్మాయ దృష్టయే ॥
(ఈ. ఉప.)

" చూడ శక్తికలుగుట యనగా ఈక్షణ శక్తి కలుగుట."

ఈక్షణ మన నపరోక్షానుభవశక్తి. అనగా ప్రత్యక్షముగ జూచుట. అంతకుముందు శాస్త్రజ్ఞానమే కాని సాక్షాత్కారము లేదు. ఇప్పుడు శ్రవణానుభవ విషయము సాక్షాత్కరించును. ఇందు కుదాహరణము: సర్వభూతముల ఏకీభావము గ్రంథపఠనము ద్వారా తెలిసికొని యుండవచ్చును. పై జెప్పిన శక్తి గలిగినప్పుడా యేకీభావము ప్రత్యక్షముగ గోచరమగును. అనగా అనుభవసిద్ధమగును. బుద్ధ్యుపాధిలో బనిచేయగలిగినప్పుడా దృష్టి కలుగును.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥
(భ. గీ. 6-29)

" వచించ శక్తికలుగుట యన పరోపకారశక్తి గలిగియుండుట."

పలికిన పలుకులు తపోమయముగ నుండవలెనని తాత్పర్యము.

వాఙ్మయ తపస్సన:

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥
(భ. గీ. 17-15)

ఈ సత్యప్రియహితము లనునవి ఈశ్వరుని జ్ఞాన ఇచ్ఛా క్రియా స్వరూపములు. ఆ మూడు గుణములు గల వాక్కు ఈశ్వర వాక్కుగా నుండును. అట్టి వాక్కు మనకు దెలిసినను దెలియక పోయినను సర్వ భూత హితకారిగ నుండును. అందువలననే "శ్రీనాధు వర్ణించు జిహ్వా జిహ్వా" అనగా జిహ్వేంద్రియముతో వచించు ప్రతి వాక్కీశ్వరార్పణ యోగ్యముగ నుండవలయును. అనగా దృష్టముగా నైన నదృష్టముగా నైన లోకశోభనకారిగ నుండవలెను.

మఱియు బై జెప్పిన విధమున జూడ విన శక్తిగలవా డపరోక్షానుభవముతో బల్కును గావున వాని మాటలు జనులకు హితకరములుగ నుండక తీరదు.

"కామమును జయించి యుండుట యనగా ఉపాధులను నియమించుకొని యుపయోగించుకొన నేర్చుకొని యుండుట."

ఉపాధులకు దమ రాగద్వేషము లుండగూడదు. సంపూర్ణముగ జీవునివశములోకి వచ్చియుండవలెను. వాడేమి కోరుమన దాని గోరవలెను. దేని సంకల్పించవలెనన దానినే సంకల్పించవలెను. ఇది యోగసిద్ధి.

"ఆత్మజ్ఞానమును బొందితివి అనగా ఎచ్చట స్థాపించబడిన వాడవై అహంకారకోశాభిమాని ప్రవర్తనలను నిష్పక్షపాతముగ జూడ గలవో అట్టి కోటలోకి మఱలియుండుట."

ఈ కోట మహత్తను విశుద్ధబుద్ధి.

జ్ఞానాత్మ అను విజ్ఞానమయ కోశాభిమాని యహంకార సంయుక్తుడుగ నుండును. వానిని మహత్తను విశుద్ధబుద్ధితో నియమించవలెనని తాత్పర్యము. అది క్షేత్రజ్ఞుని స్థానము. క్షేత్రజ్ఞుడే క్షేత్రమును అన

గా క్షేత్రప్రవర్తనలను, జక్కగా దెలిసికొని తాను దానికంటె విల క్షణుడని యెఱుగువాడు. అదియే జ్ఞానము.

> బుద్ధ్యా విశుద్ధయా యుక్తః . . . . . . .
> అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం ।
> విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయకల్పతే ॥
>
> (భ. గీ. 18-51, 53)

"వికసించిన ఆత్మపుష్పమును జూచుట యన కాలపక్వమున మానుషాతీతదశను జెందించునట్టి మార్పును నీలో నీవు క్షణకాలము సాక్షాత్కరించుట."

> సమానే వృక్షే పురుషో నిమగ్నో అనీశయా శోచతి ముహ్యమానః । జుష్టం యదా పశ్యత్యన్యమీశ మస్య మహి మాన మితి వీతశోకః ॥ యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం ॥ తదా విద్వాన్ పుణ్య పాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి ॥ (ముం. ఉ.)

మోహముచేత జీవుడు శోకించుచుండును. ఎప్పుడు పూజ్యుడైన ఈశ్వ రుని జూడగలుగునో, యిదియంతయు నాయన మహిమయే యని తెలిసికొనునో అప్పుడు శోకము పోవును.

దివ్యదృష్టిచే కర్తయును జగదాధారుడును నగు బంగారు వర్ణము వంటి వర్ణముగల ఈశ్వరుడను పురుషు నెప్పుడు చూచునో అప్పుడు పుణ్యపాపములను అతిక్రమించి నిరంజనుడై పరమసామ్యమును బొందును.

మృత్యువును దాటి అమృతత్వమును జెందుటయే గొప్పమార్పు. ఆ మార్పుయొక్క ప్రారంభదశ యిచ్చట ప్రస్తావించబడినది. పరిపాకదశ కాదు. ఇచ్చట జెప్పిన దశయందు పై జెప్పిన ఉపనిషద్వాక్యములలో వర్ణించబడిన స్థితిలో గొంతమాత్రమే యనుభవమునకు వచ్చును.

"దానిని గుర్తించుట యనగా, కన్నులు మూయకయును, భయంకరమైన పెను భూతమును జూచినపుడు భయపడినట్లు భయపడి వెనుదీయకయును, దేదీప్యమానమగు వెలుగును జూచుటయను గొప్ప కార్యమును సాధించుట. కొందఱు కిట్లు తటస్థించును. (ఇంత దూరము పోరాడి చివరన) జయము సమీపించినపుడు పోగొట్టుకొనుదురు."

ఆ యున్నతస్థితి వైచిత్ర్యమును గొప్పతనమును బూర్వపుదశ వైలక్షణ్యమును జూచి కొందఱు వెఱగందెదరు. నే నాత్మస్వరూపుడను కాదా. 'ఆత్మకు భయమెక్కడిది? దానికి భయమునుగాని, నష్టమునుగాని, క్లేశమునుగాని, నాశముగాని ఏవరు చేయుగలరు అను జ్ఞానము విస్మృతివలన నష్టమైనందున భయముకలుగును. అట్లు కాకుండునటుల నిప్పటినుండియే గురుదేవుడు, గన్నులకు గనుపడినను గనుపడక పోయినను, సర్వవిపత్తులనుండియు సర్వసంకటముల నుండియు రక్షించుననియు, "నే నాత్మస్వరూపుడను, నా కపాయము కలిగించునదెద్దియు లేదు" అనియు దలచుచు, నా తలంపు దృఢపడ నభ్యసించు చుండవలెను.

"నిశ్శబ్దవాక్కును వినుటయనగా యథార్థమైన బోధ తనలోపల నుండియే రాగలదని తెలిసికొనుట."

సర్వనియంతృశక్తి భగవంతునిదే. ఆయన మనలోపల నున్నాడను నమ్మక ముండవలెను.

"బోధామందిరమునకు బోవుట యనగా బోధను గ్రహించుదశ ప్రాప్తించుట. అప్పుడచ్చట నీ కొఱకు బెక్కుమాటలు వ్రాయబడి యుండును. నీవు సులభముగ జదువుకొన గలుగుటకై ప్రకాశమైన అక్షరములతో వ్రాయబడి యుండును. శిష్యుడు సిద్ధముగ నుండు నప్పుడు గురువు సయితము సిద్ధముగ నుండనే యుండును."

ఈ విషయమిదివఱలో విపులముగా విచారించబడి యున్నది.

## ప్రాచీనసూత్రములు

1. రాబోవు యుద్ధములో బ్రక్కకు దొలగి నిలువుము. పోరాడుచుండియు, నీవు యుద్ధభటుడుగ నుండకుము.

2. యుద్ధభటుని కనుగొనుము. నీలో వానిని బోరాడనిమ్ము.

3. యుద్ధము జేయువాని యాజ్ఞను బొంది దాని ననువర్తించుము.

ఈ యుద్ధము నేను జేయునది, ఇందులోని జయము నాది, అను అహంకారమును బ్రక్కకు దొలగించి భగవంతు నాశ్రయించి యా యన ప్రసాదముచేతనే పోరాటమున కుద్యమింతుననియు, పోరాటము ఫలము [illegible] దనియు భావించవలెను.

4 వ వ్యాఖ్యానసూత్రము

ఆయన యాజ్ఞ ననువర్తించునపు డాయన సేనాధిపతి యని భావించవలదు. ఆయిన నీవే యనియు, ఆయిన పలుకు మాటలు నీ గూఢమైన కోరికల బహిఃప్రకాశక శబ్దములే యనియు భావించుము. నిక్కముగ నాయన నీవే; అయినను నీకన్న నత్యంతముగ హెచ్చు జ్ఞానమును బలమును గలవాడు. ఆయన నన్వేషించుము. అట్లు చేయనిచో పోరాటములోని తొందర, యుద్వేగ సంరంభములో నాయనను గనిపెట్టలేక తప్పిపోయెదవు. నీ వాయన నెఱుగువఱకు నాయన నిన్నెఱుంగడు. నీ మొఱ, విన సిద్ధముగనుండు నాయన చెవికందదనేని, ఆయన నీ లోపల బోరాడును. మఱియు నీ యందలి యుత్సాహ రహితమగు శూన్యతను బూరించును. అట్లయినచో నీవు ప్రక్కన నిల్చియుండి, నీ బదు లాయనను బోరాడనిచ్చుటవలన యుద్ధమునందు నీవు శాంతుడవుగను నాయాసరహితుడవుగను నుండగలుగుదువు. అప్పుడు నీవు కొట్టు దెబ్బయొకటి యయినను దప్పిపోనేరదు. అట్లు లేక ఆయనను నిరీక్షించక యుపేక్షించితి వేని నీకు క్షేమములేదు. నీకు దల తిరుగును. హృదయమునందు సంశయము లుద్భవించును. యుద్ధరంగపు

దుమ్మునందు నీకు జూపుతప్పును. ఇంద్రియముల వ్యా పారము నిల్చిపోవును. అట్టి దశలో నీ స్నేహితు లెవ రైనది శత్రువు లెవరైనది కనుగొననేరక పోదువు. ఆయ న నీవే. అయినను నీవు పరిచ్ఛిన్నుడవు; తప్పులు చేయుదువు. ఆయన నిత్యుడు; నిస్సంశయుడు; ఆయ న నిత్య సత్య (ధర్మ) స్వరూపుడు. ఒకసారి యాయన నీలో బ్రవేశించి నీలో బోరాడువాడైన-చో, బిడప నిన్నెప్పుడును విడనాడడు. పరమ శాంతికాలము వచ్చి నప్పుడు నీతో నైక్యము నొందును.

---

"ఆయన యాజ్ఞ ననువర్తించునపు డాయన సేనాధిపతి యని భా వించ వలదు. ఆయన నీవే యనియు ఆయన పలుకుమాటలు నీ గూఢ మైన కోరికల బహిఃప్రకాశక శబ్దములే యనియు భావించుము."

భగవంతుం డెచటనో వెలుపలనుండి శాసించుచుండునని తలచ గూడదు. ఆయనను భావించునపు డంతను నాత్మస్వరూపముగనే భావించవలెను. ఇదియే యుపాసనా రహస్యము.

తదిదమపి ఏతర్హి య ఏవం వేద అహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి తస్య దేవాశ్చ నాభూత్యా ఈశతే ఆత్మాహి ఏషాం స భవతి। అథ యోఽన్యాం దేవతా ముపా స్తే అన్యో అసౌ అన్యో అహమస్మీతి న స వేద యథా పశు రేవం స దేవానాం ॥ (బృ. ఉప.)

ఇక్కాలమున నయిత మెవ్వరు "నేను బ్రహ్మను" అని తెలిసి కొనునో వాడు సర్వము తానే యగుచున్నాడు. వాని సర్వత్వ ప్రాప్తిని దేవతలు నిరోధించ నేరరు. ఎందువలన ననగా వాడా దేవతల కాత్మయగుచున్నాడు. (ఆత్మ నెట్లు నిరోధించ గలరు?) అట్లుకాక ఎవడు దేవత వేఱు నేను వేఱు అని తలచి దేవతోపాసన చేయుచున్నాడో వాడు తెలిసినవాడు కాడు. వానిని దేవతలు తమ పశువుగా భావించెదరు. మఱియు,

యోఽసావసౌ పురుష స్సోహ మస్మి । (ఈశా. ఉప.)

ఆ పురుషుడే నేను.

గూఢమైన కోరిక లన, నధోగతి జెందించు కామము కాదు. ఈశ్వరాంశయగు జీవుడు తన స్వస్థానమును జేరవలెనను కోరికయే గూఢమైన కోరిక. కామమయ మనస్సు విషయాభి ముఖముగ నుండును. సామాన్యజనుల కిది సహజము. ప్రతియొకనియందును దన యునికిపట్టయిన నీశ్వర సాన్నిధ్యమును చేరవలయు ననెడి యిచ్ఛయుండనే యుండును. అయితే అంతఃకరణశుద్ధి అహంకార నాశనము కలుగువఱకు దేహతాదాత్మ్యమే యుండును. ఎప్పు డంత ర్ముఖుడగునో అప్పుడు ప్రకాశముగ నుండు కామసంకల్పములు వీడి పోవును. ప్రచ్ఛన్నముగనుండిన నాత్మావలోకనేచ్ఛ ప్రకాశమునకు వచ్చును. అట్టి కోరికపుట్టుటయే ఆత్మ అనాత్మను జయించి వశ పరుచుకున్న చిహ్నము. ఆ ఆత్మసంకల్పమే పరమేశ్వర సంకల్పము.

"నిక్కముగ నాయన నీవే; అయినను నీకన్న నత్యంతముగ హెచ్చు జ్ఞానమును బలమును గలవాడు."

ఇదియే జీవపరమాత్మలకు గల భేదము.

జ్ఞాఽజ్ఞౌ అజౌ ఈశానీశౌ ॥ (శ్వే. ఉ.)

ఉభయులు నజులే; అయితే పరమాత్మ జ్ఞానపూర్ణుడు; ప్రకృతిని వశపరచుకొనిన వాడు. జీవు డజ్ఞుడు; ప్రకృతికి వశపడినవాడు. ఎప్పుడు ప్రకృతిని వశపరచుకొని జ్ఞానపూర్ణుడగునో అప్పుడు ఈశ్వరుడే యగును, లేక ఈశ్వరసాన్నిధ్యమునకు యోగ్యుడగును.

"ఆయన నన్వీక్షించుము."

ఇప్పుడు మనము సంసారముదెస జూచుచు జనన మరణ ప్రవాహములలో మునుగుచు దేలుచున్నారము. ఆయనె మనకు చెలికాడై మనలను జూచుచు గనిపెట్టియున్నను మన మాయనదెస జూడక యున్నాము. ఎంతకాలమువఱ కట్లు చూడక యుండెదమో అంత కాలము వఱకు మనకు సంసారప్రాప్తియే. ఆయనను జూడ గల్గిన తత్క్షణం శోకమోహములు నశించును. పుణ్యపాపము లంట నేరవు.

సమానే వృక్షే పురుషో నిమగ్నో అనీశయా శోచతి ముహ్యమానః। జుష్టం యదా పశ్యత్యన్యమీశ మస్య మహిమాన మితి వీతశోకః ॥ యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం। తదా విద్వాన్ పుణ్య పాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి ॥ (ముం. ఉ.)

సర్వా జీవే సర్వసంస్థే బృహంతే।
తస్మిన్ హంసో భ్రామ్యతే బ్రహ్మచక్రే ॥
పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా।
జుష్టః తతస్తేనామృతత్వ మేతి ॥ (శ్వే. ఉ.)

తానును దన ప్రేరితుడగు నీశ్వరుడు వేఱు అని యెంతకాలము తలచు కొనుచుండునో అంతకాలము సంసారచక్రములో బడి భ్రమించు చుండును. ఆయనను జూచిన యెడల నమృతత్వమును జెందును.

"అట్లు చేయనిచో పోరాటములోని తొందర, యుద్వేగ సంరంభములో నాయనను గనిపెట్టలేక తప్పిపోయెదవు."

మన జీవితమే యుద్ధభూమి.

ఆ యుద్ధముచేయు విధములు రెండు. "భగవంతుడే యుద్ధము చేయువాడు, నేను నిమిత్తమాత్రుడను" అని తలచి చేయుట; లేక "నేను యుద్ధము చేయుచున్నాను, జయాపజయములు నావి" యని తలచుట రెండవ విధము. రెండవ మార్గ మహంకారమును వృద్ధిచేయు నది. కావున బంధకారణము. మొదటిది యహంకార నాశనమునకు గారణము కావున మోక్షసాధనము.

భారత యుద్ధములో శత్రువులను నే నిదివఱకే హతము చేసినాను, నీవు నిమిత్తమాత్రుడవుగ నుండి యుద్ధము చేయుమని భగవంతుం డర్జునునికి జెప్పెను.

> మయైవైతే నిహతాః పూర్వమేవ
> నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥

అనగా ఈశ్వరసంకల్పమే ఎప్పటికిని నెఱవేరునది. ఆ సంకల్పము స్థూలప్రపంచములో మనద్వారా నెఱవేరును. అప్పుడు మనము నిమిత్తమాత్రులగు భృత్యులమే. యజమానుడాయనయే. రెండవ పక్షము నవలంబించి నేను యుద్ధము చేయుచున్నానని తలచెదమేని భగవంతుని నెఱుంగజాలము.

నిన్ను మఱచె నేని తన్ను దా దలచును.
తన్ను మఱచె నేని నిన్ను దలచు.

"నీ వాయన నెఱుగువఱకు నాయన నిన్నెఱుంగడు."

ఇచ్చట 'ఎఱుంగడు' అనగా తెలిసికొన నేరడని యర్థము కాదు. నీ వనుగ్రహమునకు బాత్రుడవని "తలచడు" అని అర్థము.

భగవంతు డందఱ నెఱుంగును. అందఱయందును సమముగ నుండును. అయితే భక్తిచేత నెవరు వారిని దలచి సేవింతురో వారు భగవంతుని యనుగ్రహ ప్రవాహమార్గమును పెద్దదిగా జేసికొని యందున హెచ్చుగ ననుగ్రహ రస ప్రసాదము పారుచుండును.

గొప్ప తటాకములోని జలము ప్రక్క ప్రదేశములో భూమిలోపల ఊటలను బలపర్చుచున్నను, భూములకు బారవలెనన దూములు పెట్టుకొని కాలువలు చేసికొనని యెడల నెట్లు పారనేరదో, ఎట్లు నీటి గొట్టములో నీరున్నను చీలద్రిప్పినగాని పాత్రలోకి నీరు రానేరదో, అట్లే ధ్యాన, భూత సేవారూపముల నీశు నారాధించువారికే వారి పరిపూర్ణ ప్రసాదామృతము లభించును.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం ॥

(భ. గీ. 9-29)

"మయితే" కలిగించితే "తేష్వహం" అను ఫలప్రాప్తి యగును.

"నీ మొఱ, విన సిద్ధముగనుండు నాయన చెవి కందేనేని, ఆయన నీ లోపల బోలేదము..."

ఆయన వినుట కెల్లప్పుడు సిద్ధముగా నుండును. మనము మొఱ పెట్టుకొనక యున్నాము. ఎందువలన నేనగా సంసారసుఖమే శాశ్వత మని నమ్మి యికను మేలైన దెద్దియు లేదని తలచుకొనువానికి సం సారబంధము నుండి విడిపించమని మొఱపెట్టుకొన బుద్ధి పుట్టనే పుట్టదు. "అడుగుట" అనగా నోటిమాటలతో నడుగుట కాదని యు, నీశ్వర ప్రసాదప్రాప్తియం దత్యంత తీవ్రేచ్ఛ లోపల బుట్టుట యే యనియు, నిదినఅలో మొదటి భాగము, 21 సూత్రములో జెప్పబడియున్నది.

"మఱియు నీయందలి యుత్సాహరహితమగు శూన్యతను బూ రించును."

ఎప్పటికిని దైన్యము (విషాదము) సరియైన గుణము కాదు. నిత్య సంతుష్టులుగ నుండవలయు. ఆదియందు విషయభోగముల యందు సంతుష్టి కలుగుచుండును. జ్ఞానోదయానంతరము ఆత్మావలోకన సంతుష్టి కలుగుచుండును. విషయభోగములయందు విరాగము కలిగి అక్షయసుఖము ప్రాప్తించుటకు బూర్వమే దీనత్వము (విషాదము) కలుగును. అదశ మిక్కిలి యపాయమైన దశ. దానికే శూన్యత్వ దశ యని పేరు. అప్పు డుత్సాహ ముండదు. అప్పుడు భక్తియే సహకారి. భక్తితో నీశ్వరుని దలచుటయే కాక ఆయన నన్ను దఱించును, ఆయన నన్నెపుడును విడనాడడు, నాకేమి భయము? ఆయన నా లోపలనే యున్నాడు. అని భజించి సేవించిన భక్తియను పరమో త్సాహము శూన్యత్వదశను దాటింపజేయును.

మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥
(భ. గీ. 7-14)

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥

(భ. గీ. 11-54)

ఏష హ్యే వానందయాతి ॥ (తై. ఉ.)

"అట్లయినచో నీవు ప్రక్కన నిల్చియుండి, నిబ్బను లాయనను బోరాడ నిచ్చుటవలన యుద్ధమునందు నీవు శాంతుడవుగను నాయాస రహితుడవుగను నుండగలుగుదువు."

శాంతత్వమునకును, ఆయాసరాహిత్యమునకును ప్రతిబంధకము కర్తృత్వాభిమానమే. నాకు జయము కల్గునో కలుగదో అను సంశయము, అపజయము కల్గునను భయము, శత్రుజయమున కోర్వలేమి, వీనివలన నాయాసము కలుగును. ఆత్మశక్తి దుర్వినియోగమగును. అందువలననే గీతా శాస్త్రమందు "యుద్ధ్యస్వ విగతజ్వరః" (క్షోభచెందక యుద్ధము చేయుము) అని చెప్పబడియున్నది. అట్లె ప్పుడు చేయగల మనగా

మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరః ॥

(భ. గీ. 3-30)

సర్వ కర్మములను భగవంతునియందు సంన్యసించవలెను.

అనగా ఆయనయే కర్త; నేను గాను. ఫలమునందు నాకపేక్ష లేదు. జయము నాది కాదు. ఆయనదేను. అని భావించినయెడల శాంతముతోను ఆయాస రహితముగను, యుద్ధము జరుగును. ఒక దెబ్బ అయినను [illegible] లేదు.

కర్తృత్వాభిమాన ముండినయెడల నది ప్రకృతి వికారమైన అహంకారలక్షణము కావున ప్రకృతి పరవశుల మగుదుము. అప్పుడు జయాపజయములు ప్రకృతి మండలములోజేరిన ప్రాచీన శుభాశుభ కర్మ ననుసరించి యుండును. అపజయము కలుగవచ్చును. ప్రకృతి సంమూఢత్వమువలన యథార్థజ్ఞాన ముండకపోవును. దౌర్బల్యము, స్మృతిభ్రంశము, కార్యాకార్య వివేకరాహిత్యము కలుగును. పరమాత్మ దృష్టిలేనప్పుడు ప్రకృతి వశులముగ నుందుము. ఆయనను జూచిన తక్షణం శోకమోహములు నశించును. ఒకసారియైనను జూచినట్టియైన నాయన తత్వజ్ఞాన ప్రాప్త్యనంతర మపాయములేదు. మఱల తుచ్ఛవిషయములమీద మనస్సు పోనేరదు. సర్వ మీశ్వరమయముగనే తోచును. ఈశ్వరచింత వినా వెఱొండు చింతయుండదు. అట్టివా డీశ్వరుని విడనాడడు. ఈశ్వరుడు వానిని విడనాడడు. సర్వకాలములందును ఎట్టి పని చేయుచుండినను వా డీశ్వరుని యందుండువాడే యగును.

> అజీర్యతామమృతానాముపేత్య జీర్యన్ మర్త్యః క్వధస్థః ప్రజానన్ । అభిధ్యాయన్ వర్ణరతీః ప్రమోదా నతిదీర్ఘే జీవితే కో రమేత ॥ (క. ఉప.)

సంసార అనిత్యత్వమును, పరమగతి యమృతత్వము నెఱిగిన వాడు ప్రపంచములో చిరకాలమైనను జీవించనొల్లడు.

> యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
> తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥
> (భ. గీ. 6-30)

ఎవడు నన్నంతటను జూచునో సర్వమును నాయందు జూచునో వాడు నన్ను విడనాడడు, నేను వాని విడనాడను.

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥

(భ. గీ. 6-31)

ఎవడు సర్వభూతములయం దుండు నన్నేకత్వాశ్రయ బుద్ధితో సేవించునో వా డేపని జేయుచుండినను నాయందే యుండినవా డగును.

౬ వ ప్రాచీనసూత్రము

జీవిత (విషయమైన) గీతమును వినుము.

టీక

ఆ గీతము ఎచ్చటనుండి వచ్చునది కనిపెట్టుము. ప్రథమమందు నీ హృదయములోపలనే దానిని వినుము. "అది యచ్చట లేదు; నేను వెదకగా నా కపస్వరమే వినపడుచున్నది" అని నీవు చెప్పవచ్చును. (అట్లయిన) మఱియు లోతుగ దిగి చూడుము. అప్పుడును నాశాభంగమైనచో, మఱియు నెక్కుడు లోతుగదిగి చూడుము. ప్రతి మనుజుని హృదయమునందును స్వాభావిక సుస్వరము, అగోచరమగు నీటి యూటయు నున్నవి. అవి కనపడకుండు నట్లును వినపడకుండు నట్లును మఱుగుపరచబడి యుండవచ్చును. అయిన నది యచ్చట నుండియే యున్నది. నీప్రకృతి తత్త్వమూలమునందు శ్రద్ధయు, ప్రతీక్షయు, ప్రేమయు గనుగొనియెదవు. దుర్నీతిమార్గ మవలంబించ నిశ్చయించినవాడు తనలోపల జూచుకొన నొల్లడు. తన హృదయము

నందలి సుస్వరము వినరాకుండునట్లు చెవులు మూసికొనును. ఆత్మ జ్యోతి కనబడకుండునట్లు కన్నులు మూసికొనును. అట్లు చేయుట ఎందుచేతనన నగా కామ నిమగ్నుడై జీవించుటయే సులభముగ వానికి గనబడును. అయినను సమస్తచేతన వర్గములోపల ప్రబలమయిన ప్రవాహము పారుచున్నది. దాని నడ్డగించ నెవ్వరికిని శక్యముకాదు. అచ్చట నిక్కముగ మహదుదకములున్నవి; వానిని గనుగొనుము. అప్పుడు నీవేమి తెలిసికొనగల వనగా: సర్వభూతములు—అత్యంతాధ ముడు సయితము—అందులోని యంశలు కానివారు లేరు. ఆ విషయ ము వానికి దెలియకుండ నుండనచ్చును. ఆ యజ్ఞానముచే వాని బాహ్యోపాధి చూచుటకు భయంకరముగ (అనగా హేయముగ) నుండవచ్చును. అయిన నట్టివాడు సయిత మీశ్వరాంశయే. (జ్ఞాన ప్రాప్తికై పోరాడుచుండు) నీవును మఱియు నీసరివారును అందఱు నీశ్వరాంశలే. అయితే నీవు మాయలో జిక్కుకొని మోసపోవు చుండుటవలన నితరుల హృదయమందా మధురవాక్కును మొదట నెచ్చట గనుగొన గలవో ఊహించుట కష్టము. అయిన నది నీయందే యున్నదనుట నిశ్చయము. అచ్చట దానిని గనిపెట్టుము. ఒకసారి దానిని నీలో విన గలిగితివేని దానిని నీచుట్టు సులభముగ గుర్తించ గలుగుదువు.

---

ఈ సూత్రార్థము దురవగాహము. కావుననే విపులమైన టీక వ్రాయబడియున్నది. గీత మనగా సమరస (Harmony) భరిత సుస్వరము లేక నాదము. వ్యక్తప్రపంచ మంతయు నామ రూపాత్మకము.

తద్ధేదం తర్హి అవ్యాకృత మాసీత్ తన్నామ రూపాభ్యా-
మేవ వ్యాక్రియత । అసౌనామ, అయం ఇదం రూప ఇతి ॥

(బృ. ఉప. 1-4)

అవ్యక్తముగనుండిన జగత్తు నామరూపములతో వ్యక్తమయ్యెను. వ్యక్తప్రపంచములో నామరూపములు లేని పదార్థము లేదు. ఈ నామరూపధారణమే జీవుడను వ్యవహారమునకు కారణము.

సేయం దేవతైక్షత హంతాహ మిమా స్తిస్రో దేవతా
అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి ॥

(ఛాం. ఉప. 6-3)

నామరూపముల గైకొని పరిచ్ఛిన్నత్వము నొందిన ఈశ్వరుడే జీవుడు. కావున ప్రతిజీవునికి ప్రత్యేక నామరూపము లుండును. ఆనామము వాని విశేషనామము. ప్రతియణువు ఈశ్వరశక్తిని నియతపరిమితి కొలదియు జూపు చలనము గలదియై యుండును. ఆ చలనము (Vibration) దాని స్వరము. ఒక యుపాధిలోని సమస్త అణువుల సముదాయస్వర మా యుపాధిస్వరము లేక నామము. జీవుడు ప్రప్రథమమందు గైకొనిన అవ్యక్తము లేక చిత్తము అను ఉపాధి స్వరమే వాని నిజమైన నామము.[1] ఆ యుపాధి యణు స్వరూపముగ నుండును. అచ్చట భేదబుద్ధి లేదు. అందువలన నందలి నాదము లోకసమష్టి స్వరమునకు ప్రాయశః అవిరుద్ధముగనే యుండును. ఈశ్వర సంకల్పమున కవిరుద్ధమగు జీవితోద్దేశమును దెల్పు నీ స్వరమే (అనగా

[1] స్థూల సూక్ష్మ శరీరములు జన్మజన్మకు మాఱుచుండును. స్థూలశరీర ... వ్యవహారిక నామము ... వేరు.

నామమే) జీవిత గీతము. లోక సమష్టిజీవిత గీతమే ప్రణవాత్మకమగు నీశ్వర వాక్కు. ఓంకారమను ప్రణవము విశ్వోత్పత్తి హేతువగు ఆది స్వరము. ప్రపంచమంతయు నిండియున్నది. అది ఈశ్వరుని నామము. ఈశ్వర బోధకము. తత్ప్రాప్త్యుపాయమగు ఆలంబనము. కావున నది బ్రహ్మమని శ్రుతిస్మృతులు బోధించుచున్నవి. ఆ భగవన్నామముయొక్క అంశలే జీవులయొక్క ప్రత్యేక లేక విశేష నామములు.

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।

(భ. గీ. 17-23)

ఓ మిత్యేతత్—ఏతదాలంబనం శ్రేష్ఠం. ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ । ఓ మిత్యాత్మానం యుంజీత । ఓ మితి బ్రహ్మ । ఓంకార ఏవేదం సర్వం । సర్వమోంకార ఏవ తద స్యేదం వాచా తంత్యా నామభిః దామభిః సర్వం సితం ॥

సామాన్య విశేషనామము లన్నియు ఓంకార మను దారముతో గట్టబడియున్నవి. (సామాన్య నామమన శబ్దము లేక వాక్కు. "త్రయం వా ఇదం నామరూపం కర్మ। తేషాం నామ్నాం వాగిత్యేతత్ । ఏషాం ఉక్థం । అతోహి సర్వాణి నామాని ఉత్తిష్ఠన్తి । ఏత దేషాం సామ। ఏ తద్ధి సర్వైః నామభిః సమం । ఏత దేషాం బ్రహ్మ । ఏ తద్ధి సర్వాణి నామాని బిభర్తి) ॥ (బృ. ఉప. 1. 6-1)

సర్వకాలములయందు సర్వభూతములయందు సర్వలోక సమరస స్వరూపమైనట్టియు నానందజనక మగునట్టియు నీశ్వర స్మరణకారణమై తత్స్మరణచే దత్ప్రాప్త్యుపాయ భూతంబగునట్టియు బవిత్ర

మగునట్టియు నోంకారాఖ్య ప్రణవస్వరమును యోగులు వినియెదరు. మన హృదయమునందు సదా శబ్దించుచున్నను మనము విననేరము. నామరూప గ్రహణమే ఈ స్వరము మఱుగుపడుటకు ప్రథమ కారణము.

తదేత దమృతం సత్యేన ఛన్నం। ప్రాణోవా అమృతం
నామరూపే సత్యం తాభ్యాం అయం ప్రాణః ఛన్నః ॥
(బృ. ఉప.)

అమృత స్వరూపమైన ప్రాణము సత్యాఖ్యమగు నామరూపములచే ప్రచ్ఛన్నమయ్యెను. జీవుని ప్రథమ ఉపాధినామమే సమష్టి సమరసమగు ఈశ్వర తత్వబోధకమును, ఈశ్వరాభి ధానమును అగు ప్రణవ స్వరమును మఱుగు పరచుచుండ మనము పనిచేయుచుండెడి అధోలోకముల ఉపాధులు దానిని మఱియు హెచ్చుగ మఱుగు పఱుచును. అంతియ కాదు. ఈ లోక యుపాధుల దేహబీజములగు సూక్ష్మభూతముల (Permanent atoms) స్వరమే ప్రాచీన అశుభవాసనలవలన నపస్వరముగ నుండును. ఆ యా జన్మములో మనము క్షణ క్షణముచేయు కార్యములు, సంకల్పించు సంకల్పములు సూక్ష్మభూతముల స్వరములకే సమరసముగ నుండవు. ప్రతి క్షణము మాఱుచుండుటవలన నా యా కాలమున నుత్పత్తియగు సంకల్పాదుల యపస్వరమువలన సూక్ష్మభూతముల స్వరమే తెలియక పోవును. ఇకను ప్రణవస్వరము వినబడనేరదని చెప్పనేల? పొగ బండి యంత్రముయొక్క గొప్ప ధ్వనిలో వీణానాద మెట్లు విన బడదో, అట్లు మన వ్యావహారిక దశయందలి రాగాది సంయుక్త కోశములలో నుత్పత్తియగు నపస్వరములలో సూక్ష్మనాదము మునిగి

పోయినట్లుండును. అహంకారమును నాశనము చేసికొని సర్వ భూతైకత్వభావమును నభ్యసించుచురాగా సూక్ష్మస్వర శ్రవణము కల్గును.

కాలవశాదేవ ప్రారబ్ధే చ క్షయంగతే బ్రహ్మప్రణవ సంధాన నాదో జ్యోతిర్మయ శ్శివః స్వయ మావిర్భవేదాత్మా మేఘాపాయేఽంశుమానివ । (నాద. ఉప.)

సర్వవ్యాపి న మోంకారం మత్వాధీరో న శోచతి ।

(మాం. ఉప.)

సర్వవ్యాపియగు ప్రణవమే సమష్టి జీవితగీతము. ప్రతివ్యష్టి స్వరము సమష్టియొక్క ఒక విభూతి-కళ. అన్నియుజేరి భగవంతుని మహిమను చెల్పును. సమష్టి కార్యములో బ్రతి వ్యష్టినామమునకు నియత కార్యముండును. ఆ స్వరము వినిన నా కార్య మెద్దియైనది, ఎట్లు సమష్టి కవిరుద్ధముగ నెఱవేరవలసినది తెలియవచ్చును. ఇట్లు యోగ శక్తితో సూక్ష్మనాదములైన వ్యష్టిసమష్టి నామములను లేక స్వరములను విన నభ్యసించవలెనని సూత్రము భోధించుచున్నది.

ఇప్పుడు సూత్రము యొక్కయు, టీకావాక్యముల యొక్కయు భావమును విచారించవచ్చును.

"ఆ గీతము ఎచ్చటనుండి వచ్చునది కనిపెట్టుము. ప్రథమమందు నీ హృదయము లోపలనే దానిని వినుము."

హృదయము మనస్సు, బుద్ధి (విజ్ఞానము) యొక్క స్థానము. బుద్ధి (విజ్ఞానమయాభి మాని) కి హృదయాత్మా, లింగాత్మా యని కూడ పేర్లు గలవు. మనోమయకోశ మాలిన్యము పోవునంతవఱకు,

విజ్ఞాన హృదయాత్మ స్థానమును గనుగొననేరము. వాని స్వరమును విననేరము. వాని స్వరమును వినుటయన, క్రింది మూడుపాధుల యందు (అనగా, అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశములు) నాయా జన్మ ముఖ్యోద్దేశ్యము నెఱిగి, జన్మ సాఫల్యముగ బ్రవర్తించుట. అదియే జరామరణ మోక్షోపాయము. అందువలననే జీవిత గీతమును హృదయములో వినుము అని బోధించబడి యున్నది.

"'అది యచ్చట లేదు; నేను వెదకగా నా కపస్వరమే వినపడుచున్నది.' అని నీవు చెప్పవచ్చును. (అట్లయిన) మఱియు లోతుకుదిగి చూడుము."

మనోమయకోశ (Lower mind=అశుద్ధ లేక కామసంయుక్త మనస్సు) తాదాత్మ్యమే, ఈ సుస్వరము వినబడక పోవుటకును, అపస్వరము వినబడుటకును గారణము. మొదట ఇంద్రియాత్మ తాదాత్మ్యము పిదప సంకల్పాత్మ తాదాత్మ్యము, ఈ రెండు మెట్టులు టీకలో నుదహరించబడి యున్నవి.

"అప్పుడును నాశాభంగమైనచో, మఱియు నెక్కుడు లోతుకు దిగి చూడుము."

జ్ఞానాత్మ, మహదాత్మ, శాంతాత్మలను చూడమని యర్థము.

"ప్రతి మనుజుని హృదయమునందును స్వాభావిక సుస్వరము, అగోచరమగు నీటి యూటయు నున్నవి."

స్వాభావిక సుస్వరముయొక్క స్వభావము పైన వివరించబడెను. సకల శక్తుల కాధారమైన ఆత్మయే, ఊట.

"అవి కనుపడకుండునటులను వినపడకుండునటులను మఱుగుపరచబడి యుండవచ్చును."

కనపడక, వినపడక పోవుటకు గారణము పైన దెలియజేయ బడెను.

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితంముఖం ॥

(ఈ. ఉ.)

"అయిన నది యచ్చట నుండిరయే యున్నది."

మన కగుపడనిది లేదని తలచరాదు.

"నీ ప్రకృతితత్వ మూలమునందు శ్రద్ధయు, ప్రతీక్షయు, ప్రేమయు గనుగొనిరెదవు."

ప్రకృతితత్వ మూల మనగా విశుద్ధబుద్ధి. అనగా, అహంకారాతీత దశలో నుండు ఆత్మ కత్యంత సన్నిహిత ఉపాధి. ఆ యుపాధిలో బనిచేయునపుడు యథార్థ జ్ఞానము కలుగును. ఈశ్వరసంకల్పానుసారము సకల కార్యములు చక్కగనే నెఱవేరునను శ్రద్ధ, సకల జనులు అజ్ఞానమును బోగొట్టుకొని తుది భగవంతుని జేరగలరను ప్రతీక్ష, అందులకు దోడ్పాటై పామరజనుల నుద్ధరించవలెనను ప్రేమ, ఆ దశయందు సహజముగ గల్గును.

"దుర్నీతిమార్గ మవలంబించ నిశ్చయించినవాడు తనలోపల జూచుకొన నొల్లడు. తన హృదయమునందలి సుస్వరము వినరాకుండునట్లు చెవులు మూసికొనును. ఆత్మజ్యోతి కనబడకుండునట్లు కన్నులు మూసికొనును. అట్లుచేయుట ఎందువలననగా కామనిమగ్నుడై జీవించుటయే సులభముగ వానికి గనబడును."

విషయలోలునికి విషయసుఖమే గొప్పది యని తోచుటవలన నాత్మజ్ఞానము కొఱకు, బ్రయత్నించ నిచ్ఛయించడు.

"అయినను సమస్త చేతన వర్గములోపల ప్రబలమయిన ప్రవాహము పారుచున్నది. దాని నడ్డగించ నెవ్వరికిని శక్యము కాదు."

ఈ ప్రవాహము ఈశ్వరుని మహా సంకల్పము (Great Plan, Law of Evolution). ఈశ్వరుని కాలశక్తి యని కూడా చెప్ప వచ్చును. దాని నడ్డగింప నెవ్వరికిని శక్యముకాదు. దానికి బ్రతికూలముగ బ్రవర్తించువారు నశింతురు. వారి సంకల్పము విఫలమగును.

అథ చేత్త్వమహఙ్కారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥

(భ. గీ. 18, 58–59)

"అచ్చట నిక్కముగ మహాదుదకములున్నవి; వానిని గనుగొనుము."

ఉదకము అను శబ్దము సాధారణముగ ప్రకృతికి బర్యాయపదముగ బ్రయోగించబడుచున్నది. ఇచ్చట రెండు ప్రకృతులు చేరియున్నవి. ఈ సూత్రములో మహాదుదకము లనగా క్షేత్ర క్షేత్రజ్ఞ లక్షణములైన అపరా పరాప్రకృతులు. ఇవియే జగద్యోనులు.

ఏతద్యోనీని భూతాని సర్వాణి ॥ (భ. గీ. 7–6)

ఇవియే క్షరాక్షరములు.

ఈ రెండు ప్రకృతుల కతీతుడు ప్రభువు ఆశ్రయుడు, ఆధారభూతుడు, ఆత్మస్వరూపుడైన భగవంతుడే. ఆయనయే పురుషోత్తముడు.

. . . . క్షరమతీతోఽహ మక్షరాదపి చోత్తమః ॥

(భ. గీ. 15–8)

అపళ్ళబ్ద మీాశోపనిషత్తులో కార్యకరణ సంఘాతచేష్టలు, కర్మలు అను అర్థముతో నుపయోగించబడియున్నది. అనగా క్షరప్రకృతి లక్షణములు. అక్షరప్రకృతి ప్రాణస్వరూపము, క్షేత్రజ్ఞలక్షణము. దానికి మాతరిశ్వ శబ్దము ప్రయోగించబడినది. ఆత్మయందు మాతరిశ్వుడు అప్పులను (ఉదకములను) ఉంచి యున్నాడని చెప్పబడి యున్నది.

తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ॥

కనుక నిచ్చట బ్రకృతిమూలతత్వమున కాధారముగ ప్రవాహము, మహాదుదకములున్నవి యన, ఈశ్వర సంకల్పము, కాలస్వరూపము, కాలశక్తి ఆధారముతో జగదుత్పత్తి హేతువులైన క్షేత్రక్షేత్రజ్ఞ, కార్యకారణ, అపరా పరాప్రకృతు (Life and Matter) లున్నవి యని యర్థము.

"అప్పుడు నీవేమి తెలిసికొనగలవనగా : సర్వభూతములు–అత్యంతాధముడు సయితము–అందులోని యంశలు కానివారు లేరు."

సర్వభూతము లీశ్వరాంశలే కదా. సర్వ చైతన్య మాయన ప్రాణములోని యంశయే కదా. సర్వోపాధు లాయన యపరా ప్రకృతి యంశలే కదా. ఈశ్వరు డాత్మగను ఆయన రెండు ప్రకృతు లుపాధులుగను లేని పదార్థము ప్రపంచములోనే లేదు. మనకు నీచముగ దోచు తామసభావములు సయిత మాయననుండి వచ్చి యాయనలో లయించునవియే.

యావత్సఞ్జాయతే కించిత్ సత్త్వం స్థావరజఙ్గమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ ॥ (భ. గీ. 13–26)

"ఆ విషయము వానికి దెలియకుండ నుండవచ్చును. ఆ యజ్ఞాన ముచే వాని బాహ్యోపాధి చూచుటకు 'భయంకరముగ (అనగా హేయముగ) నుండవచ్చును. అయిన నట్టివాడు సయితమీశ్వరాంశయే."

తా నీశ్వరాంశయని యా నరాధమునికి (అనగా తమోగుణ ప్రధానునికి) తెలియక యుండనచ్చును. ఆ తమోగుణ ప్రాధాన్యమువలననే వాని యుపాధి హేయముగ (అనగా మలినముగ) నుండును. లోపల ప్రకాశించునాత్మజ్యోతి వానియందు సయితము ప్రకాశించుచునే యున్నది. అయినను ఉపాధి మాలిన్యమువల్లన వెలుపల ప్రకాశము కానేరదు.

"(జ్ఞానప్రాప్తికై పోరాడుచుండు) నీవును మఱియు నీ సరివారు అందఱు నీశ్వరాంశలే. అయితే నీవు మాయలో జిక్కుకొని మోసపోవుచుండుటవలన నితరుల హృదయమందా మధుర వాక్కును మొదట నెచ్చట గనుగొనగలవో ఊహించుట కష్టము. అయిన నది నీయందే యున్నదనుట నిశ్చయము."

ఈ వాక్యముల తాత్పర్యము పైన వ్రాయబడిన దానివలన స్పష్టము.

"అచ్చట దానిని గనిపెట్టుము. ఒకసారి దానిని నీలో వినగలిగితివేని దానిని నీచుట్టు సులభముగ గుర్తించ గలుగుదువు."

తనలో నాత్మ నెఱుగువాడు సర్వత్ర ఆత్మసాక్షాత్కారము చేసికొనగలవాడు.

అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥

(భ. గీ. 5–26)

6 వ ప్రాచీనసూత్రము

నీవు విను మధురస్వరమును స్మృతిలో నుంచుకొనుము.

ఎంత పై మెట్టునకు బోయనను విస్మృతి దోష మంటి యుండును. అప్రమత్తతతో విస్మృతి కలుగకుండ జాగ్రత గలిగి యుండవలెను. సదా "అహం బ్రహ్మాస్మి" మొదలగు నిజస్వరూప బోధకములగు వాక్యములను స్మరించు చుండవలెను.

7 వ ప్రాచీనసూత్రము

దానివలన సామరస్యమను పాఠమును నేర్చు కొనుము.

8 వ వ్యాఖ్యానసూత్రము

యుద్ధము జరుగుచుండినను పోరాడు వాని యాజ్ఞను అనువర్తించుచు, నీవు ఇపుడు రాయివలె, స్థిరముగను చక్కగను, నిలుచుకొనగలవు. ఆ పోరాడువాడు నీవే; నీ ప్రభువే. ఆయనె యాజ్ఞానుసారము ప్రవర్తించుటకై ఎంత మాత్రము సంగ ముండదగునో, అది వినా యుద్ధము నందెక్కువ సంగము లేనివాడవై యుద్ధములో జయము కలుగునో కలుగదో అని విచారము లేక, శాంతుడవై, జాగరూకుడవై, దుఃఖముతోడను దుఃఖమును తరించు

టవలనను నీవు పొందిన శ్రుతము (జ్ఞానము) ను ఉప యోగించు కొనుము. ఏలయన యోధునకు జయము గలుగుట యొకటియే ముఖ్యము. ఆయనకు అపజయ ము కలుగనేరదని నీకు తెలిసియేయున్నది కదా. నీవు మానవ మాత్రుడుగ నుండునంతవఱకు ఆ గొప్ప గీత ములో గొంతభాగము మాత్రమే నీ చెవికందును. అయితే నీవు వినగలిగినచో దానిని జ్ఞాపకమునం దుంచు కొనుము. నీ చెవికందిన దానిలో నే మాత్రము మఱ వకుము. దానివలన నిన్నావరించియుండు రహస్యమును నేర్చుకొన బ్రయత్నించుము. కాలపక్వమున నీకు గురు వవశ్యకము లేకుండును. ఎందువలన ననగా అహంకార సంయుక్త జీవునకు వాక్ఛక్తియున్నట్లు అహంకారము దేనియందు బ్రతిష్ఠించబడి యున్నదో దానికి సయితము వాక్కున్నది. చైతన్యమే వాక్కు. అది యెప్పుడును నిశ్శబ్దముగ నుండునది లేదు. బధిరుడవైన నీవు దాని నాదము రోదనమని తలచెదవేమో, అట్లు కాదు. అది (సుస్వర) గీతము. నీ వా సామరస్యముయొక్క అంశవే యని దానినుండి నేర్చుకొనుము. సామరస్య ధర్మముల ననువర్తించ వలెనని (సయితము) దానినుండి నేర్చుకొనుము.

"యుద్ధము జరుగుచుండినను పోరాడు వాని యాజ్ఞను అనువర్తించుచు, నీవు ఇపుడు రాయివలె, స్థిరముగను చక్కగను, నిలుచుకొనగలవు. ఆ పోరాడువాడు నీవే; నీ ప్రభువే."

ఇంద్రియములకు విషయ సంస్పర్శ కలిగినను జలించని దశ యిచ్చట వర్ణించబడినది. వంకరలేక సరిగా నిల్చుకొనుట యనగా, అకుటిలత్వము, ఋజుభావము నొందుట. అహంకారము నశించినందున యుద్ధము చేయువాడు భగవంతుడే. ఆయనయే ఆత్మ. ఆయనయే ప్రభువు.

"యోధునకు జయము గలుగుట యొకటియే ముఖ్యము.

అనగా ఈశ్వరాజ్ఞా నిర్వర్తనము తప్ప మఱి ఏ యితర ధర్మములు లేవు. అన్ని ధర్మములు విడువబడినవి. చేయబడునే కార్యమునందును సంగము లేదు.

"దుఃఖముతోడను, దుఃఖమును తరించుటవలనను."

మొదట సంసారములో దిగి సుఖదుఃఖముల ననుభవించుటయే దుఃఖసంయోగము. తద్వియోగమే దుఃఖసంయోగవియోగము లేక దుఃఖమును దరించుట. ఈ దుఃఖసంయోగ వియోగదశకే ఆత్మ సాక్షాత్కార యోగదశయని పేరు.

తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।

(భ.గీ. 9-23.)

"నీవు మానవ మాత్రుడుగ నుండునంతవఱకు ఆ గొప్ప గీతములో గొంతభాగము మాత్రమే నీ చెవికందును. అయితే నీవు వినగలిగినచో దానిని జ్ఞాపకమునం దుంచుకొనుము. నీ చెవికందిన దానిలో నే

మాత్రము మఱవకుము. దానివలన నిన్నావరించియుండు రహస్యమును నేర్చుకొన బ్రయత్నించుము."
భగవన్మహిమను మానవ మాత్రుడు సంపూర్ణముగ నెఱుంగ నేరడు. వైరాగ్యము వృద్ధియగుచూ రాగా, కొంచెము కొంచె మెక్కుడు జ్ఞానము కలుగుచుండును.

"కాలపక్వమున నీకు గురు వవశ్యకము లేకుండును."

గురువు త్రోవచూపువాడే, సాక్షాత్కారము స్వయముగా కావలెను. సాక్షాత్కార కాలమునకు గురువు, ఈశ్వరుడు, అందఱు ఆత్మస్వరూపులుగనే దోచుదురు.

"ఎందువలన ననగా అహంకార సంయుక్త జీవునకు వాక్ఛక్తి యున్నట్లు అహంకారము దేనియందు బ్రతిష్ఠించబడి యున్నదో దానికి సయితము వాక్కున్నది."

అహంకార మాత్మయందు బ్రతిష్ఠించబడియున్నది.

అహంకారశ్చ అహంకర్తవ్యం చ బుద్ధిశ్చ బోద్ధవ్యంచ . . . . . యథా సోమ్య వయాంసి వాసో వృక్షం సంప్రతిష్ఠంతే ఏవం హవై తత్సర్వం పర ఆత్మని సంప్రతిష్ఠతే ॥

(ప్ర. ఉప.)

ఆ పరమాత్మ మనవాక్కుకు వాక్కు, అనగా మనవాక్ఛక్తి కాధారము. ఆ పరమాత్మాశ్రయము కల్గినచో మనలోనే వేదార్థజ్ఞానము కలుగును. అప్పుడు బాహ్య గురు నవశ్యకము లేదు.

"చైతన్యమే వాక్కు. అది యెప్పుడును నిశ్శబ్దముగ నుండునది లేదు."

ఈ మహాచైతన్యమే ప్రాణము. ప్రణవనాదము, పరాప్రకృతి. ప్రపంచ వ్యక్తకాలమం దంతయు నది ప్రకాశముగ నుండును. కావున వ్యక్తకాలమునందు ప్రతియణువునకు జలనశక్తియు, స్వర శక్తియు నుండును. నిశ్శబ్దము ప్రళయకాలమే.

"బధిరుడవైన నీవు దాని నాదము రోదనమని తలచెదవేమో, అట్లు కాదు. అది (సుస్వర) గీతము."

రోదన మపస్వరము. ఈశ్వరనాదము సమరసభరిత సుస్వరమే. అట్టి సుస్వర సముదాయమే గీతము. రోదనకారణమగు శోకమున కవసరము లేదు. కామక్రోధ అహంకారముల వలననే అపస్వర ముద యించుచున్నది. శోకమోహములకు కారణము లవియే. ఆత్మనాద మును వినినచో శోకమే లేదు. సర్వము శోభనము. సర్వము జయము. సర్వమును మంగళముగ దోచును.

జుష్టం యదా పశ్యత్యన్యమీశ మస్య
మహిమానమితి వీతశోకః । (ముం. ఉప.)

"నీ వా సామరస్యముయొక్క అంశవే యని దానినుండి నేర్చు కొనుము. సామరస్య ధర్మముల ననువర్తించవలెనని (సయితము) దానినుండి నేర్చుకొనుము."

సర్వభూతము లొకటియనియు, బరస్పరాశ్రయములనియు నన్యో న్య సమరసమువలననే ప్రపంచ చక్రము వర్తించు చున్నదనియు, సమ రస భావమునకు భంగము కలుగజేయువాడు ధర్మము నతిక్రమించిన వాడనియు, నొక దేహములోని సమస్త యవయవములును, అణువులు నెట్లు సమరసముగ బ్రవర్తించుచున్నవో అట్లే మనము సర్వజనహితము కొఱకు సమరసభావమును సదా జీవితములో ననుష్ఠించుచుండవలెను.

9 వ ప్రాచీనసూత్రము

నీ చుట్టున నుండు చైతన్యమునంతయు శ్రద్ధతోఁ (బరీక్షించి) గౌరవించుము.

సర్వప్రాణిజాతము ఈశ్వరుని విభూతులే, కళలే, అంశలే. అన్నిభూతములయందును నీశ్వరుడు ఆత్మరూపమున బ్రకాశించుచున్నాడు. ఎట్టి హేయములైన వస్తువులైనను సరే, ఎట్టి దుర్నీతిమంతుడైనను సరే, ఆ హేయత్వము దౌష్ట్యము ఉపాధుల యపారిశుద్ధ్యమువలన గల్గినవియేకాని అన్నిటియందు నాత్మ సమముగ వికసించుచున్నది. సర్వత్ర ఆత్మదర్శనము చేయవలెననియు, జనుల యొక్క బాహ్యప్రవర్తనలు జ్ఞానన్యూనాధిక్యముల ననుసరించి నిందార్హ పూజార్హములుగ నుండునే కాని సర్వము చిన్మయమనియే మనము భావించవలయునని సూత్రము బోధించుచున్నది.

10 వ ప్రాచీనసూత్రము

మనుష్యుల హృదయములను దెలివితో బరీక్షించ నేర్చుకొనుము.

టీక

సంపూర్ణ స్వార్థరాహిత్య దృష్టిచేతనే పరీక్షించుము. లేనియెడల నీ దృష్టి (రంగులు లేనిచోట) రంగుల జూచును. (అనగా అయథార్థముగ జూచును.) కావున స్వార్థరాహిత్య మెట్టిది యయినది మొదట దెలిసికొనవలెను. తెలివిగలిగి చూచినచో బక్షపాత ముండదు. ఎవడును నీకు శత్రువు కాడు. ఎవడును నీకు మిత్రుడు కాడు. అం

దఱును నీకు సమానముగ గురురూపులె. నీ శత్రువుయొక్క శత్రుత్వ రహస్య మెంతకాలమునకైనను నీ వెఱుగవలసియే యున్నది. ఎందువలన ననగా మనుష్యుని యథార్థ స్వరూపము తెలియవలసియున్నది. నీ స్నేహితుడు నీలో భాగమగుచున్నాడు. నీ విస్తారమే యగుచున్నాడు. ఈ గూఢార్థమును దెలిసికొనుట కష్టము. తెలిసికొననెక్కుడుకష్ట మెద్దియన నీ స్వంత హృదయమే. స్వార్థచింతన రూప (హృదయ) గ్రంథులన్నియు దెగువఱకు ఆ యాత్మవిషయమైన గొప్ప రహస్యము విదితము కానారంభము కానేరదు. దానినుండి ప్రక్కకు దొలగి నిలువబడిననేకాని దాని లక్షణము నీకు గోచరము కానివ్వదు. అప్పుడే (అంతవఱకు గానేరదు) దాని లక్షణము నెఱిగి దాని నేలగలవు. అప్పుడే (అంతవఱకు గానేరదు) దాని శక్తులను నీ వుపయోగించి దానిని యోగ్యమైన కైంకర్యమునకు వినియోగించగలవు.

"మనుష్యుల హృదయములను దెలివితో బరీక్షించ నేర్చుకొనుము." అన్నిటిలోను భగవంతు డాత్మస్వరూపమున హృదయమునందు బ్రతిష్ఠించబడియున్నాడు. ఆ భావమును మఱవగూడదు. ప్రతియొకని యందుండు నాత్మచైతన్యము ప్రకాశించి సన్మార్గమున బ్రవర్తింపజేయవలెననియే ప్రయత్నించును. అయితే ఉపాధుల క్షోభవలన నాత్మ ప్రకాశము మఱుగుపడుచున్నది. మనము బాహ్య చేష్టలను జూచి యాత్మదృష్టి నుపేక్షించ గూడదు. ఇదియే తెలివి.

"సంపూర్ణ స్వార్థరాహిత్య దృష్టిచేతనే పరీక్షించుము. లేనియెడల నీదృష్టి (రంగులులేనిచోట) రంగుల జూచును. (అనగా అయథార్థముగ జూచును.) కావున స్వార్థరాహిత్య మెట్టిది యయి

నది మొదట దెలిసికొనవలయును. తెలివిగల్గి చూచినచో బక్షపాత ముండదు. ఎవడును నీకు శత్రువుకాడు. ఎవడును నీకు మిత్రుడు కాడు. అందఱును, నీకు సమానముగ గురురూపులే."

ఇచ్ఛా ద్వేషములు క్షేత్రసంబంధములు. ఆత్మ యొకటియే కావున నొకరికి మఱియొకరు మిత్రులు కారు. శత్రువులు కారు. శత్రుత్వ మిత్రత్వము భేదదృష్టి దశకు సంబంధించినవి. ఆత్మదృష్టిచే నేకత్వమే కన్పట్టునుగాని భిన్నభావ లక్షణములు కన్పట్టనేరవు. అందఱు గురువులే అనగా ప్రతిభూతమునందు నొక్కొక్క విధమున భగవంతుని విభూతి కన్పడుచున్నది. ఆత్మచైతన్య మట్లు క్రీడించు చున్నది యని మనము తెలిసికొనవలసి యున్నది. కావున నన్నియు గురుదేవులే అనగా బోధించునవియే.

"నీ శత్రువుయొక్క శత్రుత్వరహస్య మెంతకాలమున కైనను నీ వెఱుగవలసియే యున్నది. ఎందువలన ననగా, మనుష్యుని యథార్థ స్వరూపము తెలియవలసి యున్నది."

ఒక మనుష్యుడు మనలను ద్వేషించినట్లు మనకు దెలిసిన యెడల వా' డెందుకు ద్వేషించుచున్నాడు. ఈ జన్మములోనో పూర్వజన్మ ములలోనో నే నేమైనను వాని కపకారముచేసి యుండవచ్చును. దానిని వాడిప్పుడు తీర్చుకొనుచున్నాడు. కావున వాడు నా కృతజ్ఞత కర్హుడు. ద్వేషమనునది శాశ్వతముగ నుండనేరదు. క్షేత్ర ధర్మమే కనుక నాశనము కాగలదు. ద్వేషము లోకసమష్టి సమరసమునకు భంగము కలుగజేయునది. అది తప్పు. నేను ద్వేషించగూడదు. వాడు ద్వేషించి, నేను సయితము ద్వేషించినచో లోకమునకు గీడు చేయువా రిరువుర గుదురు.. నాలోపలనుండు శాంతము, క్షమా,

దయ, బుద్ధిచాతుర్యము మొదలగు నాత్మగుణములు ప్రకాశమునకు వచ్చుటకీ శత్రువు నా కవకాశము కలుగ జేసెననియు, వానికి సుగుణము కలుగునుగాక యనియు సంకల్పించి వానికి మేలుగలుగజేసి వాని ద్వారా లోకకల్యాణమును వృద్ధిజేయవలెను. ఇదియే శత్రుత్వరహస్యము. దీని నెఱుగునంతవఱకు మనకు యథార్థజ్ఞానము కలుగ నేరదు.

"నీ స్నేహితుడు నీలో భాగమగుచున్నాడు. నీ విస్తారమే యగుచున్నాడు; ఈ గూఢార్థమును దెలిసికొనుట కష్టము."

ఉపాధిభేదవలన శత్రుత్వము, ఉపాధి సమరసమువలన మిత్రత్వము. మిత్రుడు మనమే, శత్రువు మనమే.

ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపురాత్మనః ॥

(భ. గీ. 6-5)

ఉపాధుల భిన్నత్వమువలన గలహించుకొని శత్రుత్వమును జూతుము. అవి సరిపడినచో మన మొకటి యని మిత్రత్వమును జూతుము. ఒకటియేను, అను భావముతో జూచిన మిత్రుడు తనలో భాగముగ నైన గన్పడుడును లేక తన విస్తారమే వాడు అని కనపడును.

"తెలిసికొన నెక్కుడు కష్ట మెద్దియన నీ స్వంత హృదయమే."

తన నిజస్వరూపమును దెలిసికొనుటయే మిక్కిలి కష్టము.

"స్వార్థచింతన రూప (హృదయ) గ్రంథులన్నియు దెగువఱకు ఆ యాత్మవిషయమైన గొప్ప రహస్యము విదితము కా నారంభము కానేరదు."

గ్రంథు లనగా కామము, అహంకారము అను బంధములు. అవి పోయిననే ఆత్మప్రాప్తి కాగలదు.

యదా సర్వే ప్రభిద్యంతే హృదయస్యే హ గ్రంథయః
అథమర్త్యోఽమృతో భవతి ॥

(కఠ. ఉ.)

బంధరూపా అవిద్యాప్రత్యయాః అహం ఇదం శరీరం
మమ ఇదం ధనం సుఖీదుఃఖీ చ అహం, ఇత్యేవ మాది లక్షణాః ॥

(శం. భా.)

"దానినుండి ప్రక్కకు దొలగి నిలువబడిననే కాని దాని లక్షణ
ము నీకు గోచరము కానివ్వదు. అప్పుడే (అంతవఱకుగా నేరదు)
దాని లక్షణము నెఱిగి దాని నేలగలవు. అప్పుడే (అంత వఱకు
గా నేరదు) దాని శక్తులను నీ వుపయోగించి దానిని యోగ్యమైన కైం
కర్యమునకు వినియోగించగలవు."

ఇచ్చట అది యనగా అహంకార సంయుక్తుడై మనోమయ
కోశాభిమానియైన జీవుడు. ప్రక్కకు దొలగడమనగా, ఈ కోశము
నేనుగాదు అని తాదాత్మ్యరాహిత్యము నొందుట. ఈ కోశములకు
నే నతీతుడనని తలచుకొన్న మాత్రముననే కోశముల స్వతంత్రబలము
వశీకారశక్తి తగ్గును. దాని చేష్టలు మనకు మనస్సుకు వచ్చును. అది
మన కింకరుడే కాని యజమానుడు కాదని తెలియవచ్చును. దానిని
మన స్వాధీనపరచుకొని దానివలన నే పుణ్యకార్యము (అనగా
లోకోపకారసేవ) చేయించుకొనవచ్చునో ఆ పనులన్నియు దానివలన
జేయించుకొన వచ్చును. పనిచేయు శక్తి దానికున్నది. ఇప్పుడు
స్వేచ్ఛగా తన యిష్టమువచ్చినట్టు ప్రవర్తించుచున్నది. ఇకను మనము
లోక కల్యాణమున కుపయుక్తమని తలచిన కార్యములు దానిచేత

జేయించగలము. ఈ కోశముల తాదాత్మ్యమును వదలి నేను అతీతుడ నని తలచుకొనుటయే గుణాతీతదశ.

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥

(భ. గీ. 14-20)

11 వ ప్రాచీనసూత్రము

నీ స్వంత హృదయమును మిక్కిలి శ్రద్ధతో బరీక్షించి గౌరవించుము.

12 వ వ్యాఖ్యానసూత్రము

ఎందువలననగా జీవితమునకు బ్రకాశము గలుగ చేసి నీ కన్నులకు స్పష్టముగ గన్పడజేయు నొక్కటి యగు జ్యోతి నీ స్వంత హృదయమునుండియే వచ్చును.

ఆత్మప్రకాశముననే సర్వేంద్రియ చేష్టలు జరుగుచున్నవి. ఆ యాత్మ మన యంతర్హృదయమందున్నది.

ఆత్మైవాస్య జ్యోతిర్భవతి ఆత్మనైవాయం జ్యోతిషా ।
ఆస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతీతి ॥ (బృ. ఉ. 4-3-6)

నీ వెందు జీవించి యున్నావో ఎందులో నొక భాగముగ నుండ గోరుచున్నావో ఆ ప్రపంచ మెట్టిది యయినది తెలిసికొన గలుగుటకై మనుష్యుల హృదయములను (బరీక్షించి) జదువుము. నీ చుట్టుపట్టున

సదా మాఱుచు చరించుచుండెడు జీవితమును బరీక్షించి చూడుము. ఎందుకనగా అది మనుష్యుల హృదయముల వలన నిర్మాణము కాబడియున్నది. వారి శారీరోపపత్తిని జీవితోద్దేశము నెఱుగ నేర్చుకొను కొలదియు క్రమక్రమముగ బెద్ద ప్రపంచమును (బరీక్షించి) జదువ సమర్థుడ వగుదువు.

ప్రపంచమనగా పరమాత్మ. ఆత్మజ్ఞానమే బ్రహ్మజ్ఞానము. చుట్టుపట్టు మాఱుచుండునది ఆత్మక్రీడా విశేషములు. అనాత్మ వికారములు. ఏ భూతమును ఏ అణువును దెలిసికొనినను, ఆత్మను దెలిసికొనినట్టే. ఎందువలన ననగా, అంతయు బ్రహ్మప్రతిబింబమే. కావున ప్రపంచములో మనుష్యుల స్వభావము నెఱిగిన బ్రహ్మజ్ఞానము నొందిననట్టే.

హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మనిష్కళం ।
తత్ శుభ్రం జ్యోతిషాం జ్యోతిః తద్యదాత్మవిదో విదుః ॥
(ముం. ఉప.)

18 వ వ్యాఖ్యానసూత్రము

జ్ఞానమువలననే వాక్కు లభించును. జ్ఞానము సంపాదించుము. అపుడు నీవు వాక్శక్తిని బొందగలవు.

టీక

నీ విషయమై నీకు గొంతమట్టుకు యథార్థజ్ఞానము గలుగునంతకు నితరులకు సహాయము జేయుట సాధ్యము కాదు. మొదటి యిరువది యొక్క సూత్రములను నేర్చుకొని నీ శక్తులను వృద్ధిపరచుకొని

యప్రతిబద్ధ జ్ఞానముతో బోధామందిరమును బ్రవేశించినప్పుడు నీ లోపల నొక యూట యున్నదని కనుగొనియెదవు. అందునుండియే వాక్కుద్భవించును.

వాక్కన బోధించుట. పుస్తక జ్ఞానముచే బోధించుశక్తి కలుగదు. అట్లు చేయుబోధ సయితము అంత ప్రయోజనకారిగ నుండదు. అనుభవజన్య జ్ఞానమే బోధించుశక్తి నొసంగునది. ఒక ధర్మమును శాస్త్రముద్వారా గురువుద్వారా నేర్చుకొనవలెను. దానిపైన ధ్యానించి రహస్యార్థము నెఱిగి యనుష్ఠానములోకి దెచ్చుకొనవలెను. అప్పుడా ధర్మముయొక్క నిజమైన రహస్యము మనకు గోచరమగును. అప్పుడే మన మితరులకు బోధించ గలము. ఆ బోధ వారల కుపయోగమగ నుండును. ఈశ్వరు డున్నాడు, సత్యస్వరూపుడు, పరమకారుణికుడు, సమస్త జగదాధారుడు. జను లాయనను జెంద గలరు, కర్మపునర్జన్మ అనునవి నోటిమాటలు కావు—నిజముగ నీశ్వరాజ్ఞారూప ధర్మములేను; అను నీ విషయములు మనకే నమ్మకముగా దెలియనప్పుడు పరులకు బోధించ నేరము. సాధనచతుష్టయ సంపన్నులమై గుర్వనుగ్రహముతో శారీర, వాచక, మనోబలములను వృద్ధి చేసికొని ఆత్మవీర్యమును సంపాదించుకొనినప్పుడు సమస్త జ్ఞానాకారమైన జ్ఞానగంగ మనకు బ్రాప్తించును. అదియే ఊట, తలపరిశె. దానిని సంపాదించిన నా తీర్థము నితరులను బవిత్రులుగ జేయ నివ్వగలము. అట్టి పరులబునీతులుగ జేయు బోధయే వాక్కని సూత్రములో జెప్పబడియున్నది.

ఈ రెండవ భాగమంతయు బ్రాయశః దురవగాహము. ప్రాచీన సూత్రములకు టీక వ్రాసిన ఋషి కూడ ఇట్లు వ్రాసియున్నారు.

"పదమూడవ సూత్రము ముగిసిన పిదప, నిదివఱలో వ్రాసినదాని కన్న నెక్కుడుగ నేను వ్రాయనోపను. నా శాంతిని నీ కొసగెదను.

△

"ఈ వ్యాఖ్యానములు నేను నా శాంతి నెవరి కొసగుచున్నానో, నేను వ్రాసినదానిని బాహ్యేంద్రియముతోనే కాక సూక్ష్మ ఇంద్రియముతో సయిత మెవరు చదువగలరో వారి నుద్దేశించియే వ్రాయబడియున్నవి."

అనగా మొదటిభాగము ఇరువది యొక్క సూత్రములు, రెండవ భాగము పదమూడు సూత్రములలోని బోధను గ్రహించి దాని ననుష్ఠించగా జ్ఞానప్రతిబంధకములు తొలగి జ్ఞానోత్పత్తికాగా పూర్వమున కన్న నెక్కుడుగ గుర్వనుగ్రహమునకు పాత్రతవడసి వెదకబడుచున్న మోక్షమార్గప్రవేశమునకు యోగ్యత గలుగును. సాధనచతుష్టయ సంపన్నతలోనే గొఱంతయుండి గురుసాక్షాత్కారమే కాక మోక్ష మార్గముయొక్కముఖద్వారమునకే దూరమున నున్నవారి కీ బోధ లవగాహము కానేరవు.

## 14 వ వ్యాఖ్యానసూత్రము

ఓ శిష్యుడా, సూక్ష్మశరీర ఇంద్రియముల నుపయోగించుకొను శక్తిని బొందితివి; బాహ్యేంద్రియముల రాగములను జయించితివి; అహంకార సంయుక్తాత్మయొక్క కామములను జయించితివి; జ్ఞానమును బొందితివి; ఇప్పుడు యథార్థముగ మార్గమునందు బ్రవేశించ ను

ద్యమించుము. మార్గము కనుగొనబడెను. దాన నడువ సిద్ధముకమ్ము.

15 వ ప్రాచీనసూత్రము

పృథివి, వాయువు, జలమునుండి నీవు దెలిసికొనదగిన రహస్యము లెవ్వియైనది విచారించుము. (విచారించి తెలిసికొనుము.)

వ్యాఖ్యానము

సూక్ష్మశరీర ఇంద్రియములలో బనిచేయు శక్తి కలిగినయెడల నిట్లు చేయుశక్తి నీకు కలుగును.

ఈ యింద్రియములు పనిచేసినచో, దూరదృష్టి, దూరశ్రవణము, అణిమాది సిద్ధులు ప్రాప్తించును.

16 వ ప్రాచీనసూత్రము

పృథివిలోనుండు పావన పురుషులు నీకు దెలియజేయ నుంచుకొనియుండు రహస్యము లెవ్వియయినది విచారించుము. (విచారించి తెలిసికొనుము.)

వ్యాఖ్యానము

బాహ్యేంద్రియ రాగముల జయ మిందుకు (రహస్యములనడుగ) హక్కు (అనగా యోగ్యతను) నిచ్చును.

17 వ ప్రాచీనసూత్రము

అంతరాంతరమును ఏకమును అగు తత్వము (అనగా ఒక్కడు ఈశ్వరుడు) పెక్కు యుగములనుండి నీకు దెలియ జేయవలెనని యుంచుకొనియున్న చరమ రహస్యము నడిగి తెలిసికొనుము.

వ్యాఖ్యానము

అహంకార సంయుక్తాత్మ యొక్క కామజయము గొప్ప జయము, కఠినమైన పని; పెక్కుయుగములకుగాని నెఱవేఱని పని. కావున, పెక్కు యుగముల యనుభవములను నేకరించువఱకు జయ ఫలము గల్గునని నిరీక్షించియుండవలదు. ఈ పదునేడవ సూత్రమును నేర్చుకొనుకాలము వచ్చినపుడు మానవుడు మానుషాతీతదశ ద్వారమం దుండువా డగును.

పదునాల్గవ సూత్రములో మార్గము కనుబడినది, దానిలో ప్రవేశించుము అని చెప్పబడెను. అది చరమరహస్యములు బోధించబడు స్థానమును జేర్పించెడి మార్గము. మార్గ ప్రవేశానంతర మందు విచారించి తెలిసికొనవలసిన రహస్యములు 15, 16, 17 వ ప్రాచీన సూత్రములలో సూచింపబడియున్నవి. అందు 15 వ సూత్రములో యోగానుష్ఠానమువలన సూక్ష్మేంద్రియములతో బనిచేయు శక్తి బ్రాప్తించు స్థితి చెప్పబడియున్నది. పృథివి, వాయువు, జలము

అను తత్వముల రహస్యములు తెలిసికొనుమని సూత్రము చెప్పుచున్నది. ఈ మూడు త్రైలోక్య త్రైవిద్యల కన్వయించుకొనవచ్చును. పృథివి భూలోకమును, వాయు వంతరిక్షలోకము లేక భువర్లోకమును, ప్రసిద్ధముగ దెలుపు పదములు. అంభశ్శబ్దము ఐత్తరేయోపనిషత్తులో ద్యులోకము ప్రతిష్ఠగా గల ఊర్ధ్వలోకముల కన్వయించునట్లు ప్రయోగించబడినది. ఇచ్చట మూడుపదములు భూర్భువస్స్వర్లోకముల కన్వయించుకొనవచ్చును. ఋగ్యజుస్సామము లను మూడు విద్యలుకూడ నిందులో చేరుచున్నవి. మూడు లోకములలోని సర్వమును దెలుపునదియే త్రిపదా గాయత్రీ. దాని మొదటి పాదమును దెలిసికొనిన మూడు లోకములు జయించబడుననిన్ని, రెండవ పాదమును దెలిసికొనిన మూడు విద్యలు జయించబడుననిన్ని, మూడవ పాద జ్ఞానము చేత సమస్త ప్రాణిజాతము జయించబడుననిన్ని చెప్పబడియున్నది.

> యావదేషు త్రిలోకేషు తావద్ధజయతి యోస్యా ఏతదేవం పదం వేద। యావతీయం త్రయీ విద్యా తావద్ధ జయతి యోస్యా ఏతదేవం పదం వేద। యావదిదం ప్రాణి తావద్ధ జయతి యోస్యా ఏతదేవం పదం వేద ॥ (బృ. ఉప.)

ఇట్లు 15 వ సూత్రమువలన యోగానుష్ఠానముచేత భౌతిక శక్తులు (material forces), విద్యాశక్తులు (intellectual forces), ప్రాణశక్తులు (Vital forces), జయించబడునని త్రిపదా గాయత్రీ రహస్యము జ్ఞేయమని సూచించబడినట్లు కనపడుచున్నది. అయితే మఱియు జయించబడవలసిన స్థానము లున్నవి. త్రిపదా గాయత్రీ తురీయ పదమునందును, అది సత్యమునందును, సత్యము బలమునందును,

అది ఆత్మయందును ప్రతిష్ఠించబడి యున్నవని యుపనిషద్వాక్యము బోధించుచున్నది. తురీయమే ఆదిత్యుడనియు, సత్యము చక్షుస్సనియు, బల మన ప్రాణమనియు చెప్పబడియున్నది. చక్షుస్సన యోగయుక్తునికి గలుగు సర్వభూతైకత్వ ఈక్షణశక్తిగా భావించుకొన వచ్చును. (భ. గీ. 6-29) ఇదియే విశుద్ధబుద్ధి. సూర్యుడు సత్యద్వారమున నుండు వాడను ఈశోపనిషద్వాక్య మిదివఱకే కనుపరచబడెను. ప్రాణమన ఈశ్వరప్రాణశక్తి, పరాశక్తి. కావున నివియన్నియు మహదాది ఊర్ధ్వలోకములను దెలుపునవి. ఆ గొప్ప జ్ఞానము ధ్యానముచేతనే కాని యోగ సిద్ధులచేతనే కాని లభించదు. మిక్కిలి ముఖ్యమైన విషయ మేమన: లభ్యమైన సిద్ధులను లోకోపకారమునకై వినియోగించవలెను. ఈషణ్మాత్రము స్వప్రయోజన బుద్ధి యుండగూడదు. రాగలేశ ముండగూడదు. ఇటీవల ఐరోపా యుద్ధములో భౌతికశాస్త్రజ్ఞానము చేత ప్రాణిహింసార్థము నూతన యంత్రములను గనిపెట్టి జ్ఞానమును దుర్వినియోగ పరచినది మనకు దెలిసియున్నది కదా. పృథివీతత్వ అల్ప జ్ఞానముచేతనే లోకమున కింత హింస కలుగజేయ సాధ్యముండు నపుడు ఇకను త్రైలోక్య, త్రైవిద్య, ప్రాణస్వరూప జ్ఞానముచేత నన్నిలోకములలో నెంత నాశనము చేయగూడదు.? మహదాది మఱియు నూర్ధ్వలోక జ్ఞానముచేత జేయ సాధ్యమగు చెడుగును జెప్పుటకు నలవికాదు. అయితే సర్వశక్తిమంతుడును దయాస్వరూపుడును నగు భగవంతుడు సంపూర్ణ నాశన హేతువగు జ్ఞానమును దుర్వినియోగ పరచు వారికి లభ్యముకానివ్వడు. జ్ఞానము ఋషిసంఘము వారి యస్వీక్షణకు లోపడి యుండును. ఎవ్వరు స్వార్థచింతన సంపూర్తిగ నాశనము చేసికొని జ్ఞానమును లోకము కీడుకు వినియోగించక మేలుకే వినియో

గించెదరో అట్టివారికే ఆ గొప్ప జ్ఞానము నొసగెదరు. ఆ జ్ఞాన లాభ యోగ్యతయే 16 వ సూత్రములో జెప్పబడియున్నది. 17 వ సూత్రము గాయత్రీ చరమరహస్యమగు ఆత్మతత్త్వమును బ్రస్తావించుచున్నది.

గాయత్రీ ప్రాణరూపా సతీ జగతః ఆత్మా ॥

18 వ వ్యాఖ్యానసూత్రము

ఇప్పుడు నీకు గల్గియుండుజ్ఞానము నీకెందుకు లభించినదనగా నీయాత్మ సకలపరిశుద్ధాత్మలతో నున్న అంతరాంతరముగ నుండుదానితోను నైక్యము జెందియున్నది. దానిని (అనగా జ్ఞానమును) పరాత్పరుడు నీయందలి నమ్మకముతో నీ యొద్ద నుంచియున్నాడు. (అనగా జ్ఞానము భగవంతునిది. జ్ఞాని భగవంతుని ప్రతినిధి, ధర్మకర్తవంటివాడు.) ఆ నమ్మకమునకు ద్రోహముచేసినను, నీకు లభించిన జ్ఞానమును దుర్వినియోగముచేసినను, ఉపేక్షించినను (అనగా ఉపయోగ పరచక పోయినను), ఇప్పుడైనను నీవు పొందియుండు నున్నత స్థానమునుండి పతితుడవగుట సాధ్యమే. గొప్పవారు (సయితము) ద్వారముజేరియు నచ్చట వారికర్తవ్య కార్యభారమును వహించ నేరక అచ్చటినుండి పైమెట్టు నారోహించనేరక ద్వారమునుండి వెనుకకు బడుటగలదు. కావున (ముందురాబోవు) నాసమయమును భయము

తోను గంపముతోను సదా నిరీక్షించుచుండుము. ఆదశ లో దటస్థించు యుద్ధమునకు సిద్ధముగనుండుము.

19 వ వ్యాఖ్యానసూత్రము

బ్రహ్మసాక్షాత్కార ద్వారమున నుండువానికి విధి నిర్మించబడజాలదనియు, త్రోవ నడుపువా డుండనేర డనియు వ్రాయబడియున్నది.

(అనగా ధర్మాతీతు డగుచున్నాడు. విధి ప్రతిషేధములు వాని కన్వయించవు. సాక్షాత్కారము స్వయముగ గావలయును. పర శిక్షకాల మతిక్రమించినది.)

అయిన, శిష్యబోధార్థము ఆ కడపటి పోరాటము విషయ మిట్లు వర్ణించవచ్చును.

ప్రాచీనసూత్రము

ద్రవ్యము, ఉనికి లేనిదాని ధృడముగ నాశ్రయించుము.

ఇది యాత్మయే.

నసత్తన్నాసదుచ్యతే । (భ. గీ. 13-12)

20 వ ప్రాచీనసూత్రము

శబ్దరహిత స్వరమును మాత్రమే వినుము.

21 వ ప్రాచీనసూత్రము

అంతర్బాహ్యేంద్రియముల కగోచరమైన దానినే చూడుము.

ఇది యాత్మయే.

అన్యదేవ తద్విదితాదథో అవిదితా దధి। (కేనో. ఉప.)

△

ఓం తత్సత్

ఓం శాంతిః ! శాంతిః !! శాంతిః !!!

సంపూర్ణము

---

Printed by J. R. Aria at the Vasanta Press, Adyar, Madras.

# శుద్ధపత్రిక

| పుట పజ్క్తి | అశుద్ధము | శుద్ధము |
|---|---|---|
| 16—14 | అపూర్వో౽నంతరో బాహ్యోనపరః | అపూర్వో౽నంతరో౽బాహ్యో౽నపరః |
| 41—7,8 | ప్రాణులను గౌరవించుము | ప్రాణమునందు గౌరవముంచుము |
| 44—10 | ప్రాణులను | ప్రాణమునందు |
| 54—18 | యద్‌జ్ఞాత్వా | యజ్జ్ఞాత్వా |
| 55—20,21 | హేవగు | హేతువగు |
| 59—16 | వైరాగ్యం | నైరాశ్యం |
| 67—22 | జ్ఞానము | అజ్ఞానము |
| 68—18 | జేయనట్టిదియు | జేయునట్టిదియు |
| 71—18 | విషయ విముఖత్వము | విషయము,తద్విముఖత్వము |
| 74—10 | వైరాగ్యం | నైరాశ్యం |
| 82—4 | మోక్షమార్గమం దవశ్యమైన ధర్మములు | —(అనగా ఈ పదముల దీసి వేయవలెను) |
| 82—10,11 | పజ్తులమధ్యన | మోక్షమార్గమం దవశ్యకమైన ధర్మములు |
| 87—23 | బహావోలోలుపంత | బహావో౽లోలుపంత |
| 96—17,18 | పజ్తుల మధ్యన | "అయ్యాది యుగముల కొలది జీవించి వృద్ధి బొందు వృక్షము (వంటిది)" |
| 119—23 | తోయస్థ | తోయస్థం |
| 121—23 | ప్రాణులను గౌరవించుము | ప్రాణమునందు గౌరవముంచుము. |

